# దళిత కథలు



సంకలనం, సంపాదకులు :
డా॥ ఆర్. చంద్రశేఖరరెడ్డి
కె. లక్ష్మీనారాయణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

# సంకలన కాలం

వర్ణ వ్యవస్థ భారతీయ సమాజంలో మనుషుల్ని విడదీసింది, సౌభ్రా తృత్వాన్ని నాశనం చేసింది. సౌమ్ములో సుఖంలో అసమానతల్ని సృష్టించింది. శ్రమను ఒకడికి, సంపదను ఇంకొకడికి దఖలు పరచింది. డా. బి. ఆర్. అంబేద్కర్‌గారన్నట్లు శ్రామికుల్ని సైతం విభజించింది. సారాంశంలో వర్ణ వ్యవస్థ నిచ్చెనమెట్ల సమాజాన్ని ప్రసాదించింది. ఈ సమాజ నిర్మాణంలోనే అప్రజాస్వామిక లక్షణాలున్నాయంటారు డా. బి. ఆర్. అంబేద్కర్. భారతీయ సమాజంలోని అప్రజాస్వామికతకు పరాకాష్ట అస్పృశ్యత. ఉత్పత్తి రంగానికి చెందిన అసంఖ్యాకులను సామాజిక న్యాయానికి, సాంఘిక మర్యాదకు దూరం చేయడం ఇందులోని దుర్మార్గం.

"వాని రెక్కల కష్టంబు లేనినాడు
సస్యరమ పండి పులకింప సంశయించు
వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనము బెట్టు; వానికి భుక్తిలేదు."

అని గుర్రం జాషువా ఆవేదన పడ్డాడు.

అస్పృశ్యతకు ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతికాది పార్శ్వా లున్నాయి. పూటపూటకు తిండిని వెతుక్కోవడం, శ్రమ తప్ప తనకంటూ ఏమీ లేకపోవడం, ఊరికి దూరంగా అపరిశుభ్ర వాతావరణంలో జీవించడం, సమాజ నిర్మాణంలో - ఉత్పత్తిలో ప్రధాన పాత్ర నిర్వహిస్తూనే అధికారానికి బహు దూరంగా నిలవడం: ఇలా అస్పృశ్యతా రాక్షసి కోరలు శాఖోపశాఖలుగా విస్తరించాయి.

ఈ మొత్తం దోపిడీని శాస్త్ర సమ్మతం చేయడానికి పుట్టిందీ కర్మ సిద్ధాంతం - పునర్జన్మ సిద్ధాంతం. శ్రామికుల్ని లోబరచుకోడానికి, అసమానతల్ని శాశ్వతం చెయ్యడానికి పుట్టినవే పునర్జన్మ - కర్మ సిద్ధాంతాలు. ఆఖరికి భారతీయ సమాజాన్ని అమానుషమైందిగానే కాక నిర్వీర్యమైందిగా కూడా చేసింది. ఏ దేశం వాళ్ళొచ్చి పడినా ప్రజలు మహాభక్తితో స్వాగతం పలికే దశకు తీసుకుపోయింది.

మన ప్రాచీన సాహిత్యంలో అత్యధిక భాగం వర్ణ వ్యవస్థను సమర్థించింది. అంటే అసమానతలను సమర్థించిందని అర్థం. వర్ణ వ్యవస్థ స్వరూప స్వభావాలలో ఎన్ని మార్పులొస్తున్నా - ఆచరణలో సాధ్యంకాదు గనుక - సాహిత్యం మాత్రం దానిని కీర్తిస్తూనే వచ్చింది. ఏ పాల్కురికి సోమనో, ఏ వేమనో అస్పృశ్యత వంటి అసామాజికాంశాలను వ్యతిరేకించినా అల్పసంఖ్యాకులుగానే మిగిలిపోయారు.

బింబిసారుని కాలంలోనే (క్రీ.పూ. 542) శూద్రులకన్నా హీనంగా చూడబడే మరోవర్ణం - పంచమ వర్ణం - గుర్తింపుకొచ్చినట్టు రొమిల్లా థాపర్ అంటారు. (తరతరాల భారత చరిత్ర - పుట 33). ఇన్నాళ్ళనుంచి అది మన దేశాన్ని రాచపుండులాగా కెలుకుతూనే ఉంది.

పారిశ్రామిక విప్లవం, ఫ్రెంచి విప్లవం, వలస పాలన భారతీయ సమాజంలో మార్పులు తెచ్చాయి. అప్పటిదాకా రాజ్యమేలిన ఫ్యూడల్ వ్యవస్థను పాక్షికంగానైనా కదిలించగలిగాయి. యంత్రం, మానవ సంబంధాల్లో, ఆలోచనల్లో మార్పులు తెచ్చింది. ఆధునిక విద్య కొత్త మేధావుల్ని సృష్టించింది. సంఘ సంస్కరణోద్యమం పుట్టింది. అప్పటిదాకా శాశ్వతాలుగా భావించబడే మధ్యయుగ విశేషాలన్నీ ప్రశ్నలకు లోనైనాయి. సంస్కర్తలు రచయితలు చేతులు కలిపారు. సంస్కర్తలే రచయితలైనారు. సంస్కరణోద్యమంలో స్త్రీ విషయం ప్రధానాంశమైనా ఎన్నో ఇతరాంశాలు కూడా ప్రశ్నింపబడ్డాయి. అందులో అస్పృశ్యత కూడా ఒకటి. సంఘ సంస్కరణోద్యమ కాలంలో అస్పృశ్యత కేవలం కుల సమస్యగా, అమానుషాంశంగా, సారాంశంలో సాంఘిక సమస్యగా చూడబడింది. ఆ తర్వాతి కాలంలో అది ఆర్థిక రాజకీయాంశంగా పరిగణించబడింది. మొత్తం మానవ జాతి విముక్తిలో భాగంగానే అస్పృశ్యత కూడా నాశనమౌతుందని విశ్వసింపబడింది. ఇవాళ మళ్ళీ మొత్తం మానవజాతి సమస్యల్లో భాగమైనా - అది ఒక ప్రత్యేక స్వభావంగల సమస్య అని, అందువల్ల మొత్తం జాతి విముక్తికోసం జరిగే పోరాటాలు కొనసాగినా దానికోసం ప్రత్యేక పోరాటం అవసరమన్న వాదన జరుగుతున్నది. దళిత ఉద్యమం ప్రత్యేకంగా కొనసాగడం అవసరమనీ భావించబడుతున్నది.

తెలుగు కథానిక ఎనిమిదిన్నర దశాబ్దాలు పూర్తి చేసుకున్నది. ప్రతి దశాబ్దంలోనూ దళిత సమస్యను విస్మరించకుండా కొన్నైనా కథలు వస్తున్నవి. సమాజ పరిణామంతో పాటు, సామాజిక సమస్యల అవగాహనలో వచ్చే మార్పులతోపాటు, దళిత సమస్యను కథచిత్రించే తీరు కూడా మారుతూ వచ్చింది. ఈ పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొనీ, కథ అచ్చైన కాలాన్ని అనుసరించీ కూర్చిన ఈ సంకలనం తీసుకొచ్చే ప్రయత్నం చేశాం.

ఈ సంకలనానికి ఒక ప్రత్యేకత ఉందని భావిస్తున్నాం. తెలుగులో ఇప్పటికే అనేక కథా సంకలనాలు వచ్చాయి. వాటిలో ఎక్కువ భాగం విడివిడిగా రచయితలకు చెందిన సంకలనాలే అత్యధికం. కాలాన్ని ప్రమాణంగా పెట్టుకొని కథా మంజూష, ఒక దశాబ్ది కథానికలు, తెలుగు కథ వంటివి వచ్చాయి. ఏదో ఒక సమస్యను ఆధారంగా చేసుకొని కథా సంకలనాలు అంతగా రాలేదు. అవి రావలసిన అవసరం చాలా ఉంది. దళిత జీవితాన్ని చిత్రించే కథల్ని కొన్నిటిని డా. భార్గవీరావుగారు "ఇంకానా ఇకపై చెల్లదు" అనే పేరుతో ఇటీవలే ప్రచురించారు. అవన్నీ ఇటీవలివే. దళిత సమస్యను తెలుగు కథానిక ప్రతిఫలించిన విధానాన్ని కాలక్రమంలో అవి ప్రదర్శించవు. ఈ కథా సంకలనం ఆపని చేస్తుందని భావిస్తున్నాం.

అనంతపురంలో గుర్రం జాషువా శత జయంతి కమిటీ ఏర్పడిన సందర్భంగా ఇలాటి కథా సంకలనం తీసుకురావాలని సంకల్పించాం. ప్రచురణ కోసం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారిని అభ్యర్థించాం. మా కోరికను మన్నించి ప్రచురించినందుకు కృతజ్ఞతలు. తమ కథల్ని ఈ సంకలనంలో వేసుకోడానికి సమ్మతించిన రచయితలకు కృతజ్ఞతలు.

గుర్రం జాషువా కలగన్న విశ్వనరుడు పుట్టడానికి జరిగే ప్రయత్నానికి భూమికగా ఈ సంకలనం ఏమాత్రం ఉపయోగపడినా అదే తృప్తి.

కథల్లోకి ఆహ్వానం........

—ఆర్. చంద్రశేఖరరెడ్డి

—కె. లక్ష్మీనారాయణ

# కథాక్రమం బెట్టిదనిన . . . .


| | |
|---|---|
| సాగర సంగం | 1 |
| గ్రుక్కెడు నీళ్ళు | 18 |
| మాల – దాసరి | 26 |
| పోలయ్య | 42 |
| పాకీది | 60 |
| హరిజన సమస్య | 73 |
| నరసన్న పాపాయి | 85 |
| చెప్పులు కుట్టేవాడు | 92 |
| ఊరబావి | 99 |
| పాపానికి జీతం | 127 |
| మార్పుకు మార్గం | 139 |
| శిలువ వేసిన మనుషులు | 150 |
| మాలా – మనిషి | 160 |
| సమిధలు | 177 |
| అజ్ఞాతవాసం | 187 |
| ముత్తడు గొప్పోడు | 194 |
| బంచరాయి | 208 |
| తొందరపడి ఒక కోడి ముందే కూసింది | 213 |
| తల్లి మట్టి | 222 |
| జీవనాడులు | 236 |
| అగ్నిగుండం | 244 |
| వెలి | 252 |
| కొత్తదారి | 261 |
| బందీ | 272 |
| మకర ముఖం | 281 |

# సాగరసంగం

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"కొటంరాజు మామా!"

"సోమాలా?"

"అవును మామా! ఏం చేస్తున్నావూ?"

"సావిడి తుడుస్తున్నాను. ఇలా వచ్చావేం?"

"కాపుగారు జీతపు గింజలు కొలుస్తామన్నారు. నేనూ వస్తా నుండు మామా!"

"ఇది యింతట్లో కాదు. గాది దిగితే యీవేళకి మళ్ళీ యెక్కరు కాపుగారు."

ఇవాళ కాకపోతే రేపిస్తారు. ఇంటో రెండు కుంచాల నూక లున్నాయిలే. వస్తాను మామా!"

"వుంటే మాత్రం పోనిచ్చు కోవడం యెందుకూ?"

"ఎక్కడికి పోతాయీ?"

"నువ్విడ యిలాగ పొద్దుంగడిపేస్తే మీ బాబు తిట్టడూ?"

"మా బాబు నలా అనకు మామా! వస్తున్నాను. 'ఊఁ' అను మరి."

"నీ కెందుకు సోమాలూ యీ కష్టం?"

"కష్టం యేమిటి కష్టం? కాకపోయినా మన లాంటి వాళ్ళకి కష్టపడక తప్పుతుందా? రమ్మను మామా!"

"మీ బాబుకి ముంతకి పొద్దెక్కి పోదూ?"

"మా లచ్చయ్యతాత కిచ్చే వచ్చాను."

"..............."

"ఏం? వచ్చేస్తున్నాను. ఊ! ఎంతసేపటికీ రమ్మనకపోతే యేమను కున్నావు మరీ? నువ్వొక్కడవే కష్టపడుతూ వుంటే నేను చూడలేను మామా!"

"దయ వుంది కనక, ఛణంలో ఆయిపోయీదానికి నువ్వు కూడా చెయ్యి చేసుకోవడం యెందుకని గాని నువ్వంటే యిష్టం లేకా సోమాలూ?"

"ఇష్టమన్న యిష్టమా? నా మీద నీ కిష్టమే లేకపోతే నేను బతగ్గలనా? ఆవేళ నువ్వు వెలగపండు కోసి పెట్టావు. ఎంత కష్టపడ్డావో అంత చిటాచిగురు కెళ్ళడానికి. వుడత లాగ నువ్వు వురక వేసుకుంటూ పైకి పోతూ వుండగా నా రాజా! నా మనస్సు యేలా పొంగిపోయిందో యేం చెప్పను మామా?.... ఎవళ్లూ యెక్కలేకే దాన్ని విడిచిపెట్టేశారు. ఈ వూళ్ళో నీతో సమానంగా యెవ డెక్కగలడు మామా చెట్టూ?"

"లక్షమంది వున్నారు నా నొష్టనే పొడిచిందా పొద్దు? కాని సోమాలూ! పండు చేతిలో పెట్టాటప్పటికి నీ మొగమ్మీద మెరిసిపోయిందే సంతోషం? అది చూశాటప్పటికి నా రంగా! వొళ్ళు తెలవలేదు నాకు."

"నేను చెప్పుకోవడం కాదు మామోయి! నా కోరిక తీర్చినందుకు నీ కాళ్ళ కాడపడి చచ్చిపోవాలని తోచింది నాకు. బతికుండగా నీ రుణం తీర్చుకోగలనా కాటంరాజా?"

"రుణమా? నీ దయ వుంటే నా కదే చాలు. ఆవేశం? గెపితి వుందా? చెరుకుతోటకాడ నువ్వు కనపడకపోయినా, కనపడి పలకరించకపోయినా నేనీపాటి రంగంలోనో, మోల్మేనులోనో వుందు నుసూరుమంటూనూ. నువ్వు 'యెక్కడికి మామా?' అనేటప్పటికి నాకు నడుం లటుక్కు మనిపోయింది."

"నువ్వు చెప్పేదాకా బరమా వెళ్ళడానికి బయలుదేరానని నాకు తెలవనే తెలవదు. నువ్వావేళ వెళ్ళేవుంటే నే నిప్పటిదాకా బతికి—ఏ నుయ్యో, ఏగొయ్యో—మామోయి! ఇంకెప్పుడూ అలాంటి తలంపు చెయ్యకు సుమా."

"ఇంకానా? ఇక యెవరేనా గెంటినా-తోసేసినా వెళ్ళగలనా? కానీ సోమాలూ! పెద్ద గందరగోళం పుడుతుంది."

"అందులో పడ్డవాళ్ళు అందులోనే మగ్గిపోతారు చివరికి. మనకేం?"

"కాని వాళ్ళ కెందుకూ మన గొడవలూ?"

"వూసిపోవద్దూ?"

ఇలాగ కబుర్లు చెప్పుకుంటూ కాటన్నా, సోమాలూ పేర్రెడ్డి పశువులసాల బాగు చేస్తున్నారు. పాపం పనిచేస్తూవుంటే సోమాలు చూసి "నాకే"మని వూరుకో

లేకపోయింది. "నేను సాయం చేస్తా" నంది. "ఏమంటా" వంది. "రమ్మని పిలవ" మంది. "ఇక వుండలే" నంది. అయితే సోమాలు పని చెయ్యడం కాటన్న కిష్టం లేకపోయింది. వద్దంటే ఆమె మనస్సు చివుక్కు మంటుంది. రమ్మనడానికి తనకి నోరు రాదు. మాట మరిపించాలని చూశాడు; గాని లాభం లేకపోయింది. గంప అక్కడ పడేసి సోమాలు గభీమని పనిలో వురికింది.

తరవాత యిద్దరూ పారవశ్యం కలిగించే పూర్వపు సంగతులేవో చెప్పుకుంటూ శ్రమ యెరక్కుండా పని చేస్తున్నారు.

## 2

సరిగా యిలాంటప్పుడు పేర్రెడ్డి భార్య రంగమ్మ యాదాలాభంగా అక్కడికి వచ్చింది. ఆ యిద్దర్నీ చూశాటప్పటి కామెకి ముచ్చటయింది. ఆనందం మొగమంతా కమ్మేసింది. ముప్పయి సంవత్సరాల యువతి. సుఖమయ కల్పనలు అతి జటిలంగా పుట్టే వయస్సు. పైగా, రంగమ్మ విలాసవతి; ప్రణయవతి. కానైతే వాళ్ళ యిద్దరి మధ్యా అతి గంభీరమైన అగడ్త వొకటి వుండడం నిజమే. అయినా పదిహేనేళ్ళ పిల్లా, ఇరవై యేళ్ళ పిల్లాడూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ - రంగమ్మ తానేదో పరమ రహస్యమైన వొక సంగతి గ్రహించేశా ననుకుంది. "తొందరపడి యెదటికి వచ్చా" నని కించపడింది. అయినా వూరుకునే స్వభావం కాదామెది.

"నువ్వు కూడా తుడుస్తున్నా వెందుకే?"

"తుడవకూడదండీ రంగయ్యమ్మగారు?"

"నువ్వు సాయం చెయ్యమన్నావా, యేమిటిరా?"

"కాపుగారు గాది యెక్కేరా అమ్మగారూ?"

రంగమ్మకి సూటైన జవాబుకి బదులు లౌక్యం యెదురైంది; కాని దానికంటే యిదే నయం. జవాబైతే డొంకల్లోకి యీడ్చుకుపోయి వుండును. ఇప్పుడు తన సందేహానికి బలకరమైన సన్నివేశం చూచాయగా కనపడింది. ఏదో లేకపోతే యీ లౌక్య మెందుకూ?"

"పెళ్ళి మాట లాడుకుంటున్నారా యేమిటే పిల్లా?"

"కాటన్న మాలా, నేను మాదిగ పిల్లనీని; ఎలాగండి రంగయమ్మగారూ?"

"మా బాబుకి తెలిస్తే నన్ను చీరేస్తాడు. అసుమంటి మాట లనకండమ్మగారూ."

"పోనీ దాని బాబుకి ఇష్టమేనా?"

"పెద్ద కులం అయితే మాత్రం మా బాబు వొప్పుకుంటాడా రంగయ్యమ్మగార్రూ?"

"మీ మాట చెబుదురూ వేషాలకి పోకా."

దీనికి సమాధానం తోచక కాటన్నా, సోమాలూ మొగమొగాలు చూసు కుంటూ వుండగా పేర్రెడ్డి పిలుపు మీద పిలుపు చొప్పున నాలుగైదు మాట్లు పిలవడంచేత, యిష్టం లేకపోయినా విధి లేక, సిద్ధమైన ఫలాన్ని బోర్ల తోసు కున్నదానిలాగ రంగమ్మ కాళ్ళీడ్చుకుంటూ చక్కా పోయింది.

ఆమె వెళ్ళిపోయాక సోమాలూ, కాటన్నా వొక్కమాటు ఫక్కున నవ్వు కున్నారు; కాని వెంటనే వారి మొగాల మీద అనంత గాంభీర్యం అలుముకుంది.

## 3

"నీ కూతురి కింకా పెళ్ళి చెయ్యవుటరా గంగడూ?"

"చెయ్యకపోతే యెలాగం డమ్మగారూ?"

"మరెప్పుడు చేస్తావూ?"

"ఏమీ తోచడం లేదండమ్మగారూ! నా బతుకు నట్టడివి అయిపోయింది కదాండి. పోతూ పోతూ యెంకిపిల్ల నా గొంతు కోసేసిందండి. మా సోమా లింత కాచి పోస్తోంది కనక రోజులు దొర్లిపోతున్నాయి. యీ నాలుగేళ్ళనుంచీ నేనేడవని రోజు లేదండమ్మా! సోమాలికి ఎప్పుడో ఒకప్పుడు పెళ్ళి చెయ్యక తప్పదు. చేస్తే మొగుడు మూన్నాడే తీసుకుపోతాడు. నాకు గంజినీళ్ళ కోసం బెంగ లేదు కానండి—ఏలినోరి గుమ్మం కనిపెట్టుకుంటే - నా కెంత కావాలండి రంగయమ్మగారూ? తమరింక గంజి పోస్తూవుంటే నా కిదే చాలు. ఇక కూలీ అక్కర్లేదూ. కానండి రంగయమ్మగారూ! నా బిడ్డ మాటేనండి. నేను చెప్పు కోవడం కాదు కానండి - మహా నాజూకైన పిల్లండి. మాట పడదు. ఎంత పని చెప్పినా కష్టమని చూడదు. దానికి తగిన మొగుడు దొరుకుతాడో, దొరకడో. వచ్చినవాడు దాన్ని నిబ్బరంగా చూస్తాడో, చూడడో. తల్లి లేని పిల్ల. దాని రోజు లెలా వెడతాయో తోచడం లేదండి. మొగాణ్ణి నేనేం చూడగలనండి అమ్మ గారూ?"

"వారేయి! అది లోకంతోపాటిది కాదు. దాని మాట పుచ్చుకోకుండా ఎవణ్ణీ నిరుకు చెయ్యకు సుమా. నీకు చేతకాకపోతే నేను చూస్తాను తగినవాణ్ణి. మా గుమ్మంలోనే పందిరి వేయించి చేయిస్తాను దానికి పెళ్ళి. పెళ్ళి కొడుకుని నువ్వు సొంతంగా చూసినా నాతో చెప్పకుండా మాట ఇవ్వకు."

"చిత్తమండి, చిత్తమండి. తమ కంత దయ వుంటే—"

"చూడు గంగడూ! తీరుపాటయితే దాన్ని మా యింటి కెప్పుడేనా వస్తూ వుండమనరా."

"ఇంతకంటేనా రంగయ్యమ్మగారూ? తప్పకుండా పంపుతానండి. అది యింక పనికే వెళ్ళదండి. ఆ పనీ, యీ పనీ చూసుకుంటూ యేలినవారి పాదాల దగ్గిరే పడివుంటుందండి."

"తప్పకుండా పంపాలి సుమా!"

"చిత్తమండి."

"మరిచిపోకు."

"చిత్తం. మరి సెలవియ్యండి పొలం పోతాను."

"వెళ్ళి రా."

గంగన్న వెళ్ళిపోయాక "ఇదెలా సాగుతుందీ? .... చేసి తీరాలి" అనుకుంటూ రంగమ్మ యింటోకి చక్కా పోయింది.

## 4

గంగన్న పుల్లిట్లోకి వెళ్ళేటప్పటికి సోమాలు నార్లంక పంపులో కోతి పిర్రల మామిడి కింద చితుకు లేరుతోంది, కాటన్న చెట్టు మీద వుండి యెండి పోయిన రెమ్మలు విరిచి కింద పడేస్తున్నాడు. ఇద్దరూ అచ్చటా ముచ్చటా చెప్పుకుంటూ ఆనంద తరంగాల మీద వూగిపోతున్నారు.

బోదిగట్టెక్కేటప్పటికి గంగన్నకి ముందు సోమాలు కనపడింది. అనాస మడి తిరగవేసుకొని వెళ్లాటప్పటికి కాటన్న కిందికి వురికేడు. గంగన్నని చూసి వాళ్ళిద్దరూ కూడా వులిక్కిపడ్డారు; కాని కాటన్న వెంటనే సమాళించుకొని "ఏం మామా? ఎందాకా?" అని అడిగాడు. సోమాలు మాత్రం మాట్లాడలేకపోయింది.

"ఈ చితుకులన్నీ నువ్వు...."

"ఏం కష్టం?"

"అది కాదు కాటం రాజూ! నువ్వు విరిచినవి మీ యింటికి...."

"అదేమన్న మాటా? మా అమ్మ పొద్దున్న మూడు గంపల తాటి టెంకలు పట్టుకు వెళ్ళింది. నిన్న సందాల మా బాబు రెండు కావిళ్ళ తాటి కమ్మలు మోసుకు వెళ్ళాడు. ఇంకా నేను కూడా పట్టుకు వెళ్లాలా?"

"నువ్వు మంచివాడవు. వారం దినాలు ఎలా తగులపెట్టినా-ఏం అమ్మీ?"

"ఔను బాబూ! వారం దినాలు బెంగ వుండదు. కాటంరాజుని తలుచుకుంటూ సుఖంగా కూచోవచ్చు."

"అలా వుండాలి విశ్వాసం. చేసిన మేలెప్పుడూ మరిచిపోగూడదు. కాటంరాజూ! నీ సంగతి నాకు బాగా నచ్చింది. చేసుకున్న పెళ్ళాన్ని మాబాగా

సుఖపెడతావు నువ్వు. చూస్తున్నాను కాదూ పేర్రెడ్డి కాపుగారి కమతంలోకి వచ్చినప్పణ్ణుంచీ కాపుగారికి నీ మీద చాలా చాలా దయ."

"కాపుగారు చాలా మంచివారు మామా!"

"మంచన్న మంచా? నలభై యేళ్ళనుంచి వారి గుమ్మం కనిపెట్టుకుని వున్నాను నేను. రంగారెడ్డి కాపుగారున్నప్పుడు నా కేమీ లోటు జరగలేదు; కాని ఆ మారాజుకంటే పేర్రెడ్డి కాపు ఎంతో మంచివారు. రెడ్డిగారంటే ధర్మరాజనుకోవేం."

"అవు నవును."

"రంగయ్యమ్మగారు ఆ మారాజుకి తగిన భార్య, ఆయమ్మకి చేతులెత్తి మొక్కితే యెక్కడికి పోయినా కూడు పుడుతుంది."

"ఈ రైక నాకు రంగయ్యమ్మగారే యిచ్చారు. నెల పదేను రోజుల కిందట కుట్టించుకున్నారుట. రూపాయి మూడు పావలా లయిందిట. 'తొడుక్కోవే పిల్లా' అంటూ మీద పడేశారు మొన్న."

"చూడమ్మీ! నీకూనాకూ ఆయమ్మే దిక్కు. ఆయమ్మని కొలుచుకుంటూ వుండు."

"అలాగే బాబూ."

ఇలాగ ఇంకా స్త సేపు మాట్లాడి గంగన్న బాడవలోకి వెళ్ళిపోయాడు. పెద్ద ఆపద తప్పించుకున్నట్లు సోమాలూ కాటన్నా వొకరికేసి వొకరు చూసి పెద్ద నిట్టూర్పు విడిచారు.

తరువాత యిద్దరూ చితుకులన్నీ తెచ్చి గంపలో పోసి కట్టారు. కాటన్న సాయం చెయ్యగా గంప యెత్తుకుని కళ్ల చేరెడేసి చేసుకొని వొక్కమాటు కాటన్నను నిలువునా చూసి, వెళ్ళొత్తాను మామా" అంటూ సోమాలు బయలుదేరింది. కాటన్న మాట్లాడలేక అలాగే నుంచోగా అంత బరువెత్తుకునీ కూడా పది బారల కోమాటు నిలుస్తూ, మళుపు దాటేదాకా వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ చివరికి సోమాలు ఏదో వస్తువు పోగొట్టుకున్నట్లు బిక్కమొగంతో వెళ్ళిపోయింది.

## 5

మాల మాదిగల కందరికీ సోమాలు దర్శనం కరువైపోయింది. ఆమె కాకులు కూసేటప్పుడు విడిచిన గుడిసెకి రాత్రి పది దాటితే గాని చేరుకోవడం లేదు. తండ్రికి రాత్రంతా పొలం పని వున్నప్పుడామె గుడిసెకే వెళ్ళడం మానేసింది. వెడితే అక్కడ ఆమె వొక్కత్తే పడుకోవడమే కాదూ? రెడ్డిగారి గాదుల సావట్లో పడుకుంటే వంట ముసలమ్మ యించక్కటి కథలు చెప్పి-

నవ్విస్తుంది. తొరగా పెళ్లాడమనీ, మొగుణ్ణి యెలా సుఖపెట్టాలో యెలా లోపు చేసుకోవాలో - ఇలాంటివన్నీ చెప్పి పూరిస్తుంది. తెల్లవారితే రంగమ్మ యిక క్షణం విడిచిపెట్టరు. తండ్రి యింటికి రావడానికి వీల్లేనప్పుడు ముంత పట్టుకు వెళ్ళటం తప్ప సోమాలికి బైట పనే లేదు.

సోమాలు వేషం పూర్తిగా మారిపోయింది. వారానికో తల గడుగు. ప్రతి రోజునా తల దువ్వుకోవడం, రంగమ్మ కొంచెం నలిగిన చీరలన్నీ దానికిచ్చేసింది. రంగమ్మే పట్టుపట్టి అందెలూ, కడియాలూ చేరిపించి ప్రత్యేకంగా కడియాలు చేయించింది. చేతులనిండా గోకరజాన్ గాజులు; చెవులికి యెర్ర పొళ్ళ దుద్దులు; ముక్కులికి "అషు"లికి బదులు ముక్కు పుడకలు. మొత్తానికి మునుపు గాజు రాయిలాగ వుండిన సోమాలిప్పుడు పట్టెలు తీర్చిన నీలం లాగ నిగ నిగ లాడుతూ మెరిసిపోతోంది. కాటన్న సోమాలిని మొదటి రోజున హఠాత్తుగా చూసి రెడ్డిగారి చుట్టం అనుకున్నాడు.

కాటన్న మునుపు పొలంపని నింపాదిగా చేసుకుని, నిదానంగా పాటలు పాడుకుంటూ వచ్చేవాడు. ఇప్పుడు పొలంలో పని క్షణాలమీద అయిపోతోంది. పాటలూ, పద్యాలూ మూడోకాలంలో మెలికలు తిరిగిపోతున్నాయి. మునుపటి గూడ్సుబండి నడక యిప్పుడు మేల్గాడీ పరుగైపోయింది. ఏమంటే, రెడ్డిగారి యింటికి తొరగా వచ్చేస్తే సోమాలి నింకో చూపు యెక్కువ చూసుకోవచ్చు.

వొకనాడు అప్పుడే భోంచేసి వచ్చి బల్లమీద కూచుంటూ రెడ్డి చుట్ట అంటించాడు. కాటన్న యెదట నుంచుని కొత్తగా వచ్చిన సరెడ్లని గురించి ఏమిటో చెబుతున్నాడు. సరిగా ఆ సమయంలోనే వచ్చి సోమాలు చిన్న పాలికాపు కేదో పురమాయిస్తోంది. ఆమెని చూశాటప్పటికి కేం తోచిందో యేమిటో, పేద్రెడ్డి కాట్నన్నతో, "వొరేయి! సోమాలు పెళ్ళికూతురులాగ వుందిరా. నువ్వింకా గోచీగుడ్డతో ఘోటకబ్రహ్మచారి లాగే వున్నావు" అన్నాడు. అప్పుడే వాకట్లో అడుగు పెడుతూ వున్న రంగమ్మ అది విని, "సోమాలు పెళ్ళికూతురులా వుంటే మీరు కాటణ్ణి పెళ్ళికొడుకుని చెయ్యం" దంది. దానిమీద రెడ్డి "అవునా?" అని అడగ్గా కాటన్న "యెప్పటికేనా నాకు పెళ్ళి చేసే పూచీ యేలినవారిదే" అన్నాడు. అందుకు రంగమ్మ 'సోమాలికి పెళ్ళికొడుకుని చూడవలసిన భారం నామీదా, కాటడికి పెళ్ళికూతుర్ని తేవడం పూచీ మీ మీదా పడిందండోయి" అంటూ నవ్వింది "అయితే యిక ఆలోచన యెందుకూ! సోమాలిని పెళ్ళాడతావుటరా మరి?" అని రెడ్డి అడిగాడు.

ఆమాట వినేటప్పటికి కాటన్న హృదయం గుబగుబ లాడిపోయింది. సోమాలి గుండెలు దుడుకూ దుడుకూ కొట్టుకున్నాయి. సోమాలు కాటన్న కేసి

చూసింది. కాటన్న సోమాలి కేసి చూశాడు. ఆ రెండు చూపులూ కలిశాటప్పటికి వాకలంతా మెరుపు మెరిసినట్లయిపోయింది. రెడ్డిదంపతుల కళ్లు మిరుమిట్లు కొన్నాయి.

సోమాలు, ఎక్కడలేని సిగ్గు వచ్చి, గోడచాటుకి పోయి, "నువ్వు పొలం వెళ్ళిపో" అన్నట్టు తల వూపింది; కాని కాటన్న కదలలేదు. రెడ్డి తెచ్చిన ప్రస్తావనవల్ల కాటన్నకి గొప్పరాజ్యం వచ్చినట్లుంది. ఇంకా యెదటే వుంటే రెడ్డి యింకా యెలాంటిమాట లంటాడో? అసలు ధోరణి ఇలా మార్చేసిన రంగమ్మ చివరి కెలా తేలుస్తుందో?

ఇదేమిటో చూస్తే కాని కాటన్న అక్కణ్ణుంచి కదల తలుచుకో లేదు. అయితే యింతట్లో గంగన్న వచ్చి కాటన్నని పొలం తీసుకు చక్కాపోయాడు. చేసేది లేక కాటన్న కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళాడు.

"అల్లుడూ, మామగారూను."

"నిజమే అంటావా?"

"బాగానే వుంది. ఇంకా బోధపడలేదుటండీ?"

"బోధపడింది; కాని అంత పని జరుగుతుందా?"

"మీరు కలగ చేసుకుంటె పెళ్ళి. లేకపోతే స్వయంవరం."

"అబ్బా!"

"పున్నమి వెడితే కాటడు రంగం దూకేస్తాడు."

"సోమాలు?"

"వాణ్ణి కదిపేదే అదీ."

"అయితే యిక చూస్తూ వుండు."

ఇలా చెబుతూ రెడ్డి పొలం వెళ్ళిపోయాడు. అవేళ అస్తమానూ అతనికి ఇదే ఆలోచన.

## 6

ఇక్కడ యిది యిలా వుండగా అక్కడ మాలపిల్లిలో కొంప లంటుకున్నాయి. "కాటన్న పనేమీ బాగా లేదంటోయి నరిసీములూ" అంటూ, మూడు కాళ్ళ ముసలి సోమన్న వచ్చి నిప్పు రాజేశాడు. తరవాత చంద్రన్న వచ్చి "మీవాడు కులం చెడ్డా దన్నమాటే" అంటూ ఆ నిప్పు వూదాడు. నిలవతీసి అడగ్గా, "మీవాడు సోమా లిచ్చిన నీళ్ళు తాగా దంటోయి" అని బుచ్చన్న చెప్పాడు. "మొన్న చద్దికూట్లో సోమాలిచ్చిన చింతచిగురు పచ్చడి నంజుకున్నాడంట కాటన్న" అని సీతన్న చెప్పాడు. "మీవాడికి సోమాలు ముంత అందిస్తూ

వుండగా శానామంది చూశారంట కాపులు" అని పోతురాజు రూఢించి చెప్పగా, "ఇక కులమా? కొడుకా?" అంటూ టకాయించి అడిగి సోమన్న చక్కాపోయాడు.

నరిసీములికి కొండ విరిగి మీద పడ్డట్టయింది. ఒక్క కొడుకు. గారాల కూచి. తనకి ముసలితనం అలుముకుంది. అన్నిటికీ యిక కాటన్న రెక్కలే ఆధారం. తిండి మాటకేం? ఆ వొక్క కొడుకూ తన నింత బూడిద చేస్తాడా చెయ్యడా?

అతనికి వెన్నెట్లోనించి చీకట్లో పడ్డట్టయిపోయింది. కులం అయితే యెలాంటి పిల్లయినా సమాధానపడవచ్చు. పెద్ద కులం అయితే పేచీలు వచ్చినా కులం చెడదు. ఇదేమిటి యిది? ఎటు చూసినా సర్వనాశమే. కూడు లేక పోయినా బతకవచ్చు; గాని కులం లేకపోతే యెలాగా?

నరిసీములు యిలా కుమిలిపోతూ వుండగా నీళ్ళ కడవ పట్టుకొని పోలమ్మ వచ్చింది. పెనిమిటి మొగం చూశాటప్పటి కామె కేదో భయం కలి గింది; కాని అడుగలేకపోయింది. పోలమ్మని చూశాటప్పటికి నరిసీములికి కళ్ళు నీళ్ళు కమ్మాయి. అదిచూసి పోలమ్మ యిక నుంచోలేక, కడవఅక్కడే దింపేసి, పెనిమిటి దగ్గర కూచుని, "ఏం? యెందుకూ? యేం వచ్చిందీ?" అని అడిగింది. ఒకటి రెండు నిమిషాల పాటు నరిసీములికి మాట తిరిగింది కాదు. ఆస్థితి చూసి పోలమ్మ దుఃఖిస్తూ మీద వాలగా బ్రహ్మాండంమీద నరిసీములు జరిగిందంతా చెప్పాడు.

"ఏమిటీ" అంటూ పోలమ్మ వులికిపడింది.

"ఏడవకు, ఇది నిరుకా? కిట్టనివాళ్ళు కల్పించి వుంటారు."

"నిరుకైతే యేమిటి చెయ్యడం?"

"కాటన్న నాదగ్గిర ఏమీ దాచడు. అడుగుదాం."

"నిజమే చెబుతా డనుకో. నిరుకైతే? కులం మాట చెప్పు. 'కులమా? కొడుకా?' అని అడిగాడు చింతన్నగారి సోమన్న."

"ఇటు మాలలకీ, అటు మాదిగలకీ కూడా దూరమైపోతాం" అని నర సీములు దీనంగా అన్నాడు.

"అందుకోసం వాళ్ళ నిద్దరినీ విడదీస్తే పాపం కాదూ?" అని పోలమ్మ అడిగింది.

నరిసీములు మాట్లాడలేకపోయాడు. ప్రేమోపాసన అతని మనస్సుని మృదువువరిచి వుంది. అయినా అధైర్యం పోలేదు. ఇది కనిపెట్టి పోలమ్మ "యిక్కడ కాదు" అంటూ అతగాణ్ణి గుడిసెలోకి తీసుకుపోయింది.

7

పోలమ్మా, నరిసీములూ కూడా దీన్ని గురించి చాలా రహస్యంగానే ఆలోచనలు చేశారు. కాని యిది

పూర్వస్మృతి నరిసీముల్ని గుంజేసి విడిచిపెట్టింది. బొబ్బిలికథ పాడ డంలో నరిసీములికి వున్న నేర్పుచూసి పోలమ్మ, చేస్తూ చేస్తూ వున్న పండు వంటి కాపరం విడిచిపెట్టి నరిసీములుమీద వాలింది. నిక్షేపం లాంటి మూడు యకరాల భూమి ప్రేమ యెదుట ఆమెకి గడ్డిపరక లాగ కనపడింది. తండ్రి గదిమాడు; అన్నదమ్ములు పొడిచేస్తామన్నారు. వదినలూ, మరదళ్ళూ దెప్పి పొడిచారు తల్లి గొల్లున గోల పెట్టింది. మొగుడు చార్జీ యివ్వడానికి సిద్ధపడ్డాడు; కాని పోలమ్మ వినలేదు. జంకనూలేదు. నరిసీములు అప్పుడు విజయగర్వాన్ని చూపించాడు. అయితే అది కులంలో కులం కనక సరిపోయింది, ఇప్పుడు?

"కాదుకే అని చెప్పలేకపోయావా?"

"అయితే ముందు దారి?"

"కులం కూడు పెడుతుందా? వొక్క కొడుకు. మాట తీసెయ్యడం యెరగడు. రాచకొమారుడులాగ వుంటాడు. మొగం చూస్తేనే కడుపు నిండి పోతుంది."

"అంచేతనే సోమాలు కన్నేసింది."

"అబ్బరమా? నే నెయ్యలేదూ నీ మీదా? యకరం భూమి అమ్మగారిదీ, యేదుం భూమి అక్కడిదీ వొదులుకో లేదూ నీకోసం? కోరుకున్న పెనిమిటి దొరికితే కుల మెందుకూ' కూ డెందుకూ?"

మాలపిల్లి, మాదిగపిల్లి కూడా పాకిపోయింది. ఎక్కడ చూసినా యిదే గొడవ. చివరికి మాలపెద్దలు నరిసీముల్ని అడిగినట్లే మాదిగపెద్దలు "ఏం చెబుతావోయి దీనికి?" అని గంగన్నని నిలదీసి అడిగారు.

గంగన్న వులిక్కిపడ్డాడు. ఇప్పటి కింకా అతగాడు తనకూతురు చిన్న పిల్లే అనుకుంటున్నాడు; గాని ఆమె ప్రణయశరాలస అయివుందని గ్రహించ లేదు. మొదణ్ణుంచీ గంగన్నకి ఏడుకొండలవాడిమీద వున్నంత ధ్యానమూ, దృష్టీ మరి దేనిమీదా లేదు. పెళ్ళాం బతికి వున్నప్పుడు అతను సంసారంకేసే చూడలేదు. కూలో, నాలో తీసుకువచ్చి చేతిలో పొయ్యడమూ, ఆమె భోజనం చెయ్యమంటే చెయ్యడమూ, కాపుగారి పని మితి యెరక్కుండా చెయ్యడమూ, హాయిగా పడుకోడం, —ఒక్క నిద్రపోయాటప్పుడు తప్ప తక్కిన అన్ని సమ యాలలోనూ వెంకన్నబాబుని తలుచుకోడం, పాడుకోడం—ఇంతకంటే అతను

మరోపని యెరగడు. అంచేత అతను జరుగుతూ వున్న సంగతులేమీ గ్రహించ లేదు. పైగా రెండుమాసాలకిందట దగ్గరిచుట్టం వొకడు వచ్చి తన కొడుక్కి సోమాలి నిమ్మని అడగ్గా, "చిన్నపిల్ల. దాని కిప్పుడే యేం పెళ్ళి బావా?" అని కూడా అని వున్నాడు. అలాంటివాడు ఇలాంటి ముదలకింపు విని వులిక్కి పడడంలో ఆశ్చర్యం యేం వుందీ?

మునుపటి లాగే అత నిప్పుడు కూడా కులపెద్దలతో "చిన్నపిల్ల. దాని కేం తెలుస్తుందీ? మీరు చెప్పడు మాటలు విన్నారు" అన్నాడు; కాని వాళ్ళు అంతటితో విడిచిపెట్టలేదు. ఆ పెద్దలకి కులంమీద వుండే అభిమానం కంటే సోమాలిమీద అసూయ హెచ్చయి పోయింది. ఉప్పు లేకుండానే ముప్పందుం రకంలో చేరిన కుల పెద్దలు భీష్మించారంటే ఆశ్చర్యం యెందుకూ?

ఆడాళ్ళయితే యేమి, మొగాళ్ళయితే యేమి, యిరవైమంది దాకా గంగన్నని ముట్టడించారు. రెండు గంటలసేపు తర్జనభర్జన చేశారు. ఎంత సేపూ గంగన్న "మాపిల్ల అలాంటిది కా" దంటాడు. కులపెద్దలు "బుకా యించ" కంటారు. "జాగ్రత్త" అని వాళ్ళనరు. "కూకలేస్తా" నని యితగా డనడు. చివరికి వ్యవహారం సుతి మించిపోయింది. "వారంరోజుల్లో నీకూతురికి పెళ్ళి చెయ్యకపోతే కులంలోనుంచి నిన్ను కేటాయించేస్తా" మని ఖచితంగా చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు.

గంగన్నకి కష్టం తోచింది. ఎటు చూసినా యేమీ కనపడలేదు; కాని హఠాత్తుగా రంగమ్మ అనిన మాట నెమరుకి వచ్చింది. "కాపుగా రప్పు డలాగ యెందుకన్నారో యెరుగుదువా?" అని యెవరో అడిగినట్లు కూడా అయింది.

గంగన్న యిక నుంచో లేకపోయాడు. "రంగయ్యమ్మగారి నడిగితే అంతా తేలిపోతుం" దని నిశ్చయించుకొని బయలుదేరాడు. మనస్సు చిమచిమ లాడిపోతోంది; గాని నాలిక మాత్రం "ఏడుకొండలవాడా! గోవిందా, బాబు" అని అందుకుంది.

పది బారలు వెళ్ళాడు. పాట ఏ డెనిమిది చరణాలు నడిచింది. అప్పటికి కొత్త గోదావరి నీటిలో యిండుగు గంధం కలిపిన ట్లయింది. మరో పది బారలు వెళ్ళాటప్పటికి బుద్ధి నావరించుకుని వున్న కల్మషానికి దిగతీత మొద లయింది. తిరపతి స్టేషను సమీపిస్తూ వున్నట్లూ, యాత్రికుల గోవిందబొబ్బ లతో భూనభోంతరాళాలు నిండిపోతూ వున్నట్లూ తోచింది. దీనితో గంగన్న, శరీరం మరిచిపోయాడు. అన్యచింతలు తుడిచి పెట్టుకుపోయాయి.

అలాగ పారవశ్యంతోటే నడిచి అతను పేర్రెడ్డి గుమ్మంలోకి వెళ్ళాటప్పటికి

రెడ్డి కొత్తగా అచ్చుపోసి విడిచిపెట్టిన ఆబోతుకి రంగమ్మ దగ్గిర వుండి సోమాలి చేత వులవగుగ్గిళ్ళు పెట్టిస్తోంది.

ఈ దృశ్యాన్ని చూశాటప్పటికి గంగన్నకి వెంకటరమణమూర్తి సాక్షాత్కరించినట్లే అయిపోయింది. వెంటనే పాటకి స్థాయి హెచ్చించాడు. వొట్టి చేతుల తోటే తాళంవేస్తూ, గజ్జెలు లేని కాళ్ళతోటే నృత్యం చేస్తూ ఆ వృషభానికి ప్రదక్షిణం ప్రారంభించాడు. అది కొత్తదైతే కొంచెం బెదరి వుండును; గాని చిన్నప్పట్నుంచీ కూడా దానికీ గంగన్నకీ చాలా స్నేహం. అసలు గంగన్న ప్రోత్సాహంచేతనే పేర్రెడ్డి దాన్ని అచ్చోసి విడిచిపెట్టాడు. అంచేత అది నదురూ బెదురూ కూడా లేకుండా తాపీగా దానా తిని వీధిలోకి బయలుదేరింది. చెరువు గట్టు మీదికి వెళ్ళేదాకా దానికూడానే వెళ్ళి, తరవాత గంగన్న పల్లె ప్పాలెం వెళ్ళిపోయాడు.

## 8

పోలమ్మ సంగతంతా చెప్పి మధురాన్ని సలహా అడగ్గా, మధురం దేవ సహాయానికి చెప్పి, "నువ్వు కలగచేసుకో" అంది.

దేవసహాయం అంటే ఆదిలో కులానికి దేవాంగి. పేరు దేవయ్య. పద మూడో యేట తల్లిదండ్రు లిద్దరూ వొక్కమాటే చచ్చిపోయారు. ఇటూ అటూ కూడా అతనికి "నా" అన్నవా శ్ళెవరూ లేకపోయారు. అయినా కులవృత్తిలోనే కూలివని చేసుకుంటూ అత నెలాగో కాలం గడపేస్తూ వుండేవాడు.

ఇలా వుండగా పద్దెనిమిదేళ్ళ వయస్సులో అతనోమాటు ద్రాక్షారం సంత నుంచి వస్తూ రామచంద్రపురానికీ, వసలపూడికీ మధ్య కలరావచ్చి పడిపోయాడు. కులస్థులు కొందరు కూడానే వస్తున్నారు; గాని భయంవల్ల విడిచిపెట్టి పారి పోగా వొక మిషనరీ చూసి, తీసుకువెళ్ళి, చికిత్సచేసి బతికించాడు. గ్రామస్థులూ, కులస్థులూ అయినవాళ్ళలా చెయ్యగా ఎక్కడో పాతాళంలోనుంచి వచ్చిన కిరస్తానీదొర యిలా చెయ్యడం అతని విశ్వాసాన్ని తిప్పేసింది. వెంటనే దేవయ్య మతంలో కలిసి దేవసహాయం అయిపోయాడు.

తరవాత నాలుగేళ్ళ కతను రాయవరంలోనే కిరస్తానీల పాఠశాలలో వంతులుగా ప్రవేశించాడు. అప్పటి కతను బ్రహ్మచారే; కాని వచ్చిన యేణ్ణర్థానికే గృహస్థు అయినాడు. వెలమకులం మారెమ్మ మొగుడు చచ్చిపోగా మతంలో కలిసి, మధురం అయి, దేవసహాయాన్ని చెట్టపట్టింది.

అది మొదలు ప్రణయంతో లంకెవేసి భిన్నకులాలకు చెందిన యువ తులనూ, యువకులనూ మతంలో చేర్చాలని అతను నిశ్చయించుకున్నాడు.

ఈ నిశ్చయం అక్కడక్కడ కొంచెం పలోన్ముఖంగానే వుంది; కాని యిది అతనికి కేవలమూ కొత్త.

"నా కొడుక్కి దారి చూపించండి బాబయ్యా" అంటూ పోలమ్మ కాళ్ళ మీద పడింది. "నాకు గతేమిటి పంతులుగారూ?" అంటూ నరిసీములు చేతులు పట్టుకున్నాడు. దీనితో దేవసహాయానికి రక్తం వుడుకెత్తి చర్రుమంది. వొక్క నిట్టూర్పు విడిచాడతను. గుక్క తిప్పుకోకుండా వొక్క అరగంట యేకబిగిని క్రీస్తుమతాన్ని గురించి వుపన్యాసం చేశాడు. దేవుని కరుణకి చాలా వుదాహరణాలు చూపించాడు. తన సంగతంతా పూసగుచ్చినట్టు యేకరువుపెట్టాడు. ఆ వృద్ధ దంపతులికి తెలిసిన హిందూమతాన్ని తుక్కు తుక్కు కింద యేకేసి విడిచిపెట్టాడు. సోమాలూ, కాటన్నా భార్యాభర్తలు కావడం దేవుని సంకల్పం అన్నాడు. దానికి భిన్నంగా నడిస్తే మీకు నరకం వస్తుందన్నాడు.

ఈ సందర్భంలో మధురం కూడా చిన్న వుపన్యాసం చేసింది. "దేవుని దయవల్లనే నేను మతంలో కలిశాను. కులమో, కులమో అంటే కులం కూడు పెడుతుందా గుడ్డ యిస్తుందా? దేవుని రాజ్యంలో కులాలు లేవు. అక్కడ అంతా సమానమే. మీ హిందూమతంలో మట్టుకే యీ పుట్టిముసక వుంది. మా మతం కంటే మంచి మతం మరెక్కడా లేదు. మీ కాటన్న కూడా మతంలో కలిశాడంటే రెండు మూడేళ్ళలో పంతులుగా రయిపోతాడు. సోమాలు పంతులమ్మ అవుతుంది. వాళ్ళిద్దర్నీ విడతీస్తే దేవునికి కోపం వస్తుంది. పైగా సోమాలిని పెళ్ళి చేస్తేనే మీ కాటన్న మీకు తక్కుతాడు. బాగా ఆలోచించుకోం"డని యిలాగ మధురం కళ్ళు తిప్పుకుంటూ చెప్పగా పోలమ్మ వుద్రేకంపొంది మొగుడు కేసి చూసింది. దాని మీద నరిసీములు, రక్తం వుడుకెత్తగా, "అలా అయితే మేమూ మతంలోనే కలుస్తా" మన్నాడు.

## 9

"నాకు మహా గట్టి చిక్కు వచ్చిందండి రంగయ్యమ్మగారూ!"

"చిక్కా?"

"చిక్కన్న చిక్కు కాదండి. యిక బతికే యోగం లేనట్టుందండమ్మగారూ!"

"ఏమిటిరా అదీ?"

"కులంలోనుంచి నన్ను కేటాయించేస్తారుటండి పెద్దలు."

"ఏం వచ్చిందనీ?"

"సోమాలు కాని పనులు చేస్తోందిటండి."

"అంటే?"

"మా పిల్ల కాటంరాజుకి యిలాకా పడిందనీ—"

"ఛి ఛీ! ఎవళ్లురా అలా పేలుతున్న వాళ్ళు?"

"కులం అంతా యిదే మాటండి."

"పొగరెక్కి వున్నారే?"

"నా కేలినోరి ఆసరా వుంది గనక కానండి, లేకపోతే నిమిసాలమీద గెంటేస్తురం డమ్మగారూ!"

సరిగ్గా యీ సమయంలో "యెవళ్ళురా నిన్ను గెంటేసీ వాళ్ళు? ఆడది యేలుతోందిటరా రాజ్యం?" అంటూ సింహనాదం చేస్తూ పేర్రెడ్డి వచ్చాడు. అది చూసి రంగమ్మ సంగతంతా చెప్పి, "మీరు కలుగచేసుకోవాలి" అంది. దాని మీద రెడ్డి "లేకపోతే వాళ్ళ ఆటలు సాగనిస్తానా నేనూ? వారే గంగడూ! అసలు సంగతేమిటో గ్రహించావా? సోమాలు చుట్టం లాగ మా యింటో వుంది సుఖ పడుతోంది. దానికి కులంలో యెవరికీ లేని అదృష్టం పట్టింది. అందుకోసం యేడుస్తున్నారు మీ వాళ్ళలాగ. మళ్ళీ యేమేనా అన్నారంటే నాతో చెప్పు, తవ్వి పాతేస్తాను" అని ధైర్యం చెప్పి, "ఇక్కడ కాదు. పుల్లిట్లోకి వెడదాం రా" అంటూ బయలుదేరాడు. "ఏలినోరు యెలా చెయ్యమన్నా యిష్టమేనండి నాకు. మీరే పఋవులూ, మీరే దేవుళూ నాకు" అంటూ గంగన్న రెడ్డి కూడా వెళ్ళాడు.

* * *

వీరిద్దరూ వెళ్ళేటప్పటికి కాటన్న చేని గట్టు మీద కూచుని చద్దన్నం తింటున్నాడు. ఎవరూ కూడా మాట్లాడలేదు; గాని కాటన్నని చూశాటప్పటికి గంగన్నకి మనస్సు గుబ గుబ లాడిపోయింది. ఇది కనిపెట్టి, యిక అక్కడ నుంచుంటే అనవసర ప్రసంగం రావచ్చునని గంగన్నని తీసుకుని రెడ్డి ముందుకి వెళ్ళిపోయాడు.

## 10

రంగమ్మా, సోమాలూ గాది సావిట్లో కూచుని పసుపు దుంపలు బాగు చేస్తున్నారు. రంగమ్మ మొదట లోకాభిరామాయణం కొంత సాగనిచ్చి చివరికి పెళ్ళి గొడవలోకి దింపేసింది.

"..................."

"మాట్లాడవేం?"

"ఏం చెప్పమంటా రండమ్మగారూ?"

"సిగ్గెందుకే? నువ్వు ఇంకొకణ్ణి, కాటడు మరొకత్తినీ పెళ్ళాడితే మీకిద్దరికీ

సుఖం వుండదు. తరవాత యిద్దరూ యేడుస్తారు. కనక ధైర్యం తెచ్చుకోవడం మంచిది."

"పెళ్లాడితే కులంలో వుండనిస్తారాండి?"

"లేచిపోతే వుండనిస్తారా?"

"..................."

"ఇక కులం యెలాగా వుండదు. అయినప్పుడు పెళ్ళాడితేనే మంచిది కాదూ?"

"..................."

"చూడూ మారెమ్మ యెలా సుఖపడుతోందోనూ?"

"మధురమ్మగారు మతంలో కలిశారు."

"మీరు కూడా కలిస్తే సరీ."

"మా బాబు గతేమిటండి మరి?"

"నువ్వు లేచిపోతే గతేమిటి!"

"..................."

"... ..............."

"ఇలాగే వుండిపోతే నోండి?"

"పెళ్ళాడకుండానా?"

"... ..............."

"లేచిపోకుండానా?"

"..................."

"కాటణ్ణి మరిచిపోయావా?"

"..................."

"వుండగలవా నువ్వూ?"

"..................."

"పెళ్ళి లేకుండా వుండనిస్తారా నిన్ను కులంవాళ్ళు?"

"..................."

"మీ బాబు మాత్రం వొప్పుకుంటాడా?"

"..................."

"రెడ్డిగారిని పిలవనా?"

"వారి దగ్గిర నే నేమాటా చెప్పలేనండి."

"కొడతారా తిడతారా? నువ్వూ, కాటడూ పెళ్ళాడి సుఖంగా వుంటే చూడ్డాలని వుంది రెడ్డిగారికి."

"మా సంగతంతా...."

"ముందు వారికే తెలిసింది."

"....................."

"పిలవనా?"

"వొద్దం డమ్మగారూ! మీ కాళ్ళకి మొక్కుతానండి. ఈ గొడవ వారి యెదట మాట్లాడలేనండి. పిలవకండి, మీరెలా చెబితే అలా వింటానండి. ఏం చెయ్యమంటే అది చేస్తానండి. మీ దగ్గిర దాచడం యెందుకండీ యింకానూ? ఆమావాస వెళ్ళాక రంగం వెళ్ళిపోవాలని నిరుకు చేసుకున్నామండి మేము."

"ఏమిటీ?"

"నమ్మం డమ్మగారూ?"

"ఇక్కడ వుండరూ?"

"ఇంకెందుకండీ? ఏలినోరు మమ్మల్ని కాపాడతామంటే యిక్కడే వుండి పోతామండి. కాటంరాజు కూడా మీ మాటకి అడ్డు చెప్పడండి."

"అలా చెప్పు. మీకేమీ భయం లేదు. ఏమీ లోటు జరగదు. మిమ్మల్ని బతికివున్నంత కాలమూ నేను పోషిస్తాను. మీకేమీ చిక్కులు రాకుండా రెడ్డిగారు వెయ్యి కళ్ళతో కనిపెడుతూ వుంటారు."

"చిత్తమండి."

"యిక లేచిపోవడం మాట-"

"ఇంకెందుకండీ? ఇక్కడే వుండిపోతామండి."

"కాటడితో నువ్వు చెబుతావా, నేను చెప్పాలా?"

"నేను చెబుతాను లెండి."

"మరి వెళ్ళి మాట్లాడిరా."

"అనక మాట్లాడకూడదండీ?"

"ఆలస్యం యెందుకూ? వారం రోజుల్లో పెళ్ళయిపోవాలి మీకు? ఇంకా యెన్నాళ్ళూ గుటకలు మింగుతూ కూచోడం?"

"....................."

"సిగ్గుపడకు. కాటడు అరిటి మొక్కలికి నీళ్ళ తోడుతున్నాడు, వెళ్ళి మాట్లాడిరా."

"....................."

"నువ్వు వచ్చేదాకా నే నిక్కడే వుంటాను సుమా."

"చిత్తమండి."

"తొరగా — పోనీ సావకాశంగానే మాట్లాడుకోండి పాపం."

సిగ్గుచేత సోమాలు హంస పిట్టలాగ తక్కుతూ, తారుతూ వెళ్ళడం చూసి, "మనస్సులు కలిసిపోయాయి పాపం. విడతీస్తే పాపం కాదూ? బలవం తాన్నైనా విడతియ్యడం సాధ్యమౌతుందా? రంగం దూకేస్తే? ........ పెళ్ళి చేసి తీరాలి" అనుకుంటూ రంగమ్మ అక్కడే కూచుంది. సోమాలు సందు గుమ్మం దాటీదాకానే నింపాదిగా వెళ్ళి తరవాత వురకలు వేసుకుంటూ నూతి దగ్గిరికి వెళ్ళింది.

## 11

"వాళ్ళ వూచీ అంతా నాదీ" అని రెడ్డి దృఢంగా చెప్పగా, గంగన్న కాటన్నకి సోమాలి నివ్వడానికి వొప్పుకున్నాడు. "మేము వుండగా మీ కేం భయమురా?" అని రంగమ్మ చెప్పగా కాటన్న దేశంలోనే — వూళ్ళోనే వుండి పోడానికి వొప్పుకున్నాడు. "నీకు మురుగులూ పట్టెడా చెయ్యమని కంసాలి సన్నానికి రెడ్డిగారు కాసులిచ్చేరే" అని వంటలక్క చెప్పగా సోమాలు పొంగి పోయింది.

రెడ్డి అప్పుడే భోజనంచేసి వచ్చి, బల్లమీద కూచుని చుట్ట అంటిస్తూ వుండగా దేవసహాయం వచ్చాడు.

"మీకోసం వచ్చానండి."

"నీకోసం కబురు పంపా లనుకుంటున్నాను."

ఇలా అంటూ యిద్దరూ యీ సంగతే అందుకున్నారు.

* * *

తరవాత వారం రోజులు వెళ్ళాక యాకూబూ, దావీదూ మురుక్కాలవ గట్టున కూచుని చాలా కష్టంగా మాట్లాడుకున్నారు.

"దొరగారు మంచిపని చేశారు కారు."

"ఇలా జరుగుతుందని నే నెప్పుడూ అనుకోలేదు."

"మాలాడికీ మాదిగదానికీ పెళ్ళా? ఎక్కడేనా జరిగిందా యిలాగా?"

"మతంలో కలిశాక యిక కుల మేమి టంటున్నారు దేవసహాయంగారు. విన్నావా?"

"ఆయన మరీసి. ఇదంతా ఆ మొగుడూ పెళ్ళాలే చేశారు."

"పిల్ల దొరక్క ఆయన కులం చెడ్డాడు. అందర్నీ తనతో సమానం చేసుకోవాలని ఆయన యిలా చేశాడు. ఛీ! కిరస్తానీ మతం మంచిది కాదోస్."

"అవునోస్."

* [భారతి, అక్టోబర్, 1931] *

# గ్రుక్కెడు నీళ్ళు

బందా
కనకలింగేశ్వరరావు

'దూరంగా ఉండరా, కళ్ళు కనబడటల్లేదు?'

'..............................'

'నిన్నే; మాట వినిపించుకోవేమిరా, మాయ స్వరాజ్యం వచ్చిందని మండిపడిపోతున్నావేం?'

'..........................

'దూరంగా పోరా' అని మునసబు వెంకటస్వామి మందలించగానే వెంకటప్ప తప్పుకున్నాడు. మహలక్ష్మమ్మగారు మడినీళ్ళు పట్టుకుని వెళ్ళింది.

ఇల్లు చేరగానే మహలక్ష్మమ్మ, మడినీళ్ళబిందె దింపి, అరుగుమీద పెద్ద మనుష్యులతో మాట్లాడే భర్తను 'ఒకమాటిలా రండి' అని లోపలికి పిలిచింది.

కూరసంగతి కనుక్కోటానికి గావును లోపలికి రమ్మన్నదనుకొని లోపలికి వెళ్ళాడు బ్రహ్మయ్య.

'చూడండి! వెంకటప్ప కంత పొయ్యేకాలం వచ్చిం దేం, దారి తప్పుకోరా అంటే తలతిక్క తనంగా వినిపించుకోడు, కాస్త కనుక్కోకపోతే ఆడవాళ్ళం మడినీళ్ళు తేలేం' అని కసిరింది మహలక్ష్మమ్మ.

'కనుక్కుంటాలే' అంటూ కరణం బ్రహ్మయ్య వాకిట్లోకి వచ్చి కబురంపేడు వెంకటప్పకు.

వెంకటప్ప ఊరు వెట్టి, ఆ ఊళ్ళో వాడొక్కడే మాల. తల్లిదండ్రులు చిన్నతనంలో పోవటంచేత

గాలికి పెరిగి ధూళికి ఎదిగి కన్నంగట్టుమీద చుట్టుగుడిసె వేసుకుని కాపురం ఉంటున్నాడు వెంకటప్ప. పుట్టుక తక్కువైనా బుద్ధిమంతుడు. అందువల్ల ఊళ్ళోవాళ్ళు బట్టలు పాతలు ఇస్తూ అంత పచ్చడిరవ్వా, ఇంత పప్పుచారు పెడుతూ ఆదరంగా చూస్తూండేవారు.

కరణంగారి కోపానికి కాకైనా అదురుతుంది. అలాంటప్పుడు వెట్టిపని చేసే వెంకటప్పకు చెప్పాలా! వెంటనే కరణం బ్రహ్మయ్యగారింటికెళ్ళి దణ్ణం పెట్టేడు.

బ్రహ్మయ్యగారు వెంకటప్పను చూడగానే మనుష్యునకు రావలసినంత కోపం తెప్పించుకొని ఎడమకాలి పాతచెప్పు తీసి వెంకటప్ప మొగాన కొట్టేడు. అది చాలక బండబూతులు తిట్టి బొండకొయ్య వేయించాడు. ఏం చేస్తాడు వెంకటప్ప? తల వంచుకొని దండన భరించాడు. ఇంతకు వెంకటప్ప చేసిన తప్పేమిటో!

బ్రహ్మయ్యగారు బ్రాహ్మణులు. ఊరికరణం. రామవరంలో వారంటే మంచి వలుకుబడి ఉంది. వ్యాజ్యాలలో మధ్యవర్తిత్వం చేయాలన్నా, అన్న దమ్ముల పాలు పంపుళ్ళు పెట్టాలన్నా, కవులుకత్తులు వీళ్ళుగాని వ్రాయాలన్నా, లక్షాధికారి లక్ష్మణస్వామైనా ఆయనకే కబురంపాలి. ఏభై వేల రూపాయిాల నగదు, పాతిక ఎకరముల భూమి, పురాతనపు ఇల్లు, ఆయనకున్న ఆస్తి. కాని ఎన్నుంటేయేం, బిడ్డలులేరు. ఎలాగైనా ఒక్క కాయ కాస్తుందేమో యని తాయత్తులమీద తాయత్తులూ, జపాలమీద జపాలు, తపాలుమీద తపాలు, ఇక యేమిటి! సూర్యనమస్కారాలేకాదు సుందరాకాండ పారాయణాలే కాదు, పుత్ర కామేష్టి వ్రతాలేకాదు, పుణ్యతీర్థాల మునుగటమే కాదు, గోసాయిాల వేరుముక్కలే కాదు, గోకుల బృందావనదర్శనాలే కాదు, ఎన్ని చేసినా ఒక్క పిల్లడుగాని, పోని, పిల్లయినా కలుగలేదు. భోగేశ్వరం దేవుడికి మ్రొక్కేరు. మ్రొక్కటమే కాదు, స్నానం చేసి తడిగుడ్డతో తెల్లవార్లు సాగిలపడ్డది మహాలక్ష్మమ్మ గుడి వెనుక : అబ్బే! మాటవరసకైనా నెల తప్పలేదు.

కాలం ఒక్కమాదిరిగా ఉండదు. రామవరంలో కొంచెం కలరా తట స్థించింది. కొంచెంగా ఉన్నదల్లా కొద్దిరోజుల్లో గొప్పదైనది. రోజూ నాలుగైదు పీనుగలు వెడుతున్నాయి. ప్రొద్దు క్రుంకితే తలుపు తీయటంలేదు. వీధులలో సంచారం కనపడటల్లేదు. మునసబు వెంకటస్వామి ముడుపు గట్టించాడు. మ్రొక్కే దేవతలకు మ్రొక్కుతున్నారు. చేసే పూజలు చేస్తున్నారు. గణాచార్లు మీద గణాచార్లు. మంగలితిర్పతిగాని భార్యకు మారెమ్మ పూనింది. గవళ్ళ గంగులు చెల్లెలుకు గంగానమ్మ పూనింది. చాకలిషేరాయ మరదలుకు చల్లాలమ్మ,

పోలిసాని ఆడబడుచుకు పోలేరమ్మ పూసింది. 'అయ్యో మా అక్కయ్య, నే వస్తున్నానే' అంటూ వచ్చాడు గాలి వీరయ్య. 'ఎవరు ను' వ్వన్నాడు వెంకట స్వామి. సమయం దొరికినప్పుడే తిట్టాలనుకొని వీరయ్య 'ఎవ్వరో ఎరుగవట్రా గాడిద! నేపోతరాజునురా అన్నాడు.' ఈ ప్రకారంగా వారివెనుక వీరు, వీరి వెనుక వారు, చల్లాలమ్మ, గొడ్డళ్ళమ్మ, మారెమ్మ, మహలక్ష్మమ్మ, పోలేరమ్మ, పెద్దింటమ్మ, కామాక్షమ్మ, గంగానమ్మ, కనకదుర్గమ్మ, గావుళ కైమ్మ, దిబ్బమ్మ తీర్థమమ్మ—'ఓ,' స్నానాలు చేసి బండెడు వేపమండలు చేత బట్టుకొని గెంతి తాండవమాడుతున్నారు వీధుల వెంబడి. డప్పులు తడవతడవకూ కాచి మరీ కొడుతున్నారు. వీరయ్య సిస్తు ఇవ్వలేదనే కోపంచేత కరణం బ్రహ్మయ్య కేకలువేతా మనుకొని వచ్చేటప్పటికి వీరయ్య పోతరాజురూపాన కరణంగారి పీక పట్టుకున్నాడు. పదిమంది గుమిగూడి విడిపించారు. పెద్ద కాపు రాఘవయ్య విడదీసి వీరయ్యను మందలించాడు. బ్రహ్మయ్యగారి ఒళ్ళు ఝల్లుమన్నది. పది మంది ఇంటికి చేర్చారు. దేవతలంతా ఈదెబ్బలాటలో బాగుండదని ఊరు కున్నారు. ఏం గావాలో చెప్పి చేయించుకోవాలి గాని మనుష్యులను చంపితే ఎలాగన్నాడు రాఘవయ్య దేవతల్తోటి. దేవతలకు మనభాష బాగా తెలుసుట!

'ఓ! నరుడ నరుడ నరుడ నరుడో! నాకు పదివేలెట్టి గుడి కట్టించరో! లేకపోతే నెత్తురు తాగేస్తారో' అంది గంగానమ్మ.

'నాకు కొత్తది తోపురంగు పెడననేత జరీచీరె పెడితే గాని మింగుతా' నంది పోలేరమ్మ.

'ఇంటికి కుంచెడుచొప్పున వసూలుచేసి నాకిస్తేగాని ఊరు నాశనంచేస్తా' నంది చల్లాలమ్మ.

'వాళ్ళందరకన్న నే తీసిపోయినానా! ధోవతుల్చాపు మంచిది ఇవ్వండి, మొగదేవుడినికూడా' నన్నాడు పోతరాజు. ఇవి వీరి కోరికలు.

'మావల్ల ఏం గావు! మీయిష్ట మొచ్చినట్లు చెయ్యండి; మర్యాదగా కావాలంటే జాతరచేస్తాం, లేకపోతే మీ పెద్దదేవత కాళెమ్మ దగ్గర్నుంచి తిరుగు టపాలో ఏసంగతి కనుకోం' డన్నాడు మునసబు.

'చద్దివణ్ణాల కెల్లా'లని డప్పులవాళ్ళు దారిపట్టేరు ఆనాటి కథ అలా ముగిసింది.

ఇంటికొచ్చిన కరణం బ్రహ్మయ్యకు స్పృహలేదు. వాంతులు ప్రారం భించి కలరాలోనికి దింపినవి. మందు లేదు, మాకు లేదు. పాపం తోడునీడ లేరు. మహలక్ష్మమ్మ ఉపచారం చేస్తోంది. ఏం చెయ్యగలదు ఒక్కతి? కంటికి మంటి కేకధారగా ఏడ్చింది, పాపం, పసుపు కుంకుమ పోయేరోజు వచ్చిందని.

చూస్తూ చూస్తూ ఉండగానే పెనిమిటి కాళ్ళు చేతులు చల్లబడినవి. గొల్లుమన్నది ఇల్లాలు. తిరిగి చూసేవారైనా లేరు. ఓదార్చేవారు లేరు. లంకంత కొంప. పిట్ట చప్పుడైనా లేదు. గుడ్లగూబ మాత్రం నేనున్నా నన్నట్లుగా దూరాన్నుంచి కూసింది. భర్త శవంమీద పడి రోదనం చేసి చేసి మూర్ఛపోయింది మహాలక్ష్మమ్మ.

తెల్లవారింది. సూర్యుడుదయించాడు. పశువుల చప్పుడు తప్ప వీథిలో సంచారం లేదు. ఊరంతా గొడ్డుపోయినట్లుంది. మహాలక్ష్మమ్మ దుఃఖానికి మేర లేదు. కర్తవ్యంకూడా మరచింది. బిడ్డలేని లోపం కనపడింది. చుట్టుప్రక్కల వాళ్ళు గాని తనవాళ్ళు గాని ఎవరూ రాలేదు. కలరా అంటువ్యాధి. అందుచేతనే గావును ఎవ్వరూ తుదకు ఊళ్ళో ఉన్న అన్నగారైనా తొంగిచూడలేదు. నెమ్మదిగా లేచి, వస్తూన్న దుఃఖమును అపుకొని, శవం తీసుకెళ్ళే ప్రయత్నంకోసం బయలుదేరింది. వెనుకవీథిలోని పుట్టింటివారింటి కెళ్ళింది. దూరాన్నుంచి ఈమెను చూచి కామయ్య దొడ్డోకెళ్ళాడు. ఒదినగారిని చూచి బావురుమని ఏడ్చింది మహాలక్ష్మమ్మ. 'ఎంత ఆపద ఒదినా' అంటూ గుడ్ల నీరు గ్రుక్కుకొన్నది మరదలు. కామయ్య ఇంట్లోకి వచ్చి చెల్లెలును జూచి కౌగలించుకొని ఏడ్చేడు కాస్సేపు. 'చెల్లీ, శవం మాట ఎల్లాగే' అన్నాడు కామయ్య. 'అన్నిటికి నువ్వే చూడాలి అన్నయ్యా' అన్నది చెల్లెలు. 'నేనూ అదే చూస్తున్నాను. మీ వదినెకు ఏడోనెల! పోనీ, పది రూపాయిలు పారేదామంటే పల్లెటూరు' అన్నాడు కామయ్య, మహాలక్ష్మమ్మకాసంగతి వింతగా తోచింది. ఒదినే తను క్రిందటి ఏకాదసినాడే స్నానం చేశారు. పెదవి విరచింది. సంగతి గ్రహించింది. తనమరదైన సూరయ్యగారింటికి త్రోవ పట్టింది. తోడికోడలు వాకిట్లోకి వచ్చి ఊరడిస్తో 'మరది లేరమ్మా, మారుపేరెళ్ళా' రంది. మహాలక్ష్మమ్మ తెల్లబోయింది. తాను వీథివాకిలిగుండా వస్తే బాగుండదని దొడ్డిత్రోవగుండా వస్తుంటే సూరయ్యగారు చుట్ట కాల్చుకుంటూ బయటికెళ్ళటం చూచింది. ఇదంతా కాలమహత్యం అనుకుంది. కలరాగాలి కింత భయం గావు ననుకున్నది. పోనిమ్మని పెరటివీథిని ఆడపడుచుగారింటికెళ్ళింది. 'పుట్టెడు దుఃఖంతో మాచమ్మా, నీ కెంతచిక్కు వచ్చిందే; అన్నయ్య దాటిపోయినాడటే' అని బావురుమన్నది సుందరమ్మ. కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ 'రాత్రి వస్తామనుకొన్నానమ్మా! మీ అన్నయ్య జ్వరంతో మూల్గుతుంటే ఎలా విడిచిరాను' అని చక్రం అడ్డువేసింది సుందరమ్మ. మహాలక్ష్మమ్మ వెనుతిరిగి వస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటు, వస్తున్నది. ఊరట చెందట మేలాగు? శవాన్ని తీసుకెళ్ళేవారైనా లేరు. ఆమె రోదనమును విని ప్రకృతి కూడా విలపిస్తూంది. ఆవులమందలు తప్ప మానవపురుగు లే దావీథిని. "మేము మనుష్యుల

మైనా కాకపోతిమే శవాన్ని తీసుకొని వెళ్ళేటందు" కని గావును, తలలు పంకిం స్తున్నవి గోవులు. మానవ విశ్వాసమును తిరస్కరిస్తూ కావును, యింటికుక్క కంట నీరు పెట్టింది. కష్టదశ వచ్చినప్పుడే కావాలి బంధువులు. తల వంచుకొని వస్తూంది మహాలక్ష్మమ్మ. దారిలో వీథిబడిదగ్గర కనపడ్డాడు వెంకటప్ప. తల వంచుకున్నది మహలక్ష్మమ్మ. "అమ్మగారూ, మాగొప్ప ఆపద సంభవించిందండీ" అన్నాడు వెంకటప్ప. పయిటకొంగుతో కళ్ళు తుడుచుకొన్నది.

"ఊరుకోండమ్మ, తక్కినపని చూడం" డన్నాడు.

గద్గదస్వరముతో "వెంకటప్పా! కరణంగారి శవము తీసుకవెళ్ళుదాము వస్తావా" అన్నది.

"అయ్యో! మాలోండ్లమం" డన్నాడు.

"పరవాలేదు, వస్తావటా? ఈ సహాయం చెయ్యి నీకడుపున పుడతా" నన్నది.

"మీకు లేకపోతే నాకు భయంలే" దన్నాడు వెంకటప్ప.

"అయ్యో మీవాం డ్లేమైనా అంటారేమో, అమ్మవారి జాడ్యం, అంటు జాడ్యముకూడాను."

"నా కెవరండీ యేడ్చేవాండ్లు. కన్నవాండ్లు గంగ కలిసిపోయేరు" అంటూనే పాడె తయారుచేసేడు వెంకటప్ప.

వెంకటప్ప, మహాలక్ష్మమ్మ చెరొకవైపు పట్టుకొని శవమును తీసికెళ్ళారు.

పురోహితుడు లేడు పుణ్యపురుషుడు లేడు. మహాలక్ష్మమ్మ హృదయం శాంతిపడ్డది. ఎల్లా తను వాడిఋణం తీర్చవలెనా అనుకొన్నది.................

* * *

వెంకటప్ప తిరిగి యింటికి వస్తున్నాడు. కొంచెం కడుపులో బాధగా వుంది. కళ్ళు తిరుగటం మొదలుపెట్టినవి. కొంచెము సేపటిలో కాళ్ళు చేతులు లాక్కొనిపోవటం మొదలుపెట్టినవి. వాంతులు ప్రారంభించి అవయవ పటుత్వం తప్పి స్పృహలేకుండా మునసబు వెంకటస్వామి యింటియొద్ద పడిపోయినాడు వెంకటప్ప. వెంకటప్పకు కలరా తగిలిందన్నమాట ప్రాకింది వూరంతా. వెంటనే మున్సబు వూళ్ళో కలరాటీకాలు వేస్తున్న కలరా డాక్టరుకు కబురంపేడు. వెంకటప్పకు 'నా' అన్నవారు లేరు. బట్టలు మలమూత్రములతో నిండిపోయినవి. చూస్తూ వూరుకున్నారు చుట్టుప్రక్కలవారు, గారడివాడిని చూచినట్లు. అంతటిలో ఒక పూర్వ సువాసినీదేవత కుడి భుజముమీద తడివస్త్రాలు యెడమ భుజముమీద మడినీళ్ళు పట్టుకొని తను త్రొక్కపొయ్యే దారిపొడుగున నీళ్ల చల్లుచు తులసి పాటో లేక గోవిందనామపాటో గొణుగుకుంటూ వస్తూంది. వెంకటప్పను

చూడలేదు. దాహం దాహం అని మూల్గుతున్నాడు. 'పాపం యెవళ్లైనా పొయ్యండిరా' అని ఒకడు, 'యేం చెయ్యగలం భగవత్ యత్నం అని ఒకరు, 'దిక్కులేని వారికి దేవుడే దిక్కని ఒకరు, కంటితో లేకపోయినా నోటితో యేడుస్తున్నారు. వినలేదు, యీ సంగతి, మడినీళ్ళ వెధవావిడె. చూడలేదు, యెదుట నున్న వెంకటప్పను, దగ్గిరకొచ్చినదాక. వెంకటప్పకు గజందగ్గరకొచ్చి, "అయ్యో! నీయమ్మ కడుపుకాల. వెధవవాళ్ళం, బ్రాహ్మణులం, మడినీళ్ళు తెస్తుంటే చెప్పనక్కరలేదురా? కొంప తీసేవు" అని బిందెడునీళ్ళు మయిలపడినవని తిట్టుతూ వెంకటప్ప మీద పోసింది. వెంకటప్పకు స్పృహలేదు. ఆమె కోపంతో పోసిననీళ్లు అతని దాహం తీర్చినవి. ఆయాసంతో మూల్గుతు కొంచెము ప్రక్కకు దొర్లినాడు, వెంకటప్ప, బ్రాహ్మణుల త్రోవ మయిలపర్చుట మెందుకని. ఇంతటిలోనే కలరా డాక్టరు వచ్చి నాడి చూచి మించిపోలే దనుకున్నాడు. గొంతుకలో మాత్రలువేసి నల్లనిచుక్కలు నీళ్ళలో కలిపి పోశాడు మహానుభావుడు. మునసబు వెంకటసామి కొంచెము అసహ్యించుకున్నాడు, డాక్టరు తన కులమువాడు అనగా తెలగ మాల వానిని ముట్టుకొని కాళ్ళు పిసుకుతున్నాడని. ఈ తెలగ యీ వెంకటస్వామినాయుడు పెద్దకాపు వెనుక బ్రాహ్మణులు భోజనం చేస్తుంటే తనని రానివ్వకపోవట మేమిటని దెబ్బలాడిన పెద్దమనిషి; ఈనాడు డాక్టరును కొంచెము కోరచూపుతో చూచాడు.

వెంకటప్ప సంగతి మహాలక్ష్మమ్మగారు విన్నది, రోడ్డుమీద స్పృహ లేకుండా పడిపోయినాడని. కర్తవ్యం గ్రహించి వెంటనే నిట్టూర్పు విడిచి, వెలివేసినా సరే అనుకుంది. తొందరతొందరగా వీథిలోనికిపోయి వెంకటప్పను చూచింది. కన్నతల్లిలాగున కంట తడిపెట్టినది. చుట్టు వున్నవాళ్ళు మందలిస్తూనే వున్నారు. నెమ్మదిగా లేవతీసినది. తన మెడమీద అతనిచెయ్యి వేసుకొని నెమ్మదిగా నడిపించుకుంటూ తనయింటికి తీసికొనివచ్చి పడుకుండబెట్టినది. పాపము ఆమె మాతృప్రేమ యెటువంటిదో యెరుగదు. కాని నేటికి ఆమె కడుపులోని తల్లి పేగు తరుగుకొని పోవుచున్నది. దుఃఖం దిగమ్రింగుకుంటూ ఉపచారం చేస్తున్నది. మాడుకు పట్టువేస్తూ వెంకటప్ప మొగంవంక చూచింది. దైవము అనుకూలంగా ఉండటంవల్ల గావును వెంకటప్ప కన్నులు తెరచి చూచాడు. కళ్ళవెంట నీళ్ళు యేకధారగా కారుచున్నవి. బిక్కమొగముతో వెక్కివెక్కి యేడవటం మొదలుపెట్టాడు. తన పయిటకొంగుతో మహాలక్ష్మమ్మ వెంకటప్ప కంటినీళ్ళు అద్దింది.

"ఎందుకు యేడుస్తావు వెంకటప్పా" అని చెంపలు నిమిరింది తల్లిప్రేమతో.

"నేను మాలవాడిని అమ్మా" అన్నాడు వెంకటప్ప. అంటూనే చిన్నపిల్లవాని లాగున యేడ్చాడు.

"అయ్యో, అంతమాత్రముకు యేడుస్తావు యెందుకూ?"

"మీరు బ్రాహ్మణులు నేను కడజాతివాడను."

"కావు, కావు; నీవు నాకు కొడుకువు. సందేహం లేదు. కాకపోతే నా గర్భం యెన్నడూ యీమాదిరిగా దుఃఖించలేదు. నాయనా, యీజన్మలో కాక పోయినా పూర్వజన్మలోనైన అయివుంటావు. అందువల్లనే తండ్రిగారి ఋణం తీర్చగలిగావు."

* * *

వారం తిరిగింది. మహాలక్ష్మమ్మను కులంవారు వెలివైచినారు. ఆబాల గోపాలం ఆమె యింటివంకనైనా తిరిగి చూడలేదు. మునసబు వెంకటసామిగారి ఆజ్ఞ ప్రకారం చాకలి మంగళ్ళు కూడా కట్టుకట్టినారు. వెంకటప్ప మలిన వస్త్రముల సయితము మహాలక్ష్మమ్మ వుతుకుతున్నది. దైవానుగ్రహంవల్ల, వెంకటప్ప తేరుకున్నాడు. కొంచెము యిటూ అటూ తిరుగుతున్నాడు. మహా లక్ష్మమ్మతల్లి పత్యం పెట్టింది. నీరసంగా వుండటంవల్ల ఆబిడే కలిపి పెట్టుతూ వుంది. ఇంటి కోమటి వంట కర్చులుగూడ అమ్మటం లేదు. మహాలక్ష్మమ్మకు బెంగ పడిపోయింది. కాని ధైర్యవంతురాలవడం వల్ల సమస్త చాకిరీ చేస్తున్నది. అతని పాలిటికి ఆమెయె మాతృదేవతయైనది. నిర్భాగ్యుడు వెంకటప్ప. "అమ్మా" అని పిలుచుకునే యోగ్యత లేదు. ఇతని పరిచర్య చేయ్యటంవల్ల ఆమెకు కొంచెము జ్వరం తటస్థించింది. నెమ్మదిగా మంచము పట్టించింది. ఇప్పుడు ఆమెకు సేవ చెయ్యటం వెంకటప్ప వంతు అయినది. మందుమాకులు లేనిదే జ్వరం తగ్గట మేలాగు? వైద్య మహాశయులు కూడా వెలివైచారు, మునసబు వేంకటస్వామిగారి తీవ్రశాసనం చేత. వీరి శాసనం వైస్రాయిగారి ఆర్డినెన్సుల కన్న బలమైనది. ఆర్డినెన్సులనైన తిరస్కరిస్తారు గాని ప్రజలు, మునసబు వెంకటసామిగారి ముక్కోపితనానికి జడవని మనసలిదైనా లేదు. వారే పల్లెటూరి ప్రభువులు.

* * *

రాత్రి తొమ్మిది గంటలయినది. జ్వరం మిక్కుటముగా వుంది. మైకం తల కెక్కుతున్నది. తన కాలం ఘడియలమీద వుందని గ్రహించింది. కాళ్ళు పిసుకుతున్న వెంకటప్పను దగ్గరకు తీసుకున్నది. అలుమారు తాళం చెవులు తెమ్మని ఆయాసంతో చెప్పింది. అందులోని తాను ఆక్రితం రోజునే వెంకటప్పకు తెలియకుండా వ్రాసిన వీలు చదివింది. యావదాస్తి అతనిపేర వ్రాసింది.

ఇనుప పెట్టెలోని లెక్కగా యాబదివేల రూపాయల నోట్లు అతనికిచ్చి, "నాయనా, నాకు పుత్రులు లేరనే లోపం తీర్చావు. మాతాపితరుల రుణం తీర్చటం నీకు అందువల్లనే గలిగింది. ఇందులో సగం నీవు తీసుకొని తక్కిన సగం అస్పృశ్యతా నివారణకోసం ప్రచారంచేసి వారలకు గృహములు సత్రములు కట్టించవలెను. వారలకై చెరువులు బావులు త్రవ్వించు. ఈ పుణ్య కర్తవ్యం నీకు అప్పగించుతున్నాను. మా ఋణం యెల్లా తీర్చావో మా కోర్కె కూడా అలాగుననే నెరవేర్చు. నీవే ముందు జన్మలో కూడా నాకు పుత్రుడవు కావాలని సర్వేశ్వరుడిని ప్రార్థిస్తున్నాను." అంది. ఆయాసం యెక్కువైంది మహాలక్ష్మమ్మకు. వెంకటప్పను దొడ్డిలోని తులసియాకు తెచ్చి నీటిలో కలవమన్నది. ఆ నీళ్లు గొంతుకలో పొయ్యమన్నది. సందేహించాడు వెంకటప్ప మరణకాలమందున మహాలక్ష్మమ్మ తల్లికి మాలవానిచేతి నీరా అని. ఆయాసం యెక్కువవటంవల్ల చెప్పలేక చెప్పలేక, "గ్రుక్కెడు నీళ్లు" అన్నిది. వెంకటప్ప సందేహం నివారణమయినది. వెంటనే తులసితీర్థం గొంతుకలో పోసి తల్లిఋణం తీర్చుకున్నాడు. కాళ్లు చేతులు చల్లబడినవి మహాలక్ష్మమ్మకు. కడసారి వందనం చెబుదామనుకున్నాడు, కాని కాలం చేసింది కన్నతల్లి. దుఃఖముతో చిన్న పిల్లవాని లాగున యేడుస్తూ ఆమె శరీరంమీద పడి మూర్ఛపోయాడు వెంకటప్ప.

"కర్రలే చుట్టాలు కట్టెలే బంధువులు
"కన్నతల్లెవ్వరే చిలుకా."

అని పాడుతూ ఉదయం దాసరి లేపినదాకా ప్రపంచం యెరుగడు వెంకటప్ప.

* [భారతి, మే, 1932] *

# వరాల - దాసరి*

**వేలూరి శివరామశాస్త్రి**

సోమశర్మది రాకాసి పట్టు. అతఁడా పట్టుతో పదునాలుగు విద్యలను సాధించెను. అతఁడు చిన్ననాఁట నుండియు 'యతి యనిన ప్రతి' యనియు 'ఎద్దె మనిన తెద్దె' మనియు అను అలవాటు కలవాఁడు. అతఁ డిపుడు తార్కికులకు నాకట్టు. అతని యెదుట శాబ్దికులకు మూఁగనోము. అతఁ డే శ్రౌతిని ప్రాయశ్చిత్తము చేయింపక విడిచిపెట్ట లేదు. అవధానుల కతఁడు గండమాల. స్మార్తము చేయించువారలకు పెద్ద పులి.

అతఁడు పలువుర ధక్కలను పగులఁ గొట్టించెను. వాదములలో పందెము వయిచి పలువుర తలలు గొరిగించెను. కొందఱ చెంపలు చెప్పులతో వేయించెను.

అతనికి వేదాంతమనిన మంట. కయ్యాల కామయ్య కావున ఆ వాదములోనికిఁ గూడ దుమికి పెద్దలతో ఓడియు నా కోడియే గెలిచెనని చిల్లర రాజులకడ నతఁడు లేఁత సొరకాయలు కోయుచుండెడివాఁడు.

సోమశర్మకు ధనమే సగుణబ్రహ్మము. వాదమే నిర్గుణబ్రహ్మము. యాచనమే భజనము. చాటు పద్యపఠనమే సహస్రనామ పూజ.

---

* పురాణాంతర్గత మగు ఈ కథను కృష్ణరాయలు ఆముక్తమాల్యదకు కానుక యిచ్చిరి. దానికి ఇది కొంచెము మార్పుతో అనుకరణము.

ఒక సదస్యమున అగ్రతాంబూలము గుఱించి మీమాంస కలిగెను. ఏండ్లకు చిన్నయయినను కర్మలలో పెద్దయగు నొకబ్రాహ్మణునకు అది లభించెను.

తాంబూలముతో పని లేకయే సోమశర్మ యధర మెర్రబాఱెను. మోము చెమరించెను. గొంతుక డెక్కపట్టెను. అతఁడు లేచి—

'అగ్ర తాంబూల మిచ్చితి రధమునకును
పెండ్లి చేసితి రీరీతి పింగు వగుల—'

అని రెండు పాదములు మట్టి తిట్టి లేచిపోయెను. ఆనాఁటి నుండి సోమశర్మ కగ్రతాంబూలమునెడ నాగ్రహము కలిగెను. దానికి యజ్ఞముచేయ సంకల్పించుకొనెను. యాగ భిక్షకు బయలుదేఱెను.

అపుడు కురుంగుడిలో బ్రహ్మోత్సవము. 'అచట పారాయణము చేసి గడనసేయవచ్చును. వాద భిక్షయు, యాగ భిక్షయువేఁడి మూట కట్టవచ్చును' అని యెంచి సోమశర్మ కురుంగుడికి మూట కట్టెను.

## 2

కురుంగుడికి దవ్వుగా నొక మాలపల్లి కలదు. అందు చెప్పరానివాఁ డొకఁడు కలఁడు. చెప్పులు కుట్టుటలో నతఁ డందవేసెను. మోటబానలకు వానిదే యొరవడి. కోటేరు వేయుటకు వాఁడు పెట్టినది పేరు. పశువుల కతఁడు బలరాముఁడు.

బ్రాహ్మణుని గనినంతనే కానఁబడనంత దవ్వు నతఁడు పరుగెత్తెను. దేవళపు శిఖరము కానిపించినంతనే పొరలు దండములు పెట్టును. అతఁడు మసిపాఁత ముడిఁచిన మాణిక్యము.

వాని చెవుల శంఖ చక్రాకారము లయిన రెండిత్తడి కమ్మలు. మెడలో గవడ తులసి పూసల తావళము. మేన పట్టె వర్ధనములు. తల మీఁద తిరుపతి వెంకన్న పాదరక్ష. ఆ పైని మొగలియాకు గొడుగు. బుజమున మ్రాని చీటి తాళములు. చేత గుఱ్ఱపు వెంట్రుకలఁ గుట్టిన ఓటి కిన్నెర. అతఁ డీవేసముతో ప్రతి దినమును తెలవాఱుజామున కురుంగుడికి వెళ్ళి బరువులుడించి ప్రాకారము వెలుపట మంగళకైశికి రాగముతో భగవంతుని గానము చేయుచుండును.

కోవెల తూము నుండి జాలువాఱు ముఱికినీరు శూద్రుఁ డొకఁ డీయఁగా నతఁడు కనుల కద్దుకొని నెత్తిన జల్లుకొని త్రావి ప్రసాదము పంచిపెట్టువఱకు కనిపట్టియుండును. పిదప శూద్రుఁ డెవఁడేని తన భక్తికి మెచ్చి తాను దెచ్చి కొనిన ప్రసాదము నందు కొంత యిడరాఁగా నతఁడు కిన్నెరజాఁపి దానిపయి నుంపించుకొని అతనికి మ్రొక్కి సాపడి తాండవ మొనరించును. పిమ్మట

గామవు వెలిదారినిబడి తన పంచమ స్వరము వినిపించి కోయిలలఁచేఁ గూడ వనిపించి తన గుడిసెకు మరలుచుండును. ఇది యతనికి నిత్యవ్రతము.

స్వామి తిరునాళ్ళ కూళ్ళన్నియు కోవెల ముందే యుండెను. త్రివర్ణేత రులగు భక్తు లందఱును ప్రాకారము వెలుపటనే మాల దాసరి సంకీర్తన మాలకించుచుండిరి.—

ఏదీ? మూఁడు పాదా
మూలు భూదా
న మిచ్చేదా
నంటి వేదీ?

## 3

వామనస్వామి వాకిట నున్న మాలని గానమునకు సొక్కుచుండెనా లేక తన యెట్టెదుటి సభా మంటపమునఁ గూరుచుండియున్న బ్రాహ్మణుల శాస్త్రార్థ మాలకించుచుండెనా?

చోళేంద్ర సింహుఁడు వీవన పూని కన్నులఱమోడ్చి బాపన సాములకు విసరుచుండెను. పలువురు శిష్యులతో సోమశర్మ సభా మంటపమునఁ బ్రవే శించెను. పండితుల మీఁద కన్నులచే నిశిత బాణముల గుప్పి మహారాజ సన్ని ధానమున కేఁగి — 'దేవా! ముందు వాద విషయుఁ బిదప యాగ విషయు దయ చేయునది' అని యతఁడనెను.

రా జొకతూరి కనులెత్తి నమస్కరించి 'అయ్యా! వాదము జరుగుచున్నది; సభలోనికి దయచేయుఁడు' అనెను. అనిన వెంటనే సోమశర్మ కుడికాలు ముందు పెట్టి వాదమున కుఱికెను.

'భక్తిచే మాలనికిని స్త్రీకిని గూడ ముక్తి సులభము' అను ప్రసంగ మపుడు నడచుచుండెను.

సోమశర్మ వెంటనే యిటులనెను — 'భక్తిచే ముక్తియే? ముక్తి పప్పా లేక ఉప్పా? పెద్ద పెద్ద కుండలాల వారికే లేదే, మాలలకుఁ గూడ పంచి పెట్టు చున్నారే? భక్తి కల్లు. దానఁబిచ్చి యెత్తును. కర్మతోఁ గూడని భక్తి హేయము. కర్మ మార్గమే క్రమ మార్గము. ఈ మార్గమున మాలఁడు ఉత్తర జన్మమున పశువగును. ఏల యందురా, వాని గోవును గాని వాని కుక్కను గాని మనము దాఁపునకు రానిత్తుము గాని వానిని రానీయము గదా! వానికన్నఁ బశుజన్మ ముత్తమము. వాఁ డాజన్మము నుండి శూద్రుఁడై క్రమముగా బ్రాహ్మణుఁడై యజ్ఞము చేసి సన్న్యసించి ముక్తి చెందును. ఇదియే శాస్త్ర సిద్ధము.'

'కర్మ జఘన్యము. భక్తి ముఖ్యము. దాని కెవరి యెడను పక్షపాతము లేదు. అంతరువులు లేవు' అని అవలి దెసనుండి ఖండనము వచ్చెను.

"మీవి చిల్లర శాస్త్రములు. మీరు షాండులు. నూట పదకొండులు. కర్మ బాహ్యులు" అని సోమశర్మ చివాలున రాజుకడకుఁ బరువిడి "తా మిపుడు వాదము వినవలయును" అనెను.

రాజిటు లనెను— "వామనస్వామి మీ వాదము నాలకించుచుండెనా లేక ఆ గానము నాలకించుచుండెనా?"

అందరును కిలకిల నవ్విరి సోమశర్మ అగ్నిశర్మ అయిపోయి— "ఆ మాలముండ కొడుకులకే యివి రోజులు. వారినే ఇచటఁ బూజింపుడు" అని మహారాజును, పండితులను తూలనాడి రుసరుసలాడుచు రివ్వున ప్రాకారము వెలువటికి వచ్చెను.

# 4

సోమశర్మ యెట్టెదుట మాలదాసరి. వాని చుట్టును మాలమూఁక. దాని చుట్టును సాతానుల గుంపు.

మాలఁడు భగవంతుని పాడిపాడి "తకఝుం తకఝుం తామరసాక్షా" అని తాండవింపఁదొడఁగెను. వాని గండస్థలము లానందాశ్రువులతోఁ దడిసి చెక్కిన యింద్రనీలపు ముక్కలా యనునటు లుండెను. వాని హస్తము నందలి కిన్నెర రామచిలుకవలె పలుకుచుండెను. అతని తాండవముచే గుండులే నీరయి పోవు చుండగా భక్తుల గుండెలు కరఁగుట యేమంత వింత?

కొండంత యీసు సోమశర్మ కనుల కెగఁదట్టెను. "ఇది యేమంత పాండిత్యమా? వాదమా? విద్యయా? కళయా? ఈ పిచ్చి యెగురుట చూచుటల కెంత సభ? పిచ్చి (చ్చు) గుంట (లు) లవారి పెండ్లికి గంగిరెద్దుల వారి గానమఁట! ఛీ ఛీ ఛాండాలుఁడా! నీకే యిచట బ్రహ్మోత్సవము! బయట నేమి గతి? లోపలికి విజయం చేయుము" అని యనెను.

"తకఝుం తకఝుం— తామరసాక్షా?"

"నీతకఝుం తగులఁబడ! అవలికి ఛావు!"

మాలదాసరి తాఁడవము నడుమఁ గొంచెము తూలెను. శరీరము స్తంభించెను. చూపు నిలిచెను. కంఠమున గద్గదిక యేర్పడెను. వెంట్రుకలు నిటారుగా నిలిచెను. అడవిమేఁత కరిగిన తల్లికి అఱచు లేఁగవలె దాసరి "గోవిందా" అని యరచెను.

ఆ యఱపుతో ఆలయము మాఱు మ్రోఁగెను. చుట్టునున్న జను లందఱును "గోవిందా" యని యఱచిరి. దానితో గ్రామమంతయు "గోవిందా" యయిపోయెను.

"ఛీ ఛాండాలుడా! ఆవలికి పో."

ఆ మహాధ్వనిలో ఈ సోమశర్మ కీచుధ్వని వినువారెవరు? సోమశర్మ మఱి చేయునది లేక తిట్టి తిమ్మి చేతికి దొరికిన రాలు తీసి రువ్వి, "తొలంగుడు! తొలఁగుడు" అని కేకలు వేసెను. జనులు పాయ యిచ్చిరి. మాల లెల్లరును కాకులవలె లేచిపోయిరి.

దాసరి యొకఁడే తన్మయుఁడయి నిలువఁబడి యుండెను. అతని పెడ తలమీఁద నొకరాయి విసురుగా పడెను బుస్సున రక్త మెగసెను. దాసరికి తెలివి వచ్చెను. పెడతల గాయమును అఱచేత మూసిపట్టి సాష్టాంగపడి "అపరాధమును క్షమింపుఁడు" అని సోమశర్మను వేఁడికొని మాలదాసరి దూర దూరముగా తొలఁగి పోయెను.

"ఈ యేడుపిందాఁకనే యేడ్వక పోతివా? పూవువలె పోయియుందువే" అని సోమశర్మ వెళ్ళిపోయెను. అతని వెనువెనుకనే శిష్యులును కర్మవాదులును వెనుక ముందులు చూచుకొనుచు నిర్గమించిరి.

## 5

ఆ వెళ్లుట వెళ్లుట సోమశర్మ మధుర వెళ్ళెను. వెళ్ళిన కొలదినాళ్ళకే అతని కలహకంఠ మందఱకును కర్ణజ్వరము కలిగించెను. అతని ధనాశముందు సముద్రమొగ చెరువు. శాస్త్రార్థములలో నతని కెటఁ జూచినను చేటదెబ్బ వినఁబడఁజొచ్చెను. మొండి శిష్యుఁ డొకఁడు తక్కఁ దక్కిన వారంఱును అతనిని విడనాడిరి.

అతడిట్టి కఱవులోఁగూడ ధైర్యము విడువాలేదు. వెలివేయఁబడిన వారి చుట్టును దిరిగి లఘుప్రాయశ్చిత్తములు పెట్టి వారి పంక్తిని గుడిచి బంగారము గడించెను. భాస్కరాచార్యులలోఁ దూఱి కోమటి యిండ్ల పుణ్యాహములలో దెబ్బలాడి బియ్యము సంపాదించి సంచుల కెత్తెను. గ్రహణములలో జపములు స్నానములు చేసి ఆ పుణ్యమును దొరలకు ధారాదత్తము చేసి ఆర్జించెను. మహిషీదానములకు మేషీదానములకు అప్పుల దానములకు పెత్తనమెల్లయు గుత్తగొనియెను. బ్రాహ్మణార్థములమీఁద బ్రాహ్మణార్థము లొనరించెను. దర్భపోటులకు పిలువనినాఁడు చనవు చేసికొని వెళ్ళి పిలిపించుకొని పితృ శేషము తినఁదొడఁగెను. దానికిని అభావము కలుగఁగా పూఁటకూళ్ళ మెతుకుల కలవాటుపడెను. ఇంతటితోఁబోక వీనియన్నింటిని తల దన్నిన తులాభారదాన మొగటి గైకొనెను.

ఇటులు కూడఁబెట్టిన పప్పుప్పునే బియ్యము లమ్మి మిగుల డబ్బుతోఁ

గూడ కోమటికి వడ్డి కిచ్చెను. ఇపుడు తనను బిలుచువారెవరును లేరు. వట్ట వలసిన చెడు దానములన్నియు నయిపోయెను. రొక్కము మిచ్చి యయిఱకూళ్లు మెక్క వలయును. పైగా శిష్యుఁ డొకడు. కావున నతఁ డింటికిఁ బోవ సమకట్టి మాదిగవాడకు వెళ్ళి చెప్పులుకొని నూనె పట్టించి తంగేడాకు కట్టి తెచ్చుకొనెను. గడ్డము చేయించుకొని వేసీళ్ళ యంగడికిఁ బోయి వెలయిచ్చి దరువులమీఁద దరువులతో తల యంటించుకొనెను. వంటపూఁటింటి కెప్పటికంటె నెక్కుడుగా పాలు పెరుఁగునే కూర లంపెను. వక్కలాకులతో అడపము నింపెను. శిష్యుని బుజము మీఁదికి బియ్యపుమూట తయారుచేసెను. ఆలికి రంగు రంగుల చీరలు కొనెను. పిదప కోమటి యింటికి వెళ్ళి అరుఁగుమీఁదఁ గూరుచుండి తాటాకు పట్టుకొని సెట్టిని డబ్బిమ్మనెను. అతఁడు వడ్డితోఁ గూడ డబ్బు సోమశర్మ ముందిడెను. సోమశర్మ ఒక్కొక్క పద్దే చదివి బియ్యము మొదలగు ద్రవ్యములకు వెల తక్కువ కట్టితివనియు, ఇచ్చిన తిథులింకను లోఁగడి వనియూ, అనుకొనిన వడ్డి వేఱు; ఇపుడు చెప్పు వడ్డి వేఱనియు అల్లరిచేయఁ దొడఁగెను. కోమటి కాతా తెఱచి బియ్యములోనగు వాని పద్దులను వెలలును చూపెను. తిథులును సోమశర్మ వ్రాలును గనఁబఱిచెను. వడ్డియు వ్రాఁతలోఁ జూపెను. సోమశర్మ "ఇది యంతయు సృష్టి; బ్రాహ్మణుని ధనము హరించి బాగుపడవు." అనుచు రచ్చ కెక్కెను.

సోమశర్మ చెప్పులు కొనుట మొదలుకొని రచ్చ కెక్కుట వఱకుఁగల ప్రయాణ సన్నాహ మంతయు పిల్లి గడ్డము వాఁడు కాకి మీసాల వాఁడొకడు కనిపెట్టు చుండెను.

## 6

పొరుగూరులకుఁ బోవు బాటసారు లందఱును ఒకరికొకరు తోడుగా సత్రమున గుర్రుపెట్టి నిదిరించు చుండిరి. కాకిమీసాలవాఁడు గూడ తా నొక ప్రయాణము సంచిని తలక్రిందఁ బెట్టుకొని నిదిరించెను.

నడిరేయి ఆ కాకిమీసాలవాఁడు ఉలికిపడి లేచి "అయ్యో! తెల్లారొచ్చింది లెగరా లెగూ" అని ప్రక్కవానిని లేపెను. ఆ పిలుపు విని ఒకరి నొకరు లేపుకొనిరి. బాటసారు లందఱును రెండు మూఁడు గుంపులుగా ముందరి వాఁడు నడిచిన త్రోవ నడవఁ దొడఁగిరి.

ముందరివాఁడు "ఇది దారి ఇది దారి" అని వారి నందఱను అడవికిఁ బట్టించెను. ముందొక సెలయేఱుండెను. తెరువరులంద ఱందు దిగిన వెంటనే కాకి మీసాలవాఁడొక యీల వైచెను.

అపుడు అఱచేత గీఱలు కనఁబడుపాటి వెలుతురు రాఁదొడఁగెను. బాటసారుల ముందు పెద్ద యెలుఁగుతో అలుఁగొకటి పడెను. బిఱ్ఱు బిఱ్ఱు మను మ్రోఁతలతో ఒడిసెలల నుండి రాలు పడఁదొడఁగెను. పథికు లందఱును తిరుగుడు పడిపోయిరి. ఇంతలో బేతాళురవలె దొంగలు రాహువులవంటి ఆయుధములతో వారి నందఱును చుట్టవయిచిరి. పాంథులు వెఱుగఁ ద్రొక్కు-కొనిరి. కొందఱు తమకడనున్న ద్రవ్యమును రుప్పలలోఁ బాఱవయిచిరి. దొంగలు దుడ్డులతో మోఁదిరి. పట్టుకొనిన పయిబట్టలు చింపుకొని కొందఱు పాఱిపోయిరి. కొందరు— "నాయనలారా! ఇది దేవతావర్చన సజ్జ. దీనిని దాఁకకుడు. ఇది పోవుచో మాకు వస్తు" అని విప్పి చూపి దానికి గట్టిన వలువల నిచ్చివేసిరి. కొందరు "మీ రెడముగా నుండుఁడు. ఆఁడువారి నంటకుఁడు. మా ముతాలోనున్న దెల్లయు నిప్పింతుము" అని నిలువు దోఁపిచ్చి వెళ్ళిపోయిరి.

దొంగలు కొందఱను చాటునకుఁ గొంపోయి శోధించిరి. పొదలలోఁ దూఱినవాఁరిని ఈఁటెలతోఁ బొడిచి వెలికి లాగిరి. సిగలు విప్పి చూచిరి. చెప్పులయట్టలను దబ్బనములలో గ్రుచ్చి పరిశోధించిరి.

కాకిమీసాలవాఁడు వెదకి వెదకి వేసారి తుదకు సోమశర్మను పట్టుకొనెను. సోమశర్మ శిష్యుని విడిచి పరుగిడఁ దొడఁగెను. కాకిమీసాలవాఁడు వెంబడించి సోమశర్మ కాలికొంకులకు వంకరకత్తిని బట్టి గుంజెను. కొంకులు తెగి సోమశర్మ కూలఁబడెను. కాకిమీసాలవాడు సోమశర్మ ధోవతి లాగి మొలలోని వరహాల జాలెను విప్పుకొని అంటుపోఁగుల పఱకును చెవులు చిటుక్కు-నఁ గోసికొనెను. నోటిశని యూరకుండక సోమశర్మ "ఓరి దొంగ ముండా కొడుకా! నీది మా పొరుగూరేలే; ఈ దబ్బు నీకుఁ దక్కు-నపుడు చూచెదనులే" అనెను. పాఱిపోవుచున్న కాకిమీసాలవాఁడు వెనుదిరిగి సోమశర్మను సున్నములోని కెముక మిగులనీయక నలుఁగఁ బొడిచెను. ఇంతలో వెనుకనుండి వచ్చు బాటసారుల అలికిడి అయెను. కాకిమీసాలవాఁడును, మిగిలిన దొంగలును చీకటితోపాటు మాయమయి పోయిరి.

వెనుక బాటసారుల గుంపులో వచ్చుచున్న సోమశర్మ బావమఱఁది పరుగెత్తుకొని వచ్చి చూచి వగచి చీవాట్లు పెట్టి కావడించి సోమశర్మను మోసికొనిపోఁ దొడఁగెను. సోమశర్మకు స్పృహతప్పెను. అతని బావమఱఁదికి దప్పిపుట్టెను. అంతలో కురుంగుడి దాపున నొక యేరును పెద్ద మఱ్ఱియుఁ గానిపించెను. సోమశర్మను మఱ్ఱిక్రింద దింపి అతని బావమఱఁది నీరు త్రావఁ బోయెను.

మఱ్ఱి చలువచే సోమశర్మకు తెలివి వచ్చెను. కనులెత్తి చూచెను. పెద్ద మఱ్ఱి, కురుంగుడి దేవళము నుండి ఘంటాధ్వని వినఁబడెను, మాలదాసరి గురుతు వచ్చెను. పిమ్మట నొప్పి హెచ్చెను. మగత గ్రమ్మెను. చావు తెలివి పుట్టుకొని వచ్చెను. ఆ తెలివిలో కాకిమీసాలవాని చెంబుతలయు, పిల్లిగడ్డమును, ప్రత్తికాయగ్రుడ్లును, కొంకి కత్తియు లోనగు ఘోరాకారము కనులకు గట్టినటులాయెను. అతఁడావులించెను.

## 7

చచ్చినవారి ముచ్చటలు చచ్చినవారికే తెలియవలె. అయినను బ్రతికి యున్నవారు ఆ ముచ్చటలు తెలిపిపోయిరి, తెలుపుచున్నారు, తెలుపగలరు.

ఎఱిఁగిన సంగతులకంటె నెరుగని సంగతులనే ఎక్కువగా తెలుపుటకు కొన్ని డిపోలు ఉన్నవి– జ్యోతిశ్శాస్త్ర నిష్ణాతులు, మిస్మరిస్టులు, స్పిరిటిస్టులు, థియాసఫిస్టులు. పెద్ద డిపోవారు వేదాంతులు.

పాశ్చాత్య వేదాంతులు ఇటులందరు; మనుజులందరును చావఁగనే దయ్యము లగుదురు. వారి తలమీద కొమ్ములు మొలుచును. పాదములు వెనుకకు తిరుగును. త్రికాల జ్ఞానము కలుగును. కల్పాంతము వఱకును వారొక క్లబ్బులోనో ఏ డి అంజలిస్ హోటలులోనో ఉందురు. వారి కచ్చట స్వాతంత్ర్యము గాని స్వరాజ్యముగాని, తుదకు పార్లమెంటుగాని సున్న. కల్పాంతమున భగవంతుడు పుణ్యపాపముల చిట్టా అవర్జాలు విప్పి లెక్క చెప్పును. కొందఱకు ఎప్పటికిని స్వర్గము. మఱి కొందఱకు ఎప్పటికిని నరకము. పుణ్య పాపము లన్నిటిని క్రీస్తుమీఁద పాఱవయిచి కూర్చున్న వారికి స్వర్గము. తమనే నమ్ముకొన్న వారికి నరకము.

మనదేశము వారిటు లందురు: చచ్చిన వారికి మూడు దారులు– 1. వెలుతురు దారి 2. పొగదారి 3. చీఁకటిదారి.

జ్ఞానికి దారి లేదు. 'సున్న సున్నాం గలిసెను' అని శరీరము పోవగనే అతడు బ్రహ్మమున లయమగును.

వెలుతురు దారి*–

హిందూ దేశమునందు అడవులలో బ్రహ్మోపాసన చేసిన వారికిది దారి** ఈ చచ్చిన వారిని మాస - సంవత్సర - అగ్ని - వాయు - అదిత్య - చంద్ర -

---

* అర్చిరాది మార్గము.

** బృహదారణ్యకము -6-2-15. కౌషీతకము మొ.

విద్యుత్ - వరుణ - ఇంద్ర - ప్రజాపతులను దేవతలు* క్రమముగా నొకరి తరువాత నింకొకరు బ్రహ్మలోకమునకుఁ గొంపోవుదురు. అచట వారి యిష్టమే యిష్టము.

పొగదారి**

యజ్ఞము చేసినవారికిని, యుద్ధమునఁ జచ్చిన వారికిని ఇది దారి. ఇటఁ గులభేదము లేదు. ఈ యెడ హిందువుల ఉదారత శ్లాఘనీయము. తురకాణ్యమునకును వారు స్వర్గమొసఁగిరి. కృష్ణరాయలతో పోరి చచ్చిన తురకలు స్వర్గమున కేఁగి కల్పవృక్షముల కల్లు లొట్టెలు దింపి త్రావిరఁట. సనకాదుల బొట్లు నాకిరఁట. ఆకాశ గంగలో ఇసుక దిన్నెలమీఁద సప్తఋషు లర్చించుచున్న ఇసుక లింగములను ముచ్చెల కాళ్ళతోఁ ద్రొక్కిరఁట. రంభాదు లెక్కడఁ గానఁబడిన నక్కడ ఒత్తి కౌఁగిలించిరఁట.***

ఈ పొగదారినిఁ బడి స్వర్గము చేరినవారు పుణ్యమునంతయు ఖర్చుపెట్టుకొని మరల నీ లోకమునకే రవాణా యగుదురు.

చీఁకటి దారి.—

పాపుల కిది దారి. ఈ దారినిఁ బడినవారు నరకపట్నము చేరుదురు. నరకము కలదా లేదా యని యొకని నడుగఁ బనిలేదు. పాడు పని చేయఁగనే యది కనఁబడునఁట! పాడు పనికి మనస్సే ప్రమాణమఁట! సరియ. నరలోకపు భూగోళము ఖగోళము మొదలగు వానిని దెలుపుటకు శేషధర్మములు ఒక గైడ్. కాని అది పాఁతబడిపోయెను. సనాతనధర్మ సభవారయినను, చెఱసాలల అధికారులయినను అప్టుడేట్ గైడ్ ఒకటి తయారు చేయవలసి యున్నది. చెఱసాలలవారు ఈ లోకముననే నరలోక మొకటి తయారు చేసియున్నారు. సత్యాగ్రహ మొనరించినఁ జాలును; పోయి చూడవచ్చును.

ఇందు ఒక పుంత.

ఈ చీఁకటి దారిలో నొక పుంత కలదు. ఈ పుంతి కావల కంత లేదు. ఇది బ్లయిండ్ స్ట్రీట్. స్పిరిటిస్టులకును థియాసఫిస్టులకును ఈ పుంత కొట్టిన పిండి. ఈ పుంతలోనివారు దయ్యములు, తురక దయ్యములు, బర్మా దయ్యములు, తెల్ల దయ్యములు, బ్రహ్మ రాక్షసులు.

ఈ దయ్యములను అన్ని దేశములవారును అంగీకరించిరి. ఎవఁడేభావ

---

* బ్రహ్మసూత్ర-4.3-1, 2, 3, 4.

** ధూమయానము.

*** ఆముక్త మాల్యద, 1, 24.

ముతోఁ జచ్చునో వాఁడాభావముతోఁ బుట్టునని గీతాదార్యు లనిరి. సోమశర్మ కాకి మీసాలవానిని కనులకుఁ గట్టుకొని చచ్చి వచ్చి ఈ పుంతలోఁబడి బొమ్మ రాకాసియయి ఆ మఱ్ఱి మీఁది మకాము చేసియుండెను. బ్రతికిన నాలుగు నాళ్ళును అతనికి జగడములతోడను సంపాదనముతోడనే సరిపోయెను. ఇపుడు తీఱిక గనుక నాలుగు పుంజీల ఆఁడు దయ్యముల వలచి వలపించి గార్హస్థ్యము గావింపఁదొడఁగెను.

# 8

మాల గూడెము మాఱు మ్రోఁగునటుల భజనచేసి దాసరి నిదిరించెను. రెండవ జామున పిల్లి యొకటి గుడిసెలోఁ దూఱి కోడిని బట్టఁబోయెను. కోడి కొక్కొఁరోకో యనెను. కోళ్ళన్నియు కొక్కొఁరోకో యని సానుభూతి చూపెను.

దాసరి లేచి నింగివంకఁ జూచెను. గాఢాంధకారము. ఒక్కఁ చుక్కయుఁ గానరాలేదు. వేగు జామాయె ననుకొని అతఁడు గుడికి బయలుదేఱెను.

నింగి మబ్బులచే నిండియుండెను. చీఁకటి ఓయనిన మాఱుపలుకుచుండెను. దట్టమగు నడవిలో మరులు మాతంగి త్రొక్కెనేమో తప్పుదారిన బడెను. పొద లన్నియుఁ దిరిగెను. చిగిరింతలచేఁ గప్పఁబడిన పాడు నూతులలోఁబడి యెట్టెటులో ఒడ్డునకుఁ బ్రాఁకెను. అవురు దుబ్బుల చే లన్నియుఁ దిరిగెను. ముండ్లు లాగుకొనుచు, పల్లేరుకాయలఁ దుడుచుకొనుచు, పూచికలఁ బీఁకు కొనుచుఁ బోయిపోయి తుద కతఁడు మఱ్ఱి కడకుఁ బోవుదారిని జూచి దొరకనే దొరకెనని ఆ దారిని బడెను.

క్రోలి పాఱవయిచిన కొబ్బరి బొండములవలె పుర్రెలు పడియుండెను. కంబళ్ళవలె పచ్చి తోళ్ళు ఈఁగలు ముసరఁగా కంపల వ్రేలాడుచుండెను. చీఁకటి కుప్పలవలె వెంట్రుకలు అచటచట గుట్టలుగాఁ బడియుండెను. ముందు ముందులకుఁ బోవఁగా కుక్కలును, నక్కలును క్రుళ్ళిన ప్రేవులకు పెనఁగులాడుచుండెను. దాసరి అది యొక మాదిగ గూడెమనుకొనెను. ముందరికి నడచెను.

కుక్కలు ముంగాళ్ళ మీఁద లేచి చెట్టుమీఁదికి దొంగ చూపులు చూచుచు ఎముకలు నోటఁ గఱచుకొని పరుగెత్తుచుండెను. మాంస ఖండములు తన్నుకొని పోవు గ్రద్దలు కొమ్మలు తగిలి అఱచుచుండెను. క్రోఁతులు అరచేతి వ్రేటుదిని రొండిని చేతు లిడికొని అంగలార్చుచుండెను. ఇవి యిటు లుండఁగా పెద్ద మంట కనఁబడి వెంటనే మాయమాయెను.

'ఎవఁడో ఈ చెట్టు మీఁద నున్నాఁడు. ఇది కట్టెలు కొట్టుకొను వేళయా

కాదు. కావున వీఁడు మానవుఁడు కాఁడు. నీచుకంపు కొట్టుచున్నది. ఏమిటిరా యిది?' అని దాసరి పరికించెను.

'నిన్ను చూచితిని లే' అను మాట వినఁబడెను. పెద్ద మంట మండెను. వెంటనే చిమ్మచీఁకటి యాయెను. దాసరి ముందు ధమ్మని చప్పుడాయెను. ముందు కొండ యెత్తువాఁడు, కండ కన్నులవాఁడు, కుండ మోఁకాళ్ళవాఁడు, నూతిబొడ్డువాఁడు, శవపుగోఁచివాఁడు, చెంబుతలవాఁడు, తేనెతుట్టె గడ్డము వాఁడు, బూరగాలివాఁడు, కాకి మీసాలవాఁడు!

దాసరి దేవునిఁ దలఁచెను. బ్రహ్మరాక్షసు. డొక తాపు తన్నెను. దాసరి దుడ్డుకఱ్ఱతో నొక పెట్టు పెట్టెను.

ఈ చప్పుడు విని లేచి ఆఁడు దయ్యములు మూతులు సాఁచి కొమ్మల చివరఁ గూరుచుండెను. బొమ్మ రాకాసి దుడ్డుకఱ్ఱ విఱిచి దాసరి డొక్కలో నొక గ్రుద్దు గ్రుద్దెను. దాసరి తప్పించుకొని ఒక పోటు పొడిచెను. బాఁపన దయ్యము మాలని ముక్కు పీఁకఁ జూచెను. దాసరి పిడికిలి పోటులే కోటగా తిరిగెను. బేతాళుఁడు ప్రేవుచబుకు జాడించెను. మాలఁడు దానేని లాగుకొనెను. దయ్యము ముందరి కొఱగెను. ఆఁడు దయ్యము లయ్యయ్యో యని యఱచెను. మాలఁ డొక తన్ను తన్ని తప్పించుకొని పాఱిపోఁ జూచెను.

'ముండ కూఁతులారా! కుండెఁడు బండెఁడు తిని కూరుచుందురా? వీఁడు తప్పించుకొని పోచున్నాఁడు. రారేమే. రండే' అని బూతులు తిట్టుచు బొమ్మ రాకాసి దాసరి చుట్టు తిరుగఁదొడఁగెను.

'అడుగనిదే అమ్మయు పెట్టదు' అని పేఁడ నీళ్ళు చల్లుకొనుచు పెద్ద భార్య సోమిదమ్మ దిగెను. 'పిలువని పేరంటమునకు పోరాదని కూర్చుంటి'నని చిన్న భార్య లంబాడీ దయ్యము కాఁబోలు 'హసిలి' ఎముక కత్తితో, ప్రేవుల త్రాళ్ళతో దిగెను. 'మీరే కాఁబోలు మహా ప్రియురాండ్రు' అని బాదించుకొనుచు వెంట్రుక చీపురుతో నొకతె, నరముల యొడ్డాణముతో నొకతె, కంకాళపు కఱ్ఱతో నొకతె బిల బిల మూఁగిరి.

మగవానిని పట్టుకొనుటకు ఆఁడు దయ్యములు చాల నేర్పరులు. చిన్న దయ్యము నరమొకటి దాసరి మీఁదికి విసరెను. మిగిలినవారు లాగిరి. బ్రహ్మ రాక్షసుఁడు కట్టఁదొడఁగెను. దాసరి కాళ్ళతోఁ ద్రొక్కుచు ఎగురుచు మోఁచేతులతోఁ బొడుచుచు పెనఁగులాడుచుండఁగా లాగుకొని పోయి బాపన దయ్యము వానిని మఱ్ఱికిఁ గట్టివయిచెను.

# 9

'ఓసి సోమీ! కత్తియు కుండయు తే. దొమ్మరనాగీ! పిడకల దాలి పెట్టు. లంబాడీ హసిలీ! నీవు పోయి పైని పడుకో.' అని పురమాయించి బొమ్మ రాకాసి దాసరిని జూచి బుసకొట్టి, 'ఒరే! నా చెమట దీసిన నిన్నూరక చంపుదు ననుకొంటివా? నీ మెడ సగము కోసి వేఁడి వేఁడి నెత్తురు త్రాగుదును. అదిగో అటు చూడు. ఆ తాటి తోపున పుర్రెల లొట్టెలు! అ కల్లు త్రాగుచు పందఁ గాల్చిన నీ మాంస ఖండములు పీ రందఱం దీయగా నంచుకొందును' అనెను.

ఆఁడు దయ్యము లన్నియు తమ తమ పనులకు వెళ్లెను. దాసరి యిటు లనెను: 'అయ్యా! వేగిర పడవలదు. నేను మీ కంచములోని ముద్దను. నాకీ మేని మీఁద అంతగా భ్రాంతి లేదు. ఇది పోవుటే మేలు. ఏలందురా, నీచ జన్మముతో నొక ప్రాణికి భుక్తి యిడుట ముక్తి కాదా?'

'ఏమీ? అంత స్వచ్ఛందశరీరుఁడవా? అగుచో ఇంత పెనఁగితి వేల?'

'అయ్యా, మీరనిన దేవతలకును హడలు. ఇఁక నామాటయా? ఊరక చంపనిచ్చుట పాతకమనరా? కాన పెనఁగితిని. దీనికి కినుక వలదు.'

'ఏమీ పెద్దమాట లాడుచుంటివే! ఊఁ చెప్పు!'

'అయ్యా, నేనేమి చెప్పఁగలను? అయినను ఒక హిత వాడెదను. ప్రాణ భీతిచేఁ గాదు. మాధ్యస్థ్యమునకు మాటలాడుచుంటిని. అయ్యా! నీవు నక్కవా, కుక్కవా, పులివా, పుట్టవా? కావుగదా! దేవయోనివి. మీకు మాకంటె పాటవమా యెక్కువ, తెలివియా యెక్కువ. ఇట్టి నీకు భక్ష్యాభక్ష్య వివేకము లేకునికి పాడియా? ఈనా శరీరము రుచియా శుచియా? ఇదియు హింసైకలభ్యము. హింస వలన యమబాధ మీకును తప్పదే.

'మీకు దేవతలు సోదరులుకదా! మీరు వారిచే బాధింపబడుట కేమి కారణము? తామసాహారము కాదా? నాకు పలుకరాదు గాని చంద్రుని మొదటి కళ అగ్ని క్రోలునఁట గాదా! దేవతలకు అమృతమాహారము. అది సాత్త్వికము. దాన వారు మీకంటె పెక్కేండ్లు జీవింతురు. ఇది యంతయు విచారించి మీకు రుచించునటులు చేయుఁడు.'

'అట్టే చంపకు. మాకు రాని చదువులా? "ప్రథమాం పిబతే వహ్నిః" కదా! సరికాని, మాకు దేవతలు సోదరులని నీవే యంటివి. అగ్ని చంద్రుని మొదటి కళ క్రోలునని నీవే యంటివి. అట్టి అగ్ని తినని వస్తువున్నదా? ఇఁకఁ జాలు. ఇది మాకు వృద్ధానుచారములే. సరేకాని చదువులు చాలఁ జదివితివి. చదువులతో ఆఁకలి యెవఁడు తీర్చుకొనఁగలఁడు? చదువులలో వాదించి నా

మెచ్చు గొనలేవుగాని నాయాఁకలి తీర్చి యీచదివిన కూర మంచి రుచిగా నున్న దని మాత్రము మెచ్చుగొనఁగలవు.'

'అయ్యా! నీవు సర్వజ్ఞుఁడవు. నాకోనమాలు రావు. పైఁగా నేను మాలఁడను. నీకు మాఱాడఁగలనా? నాపొరపాటు లన్నియు మన్నించి నాప్రార్థన మొకటి వినవలయును. కురుంగుడి దేవరను గొలుచుట నాకు నిత్యవ్రతము. సేవాకాల మయినపిదప ఈదేహము తమది.'

బాపనదయ్యము కొంచెము నవ్వి దాసరి చెక్కిలి గొట్టి యిటు లనెను: 'బలే మోసగాఁడవురా! దారులు కొట్టికొట్టి నిన్న కాదా దాసరివైతివి. మంచిది కాని, నీవే చెప్పు! నోటిముద్ద నెవఁడు జాఱవిడుచును? తప్పించుకొని శరీరము నెవఁ డిచ్చును? నేను వదలమియు నీవు పోమియు నిక్కము. ఎందుల కిఁక రచ్చ? చావునకు సిద్ధపడు!'

'నారాయణనారాయణా' యని చెవులు మూసికొని దాసరి కన్నులింతలు చేసికొని ఏకాగ్రదృష్టితో నిటు లనియెను: 'నేను మరల రానిచో వామనస్వామి మీఁద ఒట్టు.'

తీవ్రమగు ఈపలుకుబడి బొమ్మరాకాసిని కదిలించివయిచెను. కురంగుడియు వామనస్వామియు మాలదాసరియు అంతయు గుఱుతు దగిలెను. వెంటనే బందము విప్పెను. దాసరి నమస్కరించి వెళ్ళిపోయెను.

పిదప పెద్ద భార్య మొదలుకొని చిన్న భార్య వఱకును గల రాణివాస మంతయు వచ్చి ముక్కుమీఁద వ్రేలు వేసికొనెను. వారందఱు గలిసి బండు బూతులు తిట్టిరి; ఎడపెడ తన్నిరి. 'చేఁ జిక్కినవానిని జాఱవిడిచిన విధవవు. ఇఁక నీ ఛావు నీవు చావు' మని తిట్టి విడాకులు లేకయే గుడెసెమీఁద దెబ్బకొట్టి లేచిపోయిరి.

సోమి యింత సులువుగా లేచిపోయినందులకు వానికి సంతసము కలిగెను గాని హసిలికొఱకు కంట తడి పెట్టెను. పిమ్మట చెట్టుమీఁది కెగిరి యిఱుకు కొమ్మలలోఁ గూరుచుండి యేదియో యాలోచించుచుండెను. భార్యలందఱును లేచిపోవుటచే నతనికి వైరాగ్యము కలిగియుండవచ్చును.

## 10

'వామనస్వామీ! నేను నీగుఱ్ఱమును, నేను నీకేనుఁగను' అని యనుకొనుచు దాసరి నిండువేగముతో కురుంగుడికి పరువిడెను.

నేడు వానిపాట ముక్తికి బాట. వాని పెదవులమీఁది మందహాసము భగవంతుని చిద్విలాసము వాని కన్నులు ముక్తికి తెన్నులు. వాని మోము దేవుని గీము. ఇట్టి భక్తితో నతఁడు భజన చేసెను.

నేఁటి తాండవమున వాని మేను బంతి. వాని యడుగులు తాళములు. దాసరియే నాఁడు భజించెను. వామనుఁడే వినెను. దాసరియే నాఁడు తాండవించెను. వామనుఁడే చూచెను.

వామనుని విడిచి దాసరి వెనుదిరిగెను. వాని మోము మధుకలశము. అతఁడు పొరలుదండము లొనరించి లేచెను శిఖరము కానిపించునంతవఱకు వెనుక నడకతో మ్రొక్కుచు నడచెను. పిదప మనోదేవాలయముననే వామనుని గొలుచుచుఁ బరుగెత్తెను. బాపనదయ్యము వెఱ్ఱిచూపులు చూచుచుండఁగా దాసరి మఱ్ఱి క్రిందికిఁ జనెను.

ఆ మండు టెండలో తన బట్టతల చత్రాతివలెఁ గానిపింపఁగా బ్రహ్మరాక్షసుఁడు దాసరిముందరికి నడచెను. దాసరి కౌఁగిలించుకొని 'మహానుభావా! నావ్రతము పూర్తి చేయించితివి. నీ చెఱఁ బాపి నన్ను ముక్తి చెఱలోఁ బెట్టితివి. ఎన్నాళ్ళ యాఁకలియో పాపము, పారణచేయుము' అని యనెను.

రాకాసికన్నులు బాష్పములచే గాజులాయెను. కౌఁగిలి వదిలించుకొని మాలనిచుట్టు ప్రదక్షిణ మొనరించెను. నొసలు పాదము లంట వ్రాలెను. పర్యాయముగా పాదములు నెత్తిని దాల్చి లేచి, 'అయ్యా, అతిదారుణమగు ఈప్రతిజ్ఞ నీకుఁగాక యొరులకుఁ జెల్లదు' అని స్తుతించుచుండఁగా దాసరి యిటు లనెను: 'అయ్యా! బాస నమ్మి యాఁకట మాఁడియు నోటిముందు ముద్దను జార్చుకొను వానిని నే నెన్నఁడును కని వినియుండలేదు. గొప్పఁదనము నీదా నాదా? బాసల కేమి? నోరికొలఁది చేయనగును. అయ్యా, చాల తడవాయె నన్నిఁకఁ దినుము!'

'ఇఁక నటు లనవలదు. నరమాంసము చేతనే ఈ బొజ్జ పెరిఁగెను. నీ చెలిమితో నాచక్రము తిరిగెను. మీవంటి భక్తులు మావంటి పాతకులను తరింపఁ జేయనిచో మాకు గతి యేమి? వానకు సముద్రమయినను ఎడారియయినను ఒకటియే కాదా?'

'అయ్యా! బాసచొప్పున ఈ శరీరము తమదే. నే నీయ ననుట లేదు. ఈశ్వరుడే సాక్షి.'

'వలదు వలదు. నా శరీరము నీవు గొనవలయును. అయ్యా! నేను ఘంటాకర్ణునికంటె తుంటరినా? శ్రీకృష్ణుఁ డతనికి శ్రేయ మిడలేదా? భక్తుఁడు భగవంతునికంటె మేలు చేయునందురు. అట్టి మేలు నాకు చేయరాదా? ఒకనికి మేలు చేయుట భగవత్పూజ కాదా?'

'అయ్యబాబో! అంతపని నాతరమా? నాబాబు తరమా?'

'ఆహా! నీతరమే.' అని అబొమ్మ రాకాసి దాసరి పెడతలఁబట్టి చూపి,

'నాయనా! నిన్నిచ్చట రాతఁ గొట్టితిని' అని చెప్పుచుండఁగా దాసరి 'భగవంతుఁడు నాపాపమున కారీతిగా సుంకము గొనెనే కాని వేఱు కాదు.' అని యనఁగా తెల్లఁబోయి తెలివి దెచ్చుకొని బాపనదయ్యము 'మహాత్ముఁడా! పిదప నేను దొంగచే కొట్టఁబడి వానిరూపే తలఁచుచు చచ్చి యిటులయితిని. బాట సారులను పలువురను ఈపొట్టఁ బెట్టుకొంటిని. పూర్వజన్మమున బ్రాహ్మణుఁడను. దయనీయుఁడను. నేఁడు నీపాడిన వామనస్తుతిఫలమును ధారాదత్తము చేయుము. ఇఁక ఈ నాదేహము తన యిల్లు చేరును' అని యనెను.

'అమ్మా! ఏమో యనుకొంటిని. ఈ శరీరమునకు బదులు నేఁటి పాట ఫలము కాదు సరికదా ఒక త్రుటిఫలమేని యీఁ జాలను. ఈ శరీరము లెన్ని వచ్చెను, ఎన్ని పోయెను? ఇది బుడగ. సరికాని, కప్పర మిచ్చి ఉప్పుకొను మందువా?'

'ఔరౌరా! సగమేని యిమ్ము! మీను మ్రింగినచో సముద్రమునకుఁ గొఱఁతయా?'

'అయ్యో! నీకును నాకును జరిగిన బాసయేమి? ఇపుడు నీయడుగునదేమి? పాతాళప్రశ్నము లేల? బావిత్రవ్వఁగా బేతాళములు బయలుదేఱినవఁట! పాపము! ప్రొద్దు వోయెను. ఇఁక నన్నుఁ దినుము! ఓ యమ్మలారా! కుండ తెండు! కత్తి తెండ దాలియెదీ? వీరేరీ? ఎవరును లేరే! పోనిండు! నేనే తెచ్చెదను! ఏడ నున్నవో కొంచెము తెలుపుఁడు!

'ఆ సంసారము శాంతించెను. శాంతమ్ పాపమ్. అయ్యో! భక్తులకు దయ వలదా? పూర్ణాచార్యులవారు సంతుష్టులయి రామానుజులకు గీతాచరమార్థము నుపదేశించి అనధికారులకుఁ జెప్పవలదని శాసించిరి. శ్రీ రామానుజులు లోకుల యెడ దయ గలిగి రంగని గోపురమెక్కి యెలుఁగెత్తి చాటిరి. దాన గురువు కోపించెను. శిష్యుఁడిటు లనెను: 'నే నొకఁడనే నరకమునఁ బడుటమేలా? భక్తులందఱకు పరమపదము లభించుట మేలా?' అని నాలో నే నాలోచించుకొంటిని. రెండవదియే మేలని నిశ్చయించుకొంటిని. అంతట గోపురమెక్కి మీరు చాటుటగా నేను చాటితిని" అనెను. గురువు సంతసించెను. నీవు లోఁగడఁ జెప్పినటులు కలుషము గాని కాయమునఁగాని కల్యాణము కలుగదు. కావున ఈ పాడు రూ పుడిపి నన్ను కృతార్థుని జేయుము. నీ పాటఫలములో పాతికపాలేని ఇమ్ము.'

'అమ్మా, ఎంతాశ!'

'పోనీ తుదిపాట ఫలమేని చాలును. ఇదియు ఈయనిచో ఇఁక లేచుట సున్న' అని ఆ బొమ్మరాకాసి దాసరి పాదములను గట్టిగా లంకించుకొనెను.

'అయ్యా! నేను దీనిఫల మెఱుఁగను. పరమేశ్వరుని ముఖోల్లాసమే ఫలము. అదియుఁగాక ఆజ్ఞకుఁగాని అభ్యనుజ్ఞకుఁగాని ఫలపరిగణనము ప్రసన్నుని కేడది? మఱియొకటి. ఫలము బంధమునకు ఇక్క. ఫల మింతయనియు అంత యనియు లెక్కవేసి దానిలో ఇంత గొమ్మనుటకు వెఱపు గలుగుచున్నది. భగవంతుడే మిమ్ము రక్షించును. ఊఁఅడిలుఁడు.'

ఈ మాటలు దాసరినోట నుండఁగనే దయ్యము తలమీఁద పిలకయు, బుజమున జందెములును, చేత బుడి దెంబును, మేన బ్రహ్మవర్చసమును పుట్టుకొని వచ్చెను. పొగనుండి నిప్పువలె రాక్షసదేహము నుండి సోమశర్మ వెలువడెను.

* [భారతి, జనవరి, 1933] *

# హోలయ్య

కరుణకుమార

విశలాపురాగ్రహారం వైదీకి బ్రాహ్మణ్యం పుట్ట. అనాది అగ్రహారం. ఆ అగ్రహారంలో గల రెండు వందల బ్రాహ్మణ కుటుంబాలలోకి వెంకటశాస్త్రి మకుటం వంటివాడు. గొప్ప తర్కశాస్త్ర పండితుడూ, వైయాకరణీ, నైష్టికుడూను. త్రికాలములా సంధ్యా వందనం చేసుకోనిదే గంగ తాకడు. సనాతన ధర్మం అన్నా, వర్ణాశ్రమ ధర్మం అన్నా చెవి తెగ్గోసుకొంటాడు. చిన్నతనంలో తల్లిదండ్రుల్ని విడిచి కాశీకి వెళ్ళి పదేళ్ళుగా గురుకుల వాసం చేసి శాస్త్రం పఠించిన పండిత శ్రేష్ఠుడు.

ఆయనకు పంచములంటే సుతలామూ సరి పడకపోవడం అంతగా ఆశ్చర్యకరమైన విషయం కాదు. పంచములంటే పనికిరాని బ్రాహ్మణోత్తము లెంతమందో లేకపోలేదు. కాని వెంకటశాస్త్రి మట్టుకు వాండ్ల విషయమై ప్రత్యేక కృషి చేశాడు. గాంధీగారు అస్పృశ్యతా నివారణోద్యమం ఆరంభించినది లగాయతు పంచములను గురించి అనేక గ్రంథాలు తిరగేసి, కూలంకషంగా గాలించి పంచముల పుట్టుపూర్వోత్తరాలను గూర్చి గొప్ప పరిశ్రమ చేసిన పరిశోధకుడు. ఆయన అసలు పంచములు హిందూమతానికి సంబంధించినవారు కారని ఓం ప్రథమంలో ఒక నూతన సిద్ధాంతాన్ని లేవదీశాడీ మహనీయుడు!

ఆ బ్రాహ్మడికి వయస్సు ముదిరినకొద్దీ, తాను చేసిన గాఢమైన పరిశోధన ఫలితంగా, చిన్నతనంలో ఆయనకు పంచముల విషయమై ఉండిన అభిప్రాయా లన్నీ వయస్సుతో కూడా ముదిరి, స్థిరపడి, నఖశిఖ పర్యంతమూ గాటంగా నాటుకొని పోయినవి. రాను రాను ఈ కృషిలో ఆయన కత్యంతమైన విశ్వాసమూ, ఆనందమూ కలుగుతూ వచ్చింది. అందువల్ల ఆయన కాశీ విడిచి, ఇల్లు చేరుకొని వివాహం చేసుకొన్నది లగాయతు, ఈ ముప్పై ఏళ్ళుగా స్వగ్రామం లోనే బ్రాహ్మణ విద్యార్థులకు విద్యా దానం చేసుకొంటూ కాలక్షేపం చేస్తూ వస్తున్నాడు.

అస్పృశ్యతను తొలగించవలెననీ, పంచములకు హరిజనులని నూతన నామకరణం చేసినవారికి దేవాలయ ప్రవేశంకూడా ప్రసాదించవలెననీ—ఇట్లాంటి బిల్లులూ, ఉద్యమాలూ, ఉపన్యాసాలూ బయల్దేరే వరకు, ఆయన కాపాద మస్తకమూ ఒళ్ళు కంపించిపోయి, తన కళ్ళ యెదుట సనాతన ధర్మం చచ్చి పోతూ వుండగా, తనవంటివారు చూస్తూ చేతులు ముడుచుకొని కూర్చోవడం భావ్యం కాదని, సనాతన ధర్మోద్ధరణ కోసం నడుం కట్టి రణరంగంలోకి దూకి నాడు. ఆ క్షణం లగాయతూ నూతనోద్యమాన్ని రూపు మాపి సనాతన ధర్మం స్థాపించే పని మీద, ఆయన తిరగనన్ని దేశాలూ తిరిగి తిరిగి వేసారి పోతూన్నాడు.

ఇంటివద్ద సంసారం యావత్తూ చేతికెక్కివచ్చిన ఇరవై ఏళ్ళ కొడుక్కి వప్పగించి, మాల మాదిగలను పైకి రానియ్యకుండాచేసే కృషి మీద ఉత్తర హిందూదేశంలో పర్యటనం నిమిత్తం ఇప్పటికి రమారమి రెండేళ్ళ క్రిందట బయల్దేరి వెళ్ళాడు. కాశీ, గయ, ప్రయాగ, ఢిల్లీ, పంజాబు, బరోడా వగైరా స్థలములలో అనేకమంది పండితులతో పంచములకు సంబంధించిన విషయాలన్నీ చర్చించి, కొత్త విషయాలెన్నో సేకరిస్తూ, తన సిద్ధాంతాలను దృఢపర్చుకొంటు న్నాడు. ఆఖరుకు పంచములు హిందూమతం వదలి అన్యమతాల్లో కలుస్తామని తీర్మానించుకొన్నట్టు వదంతి పుట్టేవరకు 'పీడ వదలింద'ని వెంకటశాస్త్రి బ్రహ్మానందపడుతున్నాడు.

ఇల్లు విడిచిన ఇరవై రెండు నెలలకు ఇంటి దగ్గర తన కొడుక్కి కుమారుడు కలిగాడనీ, ఆ సంవత్సరం మాఘ శుద్ధ పంచమీ మంగళవారం ఉదయం 9 గంటలకు మనుమడికి బారసాల జరపవలసి ఉందనీ ఆనాటికి పెద్ద వాడయిన తాతగారు తప్పక రావలసిందనీ, ఉత్తరాల మీద ఉత్తరాలూ, టెలి గ్రాముల మీద టెలిగ్రాములూ రాగా, ఇక ముహూర్తం నాలుగురోజులుందనగా

వెంకటశాస్త్రి కాశీలో బయల్దేరి — ఏకాయెకీని సోమవారం రాత్రి 11 గంటలకు తన గ్రామానికి సమీపంలో ఉన్న పుంజూరు స్టేషన్‌లో రైలు దిగాడు.

పుంజూరు నెల్లూరికి దక్షిణంగా పోతే మూడో స్టేషన్. ఆ స్టేషన్ కొంచెం పెద్ద స్టేషన్‌లోనే, అనగా సెకండుక్లాసు స్టేషన్‌లోనే లెఖ అయినప్పటికీ, ఆ రాత్రి మట్టుకు వెంకటశాస్త్రితో కూడా ఏ అయిదుగురోకంటె జాస్తిగా జనం దిగలేదు. వెంకటశాస్త్రి రైలు దిగి దిగడంతోనే గేటులో టిక్కెట్టు ఇచ్చేసి, కాశీ గంగ చెంబులూ, తన గుడ్డలూ కలిపిన మూట నొక చేత్తోనూ, జారీ రాగిచెంబు మరొక చేత్తోనూ పట్టుకొని గేటు దాటి బయటికి వచ్చాడు.

పుంజూరు స్టేషన్‌కీ, విఠలాపురానికీ పద్దెనిమిది మైళ్లు. బరువుగా ఉన్నది. పదహారు మైళ్లు కంకర రోడ్డు మీదా, రెండు మైళ్లు మట్టిరోడ్డు మీదా పోవలె. ఆ రోడ్డు మీద రాత్రి అనకుండా, పగలనకుండా ఎప్పుడూ ఎడతెరపి లేని రహదారీ ఉంటూ ఉండేది. ఆ రోడ్డు పుంజూరు నుండి గంగపట్నం మీదుగా తూర్పు సోమేశ్వరం వరకూ ముప్పై మైళ్ళు పోతుంది. ఏ పొయ్యిల్లో ప్రయాణం చేసినా భయంలేని రస్తా కాబట్టి, రైలు దిగంగానే బండి కట్టుకుంటే కాకులు కూసేవేళకు అలాగ్గా ఇల్లు చేరుకోవచ్చు గదా అనుకొని సోమవారం రాత్రి బండికే వచ్చాడు వెంకటశాస్త్రి. కాని ఏ రైలుకు చూచినా బిల బిల మంటూ ఒంటెద్దు బళ్ళవాళ్ళు ప్రయాణీకుల కాళ్ళ కడ్డం తగిలి చేతిలో మూటలు పెరుక్కొని పొయ్యే సమ్మర్దం గల ఆ స్టేషన్ దగ్గర ఆ రాత్రి వెంకటశాస్త్రికి ఒక్క ఒంటెద్దు బండి అయినా కంటిలో కలికానికి కూడా కనుపించలేదు.

రాత్రి పదకొండున్నరా, రమారమి పావు తక్కువ పన్నెండూ కావొచ్చింది. వెంకటశాస్త్రి దిగిన రైలు కూతేసి వెళ్ళిపోయి చాలా సేపయింది. తనతో కూడా దిగిన జనం ఎట్లా వెళ్ళారో ఎవరి దారిన వారు వెళ్ళారు. రాత్రి డ్యూటీ చేసే రైలు ఉద్యోగి గేటు తలుపు బిగించి, పోర్టరూ తనూ అప్పుడే చెరొక బెంచీ మీదా నడుములు వాల్చారు. స్టేషన్ నిశ్శబ్దంగా ఉంది. పైన వ్రేలాడ కట్టిన లాంతరు దీపం తగ్గించబడి, మినుకు మినుకు మంటూ ఉంది.

స్టేషన్ మెట్లు దిగి పడమటగా ఉన్న మైదానం వైపు వెంకటశాస్త్రి పరకాయించి చూచాడు. ఆ ప్రదేశం అంతా నిర్జనంగా ఉంది. తాను రెండేళ్ళ క్రిందట చూచిన స్థలంతో పోల్చుంటే ఇప్పటి ప్రదేశం పాడు పెట్టిన ఇల్లువలె కళావిహీనమై కన్పట్టింది. శుద్ధ పంచమి కాబట్టి నెల చాలా లేతలోనే వొరిగి పోయింది. వెంటనే చీకటి అలుముకొని విజృంభించింది. మాఘ మాసం. మంచు కురుస్తోంది. చలి దవడలు నొక్కేస్తూ వుంది. బిగబట్టిన చేతి పిడికిళ్ళు విప్పితే శరీరం యావత్తూ పీక్కొని తినేటట్టుగా ఉంది చలి. వెంకటశాస్త్రి

అంత ముసలి వయస్సు కాకపోయినా, ఏభయి దాటి అరవైలో పడ్డఘటం. అందువల్ల అంత తీవ్రమైన చలికి గాని, ఎండకు గాని పూర్వంలాగా ఓర్చుకో లేకపోతున్నాడు. ఏమయినప్పటికీ, తెల్లవారకుండా ఆ పద్దెనిమిది మైళ్ళ ప్రయాణం చేసితీరాలే, విధి లేదు. వెంటనే బయల్దేరితేనే గాని అనుకొన్న ప్రకారం ఇంటికి చేరుకోలేడు. ముహూర్తానికి ముందుగా అందుకోకపోతే చేసిన ప్రయత్నం వృథా అయిపోవడమే కాకుండా తాను రానందుకు ఇంటి దగ్గర ఖంగారు పడతారేమో! బాడుగ బండ్లను నమ్ముకొని ప్రయాణం చేశాడు. తాను ఇల్లు విడచిన ఈ రెండేళ్ళగా కాలపురుషుడు కలుగజేసిన మార్పు లాయనకేం తెలుస్తె? "స్టేషన్‌కు ఇంటి దగ్గర నుంచి బండిని పంపవలసిందని అబ్బాయికి జాబువ్రాసిన బాగుండిపొయ్యేది. ఎంత పొరపాటు పడ్డాను. అని తనలో తానే పశ్చాత్తాయించుకొన్నాడు. కొంత సేపటికి, అసలు ఆ స్టేషన్ పుంజూరు స్టేషనేనా అని ఆయన కనుమానం వేసింది. ప్లాటుఫారంమీదికి వెళ్ళి చెక్కమీద అక్షరాలు చదువుకొన్నాడు. "పుంజూరు" అని ఆయన కళ్ళకు కనిపించింది. మనిషికి అనుమానం తీరింది. కొంత ధైర్యం కలిగింది.

కాని ఏంలాభం! ప్రయాణం సాగే ఎత్తు కనపడడంలేదు. ఒక్కబండి అయినా లేకుండా ఇంత శూన్యం కావడానికి కారణ మాయనకు గోచరించడం లేదు. ఎవరినైనా అడిగి తెలుసుకొందా మనుకొన్నాడు. కాని ఎక్కడా మనిషి సంచారంలేదు. సర్వమూ నిశ్శబ్దంగా ఉంది. కీచురాళ్ళ కూతలూ ఎక్కడనో దూరంగా మొరిగే కుక్కల అరుపులూ తప్ప మరోధ్వని శాస్త్రి చెవికి సోకడం లేదు. పోనీ, గ్రామంలోకి పోయి బండ్లకొరకు విచారిద్దామా అనుకొన్నాడు. కాని ఒకమైలు పోతేనేగాని ఊరు కనపడదు. ఆ అంధకారంలో, ఆ చలిలో, ఆమూట భుజాన వేసుకొని అంతదూరం పోలేకపోయాడు. ఆయనకేమీ పాలుపోకుండా ఉంది. ఏమీతోచక-మంచులో తిరిగితే రాత్రి నిద్రలేక జలుబు జ్వరం చేస్తుం దేమోనని-బయట మైదానంలో తిరగే మనిషి స్టేషనుహాల్లోకి పోదామని వెనక్కి తిరిగి, నాలుగడుగులు వేశాడు. ఇంతలో పడమటి తట్టునుండి ఏదో ఒకబండి వస్తున్నట్టు చప్పుడయింది. శాస్త్రి తటాలున వెనక్కితిరిగి చూశాడు. ఒంటెద్దు బండి ఒకటి వచ్చి ఆతట్టు ఎడంగా ఉన్న ఒక వేపచెట్టుకిందికి పోయి నిలచింది. వెంకటశాస్త్రికి కొంత ఆశ కలిగింది. పరవాలే దనుకొన్నాడు. వడివడిగా పది బారలదూరం అడుగు వేసుకొంటూ పొయ్యేవరకూ, బండివాడు ఎద్దుని విప్పి, కాడి కింద పెట్టి, చాపకింద గడ్డితీసి అప్పుడే ఎద్దుముందర వేశాడు. గడ్డి తిన డానికిగాను, బయట నిలబడిన ఎద్దు నొగలకొడ్డికో ఒక కాలు ముందుకు వేసి,

మెడకిందా పొట్టకిందా పుట్టుకు పుటుకున కుట్టే జోరీగలను మూతితోనూ, చెవులతోనూ, తోకతోనూ తోలుకుంటూ, ఇంకా గడ్డిలో మూతి పెట్టకుండానే నిలబడి ఉన్నది. పండుకొని నిద్రపోదామని బండివాడు ఈతాకుల చాపను బయటికి తీయబోతూ ఉన్న సమయంలో వెంకటశాస్త్రి వెళ్ళి "అబ్బీ! విఠలాపురానికి బండి కడతావా?" అని అడిగాడు.

"విఠలాపురమూ లేదు, గిఠలాపురమూ లేదు, వెళ్ళవయ్యా" అన్నాడు బండివాడు.

"బాబుకదూ! నా తండ్రికదూ! నేను చాలా తొందరగా పోవాలె. ఇప్పుడు ఎకాఎకిని పోకుంటే నాకు చాలా తొందరపనులు చెడిపోతవి. నాకోసం కాస్త కష్టపడుదూ నాయనా! పెద్దవాణ్ణి! బహుమంచివాడిని" అని ప్రాధేయపడ్డాడు శాస్త్రి.

"నాకు నిద్రొస్తోంది తాళవయ్యా! పండుకోవాలె" అని బండివాడు చావ నేలమీద పరిచాడు. నిద్రబద్ధకం తోసుకురావడంచేత చాపమీద నడుం వాల్చాడు.

ఇక ఆ బ్రాహ్మణుడు బండి కట్టమని 'బాబుకాదూ, నాయనకాదూ' అని ఒకటే బ్రతిమాలడం మొదలుపెట్టాడు. బండివాడు కట్టలేనని విసుక్కోవడమూ, బ్రాహ్మణుడు బ్రతిమాలడమూను. చివరకిది పనికాదని "ఇదిగో చూడు. నువ్వు కోరినంత బాడుగిస్తాను. రూపాయిన్నర ఇస్తాను తీసుకో లే! ఎక్కడా బండి చిక్కలేదు నాకు. గిరాకీగా ఉంది: పోగొట్టుకోబోకు" అని ఆశ పెట్టాడు శాస్త్రి.

"ధనమూల మిదం జగత్" కదా! మామూలు బాడుగకంటె అర్ధరూపాయి అదనంగా వచ్చేపాగీ కనపడేవరకు బండివాడికి ఆశ పుట్టింది. వెంటనే వాడు చాపచుట్టి బండిలోవేసి, "ఎంతమంది మనుష్య"లని అడిగాడు.

"నే నొక్కణ్ణే" అన్నాడు శాస్త్రి.

బండివాడు ఎద్దు ముందర వేసిన గడ్డిని బండిలో చావ కింద తురిమి, నొగ ఎత్తి, ఎద్దును అంకెకు తెచ్చుకొని, కాడి ఆర్రు మీద పెట్టి, మెడ పలుపు బిగించాడు. వెంకటశాస్త్రి జారీచెంబు చేత్తో తీసుకొని వెళ్ళి, కాలు ముడిచి అనుమానం తీర్చుకొన్న తర్వాత మూట తెచ్చి బండిలో పెట్టాడు. కాలి చెప్పులు చావ కింద భద్రపరచి, "పట్టుకో" అని బండివాణ్ణి హెచ్చరించి, "రామయ్య తండ్రీ" అంటూ బండిలో ఎక్కి కూర్చున్నాడు. పది గజాల దూరం రోడ్డు ఎక్కేవరకూ బండివాడు నొగ పట్టుకొనే నడిపించి, రోడ్డెక్కిన తర్వాత పగ్గం బండి వెదురు దబ్బలకు కట్టి, నొగలో ఎక్కి కూర్చున్నాడు. వాడు కొరడా కోసం ఇంకా తడువుల్లాడుకొంటూ ఉండగనే ఎద్దు మెల్లగా పరుగందుకొన్నది.

రాత్రి చాలా పొద్దు పోయింది. ఒంటిగంట కావచ్చింది. రెండురోజులుగా

ప్రయాణం బడలికచేత పాపం బ్రాహ్మణుడు డస్సిపోయాడు. కాస్త కన్ను కూర్చుదామనుకొని, నడుము వాల్చి తల కిందికి మూట లాక్కొన్నాడు. "వెనక బరువు సామీ" అని బండివాడు హెచ్చరించే వరకు మూటతో సహా తాను ముందుకు జరిగాడు. మూటా, మూటమీద పెట్టుకున్న తనతలా బండి వాని పృష్ఠానికి వెళ్ళి తగుల్కొన్నవి. "రవంత వెనక్కు అనండి, ముందు బరువయిం" దన్నాడు బండివాడు. బండివాని సహాయంతో మూట కొంచెం వెనక్కు లాక్కొని, బండివాడు "ఆఁ" అన్న తర్వాత శాస్త్రి కాశ్మీర శాలువ కప్పుకుని ముసుగుతన్ని, కాళ్ళు ముడుచుకొని, వత్తిగిలి మూడో అంకె వేసి పండుకొన్నాడు.

బండి రెండు మైళ్ళు సాగిపోయింది. ఆ బండి వట్టి పాత తుక్కు. ఎప్పటిదో ఇక్ష్వాకుల నాటిది. అందులో అడ్డబండి. బాడుగ బళ్ళవాళ్ళకు కమాను బళ్లెక్కణ్ణుంచి వస్తాయి? పైన గూడుకు వేసిన ఈతాకుల చాప చాలా భాగం శిథిలమై, బండిలో పండుకొని పైకి చూస్తే ఆకాశంలో నక్షత్రాలు అగుపడుతూ ఉన్నవి. బండి చక్రాలకు వేసిన సామాను కులంగల కొయ్య కానందువల్ల, చలికి బిర్రబిగిసి, ఆకులూ, పూటీలూ వంకలు పోయి, ఎగుడు దిగుడుగా బండికి దొడ్డి ఏర్పడింది. కుండల్లోని ఉలవాయిలూ, ఇరుసు కడలూ అరిగిపోయి, కుంద తూముల్లో సందు ఏర్పడి, వదులువల్ల కుండలు రెండూ ఆ పక్కకీ, ఈ పక్కకీ జరిగి కడసీలలకు టక్కు టక్కుమని తట్టుకొంటూ ఉన్నవి. ఆ తట్టుకోవడంలో అసలె దొడ్డిచక్రా లయినందువల్ల బండి చట్టం యావత్తూ ఆ పక్క నుంచి ఈ పక్కకీ, ఈ పక్క నుంచి ఆ పక్కకీ ఊపు ఇస్తోంది. అందులో గతుకు లున్నచోట, చక్రం పల్లానికి దిగి మిర్రు కెక్కడంలో, ఎద్దు మెడ మీద ఉన్న కాడితో సహా బండి అడ్డంగా ఉయ్యాల లూగుతోంది. ఈ ఎగుడు దిగుడు ఉయ్యాలల్లో వెంకటశాస్త్రి కళేబరం కూడా ఊగిసలాడుతూ, ఒక పక్కకి ఒత్తిగిలి పండుకొన్నందువల్ల, బండి వెనక్కు మీటినపుడు వెన్నెముకకూ, ముందుకి మీటినపుడు మోకాళ్ళ చిప్పలకి బండి వాసి కొయ్యలూ, పెండెందబ్బలూ కొట్టుకొని బొమిక మీద దెబ్బ తగిలే వరకు — పాపం — ఆ బ్రాహ్మడికి ప్రాణం జిల్లార్చుకొని పోతోంది. కుడి చెయ్యి తల కింద ఉండడంవల్ల, దెబ్బ తగిలినపుడల్లా "ఇస్సు, అబ్బా!" అని ఆయన ఎడం చేత్తో ఆ స్థలంలో రుద్దుకొంటున్నాడు. కంటి మీద కునుకెటువంటిదో ఎరుగడు ఆ మానవుడు. ఇన్నాళ్లుగా ఇంత దేశం తిరిగాడు కాని ఇట్లాంటి ఉత్కృష్ట ప్రయాణ సౌఖ్యం ఆయన కెక్కడా లభ్యపడలేదు. ఇక నిద్ర ఎట్లా పట్టుతుందాయనకు? నిద్ర పట్టడం మాట ఎట్లాగున్నా, మోకాళ్ళ చిప్పలు బద్దలయ్యే

బాధ భరించలేక, కాళ్ళు ముడుచుకొన్న మనిషి వెల్లకిలా పొర్లి "శంకరా, మహా దేవా" అంటూ కాళ్ళు రెండూ చక్కగా చాచుకొన్నాడు. అట్లా కూడా అయనకు ఉనికి చిక్కలేదు. బండి చట్టం పొడుగు మట్టమైనందున, చాచిన రెండు కాళ్ళూ మోకాలి కింది పిక్కల లగాయతు పాదాల వరకూ చట్టానికి వెలుపలగా వచ్చినై. దానికి తోడు బండి ఇచ్చే ఒక్కొక్క ఊపుతో ఒక్కొక్క అడుగు కిందికి జారిపోతూ వచ్చింది ఘటం. ఆ జారిపోవడంలో, తలకింద మూటకీ మూటమీది తలకాయకీ సంబంధం విడిపోయి, రెండూ వేరయిపోతున్నవి. ఇంతలో కాడి పైకి లేచి ఎద్దుకి మెడ పలుపు బిర్రుతగిలేవరకు "వెనుక బరువు సామీ, వెనక బరువని బండివాడు మళ్ళా హెచ్చరించాడు. "నీ పోరేమిటిరా చచ్చిపోతుంటే" అని శాస్త్రి మూట విడిచి తలకాయ కిందికి జరగకుండా ఉండే టట్టు ఇరుపార్శ్వములా ఉన్న పెండెం కొయ్యల్ని చెరొక చేత్తోనూ గట్టిగా పట్టుకొని, బండి చట్టానికి చివరి భాగంలో బిగించిన అడ్డకొయ్యకు కాలి మడి మెలు తన్నిపట్టి, మనిషి బిర్రబిగిసి పైకి ఎగతన్ని పండుకొన్నాడు. ఈ వాటంలో పండుకొనేవరకు మనిషి కిందకి జారిపోవడం నిలిచిపోయింది. కాని నిద్రపోవడానికి సావకాశం చిక్కలేదు. ఆయన చేతులూ, కాళ్ళూ, శరీరం యావత్తూ జారిపోకుండా బండిలో నిలబెట్టుకొనే ప్రయత్నంలోనే ఉండవలసి వచ్చె! ఏ మాత్రం పట్టు వదలినా వాటం చెడి మనిషి కింద పడిపొయ్యేటట్టుగా ఉండె. ఇక ఆయన నిద్రపొయ్యే దెప్పుడూ?

ఎద్దు కూడా బండికి తగినట్టుగానే ఉంది. ఆ బండివాడు, దానిమొఖాన్న ఎన్నడూ ఇంత పచ్చి గడ్డి కాని, ఇంత నున్నపొట్టు కాని కొట్టిన పాపాన్ని పోలేదు. కొరడా కొయ్యతో కొట్టేవరకు, శరీరంలో చర్మం తప్ప కండ లేనందువల్ల, ఎముకలకు తగిలి, కొయ్య మీద కొయ్యతో కొట్టినట్లు చప్పుడవు తున్నది. కడుపులోకి తాగిన నీళ్ళు తప్ప మరో బలమైన ఆహారం లేనందువల్ల ఎద్దు లగువు తీసినపుడల్లా, కడుపులో పేగులు అదిరి ఎద్దు పారుకొంటూ వచ్చింది. వాసన భరించలేక గుడ్డ తీసుకొని ముక్కు కద్దు పెట్టుకొంటూ, పండుకొన్న మనిషి లేచి కూర్చుని, ఆగ్రహపూరితుడై, "అబ్బబ్బ! ఏం బండిరా, ఈ బండి! నా ప్రాణాలు తీయడానికి వచ్చిందిది. ఛీ! ఛీ! దీన్ని అగ్గిపుల్ల వెలిగించి మంటపెట్టితే పీడ వదలిపోను" అని పెద్దంగా అరిచాడు శాస్త్రి.

బండివాడికి నవ్వొచ్చింది.

"నా బండికేం తక్కువ సామీ!" అని అడిగాడు వాడు.

"నా శ్రాదం, నా పిండాకూడూను. శరీరం నఖశిఖ పర్యంతమూ హూనమైపోతోంది."

"బండి బాడుగలన్నీ పోయినవయ్యె. వాడడం లేక బాడుగ రాక మర్మత్తు లేకపోయె. ఏం చేయమంటారు సామీ!"

"ఇంత దేశం తిరిగాను కడుపులో నీళ్ళు కదలకుండా. ఏ రోడ్డుబట్టినా మోటర్లు మయమైపోతుంటే, ఈ దిక్కుమాలిన రోడ్డు మీద మోటారే పడదు. ఛీ! ఛీ! వెధవ ప్రయాణం. ఎరక్కపోయి ఎక్కా నీ ముతనష్టపు బండి" అని శాస్త్రి విసుక్కున్నాడు.

"లేకేమి సామీ! ఎదురొకటి, వాలొకటి. రెండు మోటార్లుండై ఈ రోడ్డు మీద."

"అయితే నాకా సంగతి మొదట్లోనే చెప్పావు కాదేం?"

"తెల్లవారి పదకొండు గంటల బండి చూచుకొని గాని తూర్పుకెళ్ళే మోటరు బయల్దేరదు. తెల్లవారకుండానే ఇల్లు చేరుకోవాలన్నారుగా తమరు?"

"రాత్రి కూడా ఒక మోటరు తగలబెట్ట కూడదూ ఆ మోటారువాళ్ళి?"

"వాళ్ళకేం మారాజులు. బాడుగ బండి వాడనే పురుగు లేకుండా—ఉన్న వాళ్ళ నందర్నీ జైలుకేసిన తర్వాత – ఇక పగలూ తిప్పుతాడు, రాత్రిళ్ళూ తిప్పుతాడు ఆ మారాజు."

"బాడుగ బళ్ళ వాళ్ళేమిటి? జైల్లో వేయించడమేమిటి?"

"ఆ కథ అంతా శానా ఉండది లెండి. చెప్పుకొంటే తీరే మంట కాదు" అని బండివాడు, ట్ర్రుమని ఎద్దును అదలించాడు.

ఎద్దు దవుడుతీసింది.

"ఎవరు వేయించారు ఈ రోడ్డు మీద మోటార్లు?"

"ఉన్నాడు లెండి ఒక పుణ్యాత్ముడు. మా ప్రాణాలకు శనేశ్వరుడై పట్టి పీక్కొని తింటున్నాడు."

"ఆయన పేరు?"

"చెంచునాయుడంట."

"ఏ చెంచునాయుడు?"

"బోళ్ళ చెంచునాయుడు."

"ఏ వూరు?"

"గంగపట్నం ఆయనగారిది."

గంగపట్నానికీ, విఠలాపురానికీ ఒక మైలు దూరం. విఠలాపురం గంగపట్నం మజరా గ్రామమే. చెంచునాయుడుకీ, వెంకటశాస్త్రికీ ప్రాణ స్నేహం.

చెంచునాయుడు, మోటారు, బళ్ళవాళ్లు, జైలు — ఈ మాటలు చెవిని పడేవరకు కాని స్నేహితుడు చెంచునాయుడికేదో అపద కలిగి ఉంటుందిని శాస్త్రికి కొంత అందోళన కలిగింది. తాను కొత్త మనిషివలె నటించి, అచ్చటి విశేషాలేమో బండివానివల్ల తెలుసుకొందామని శాస్త్రి కొక ఆలోచన పుట్టి, "అయితే ఎన్నాళ్ళయిందీ రోడ్డు మీద మోటార్లు వచ్చి" అని బండివాణ్ణి అడిగాడు.

"అంతా ఒక సంవత్సరం అయింది. మీదేవూరు సామీ?" బండివాడు ప్రశ్నించాడు.

"మాది దక్షిణాది. విఠలాపురంలో బంధువులుంటే చూడటానికి పోతున్నా."

బండివాడు పలక్కుండా బండి తోలుతున్నాడు; కాని వాడు ఊరు కోవడం శాస్త్రికి హితవుగాలేదు. వాణ్ణి కదిలించి ఇంకా విశేషాలు ఒక్కొక్కటే బయటికి తీయాలని ఆయనకు ఆత్రంగా ఉంది.

"బళ్ళవాళ్ళను జైల్లో ఎందుకు పెట్టార్రా అబ్బీ?"

"ఈ రోడ్డుకు మోటార్లు వచ్చినప్పటి నుంచీ, బళ్ళవాళ్ళ కూడు పడిపోయింది. ఆ మారాజు, ఒంటెద్దు బళ్ళవాళ్ళతో పోటీచేసి, వీళ్ళు అర్ధరూపాయికి తీసుకొని పోతామంటే, వాళ్ళు అరణాలకే తీసుకొని పోతామనీ, వీళ్ళు అరణాలంటే వాళ్లు పాపలా అనీ, వీళ్ళు పావలా అంటే, వాళ్లు బేడనీ—ఇట్లా పంతానికి పోటీచేసి ఒక్క పురుగయినా బళ్ళవాళ్ళకు చిక్కకుండా చేశారామోటారువాళ్లు."

"అందుకని ఇద్దరూ కలియబడి కొట్టుకొన్నారా ఏమిటి?"

"కొట్టుకోనూ లేదు. తిట్టుకోనూ లేదు. బలవంతుల మీదికి కూటికి లేని కుంకలు పోగలరా? సంసారాలకు జీవనోపాధి పడిపోయి, బళ్ళమీద చిన్నడబ్బు రాకుండా పోయ్యేవరకు, బళ్ళవాళ్ళకీ బళ్ళను ఆధారం చేసుకొని బతికే అలగా జనానికీ కడుపు మండి, అంతా నూరు మంది తోడయి ఒక రోజు కుమ్మక్కుగా నాయుడి లోగిలిమీద పడి ఆయనగారి ధాన్యపుకొట్ల తాళాలు పగలకొట్టి, తలా పందుం, ఏదుం గింజలు పట్టపగలు దోచుకొన్నారు."

"అయ్యో!"

"అయ్యో లేదు, కొయ్యో లేదు. మరి ఎన్నాళ్ళని కడుపు మంట భరించగలరు చెప్పండి సామీ! ఇంట్లో గడవక బళ్ళనీ, ఎద్దుల్నీ కూడా అయిన కాడికి తెగనమ్ముకోవలసి వచ్చె. అందులో ఆ గంగపట్నం బళ్ళ వాళ్ళందరూ తురక సాహేబులు. సంసార పోషణ యావత్తూ ఒక్క మొగవాడి రెక్క మీదనే జరగాలె. కూలిచేసుకొని బతుకుదా మనుకొంటే వాళ్ళ కులంలో అడది బయటికి

ఛావడానికి వీల్లేకపోయె. చస్తారా! ఆఖరికి ఆ తురకలే ఇంత ప్రయత్నంచేసి, ఇతర కులాల వాళ్ళని కూడా లోగట్టుకొని ఇంత పని చేశారు."

"ఇంకా ఇతర కులాల వాళ్ళంటే ఎవరు?"

"అబ్బో, ఈ మోటారు వచ్చిన తర్వాత ఎంత మందికి కూడు వడి పోయింది సామీ? బళ్ళుచేసే వడ్రంగులకీ, ఎద్దుల బేరగాళ్ళకీ, బండి కొయ్యలు అమ్ముకొనే వాళ్ళకీ, బండి గూడు కొట్టే మేదరోళ్ళకీ, ఆఖరికి ఎద్దుకి పచ్చి గడ్డి ద్రోక్కొని రోజుకో అణా డబ్బులు తెచ్చుకొనే మాల మాదిగ ముండలకీ—ఇంత మందికీ కూడు లేకుండాపోయింది సామీ! ఆ తురక సాహేబులే గంగపట్నంలో ఇంత మందినీ కలుపుకొన్నారంట, అబ్బ! వాళ్ళు తలుచుకొంటే ఎంత పనైనా చేస్తారు సామీ!"

"మంచి పని చేశారు. తగిన శాస్తి అయిందన్న మాట!"

"ఏమయిందో. ఏమయి ఏం క్రియ చెప్పడీ! బలవంతుడిదే రాజ్యం ఈ కాలంలో."

"అట్లాగే."

"ఈ వందమందిమీదా కేసుపెట్టి, ఆఖరికి తలా ఒకటి. రెండూ, మూడే నేళ్ళు శిక్షవేయించి, జైలుకు పంపేవరకూ ఆ నాయుడూ ఆ పోలీసులూ నిద్ర పోలేదుగదా! కానియ్యండి భగవంతు డన్నీ కనిపిస్తాడు" అంటూ బుగ్గన ఉన్న పొగాకు తుబుక్కున ఊసి ద్రుచ్చి అని ఎద్దును అదిలించాడు.

చివరికి చెంచునాయుడిదే పైచెయ్యి అయిందని వినేవరకు శాస్త్రి మనస్సుకు ఊరట కలిగింది. బళ్ళ వాళ్ళకీ, నాయుడికి ఏదో పెద్ద వ్యవహారమే జరిగి ఉంటుందని ఊహించాడు. నాయుడు పట్టుదల మనిషని శాస్త్రికి బాగా తెలుసు. ఇంకా విశేషాలు ఏమిటో విందామని "అబ్బా! ఎంతకథ జరిగిందిరా అబ్బీ! ఎన్నాళ్ళయింది ఇదంతా జరిగి?" అన్నాడు.

"కేసు జరిగి ఆరునెల్లయింది. ఈ ఆరునెలలుగా విచారణలో ఉంది, అంతా వారంరోజుల కిందటనే జడిజిగారు శిక్ష చెప్పారు."

"ఆ నాయుడు బాగున్నాడా?"

"బాగుండక ఆయన కేంరోగం? బీదవాళ్ళని ఏడిపించడానికి ఇంకా నూరేళ్ళు బతుకుతా డాపుణ్యాత్ముడు."

"ఆయన దేమైనా పెద్ద స్థితేనా ఏమిటి?"

"ఆయన కేం సామీ, జమీందారు: గంగపట్నం సగం వూరంతా కొన్నా డంట. ఇంకా ఎన్నెన్నో ఆయనకు వ్యాపారాలుండై. సాలుకు ఇరవై వేలు వస్తుందని అంటారు."

"అబ్బా! ఇంత డబ్బుగలవాడు మోటార్లు వేసి బీదవాళ్ళని ఏడ్పించకపోతే నేం పాపం?"

"ప్రజల సౌకర్యంకోసం వేయించాడట ఈ మోటార్లు. ప్రజలెవరో, సౌకర్యాలేమిటో ఆయన కసలు తెలుసా?"

"ఎంత సేపూ స్వలాభంకొరకే ఈ దొర్లాట - భాగ్యవంతులకు కూడా."

"పోనీ, కేసు పెట్టితే పెట్టా డనుకోండి. పచ్చి గడ్డిగంపలమ్ముకొనే మాలముండల్ని కూడా ఇరికించాలా ఆ దొర? అయినా మా కులం అంటే ప్రతీ వాడికీ అలుసు సామీ" అని అన్నాడు బండివాడు.

బండివాడు "మా కులం" అనేవరకు శాస్త్రికి అర్థం కాలేదు. "మాలకుల మనా లేక వాడికులమే మాలకులమనా దాని అర్థం" అని సందేహం కలిగింది శాస్త్రికి. ఏదో ఆలోచనవడింది మనస్సులో!

బండివాడు తన దోరణి తాను విడువలేదు. ఏదో పరధ్యానంగా ఉండి నోటికి వచ్చినట్టు మాట్లాడుతున్నాడు. తన బండిలోని మనిషి బ్రాహ్మడని వాడికి తెలియదు. తెలిసినప్పటికీ వాడు బ్రాహ్మలికి కూడా ఇదివరలో చాలా సార్లు బండికట్టాడు. మళ్ళా అందిపుచ్చుకొని "మా మాలకులానికి కయ్యేలా, కాలవలా చెప్పండి సామీ! ఆ ముండలు బళ్ళవాళ్ళకి గడ్డి అమ్ముకొని బతుకు తున్నారనీ, దోపిడీ సమయంలో వాళ్లు కూడా గంపలు చేతపట్టుకొని ఆ జనంలో ఉన్నారనీ పదిమంది ఆడవాళ్ళను కూడా కేసులో ఇరికించాడు ఆ నాయుడు. వాళ్లు పసిబిడ్డల తల్లులంట. ఇంటికాడ పిల్లలు అలో లక్షణా అని అల్లాడిపోతు న్నారంట! తలచుకుంటే, దుఃఖం వస్తుంది సామీ!" అని బండివాడు ఆ పుద్రేకం మీద ఏమేమో చెప్పబోతుండగా, వాడు మాలవాడని శాస్త్రికి స్పష్టమయింది. దానితో ఆయన ఒళ్లు జలదరించింది. బండిలో వక్క-క్షణం కూడా నిలవ బుద్ధి లేక కిందికి గభాలున దూకాలనిపించింది. చైతన్యం విడచి కొయ్యబొమ్మ అయిపోయినాడు. బండివాణ్ణి నమిలి మింగేయాలన్నంత ఆగ్రహం వచ్చిం దాయనకు: కాని కర్తవ్యం గోచరం కాలేదు. జీవితానికి పరమావధిగా పెట్టుకొని తాను ఇన్నేళ్లుగా చేసిన కృషి అంతా గంగపాలయిపోయింది. కాశీగంగ చెంబులు బండిలో ఉన్నై. సర్వం జగన్నాథం అయింది. బండివాడి తల రెండు చెక్క లయ్యేటట్టు వగలకొట్టాలనుకొన్నాడు; కాని ధైర్యం చాల్లేదు; చీకటి, అంధ కారం. తాను ఒంటరిగాడు: రెండో సహాయం లేదు: బండివాడు ఇరవై, ఇరవై అయిదేళ్ళ వయస్సు గలిగి, మంచి జబ్బపుష్టిగల మనిషిలా ఉన్నాడు: తిరగ బడితే తనవంటి పప్పు బ్రాహ్మలను పదిమందిని కలిపికొట్టేవాడులా కనపడ్డాడు.

ఆ పరిస్థితులలో తొందరపడకూడదనుకొన్నాడు. ఊరికి చేరిన తర్వాత వాడి భరతం పట్టాలని తీర్మానించుకొన్నాడు. బండివాడి కానుకొనిఉన్న తన మూటను ఎడంగా లాక్కొన్నాడు. బండి సాగింది, ఇక బండివాడి పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవాలని శాస్త్రి, "అబ్బీ! నీ దేవూరురా?" అని అడిగాడు.

"నాది ఉత్తరాది-తెనాలండి?"

"ఇక్కడి కెందు కొచ్చావు?"

"పుంజూరులో నా మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకొని ఇప్పటి కారు నెలలుగా ఇక్కడే నిలిచిపోయాను. ఈ బండి మా మామదేనండి."

"నీ పేరు?"

"పోలయ్య."

"గంగపట్నం బళ్ళవాళ్ళను నువ్వెరుగుదువా!"

"కొంతమంది గుర్తేనండి."

"నువ్వు మాలవాడివి కదా? నీ బండికి జనం దొరుకుతున్నార్రా?"

"ఇప్పుడెవరూ ఆ పట్టింపులు పెట్టుకోవడం లేదండి. అవసరం కొద్దీ అయ్యగార్లు కూడా నా బండి చాలాసార్లు కట్టించుకొన్నారు."

"ఇదివర కెప్పుడైనా విఠలాపురం వెళ్ళావా?"

"విఠలాపురం పోలేదుకాని, గంగపట్నం వెళ్ళాను."

"అవూళ్ళో నీకు బంధువు లున్నారా?"

"లేరండి."

"సరే! తొందరగా పోనియ్యి! తెల్లవార వస్తోంది." అన్నాడు వెంకటశాస్త్రి.

తెల్లవారుజామున ఇంకా కనిచీకటి ఉంది. ఇంకా అయిదారు మైళ్ళు పోవాలి బండి. వెంకటశాస్త్రికి స్థిమితం చెడింది. తనంతటి పండితుడు చివరికి మాలవాడి చేతిలో చిక్కుకొన్నందుకు ఆయనకు పట్టరాని ఆగ్రహం కలుగుతూ వుంది. అగ్రజన్మ యెత్తిన తనయెడల అంత అపకారం చేసిన ఒక తక్కువ కులం మాలవాణ్ణి ఆ సమయంలో ఏమీ చేయలేని తన నిస్సహాయ స్థితికి ఉడుకు మోతుతనం ఉబికి ఉబికి పొర్లి వస్తోంది ఆయనకు. హృదయం కుమిలి వేడి నిట్టూర్పు లధికమైనవి. బండివాడి మీద కలిగిన ఆగ్రహాగ్నికి శరీరం యావత్తూ వేడెక్కి, మాఘమాసం చలి మందగించి, కప్పుకొన్న శాలువ వంటిమీద ఉంచుకోవడానికి ఆయనకు చీకాకనిపించింది. శాలువ విసరి బండిలో ఓ పక్కన వేశాడు. ఎప్పుడెప్పుడు ఇంటికి చేరుదామా అని ఆత్రపడుతున్నాడు ఆ బ్రాహ్మడు.

ఉదయం అయిదు అయిదున్న రయ్యేసరికి బండి కంకరరోడ్డు దిగి

మట్టిరోడ్డుకు మళ్ళింది. బాగా తూర్పురేఖలారినవి. బండివాడి మొఖం శాస్త్రికి బాగా గోచరించింది. ఉదయాన్నే ఛండాలుడి ముఖం చూడడాని కసహ్యం అనిపించింది. ఆ సంధ్య వెలుతురులో శాస్త్రి మొఖం కూడా పోలయ్యకు పొద కట్టింది. ఆయన బ్రాహ్మడు కాబో లనుకొన్నాడతడు; కాని ఆయన మొఖంలో వికాసం కనిపించలేదు. మనిషేదో దీర్ఘాలోచనలో ఉన్నట్టుగా అగుపడ్డాడు. మొఖం ఎర్రగా జేవురించి, నరాలలో కూడా ఉబికి ఉంది. కళ్ళు రెండూ చింత నిప్పులవలె కణకణలాడుతూ ఉన్నై. రాత్రి నిద్రలేక ఆయన మొఖం అట్లా ఉందనుకొన్నాడు బండివాడు.

ఆరుగంట లయ్యేవరకు బండి విఠలాపురం చేరి వెంకటశాస్త్రి ఇంటి ముందట నిలిచింది. ఆరోజు మనుమడి బారసాల. వీధిగుమ్మానికి మామిడాకుల తోరణం కట్టారు. శాస్త్రి ఎప్పుడు వస్తాడా అని ఇంటిల్లిపాదీ కోడికూతతో లేచి ఎదురుతెన్నులు చూస్తున్నారు. వెంకటశాస్త్రి బండి దిగి మూట వీధి అరుగుమీద పెట్టి బయటనే నిలబడ్డాడు. కాళ్ళు కడుగుకోను భార్య నీళ్ళు తెచ్చి యిచ్చింది. మొఖం కడుకోను పుల్ల తెమ్మని మొఖం కడుక్కొన్నాడు. శాస్త్రి ఇంకా ఇంట్లో అడుగు పెట్టలేదు. "లోపలికి రం" దని భార్యా, కొడుకూ పిలిచారు. "ప్రయాణపు గుడ్డలు లోపల పెట్టటానికి వీల్లేదు. స్నానం చేసిగాని లోపలికి రా" నన్నాడు శాస్త్రి.

బండివాడు "బాడుగ సామీ" అని అడిగాడు. "ఇస్తాను ఉండరా" అని వాడికి జవాబు చెపుతూ, కొడుకును రహస్యంగా పిలిచి, అర్జంటుగా చెంచు నాయుణ్ణి పిలుచుకొనిరమ్మని పంపాడు.

చెంచునాయుడికి వెంకటశాస్త్రి గురుపదం. పండితుడన్న గౌరవంచేత, ఆయనకు నాయుడు ఇల్లు కట్టించి యిచ్చాడు. నాలుగెకరాల మాగాణి వ్రాసి యిచ్చాడు. ఆయన కొడుకు వివాహానికి ద్రవ్య సహాయం చేశాడు. శాస్త్రిగారి కుటుంబంమీద నాయుడి కెంతో ప్రీతి, అభిమానమూను. ఈ సంబంధం అనాదిగా పెద్దల లాగాయతూ వస్తూ ఉన్నది. అందువల్ల తనకు పని ఉన్నా, శాస్త్రికి పని ఉన్నా, ఏ వేళనైనాసరే నాయుడే శాస్త్రిగారి దగ్గరకు స్వయంగా వచ్చి మాట్లాడి పొయ్యే మామూలు. అందువల్ల ఆయన దగ్గరనుండి కబురు వచ్చిందనేవరకు, రెండేళ్ళుగా దేశాటనంచేసి వచ్చినందున ఏమి తొందరపనో అని నాయుడు నిద్ర మంచంమీదనుండి లేవడంతోనే తలకు ఫ్లానల్‌గుడ్డ చుట్టుకొని, కాలికి చెప్పులు తొడుక్కొని, చేత కర్ర పట్టుకొని, ఏకాయెకీని విఠలాపురం బయల్దేరాడు.

అప్పటి కప్పుడే సూర్యోదయమయి బారెడు పొద్దెక్కింది. అగ్రహారీకులు

"చాలా కాలానికి దయచేశారు శాస్త్రిగారు" అని కొందరూ, అగ్రహారం మీద శాస్త్రిగారు మరీ శీతకన్నేశారు" అని మరి కొందరూ, "మమ్మల్ని మరిచే పోయారు—శాస్త్రిగారు" అని ఇంకో కొందరూ, బహు కాల దర్శనం—క్షేమమా?" అని మరి కొంత మందీ – ఇట్లా అనేక రకాలుగా పలకరిస్తూ శాస్త్రి గారి ఇంటి ముందర జనం మూగారు. ఇంతలో నాయుడు వచ్చి – "సాష్టాంగ దండాలు" అని శాస్త్రికి దణ్ణం పెట్టాడు.

"దీర్ఘాయుష్మ మస్తు. వంశాభివృద్ధిరస్తు. ఐశ్వర్యాభివృద్ధిరస్తు" అని శాస్త్రి దీవించి, చాప తెప్పించి వీధి అరుగు మీద వేయించి నాయుణ్ణి కూచో మన్నాడు.

చాలా కాలానికి మామీద దయ వచ్చిందే శాస్త్రి గారికి—" అని నాయుడు కుశల ప్రశ్న చేసి ఏదో అనబోతూ ఉండగా, లోపల కుత కుతలాడే శాస్త్రి ఇక భరించుకోలేక, వెంటనే "విన్నాను. కథ యావత్తూ విన్నాను. ఈ తాగుబోతు గాళ్ళు నీకు చేసిన అపకారం అంతా చెవి కొచ్చింది. అబ్బా! ఎంత గండం తప్పింది నాయుడూ! నిష్కారణంగా వీళ్ళ చేతుల్లో నీ ప్రాణాలు పోయిఉండేది. ఎంత పని జరిగింది? ఇట్లా జరిగిందని ఓ కార్డు ముక్కైనా రాశావు కావు. మావాడూ రాశాడు కాదు—" అని నాయుడికి కలిగిన ఆపదకు తన సానుభూతి చూపిస్తూ ఆదరణ మొదలు పెట్టాడు.

"మీకు వ్రాద్దామనుకొంటూనే సుస్తీ చేశాను. ఇంతకూ భగవంతుడు చల్లంగా చూడాలె కాని – వీళ్ళవల్ల ఏమవుతుందీ వెధవలు?"

"నిజమే! ఇంకా వీళ్ళని ముక్కలు ముక్కలుగా తరిగి ఉప్పు పాతర వేయకుండా ఊరుకొన్నావా నాయుడూ?"

"అయితే అంత పనీ చేయకుండా విడిచిపెట్టేనా ఏమిటి? ఒక్కొక్కడికి మూడేసేళ్ళు వేయించి వంద మందినీ నెల్లూరు జైలుకు పంపించాను. తమరు వినలేదూ?"

"ఎంత చేసి ఏం ఉపయోగం? మళ్ళా కథ అంతా మొదటికొచ్చింది. విన్నావో లేదో! జమీందారు వంటివాడివి నిన్నే లెఖచేయని ఈ మాల మాదిగలు మాబోటి వాళ్ళని లక్ష్యపెట్టుతారా? సేతుహిమాచల పర్యంతమూ తిరిగివచ్చాను కాని ఇంత పరాభవం ఎక్కడా పొందలేదు."

"ఏం జరిగిం దేమిటి?"

"అదుగో చూడు! అ బండి దగ్గర నిలబడ్డాడు వాడు శుద్ధ మాలాడు. నిన్న గాక మొన్న నూరు మందికి శిక్ష వేయించావు కదా నువ్వు, వీడు భయ

శక్తులు లేకుండా నన్ను పుంజూరు నుంచి విఠలాపురానికి బండిలో ఎక్కించు కొస్తాడు? వీణ్ణి ఏం చేస్తే పాపం ఉందీ?"

"మాలవాడా వీడు?"

బండివాడు పలకలేదు.

శాస్త్రి వాడికేసి చూస్తూ "ఛీ! జవాబు చెప్పకుండా నిలబడతావు. ఆ నోటి మీద వాతలు వేయిస్తా చూడు! రాత్రి తెల్లవార్లూ, ఈ నాయుణ్ని నోటికి వచ్చి నట్లు దూషిస్తూ మాట్లాడావే! ఇప్పుడేమైందా నోరు?"

"దవడ పళ్లు రాలేటట్టు కొట్టక పోయినారా అట్లాంటి కూతలు కూసి నప్పుడూ? ఈ వొంటెద్దుబళ్ళ వాళ్ళని ఏం చేసినా పాపం లేదు" అన్నాడు నాయుడు.

బండివాడు గడ గడ వణకిపోతున్నాడు.

"నే నెవరని నీ బండిలో ఎక్కించుకు వచ్చావురా నువ్వు? మాదిగ వాణ్ణనుకొన్నావా? మాలవాణ్ణనుకొన్నావా? మనిషిని గమనించి మరీ బండి కట్ట వనిలె."

"నాకేం తెలుసు సామీ! తమరు బ్రాహ్మలని?" అన్నాడు బండివాడు.

"అయితే బ్రాహ్మడెవడో మాలవా డెవడో కూడా తెలియకుండా కళ్ళకు కావరం ఎక్కి ఉన్నావన్న మాట" అన్నాడు నాయుడు.

"అర్ధరాత్రి నేను మనిషిని గుర్తించలేకపోయాను బాబుగారూ!" అన్నాడు బండివాడు.

"అసలు నిన్ను బాడుగ బండి పెట్టుకోమని ఎవరు చెప్పారు? నీ తాతనా డెరుగుదువా, నీ ముత్తాతనా డెరుగుదువా, నువ్వు బండెక్కి? చెప్పరానివాడు తన కుల వృత్తి మాని ఇంకో వృత్తి చేసుకోవచ్చునని ఎక్కడ ఉందో చెప్పరా? తెలియక ఒకవేళ నా బోటివాడు బండి కట్టమంటే మాత్రం, అమైన వర్ణాశ్రమ ధర్మాలు నాశనం చేయడానికి సరేనని తయారవుతావా? 'నేను చెప్పరాని వాణ్ణి సామీ!' అని చెప్పనక్కర్లే?" అని వెంకటశాస్త్రి పండ్లు పట పట కొరుకుతూ పరవళ్లు తొక్కుతున్నాడు.

"చెప్పుతో మాదు పగలగొట్టండి వెధవను. మదం అణుగుతుంది" అన్నాడు నాయుడు.

"తెలియక చేశాను సామీ!" అన్నాడు బండివాడు.

"ఛీ! మళ్లా ఆ కూతే కూస్తావు. తెలియదంటే నే నమ్ముతానా? పదేళ్లుగా రక్త మాంసాలు వొడ్చి చదువుకొన్న శాస్త్రం అంతా తగలడిపోయిందే, కాశీ

సమారాధన చేసుకొందామని కష్టపడి గంగ తెచ్చుకొన్నాను — అంతా నాశనం చేశాడు వీడు."

"వీడి కన్నీ తెలుసు — ఇట్లాంటి పని చేయవు కదా అని పందబెట్టి పట్టకారతో రెండు గుడ్లూ ఒత్తిస్తే రోగం కుదురును. — అబ్బబ్బ! నా కేసులో ఆ తురకవాళ్ళు, వీళ్ళు చేరి నా గడ్డి నాకు పెట్టారు శాస్తుర్లూ! ఈ వంద మంది మీదా కేసు రుజువు చేయించి, జైలుకు వేయించేవరకు బోలెడంతయింది నాకు. ఎవరు తిన్నట్టు చెప్పండి? మీబోటి బ్రాహ్మడి కిచ్చినా దీపం పెట్టుకొని తలచుకొనేవారు. ఆ జడ్జి ధర్మప్రభువు కాబట్టి వీళ్ళెన్ని కూతలు కూసినా మనవాడనే నమ్మి శిక్ష వేశాడు" అన్నాడు నాయుడు.

ఇంతలో అక్కడ చేరిన అగ్రహారీకులందరూ తలా ఒక బడితె చేత పట్టుకొని తలొకమాట అందుకొన్నారు.

నాయుడికి వేడెక్కింది; కేసు అయింది లగాయతు ఒంటెద్దుబండివాడంటే అసలే మండిపడుతున్నాడు నాయుడు.

"అయితే వీడికేం శిక్ష చెప్పారు వెంకటశాస్త్రిగారూ" అని ఆ వేడిమీద అడిగాడు నాయుడు.

"ఛండాలుణ్ణి తాకితే, బ్రాహ్మడు ఒళ్ళు తెగ్గాల్చుకొంటేగాని ఆ పాపం పద్నాలుగు జన్మాలదాకా పోదని శాస్త్రం. నాకు కావలసిన ప్రాయశ్చిత్తం వీడికి శిక్ష—" అన్నాడు శాస్త్రి.

నాయుడు వెంటనే ఇద్దరు మనుషుల్ని పిలిచి, బండివాణ్ణి పశువుల దొడ్లో పగ్గాలతో గుంజకు కట్టించాడు. గంపెడు పిడకలు దాలి చేయించి, బొటనవేలు లావు ఇనపకర్రు అగ్నిహోత్రంలో పెట్టించి చేటలతో విసిరిస్తున్నాడు.

బండివాడు ఒక విపరీతమైన స్థితిలో పడ్డాడు. చినికి చినికి గాలివాన అయింది వ్యవహారం. ఇట్లా జరుగునని తాను కలలోకూడా అనుకోలేదు. వెయ్యి పెద్దపులుల్లో ఒక్క లేడిపిల్ల! ఇంతమంది అగ్రహారీకుల్ని తానొకడూ ఎట్లా ఎదుర్కొగలడు? ఎవరితో మొరపెట్టుకొంటాడు? తాను చేసిన తప్పేమిటో అర్థం గాకుండా ఉంది బండివాడికి. ఇక తన చావు నిజమని స్థిరపర్చుకొన్నాడు వాడు. నోటివెంబడి మాట రావడం లేదు. గొంతుకు ఎండిపోతున్నది. దాహమవుతున్నది: ఒంటేలుకు పోవలసిన అవసరంగా ఉన్నది. కాని కాలూ చెయ్యీ కదపడానికి వీల్లేని స్థితిలో ఉన్నాడు. తన కళ్ళ ఎదుట నల్లని ఇనపకర్రు ఎర్రబడుతోంది. ఉత్తరక్షణం తలుచుకొంటే గుండె నీరయిపోతోంది. "ఎంత పాపం చేసికొన్నానోగదా భగవంతుడా! నాకు నిష్కారణంగా ఇంత శిక్ష ఏల విధిస్తున్నావో నారాయణమూర్తి తండ్రీ" అని లోపల దుఃఖిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

ఇంతలో వెంకటశాస్త్రి నాయుణ్ణి చాటుకు పిలిచి "నాయుడూ! మనం చేసేపని పైకి పొక్కితే, ఆ పోలీసువాళ్ళవల్ల తంటా రాదుగదా! కాస్త ఆలోచించు నువ్వుకూడా!" అన్నాడు.

"అంత పిచ్చిపని చేస్తాననుకొన్నావా శాస్తుర్లూ. పోలీసులు మనం కూర్చోమంటే కూర్చోవాలె, నుంచోమంటే నుంచోవాలె!" అని ధైర్యం చెప్పాడు నాయుడు.

"అయితే తొందరగా కానీ" అని వెంకటశాస్త్రి ఉత్తర్వు ఇచ్చాడు.

కఱ్ఱు ఎఱ్ఱబడిందో లేదో చూడమన్నాడు నాయుడు.

పోలయ్య కొంచెం వ్యక్తిగలమనిషి: కొంచెం చదువుకొన్నవాడు కూడాను. చిన్నతనంనుండీ పట్నవాసంలో పుట్టిపెరిగిన మనిషి. మంచీ, శబ్బరా, దేశకాల పరిస్థితులూ కాస్త తెలుసుకొన్నవాడు. కళ్ళు మూసుకొన్న కొంతసేపటికొక ఆలోచన తట్టింది అతగాడికి. "చచ్చేవాళ్ళం ఎట్లాగా చస్తాం. అబద్ధమైతే అయింది. ఈదారి తొక్కి ఒక దొంగెత్తువేదాం. నారాయణమూర్తి సాయపడక పోతాడా?" అని నిశ్చయపర్చుకొని, మొండి ధైర్యం తెచ్చుకొని, నాయుణ్ణీ, శాస్త్రినీ ఉద్దేశించి.

"నన్ను మీరీ ప్రకారం హింసిస్తున్నారు. నేను చచ్చినా, బ్రతికినా ఈ విషయం పైకి పొక్కక మానదు. మా పాదిరీ దొరగారికి ఈ సంగతి తెలిస్తే, మీరు ఇంతకింతా అనుభవిస్తారు: మీరే బలవంతులని అనుకోకండి. మేము మీ మతం విడిచి క్రయిస్తవ మతం తీసుకొన్నాకూడా మీరీ ప్రకారం మమ్మల్ని ఏడిపించడం మా ఏసుప్రభువు గమనిస్తూనే ఉన్నాడు" అని పెద్దగా వెర్రిఅరుపు అరుస్తూ కేకపెట్టాడు.

బండివాడి నోటినుండి ఈ మాటలు వినవచ్చేవరకు, శాస్త్రీ, నాయుడూ ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు. "ఇదేమిటి మతం తీసుకొన్నానంటున్నాడు" అని ఇద్దరూ కొంత తటపటాయించారు.

"నువ్వు క్రయిస్తవుడవా?" అని శాస్త్రి అడిగాడు.

"అవును. మా తాత తన హయాంలో మతం పుచ్చుకొన్నాడు" అని బింకంగా జవాబు చెప్పాడు.

"నీ పేరు?"

"పౌలయ్య."

"బండిలో చెప్పడంలో నీపేరు పోలయ్య అని చెప్పావే!"

"లేదు; పౌలయ్యనే చెప్పాను."

"నీ తండ్రి పేరు?"

"జకరయ్య."

వెంటనే కట్టినకట్లు విప్పమని నాయుడు ఉత్తర్వుచేసి, శాస్త్రీ, తనూ గడ్డివామి చాటుకు పోయారు.

వెం—రాత్రి చెప్పడంలో పోలయ్యా అని చెప్పాడయ్యా, దొంగవేషం వేస్తున్నాడేమో!

నా—మీరు పొరపాటుగా విని ఉంటారు; పౌలయ్యకు బదులు పోలయ్య అని మీకు వినిపించి ఉంటుంది. తల చూడండి, వాడికి క్రాసింగు కూడా ఉంది. సందేహంలేదు, వీడు క్రయిస్తవుడే!

వెం—క్రాసింగు కేం గాని క్రయిస్తవుడయితే కొంచెం ఆలోచించదగ్గదే.

నా—అమ్మా! ఇంకా నెమ్మదిగా అంటున్నారా? ఈ పాదరీలకీ, సర్కారు వారికీ చాలా దోస్తి ఉంటుందండీ! వాళ్లు పట్టుపట్టారంటే సీమదాకా కూడా వెళ్ళి తగవులాడుతారు. అంతవర కొచ్చేవరకు ఎంత డబ్బిచ్చినా ఈ పోలీసులు మన ములాజా ఏమీ ఉంచకుండా తోసిరాజంటారు మనల్ని; కాబట్టి తొందర పడగూడదు.

వెం—సరే! అట్లాగే నీ ఇష్టప్రకారమే కానీ! అతిసర్వత్రవర్జయేత్తన్నాడు శాస్త్రకారుడు అదీగాక, నిజంగా వీడు క్రయిస్తవుడే అయితే మనకంత పట్టింపు లేనేలేదు. మన ప్రభువుల మతం అదే అయినపుడు, ఆ మతాన్ని నిందిస్తే ప్రభువుని నిందించినట్లే! "నావిష్ణుః పృథ్వీపతిః"; కాబట్టి రాజు అవలంబించిన మతంలో కూడా విష్ణ్వంశ ఉండితీరుతుంది. మన మతంలోనేకాని, వాళ్ళ మతంలో చండాలురంటూ లేనేలేరు. కాని ఎటువచ్చి నా సందేహం ఏమంటే, వీడు నిజంగా క్రయిస్తవుడేనా అని?

నా—అయినా కాకపోయినా, ఈ విషయంలో మట్టుకు మనం తగ్గడమే శ్రేయం. ఏమో! ఏపుట్టలో ఏ పాముందో! వాడు ఉత్తరాది తెనాలంటున్నాడు. అక్కడ వాడికేం ప్రాపకముందో, ఎవడు చూడొచ్చాడు?

వెం—అవును. వాడింకా మంచివాడు కాబట్టే ఇంతదూరం ఊరుకొన్నాడు.

అని శాస్త్రి తృప్తిపడి మళ్ళా బండివాడి కంటబడకుండా సందుదారిన దొడ్లో దూరాడు. నాయుడు పౌలయ్యకు కట్టిన కట్లు విప్పించి, ఇంటికి తీసుకొని పోయి రు 3-0-0 చేతిలో పెట్టి అన్నం పెట్టించి ఇంటికి పంపివేశాడు.

* [భారతి, 1937] *

# పాకీది

అనిశెట్టి
సుబ్బారావు

బడి గంట కొట్టగానే పిచ్చుకల్లాగా ఎగిరి పోతున్నారు పిల్లలు. సాయంత్రపు సూర్యుడు తడి మబ్బుల్లోంచి జారిపోతున్నాడు. బజారులో ఎర్రని పల్చని ఎండ ఇండ్లనీడలు సాచుతున్నది. పిల్లలు వీథితిరిగి ఇళ్ళవేపు మళ్లారు. పంతులుగారు సీనయ్య ఏపిల్లాణ్ణో పిలిచి శనగపప్పు నములుతూ సంచి చేత పట్టుకు రమ్మన్నా డింటివరకూ. కోటి గాడి మనస్సు నాగుతోనే వెడదామని పెనగులాడు తున్నది. బిక్క మొహంతో నాగుపై చెయ్యి తీసి ఆ కూరగాయల సంచి నెత్తుకున్నాడు కోటి.

నాగుకు పంతులుగారు సీనయ్యంటే మహా భయంగా వున్నా అతనిక్కూడా కోటితో ఎగు రుతూ పాడుతూ వెళ్ళాలనే.

"మాష్టారూ! మాష్టారూ! మా నాన్న నన్నూ ....కోటినీ .... తీసుకు రమ్మన్నాడండి .... ఏమం దోయ్!" అన్నాడు నాగు ప్రక్కగా చూస్తూ, ధైర్యం బిగబట్టి.

పంతులుగారు నాగు జేబులోంచి ఇంకో గుప్పెడు శనగపప్పు తీసి బొక్కుతూ "అరేయ్! నిజంగానా .... చెప్పు!" అన్నాడు. "ఐతే మీ నాన్నగా రూళ్ళోనే వున్నారూ! – పో వెధవ!" అని గదిమాడు కోటిని.

భారం తప్పిపోయిందంతే చాలని కోటీ,

నాగూ ఒక్క పెట్టున పరుగెత్తారు. ఇద్దరూ శనగపప్పు నములుతూ "జేబులో పోసుకున్నా తీసుకున్నాడ్రా!" అన్నారు పంతుల్ని గురించి.

"నా జేబులో కానీలన్నీ వీడి ముహాన్నే పెట్టా. లేకపోతే బిళ్ళంగోడు కొనుక్కునే వాణ్ణి!" అంటూ నవ్వుతూ మెడనున్న పుస్తకాల సంచీ సర్దుకున్నాడు నాగు.

కిళ్ళీకొట్టు దగ్గర్నుంచి నాగు ఇంటికి ఇంకో వీధి దూరం వెళ్ళాలి. కొట్టు దగ్గర సిగరెట్లంటించుకొంటూ టెన్నిసుకు వెళ్ళబోతున్నాడు నాగు తండ్రి భాస్కరరావు. సుందరయ్య దూరాన్నుంచే కనిపెట్టాడు నాగూ, కోటీ పరుగెత్తుకురావడం. సైకిల్ హాండిల్ వోరగా పట్టుకొని భాస్కరరావుతో "అడుగో రోయ్! మీవాడొస్తున్నాడు.... ఎప్పుడో వాణ్ణొకణ్ణెవణ్ణో ఎత్తుకొస్తాడు .... కోర్టుకు రమ్మనరాదూ .... ఈ వెధవ సరుకంతా వొదిలిపోతుంది. అటూ ఇటూ బంతులైనా ఎగరేస్తాడు," అన్నాడు. నాగు తండ్రి తల ఎత్తి చూసేప్పటికే సుందరయ్య పిలుస్తున్నాడు: "ఓహోహో! మిస్టర్ నాగూ! హలో .... హలో....ఇట్రా వోయ్!" నాగు చిరునవ్వు నవ్వుకుంటూ రాగానే సుందరయ్య ఒళ్లోకి లాక్కున్నాడు. ముద్దు ముద్దుగా మాటలు చెబుతూ "ఏమోయ్! బళ్ళో ఇవ్వాళెన్ని తన్నులు తిన్నావ్? మీ నాన్నేమీ అనడులే, చెప్పు....నేనున్నానుగా—భాస్కరం! వీణ్ణేమనాకు, చెబుతాడెన్ని తన్నులు తిన్నాడో" అని నాగును సీటుపై కెక్కించి క్రాపు దువ్వుతున్నాడు మెల్లగా. కోటి సైకిల్ కారేజీ పట్టుకొని నవ్వుతూ "చెప్పరా!" అన్నాడు మృదువుగా. సుందరయ్య కోటిగాడి వంక చూచాడు. ఏవగించుకొంటూ అన్నాడు:

"నాగూ! వీణ్ణెవణ్ణో రోజూ వెంటేసుకొస్తావేం? వెధవలందరూ—భాస్కరావరేయ్! మీ వాణ్ణి జాగ్రత చెయ్యాల్సిందే ఇక .... ఇప్పట్నించే ఆఫీసర్ల ఫాయీలో తిప్పితే గాని ఆ కళ పడదసలు!"

భాస్కరరావు ఆ కుర్రాణ్ణి పరికించి చూచాడు.

"వీడెవడో తెలుసా?" అన్నాడు సుందరయ్య కోటిని చూచి అసహ్యించుకొంటూ.

కోటిగాడు చిన్నబోయాడు, మనస్సు కుంచించుకుని, తల వంచుకొని తాకుతున్న సైకిల్ కారేజీ వదిలేసి మెల్లగా గోడ ప్రక్కగా వెళ్ళి నుంచున్నాడు నాగు కోసమని. సుందరయ్య చొక్కా గుండీలు మెలిపెడుతుం నాగు దీన్ని గమనించనైనా లేదు. భాస్కరరావు పిప్పరమెంట్లు కొని జేబులో పోశాడు.

"మీ నాన్న హెడ్ క్లార్కవుతే నువ్వు తాసీల్దారువౌదువుగాని" అంటూ సుందరయ్య క్రిందికి దింపాడు.

"వస్తావా నాన్నా!" అన్నాడు వెనుకనుంచి భాస్కరరావు.

వినిపించుకోకుండా, "ఊహూ!" అంటూనే కోటి వద్దకు పరుగెత్తాడు. కోటి ఇంతవరకూ కిల్లీ కొట్టు దగ్గర భాస్కరరావు, సుందరయ్యలవేపే చూస్తున్నాడు. ఇగిరిపోయే జలవలె అతని మనస్సులో సంతోషం ఇంకిపోయింది. ఇద్దరూ నాగూ ఇంటివరకూ వచ్చేటప్పుడు ఏమీ చెప్పుకోలేదు. నాగు పిప్పరమెంట్లు తీసి ఇస్తున్నాడు. అందుకొంటున్నాడు కోటి.

మెట్లెక్కుతూ "కోటీ! మా ఇంట్లో కూచుందాం రారా!" అన్నాడు.

"చీకటి పడుతున్నదిగా, మా ఇంటి దగ్గర దీపాలుండవ్."

"లేకపోతే ఎట్లా? మా ఇంట్లో బొమ్మలు చూద్దువు రారా" అని చెయ్యి పట్టుకున్నాడు నాగు.

"ఉహూహూ! వద్దురా .... మా అమ్మ వద్దన్నది.... ఏ ఇంట్లోకి పోవద్దన్నది."

"ఏం?" అంటూ నాగూ నవ్వుతూ మెట్లెక్కి వెళ్ళిపొయ్యాడు.

"తాయం!" అని పిప్పరమెంట్లు నోట్లో విసురుకుంటూ, గంతేసి పరుగు తీశాడు కోటి.

## 2

రైలు రోడ్డు నానుకొని వాలిపొయ్యే పొలాల్లో పాకీవాళ్ళ గుడిసెల కుప్ప వున్నది. క్రిక్కిరిసి, ఒకదానిపై ఒకటి విరుచుకుపడుతూ ఇప్పుడో ఎప్పుడో కూలిపోబోతున్నా యన్నట్లు, సగాలు విరిగిన ఆ గోడల్లోనే గేదెల అరుపులు, దూడల రొచ్చు! మురికి పిల్లలు ఆ బురదలోనే పాకీ డబ్బాలు మోగిస్తూ ఆడుకుంటున్నారు. ముసలమ్మలు మూల్గుతూ వూస్తూ పొగాకు కాలుస్తుంటారు. వూరివారంతా ఆ ప్రాంతాలకే బహిర్దేశానికి వెడతారు. అనవసరంగా పొలాల్లోనికి వెళ్ళేవారు ముక్కులు బిగించుకొని కళ్లైనా ఎత్తరు. పగటిరైలు పొగ క్రక్కుతూ వెళ్ళేది ఆ కుళ్ళు కొంపల మీదనే, రాత్రి రైలు రవ్వలు చిమ్మేదీ వాటిపైనే.

సందె చీకటి క్రమ్ముకొస్తున్నప్పుడు మాచి ఇళ్ళల్లో నుంచి వంగి వంగి బయటి గట్టు మీదికి వచ్చింది. చూసీ చూడక ముందే గొల్లుమన్నది. మళ్ళీ వాడొచ్చాడు. పాకీ డబ్బా అటు పడేసి తూలిపోతూ ఇంటికి ఉరుకుతున్న కోటి రెక్క పట్టుకు లాగుతున్నాడు.

"ఏయ్! ఏయ్! నీకు చదువేంట్రా? .... నీ బండ చదువు .... లే పైకి, చేతిలో జారి పోతావేం.... డబ్బా ఎత్తుకో! వూళ్ళో కెళ్ళిరా పో.... నేను పోలేను. ఎప్పుడూ నేనేనా .... నేను పెద్దవాణ్నోయ్ కుంకా!"

కోటి పోనీకిపోతూ కెవ్వుమని కేకవేసి "అమ్మా" అన్నాడు. మాచి వెతగా

పరుగెత్తి వచ్చింది. దానికి మొదట్నుంచీ ఆ భయమే! అందుకే గట్టు మీదికి వచ్చి కాచుకు చూస్తుంటుంది ప్రతి సాయంత్రమూ ఆతురతతో. దాని కడుపులో మంట వున్నది. అది పాకీ పనిలో కాలం వెళ్ళబుచ్చింది. యౌవనంలో విచ్చల విడిగా సంచరించి భర్తకు కాకపోయింది. భర్త త్రాగుతూ, తిరుగుతూ సుడిగాలి వలె బ్రతికాడు. చివరిదశలో క్షయతో మందైనా పోసుకోలేక ఆ మురుగుడులోనే ప్రాణం విడుస్తూ, మాచి చెయ్యిపట్టుకు వేడుకున్నాడు: "మనం చూస్తున్నావు గదా.... ఉన్న ఒక్కణ్ణీ ఈ గూడెంలో ఎదిగించి డబ్బా చేతికిస్తావా?.... ఊపిరి పోయేటప్పుడైనా నన్ను చూడొచ్చావు .... వాణ్ణిక్కడ వుంచితే నీ కదీ ప్రాప్తం వుండదు!" ఆనాటి నుంచి కోర్కెగా వున్న ప్రతిజ్ఞ కడుపు దహించింది మాచికి.

పొరపాటున కలిసినప్పు డెప్పుడూ పినతండ్రి కోటిరెక్క పట్టుకోక వదల్లేదు: మాచి కోటిని పినతండ్రి చేయివదిలించి వెనుక దాచుకొని దీనమూర్తి అయింది.

"ఏం నాయనా! మీ అన్న చెప్పలా? మావాణ్ణెందుకు పుటమారుస్తావు.... నాలుగేళ్లు పోతే నువ్వు మాత్రం కర్రం పట్టవూ? ఉన్నప్పుడే ఏం వూగినా...." అని కళ్ళు తుడుచుకున్నది.

మాచి పిల్లాణ్ణి బడికి పంపుతున్నదంటే పాకీ గూడెంలో పిల్లకూ పిట్టకూ కన్నెర్ర. ఎత్తిపొడుస్తూ, వెక్కిరిస్తూ ఇరుగుపొరుగులంతా వీళ్ళను ఒంటరితనం లోనికి తరిమారు.

పినతండ్రి వూగుతూ దగ్గరగా వచ్చి డబ్బా ఒకసారి తన్ని "మాచీ! చిన్నప్పుడు నువ్వెంత సోగ్గా యేసం యేసేదానివే.... ఇప్పుడంతా ఐపోయిందిలే- ఒరేయ్! ఒర్, నిన్నే! దాక్కుంటే ఎట్లా, డబ్బా పట్టుకుపో వూళ్ళోకి ... పలకా పుస్తకా లిటియ్ బళ్లోకెళ్ళాలి!" మాచి జాగ్రత్తగా అతన్ని తప్పించుకు నడిచింది. డబ్బా ఎత్తుకొని ఏవేవో గొణుక్కుంటూ సందులో దూరాడతను.

మురికి గుడ్డనే నీళ్ళల్లో ముంచి ఒళ్ళంతా తుడిచింది మాచి. బైట పది అంగల దూరంలో మసగ్గా వెలుగుతున్న వీధి లాంతరు వద్దకు చేరింది కోటిని చంక నెత్తుకొని, మూకుడులో ముద్దలు కలిపి పెడుతూంటే అన్నాడు కోటి:

"దిగుతాలే అమ్మా!" నేలపైకి దించమని.

"మాకన్నా! వొద్దులేయ్యా! బళ్ళోకి వెళ్ళేప్పుడూ వచ్చేప్పుడూ ఏంపరుగు తీస్తావో! జాగ్రతయ్యా! అటూ ఇటూ పరకాయించి రోడ్డు దాటు."

"ఏం నాగూ, నేనూ ఒక్కసారే వస్తాం! బండీ లేదూ భయమూ లేదు.... ఒక్క పరుగు పెడ్తే నాగు గారి మేడ మెట్ల దగ్గరి కొచ్చి పడతాం!"

"బంగారు చిలకవు నీకేం .... నాగూ ఎవరు కన్నా?"

"ఎవరంటే! మే మిద్దరమూ ఒకదేగా! ఇదిగో పిప్పరమెంటు వాళ్ళ నాన్న వాడి జేబులో పోస్తే ఇద్దరం తిన్నాం...." తీసి, విరిగి మిగిలినది తల్లి పెదవుల్లోని కదిమాడు. తిరిగి అందుకున్నాడు. ఒక్క పెద్ద నవ్వు నవ్వి "మాష్టారంటే నాగూకు భయమే లేదే .... నన్ను సంచి ఎత్తుకు రమ్మంటే 'మా నాన్నగారు కోటిని పిల్చుకు రమ్మన్నా' రన్నాడు. ఇద్దరం వుడాయించాం."

మాచి ఆనందపడ్డది. స్మితం చేసింది. "ఐతే పెద్ద పెద్ద సేయితాలు కుదుర్చు కుంటున్నావన్న మాట." సంతోషం పట్టలేక కోటి ఒళ్ళంతా ముద్దు పెట్టుకున్నది. ఒద్దంటున్నకొద్దీ ముద్దలు నోటిలో తురిమింది.

ఇంట్లో పిల్లాణ్ణి దించి ఆ చీకటి గూళ్ళన్నీ ప్రమిదకోసం తడిమింది. కనిపించలేదు. "ఇక్కడే వుండు దీపం తెస్తా"నంటే బిక్కు బిక్కు మంటున్న దని, వుండలేనన్నాడు. వెంటపెట్టుకొని ప్రక్క సందులోనికి వంగి చూస్తే నలుగురెవరో 'పులి మేక' ఆటలో మునిగి వచ్చి మాటలు మాట్లాడుతున్నారు. ఈమె నెవ్వరూ గమనించలేదు. ఆ దీపం పీలువడనిదని పినతండ్రి సందులోనికి వచ్చింది. చిరిగిన చాప మీద రెండు ప్రమిదలూ దగ్గరగా చేర్చి ఏమిటో బాష నేర్పుతున్నాడు ఆ దీపాలకు. తల ఎత్తి చూచి గట్టిగా "ఊ" అన్నాడు. మాచి గుండె అదిరింది. అత నింకా మైకంలోనే వున్నాడు. ఇల్లు చేరి ఆ చీకట్లోనే నేలపైన కోటిని కడుపులో పెట్టుకు నిద్రపోయింది.

## 3

ఉదయం పది గంటల వేళకు భాస్కరరావుగారు ఆకుమడుపు లందు కొంటూ భార్యను "నాగ వచ్చాడా" అని అడుగుతున్నాడు. ఈలలు వేస్తూ దూకుళ్ళు పెడుతూ వస్తూనే వున్నాడు నాగు. భాస్కరరావుగారికి మెట్ల మీది నుంచి నాగు స్వరం వినిపించింది. "మధ్యాన్నం రారోయ్ కోటీ! ఇదిగో బలపం విసురుతున్నా అందుకో" — అతని మనస్సును కలచివేసింది ఆ పిలుపు. నాగు నవ్వుతూ ఇంట్లో పడగానే అతను భార్యను గదిమాడు: "మన నాగూ చూశావా, వెధవ పిల్ల లందరి స్నేహితమూ వీడూ .... వాణ్ణొకసారి భయపెట్టు."

ఆయన నాగును గమనించగా, ఎత్తుకోగా భార్య ఎరగ దింతవరకూ. ఆమెకు ఈ జాగ్రత కొత్తగా తోచింది. నాగు తనమీదేదో పిడుగు పడుతున్నట్టు గ్రహించి గదిలో కెళ్ళి ముడుక్కున్నాడు. ఆయన మళ్ళీ భార్యను గద్దించాడు: "వాణ్ణిటు పిలు ... మూగ మొద్దాలె నుంచుంటావేం?" భార్య ముహం కందింది. కేకవేసి పిలవగానే నాగు బెదురు చూపులు చూస్తూ ముందుకు వచ్చాడు. తల గుడ్డ చుట్టుకుంటూ భాస్కరరావుగారు అరిచాడు: "చెల్లితో ఇంకో ఆడుకో!

పరాయిపిల్లలతో మాట్లాట్టం చూశానా. ఒళ్ళూలిచేస్తా!" నాగు కంపించిపోతున్నాడు. అకస్మాత్తుగా పారిపోతే బావుండు ననుకున్నాడు, భాస్కరరావుగా రొక్కసారి నాగు వంక చూసి "నిన్నే! ఆ కోటితో తిరగడం మానెయ్యి." నాగు నిలవలేక పొయ్యాడు; పరుగెత్తలేక పొయ్యాడు. గాలికి లేచిపోతూ గిరిటీలు కొట్టే ఆకు లాగా వున్న దతని మనస్సు. వుండి వుండి బావురుమన్నాడు. తల్లి దగ్గరగా వచ్చి కావులించుకొని "మా నాయనే! ఏడుపెందుకు .... నీ యిష్టం వచ్చిన వాళ్ళతో తిరుగు" అని లాలిస్తూ వీపు చరిచింది. భాస్కరరావుగారు హుంక రించుకొంటూ మెట్లు దిగి ఆఫీసుకు వెళ్ళిపొయ్యాడు.

ఎప్పటివలెనే కోటీ, నాగూ వీరప్ప కొట్లోనే శనగపప్పు కొనుక్కుంటారు. ఒక్క జేబులోనే పోసుకు తింటారు. పరాయి పిల్లల్ని ఉడుకెత్తించడంలో ఇద్దరూ ఒకటి. పంతులుగారు సీనయ్యను బూకరిస్తారు ఒకే విధంగా ఇద్దరూను.

నాగు కోటితో కిల్లీకొట్టు వేపు నక్కి నక్కి చూస్తూ ఇంటి వేపు నడిచినా తండ్రి కంటబడ్డా డొకసారి. సుందరయ్య వేలుపెట్టి చూపుతున్నాడు గూడ. భాస్కరరావుగారు ఇంటికి ముక్కున తుపాను పెట్టుకువచ్చాడా రాత్రి. ఇల్లంతా దద్దరిల్లింది. తనని చేతితో ముద్దచేసి విసిరి పారేస్తాడేమో ననిపించింది నాగుకు.

మరునాటి ఉదయం నాగు బళ్ళో చిరునవ్వుతూ వచ్చి కోటి ప్రక్కన కూచోలేదు. దాచి వుంచిన చోటును చేత్తో చరుస్తూ రమ్మని తల వూపాడు కోటి. గమనించనట్లు దూరంగా తొలిగి వెళ్ళి కూచున్నాడు నాగు. పంతులుగారు సీనయ్య పాఠం ప్రారంభించాడు. లెఖలు దిద్దించుకోలే దిద్దరూ. వరుసనే పలకలు పిలుస్తూ "కోటీ, నాగూ మీ లెఖ లేవిరా?" అంటే కోటి తరువాత నాగు పలక అందివ్వలేదు. మొదట, నవ్వులేమో అనుకొని, కోటి, దూరంగా కూచున్న నాగు పైని రహస్యంగా చిన్న చిన్న రాళ్ళు విసిరేవాడు. ప్రతిగా నాగు మళ్ళీ వాటిని ఏరుకోలేదు. కోటి మనస్సు కారణం ప్రశ్నించుకొంటున్నది. ఎంత పెద్దగా పిలిచినా నాగు "ఊ" అంటూనే ఎటో చూసేవాడు.

సాయంత్రం బడి గంట విని భుజాలపైని చేతులు మెలిచి జోడుగా పరుగెత్తలేదు. పిల్లల గుంపులో అప్పుడే కలిసిపోతున్నాడు. కోటి పరిశీలించే లోపలే దూరమైనాడు. కోటి మనస్సు ఆతురపడుతున్నది. వెనుక నుంచి పిలుస్తూ పరుగెత్తుకొని వస్తే విననట్లు ముహం తిప్పుకొని వెళ్ళిపొయ్యాడు నాగు. కోటిని గుండెలో పొడిచినట్లయింది. లేత చీకటి ముసురుకుంటున్నప్పుడు మెల్లగా ఇంటి దారి నడిచాడు.

ఆ సాయంత్రం మళ్ళీ పినతండ్రి పట్టాలవద్ద నిలవేశాడు. "అఖు!" అన్నాడు.

తల్లి బైటికి వస్తూన్న సమయాన్నే కోటి "అమ్మో!" అని పరుగెత్తాడు. ఆ తొందరలో పుస్తకాలు క్రిందికి జారిపోయినై. పలక ముక్కలై ఫ్రేము వదిలించుకున్నది. మాచి కోటి నెత్తుకొని పినతండ్రిని సమీపిస్తున్నప్పటికే అతను వంగి పుస్తకా లొక్కొక్కటే పాకి డబ్బాలో విసిరి "వెధవ! చేజారిపోయ్యావ్.... నీ కర్మ చూసుకో.... నీ గతి చూసుకోరా .... నీకు చదువెందుకు" అంటూ పలక ముక్కలు లెక్కిస్తూ, తూలుతూ డబ్బా చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాడు.

నీళ్ళకు వెళ్ళే అమ్మలక్కలు కొంతమంది పరిహాసంగా "కోటిగాడి చదువెంతవరకొచ్చింది" అని ప్రశ్నించారు.

మాచిముహం నిమురుతూ, ఏడుస్తూ కోటి "పుస్తకాలు చూడవే డబ్బాలో వేశాడు ...చూడమ్మా! ఎట్లాగే! పలక ఎట్లా అమ్మా!" అంటున్నాడు ఎక్కిళ్ళు విడుస్తూ. మాచి క్రుంగిపోతున్నది. క్రొత్త చొక్కా కుట్టించుదామని నెలరోజుల నుంచీ చాకిర్లన్నీ చేసి, అన్నం కడుపులోనికి వెళ్ళనివ్వక మిగిల్చిన అణాలు మళ్ళీ ఎదురు చూసినై. తను పదిహేను రోజులనుంచి ఒంటిపూట వచ్చేడి మెతుకు నంజింది. ఆ కుళ్ళు సౌరంగాల్లో ఎవరికీ గోచరించకుండా కడుపు మాడ్చుకొని దాచుకున్నది. పినతండ్రి చేతలు, పొరుగువారి ఏవగింపు తనను మంటలమధ్య కట్టివేసినట్లున్నది. కోటి కళ్ళు కప్పుకొని ఏడుస్తున్నాడు. మాచి కళ్ళవెనుక నరాలు జిమ్ముమన్నాయి. నీరు పొర్లింది. కోటి కళ్ళు అద్దుతూ ఇంట్లోకి తీసుకుపోతూ "దాన్దేమిలే!" అన్నది.

ఆరాత్రి మళ్ళీ మసక వెలుతురు లాంతరు వద్దకు ఎత్తుకొని వచ్చి, అన్నం ముద్దలు చేస్తూ "రేపు మీ నాగును అడుగు నాయనా నాలుగునాళ్ళ పుస్తకం చూపించమని....నే నింతలో కొనిస్తానుగా....నాలుగునాళ్ళే" దీనంగా, మెల్లగా అన్నది.

కోటి తల్లిని గట్టిగా కావలించుకున్నాడు. నాగు మెట్లెక్కి వెడుతూ ముహం తిప్పుకోవడం మళ్ళీ అనుభవిస్తున్నాడు.

"పలక గూడా అడుగుతావా" అన్నది తల్లి.

కోటి గొంతులో మాటలు ఏడుపు రాచుకొంటున్నై. "అమ్మా!" అని భోరుమన్నాడు. తల్లి నివ్వెరపోయింది. సముదాయిస్తూ ప్రశ్నిస్తే, నాగు పలకడట. మాచి చేతిలోని ముద్ద రాలిపడి మెతుకులై పోయింది. చేరవస్తున్నట్లున్న దూరపు దీపం దూరమే సాగిపోతున్నట్లనిపించింది. మాచి బ్రతిమలాడినా కోటి అన్నం ముట్టలేదు.

"నాగుతో ఎట్లా మాట్లాడేది...."

"నాగూ, నేనూ కలిసి తిరిగే వాళ్ళమే అమ్మా."

"వాళ్ళ నాన్నను చూస్తే నాకెందుకో భయమే...."

"నాగు ఎంత మంచివాడనుకున్నావ్...." అని వెక్కిళ్లు పెట్టాడు. తల్లి ఇంట్లోకి వంగబోతున్నప్పుడు పినతండ్రి దీపం ఎత్తుకుపోతూ ఎదురైనాడు. మాచి భుజంమీదే కోటి నిద్రపొయ్యాడు. కోటిచుట్టూ చెయ్యిచుట్టి ఆ చీకట్లో చాపమీద కళ్ళు తెరిచేవుంది మాచి.

భర్త తన ఇంటిచుట్టూ, ఇంట్లోనూ తిరుగుతూ "జాగ్రత్త! జాగ్రత్త!" అని హెచ్చరిస్తున్నట్లున్నది. రాత్రంతా తమ జీవితాలకు పశ్చాత్తాపంగా ఆడింది గుండె. గుడిసెల్లో పొగలాగా వెలువడుతున్న శబ్దాలూ, తనను సూటిగా గ్రుచ్చుకునే వెటకారాలూ వింటూ తెల్లవార్చుకున్నది.

## 4

కోటి పొడిచేతులతో బడికెడుతోంటే డబ్బాలెత్తుకొని వీధులకు చీలిపోతున్న కుర్రాళ్ళలో ఒకడు డబ్బా చేతి కందివ్వబోయినాడు. ప్రక్కగా తప్పుకున్నాడు కోటి. మాచి చూస్తూ "ఒరేయ్! ఏమమ్మా మిడిసిపడతావ్... నీ తమ్ముడనుకోలేవూ....అంత పొగరెందుకయ్యా!" అంటూండగానే మరో ఆమె చేతులూపుతూ వచ్చి "ఉస్సూ ఉస్సు! నువ్వేగాగ చదివిస్తున్నావని అందరూ పొగరుమోతులూ పోకిరీలూ ... నోరు చేసుకునేవు మర్యాదగాదు.... ఐనా ఏ మేడుస్తాడో చూద్దాముగా చదివి...." అంటూ రాచుకొంటూ నడిచింది. ప్రక్కనే చోద్యం చూస్తున్న కొందరు "ఊరుకుంటావేమే!" అన్నట్లు వుసిగొల్పారు. మాచి గొంతు మూసుకుపోయింది. లోపలికి వెళ్ళిపోయింది సరాసరి. బైట తిరిగే పొరుగమ్మలు "ఇంతేలే!" అన్నట్లు తలలు విసురుకొంటూ ఇళ్ళు దూరారు.

కోటి వాకిట్లోనే నాగువంక చూశాడు. ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తున్న నాగు లోపలికి అడుగు పెట్టగానే తల వంచుకున్నాడు. తన స్థలంలో కూచుని దిక్కులు చూస్తూంటే పంతులుగారు గద్దించాడు పలకా పుస్తకాల కోసం. "నాగూ! నీ పుస్తకం చూపించరాదూ....ఇటు రా" అన్నాడాయన. నాగు ప్రక్కకు చేరక తప్పలేదు. కూచోగానే భుజంమీద చెయి వుంచి నాగు ముహం వంక చూచాడు కోటి. నాగు నాళాల్లో నెత్తురు వుసిగా పరుగెత్తింది. కందిన ముహంతో కోటిపైకి వొత్తిగిలి భుజంమీద తల వాల్చాడు. కోటి నవ్వుతూ పుస్తకం తెరిచాడు.

బడివేళ కాగానే మళ్ళీ నాగు పిల్లలతో కలిసి వెళ్ళిపోతున్నాడు. కేక

వేస్తున్నా, చప్పట్లు చరుస్తున్నా, "ఓయ్!" అంటూనే దాటిపొయ్యాడు. కోటి పరుగెత్తుకొని వచ్చి పిలుస్తూంటే కిల్లికొట్టు దగ్గర సుందరయ్య నాగు బుగ్గలు పట్టుకు నవ్వులాడుతున్నాడు. కోటి బెరుకుగా చూస్తూ పుచ్చుకున్న నాగు పుస్తకం అక్కడే పెట్టేసి నిశ్శబ్దంగా దారివట్టాడు.

భాస్కరరావుగారు పళ్ళు ఒత్తిపట్టి అతను మలుపు తిరిగే వరకూ కళ్ళు గాలిలో పెట్టుకు చూచాడు.

మాచి ఆరాత్రి అన్నం పెడుతూన్నప్పుడు అన్నీ శ్రద్ధగా ఆకళింపు చేసుకున్నది. ఏదో విధంగా కోటిని సంతోషపెట్టి కృత్రిమ సంతృప్తి పొంద వలెనని వ్యర్థ ప్రయత్నం చేసింది.

"నాయనా! నాగుకూడా మంచివాడేరా....నీతో ఎందుకు మాట్లాడడూ.... ఏదో దూరదూరంగా వుంటున్నాడనేగానీ...." కోటి తల్లి ఒడిలో తలవుంచి నిద్రమంపులో "ఊ" అన్నాడు.

బైట ఎవరిదో లాంతరు నడిచిపోతూ, వెలుతురు వచ్చి మాచి ముడతలు తేరిన ముహంమీద క్షణం ఆడింది. ఆమె వేదనను కండ్లకు కట్టింది. నలిగిన కళ్ళలో వెలుతురు తడిగా మెరిసింది.

"రేపు పలకరించు నాయనా! సిగ్గుపడేవు....నాగు అంటే నీకెంతో యిష్టం గదూ....పలకరిస్తావా!"

కోటి కళ్ళు తెరిచి "సరేలేవే!" అంటూ ఒడిలోనే ప్రక్కకు ఒత్తిగిలాడు.

పడుకున్న మాచికి పూర్వజన్మ స్మృతులు మళ్ళీ జీవించాయి. తను విశృంఖలంగా మనస్సును పరుగెత్తించిన రోజులు తేరిచూస్తే ఇప్పుడీ చలిలో కూడా గుండె వడిగా కొట్టుకుంటున్నది. భర్తతో కలిసివున్నప్పుడు జీవితాన్ని జలపాతంవలె గడిపింది. గుడిసెల్లోని బంధువులంతా ఏదో పని వున్నట్లు వచ్చి ప్రేమగా మాట్లాడేవారు. రహస్యంగా తనను గూర్చే ప్రసంగించేవారు. భర్త చావు దాపురించే నాటికి పిల్లాడికి రెండో ఏడు. పంజరంలోని పావురాయిని చిత్రవధ చేసినట్లు తనను తాను ధ్వంసం చేసుకున్నాడు భర్త. అతను కంటి ముందు తిరిగినట్లే కనిపించింది. అతని బరువైన అడుగుల చప్పుడు వినిపిస్తున్నది. త్రాగివచ్చి గుడిసెల్లో అందరిపైనా తొడకొట్టడమూ, ఊరిలో ఎవరితోనో కయ్యానికి దిగి రక్తసిక్త వస్త్రాలతో రొజుకుంటూ వచ్చి ఇంట్లో పడటమూ దృశ్యాలుగా తోస్తున్నాయి. అవసాన సమయాన అతని మాటలు మళ్ళీ జ్ఞప్తికి వచ్చి కంపించింది.

"నాకోటీ! మాకన్న! మా అదృష్టం! అనుకొంటూ కోటిని గుండెకు ఒత్తుకొంటూ కన్ను మూసింది.

## 5

ఉదయం కోటి బళ్ళోకెళ్ళి నాగూను ఎప్పుడు పంతులుగారు దగ్గరగా రమ్మంటారా అని ఎదురు చూస్తున్నాడు. పంతులుగారు సీనయ్య లెక్కపలకలు దిద్దుతూనే "కోటీ!" అన్నాడు. కోటి లేచి నిలిచాడు. పంతులుగారు సీనయ్య కళ్ళజోడు పైకి లాగి తీరికగా చూస్తూ "దయచెయ్యొచ్చు!" అన్నాడు.

నాగు తల ఎత్తి చూచాడు.

మళ్ళీ ఆయన– "ఏమిరా! నీగ్గాదు చెప్పేది! పో...."

కోటి వొణికాడు. "ఏమిటండీ!"

"పో బైటికి....ఇక్కడెవరూ లేరు తేరగా పాఠాలు చెప్పేందుకు...."

నిష్కారణమైన ఈ కోపానికి కోటి అంతర్నాళాలు జలదరించాయి. వొణుకుతున్న చేతులతో కోటి గొణిగాడు: "నాగు దగ్గర చూస్తానంది పాఠం. ఇవా శొక్కరోజేనండి.... పుస్తకాలు రేపు తెచ్చుకుంటానండి."

కుర్చీ మీదినుంచి కాళ్ళు క్రిందికి దించి — "మా అయ్యగాని, ముందు బైటికి నడు .... రేపణ్ణుంచీ బడికి రానక్కర్లేదు .... తెలిసిందా....హాజరు పట్టీలో నీ పేరు కొట్టేశాం...."

కోటి ఇంకా నిలిచే వున్నాడు, నాగు వంక చూచాడు .... పంతులుగారి ముహంలో దీనికేమైనా కారణం స్ఫురిస్తుందేమోనని వెతికాడు.

"తెలిసిందా!" అన్నాడాయన పెద్దగా. "వెళ్లు....నాగుతో మాట్లాడావో, ఒళ్లు చీలుస్తాను జాగ్రత!"

నిర్విణ్ణుడై, వినమ్రుడై నుంచున్నాడు కోటి. క్లాసులో పిల్లలంతా పలకలు దిద్దడం, బలపాలు చాదడం మాని కోటి వంక చూస్తున్నారు.

పంతులుగారు సీనయ్య విశ్రాంతి తీసుకునే కొన్ని నిముసాలు ఉదాసీనత వహించాడు. "నిన్నేరా అబ్బాయి, పో; తర్వాత భాస్కరరావుగా రూరుకోరు."

కోటి మెల్లగా చెప్పుకున్నాడు: "పొమ్మంటారా?"

"ఆహా!" అని నవ్వాడు పంతులుగారు.

నాగు వంక చూస్తూ కోటి వాకిలి దాటి బైటికి వస్తున్నప్పుడు పిల్లలంతా అతని వంకనే చూస్తున్నారు. నాగు ఊపిరి బిగబట్టి తల వంచుకొని చదివిన పంక్తినే తిరిగి తిరిగి చదువుతున్నాడు.

పది గంటల వేళ బజారంతా నిండుగా వుంది. పల్చని ఎండ చిక్కనై వెచ్చని గాలులు క్రక్కుతున్నది. గొడ్ల కాపరి ఆవుల్నీ, గేదెల్నీ తోలుకుపోతు న్నాడు. గంట విని పిల్లలంతా ఇళ్ళకు చీలిపోతున్నారు.

వాకిలి ప్రక్కగా ఒదుగుకొని కూచుని వున్నాడు కోటి. పిల్లలంతా వేలితో చూపుతూ, గుస గుస లాడుతూ వెడుతున్నారు. నాగు గడప దిగగానే కోటి "నాగూ!" అని పిలుస్తూ లేచాడు. నాగు తిరిగి చూచాడు. ఇప్పుడేమి చెయ్యాలి? నాగుకు తోచలేదు. నుంచున్నాడు. కోటి దీన వదనంతో సమీపిస్తున్నాడు. నాగు కదలడం ప్రారంభించి, వడివడిగా నడిచి, పరుగెత్తుతున్నాడు. కోటి "ఇదేమిటి?" అనుకున్నాడు.

"నాగూ! నాగూ! ఉండవోయ్" అని కేకలు వేస్తూ వెంబడించాడు. నాగు వీధి తిరిగి ఇంటి వేపు ఒక్క పరుగు తీశాడు. అందలేదు. అత నట్లా పరుగెత్తుతూ ఉండటానికి కారణం ఏమీ స్ఫురించలేదు తిరిగి వస్తున్న కోటికి. ఇంత సేపటి నుంచీ గడప బైట కనిపెట్టుకు కూచుంటే నాగు పిలుపు వింటూనే, "ఆ!" అంటూనే తప్పించుకున్నాడు. మలుపు తిరిగేటప్పుడు నాగు ఏడుస్తున్నట్టు స్పష్టంగా కనిపించింది. కలుసుకోవడానికి ప్రతిబంధకాన్ని నిర్మించుకొని కోటి మీది అనురాగం వల్లనే ఏడుస్తున్నాడని అతను గ్రహించలేదు.

కోటికి ఇంటికి ఒకే త్రోవ. ఎందుకో తెలియని బాధ ఒళ్ళంతా ఆవరించి వెక్కిళ్లు పెడుతూ, నాగు వెళ్ళిన దిక్కుగా చూస్తూ, చేతులు నులుముకొంటూ ఇంటికి వచ్చి ఆవురుమన్నాడు. త్రోవలో తల ఎత్తితే ఇదంతా కనిపెట్టివుండిన ఏదో దొంగ కన్ను పరిహసిస్తున్నట్లనిపించింది. పంతులుగారు సీనయ్య గద్దింపులకు మనస్సు దద్దరిల్లుతున్నది ఇంకా.

మాచి ఒక్కొక్క మాటా వింటూ క్రుంగిపోయింది. ఇరుగుపొరుగమ్మలు గోడల వెనుక చెవులు రిక్కించి వింటున్నారా అనుకున్నది. భర్త కడసారి చెప్తూ ఆమె చెయ్యి పట్టుకోవడం జ్ఞాపకానికి వచ్చింది, పంతులుగారు దేనికి వెళ్ళిపొమ్మంటాడు? ఎప్పటికీ ఎందుకు రావద్దంటాడు? మాచికి పాలుపోలేదు. కరవలేని పామును అందరూ త్రొక్కుతారు.

"నాగు ఏమన్నాడు నాయనా! మరి పంతులుగారితో చెప్పలేదూ .... నీ ప్రక్కనే కూచోలేదూ ఇవ్వాళ గూడా?"

కోటి తల దించి అన్నిటికీ "ఊహూ" అంటూ చినిగిన పమిట చెరగు కళ్ళకు కప్పుకున్నాడు.

"నీ కర్మ! నాగును పలకరించమని రాత్రి చెప్పలేదూ?"

"పలకరించానే!" స్వరం గాద్గదికమైనది.

"ఏమన్నాడు?"

"ఏముంది?"

"పో .... నీ కర్మ!" మాచి దిక్కుతోచని దుఃఖంలో విసుగు పడ్డది.

ఇరుగమ్మ ఎవ్వరో వచ్చి అప్పుడే కోటితో నవ్వులాడుతున్నది చదువును గురించి.

## 6

దూది ఒత్తులైన కాళ్ళను మెల్లగా ఈడ్చుకొంటూ మాచి స్వయంగా బడి వద్దకు వచ్చి చేరింది. సాయంత్రం గంట మ్రోగే వరకూ, తలుపు తెరుచుకున్న ప్రతీసారీ కష్టం మీద లేచి నుంచుంటూ, పంతులుగారు కాదని తెలియగానే కూలబడి ఎదురు చూస్తున్నది.

పిల్లలు బైటికి పొర్లివస్తూ మాచిని చూచి వెక్కిరిస్తూ, నవ్వుతూ వెళ్ళి పోతున్నారు. పంతులుగారు బెత్తం ఊపుతూ తలుపు తాళం వేస్తూండగానే మాచి చేతులు కలిపి "అయ్యా! ఓఅయ్యా! మీరేనయ్యా పంతులుగారు!" అన్నది బావిలో నుంచి మాట్లాడిన స్వరంతో. బావిలో పడ్డదానివలెనే.

"ఏం అన్నాడు.

"కోటి మావాడేనండీ!"

"ఓహో! తెలిసింది .... తెలిసింది. కోటి గదూ!.... లాభం లేదు....ఐనా వాడికి చదువెందుకే పిచ్చి ముండా...." చిరునవ్వు నవ్వాడు బెత్తాం గాలిలో విసురుతూ.

"ఏదో మావాణ్ణి గూడా గట్టున పడేద్దామని.... దయ వుంచండయ్యా...."

"దేముడే దయుంచాలి .... నా చెత కాదు .... ఆ భాస్కరరావుగారి నడుక్కోక పొయ్యావా, ఇక్కడ గొణక్కపోతే!"

"నాగుగారి తండ్రా?"

"ఎవరి తండ్రో....మా ప్రాణాలు తీస్తారు .... పో పోవే ఇప్పుడు మీవాడి సంగతీ నీ సంగతీనూ" పంతులుగారు సీనయ్య సాగిపోతున్నాడు.

"ఓ అయ్యా! భాస్కరరావయ్యగార్ని అడుక్కోమంటారా! ఐతే మీవల్ల కాదంటారా!"

వెనుకకు చూచాడు మాచి వంక. బెత్తం గిర్రున త్రిప్పాడు నేలమీద.

"పట్నాడగొడతాడు అయన్నడిగితే, తెలుసా? వెళ్ళు ముందు .... మీకు చదువు లెందుకే పిచ్చి ముండా!" నవ్వుతూనే అన్నాడు.

మాచి వెలిగించుకున్న దీపపు ఒత్తి క్రమంగా లోపలికి ముంచుకు పోతున్నది. వెలుగు సన్నగిలి దీపం రెప రెప లాడింది.

"ఐతే .... ఏం చెయ్యమంటారు .... ఏదైనా చెప్పండయ్యా!" సన్నగా దీనంగా, ప్రార్థనగా, అడిగింది.

ఆయన మాచిని సర్వవిధాలా అనుకరించాడు.

"ఏమంటారు" అన్నది మళ్ళీ.

"ప్రయోజనం లేదు పో .... పొరపాటున ఆయన దగ్గరికెళ్ళేవు....బ్రతికి ఇంటికి పోవు" బెత్తాంతో గాలికి గూడా అక్షరాలు నేర్పుతూ దారి తీశాడు.

మాచి తిరిగి, వచ్చిన త్రోవనే మెల్ల మెల్లగా కాళ్ళీడ్చుకొంటూ ఇల్లు చేరింది. క్రింద పడిపోతుందేమో అన్నట్లు ఒక చేతితో గుండె పట్టుకున్నది. త్రోవ పొడుగునా ఏమేమో గొణుగుకొంటున్నది. నెరిసీ నెరియనట్లు వెంట్రుకలలో వ్రేళ్ళు దూర్చి విసుగ్గా ఆడిస్తూ తనకు తెలియకుండానే ఇంటి వద్దకు వస్తున్నది.

ఇంటి బైట మసక వెలుతురు చిమ్ముతున్న లాంతరు ప్రక్కగా కాళ్ళలో తల దూర్చి కూచున్నాడు కోటి గట్టు మీద. మళ్ళీ పినతండ్రి తప్ప త్రాగి, వసి బట్టి కొన వూపిరితో వెంటబడ్డ త్రాచువలె లేస్తూ, పడుతూ, పాడుతూ, తూలుతూ వస్తున్నాడు. సరాసరి వచ్చి కోటి రెక్క పట్టుకు లాగుతూ – "పనిలోకి వెళ్ళ కుండా నిద్రపోతున్నావా కుంక .... ఇదిగో!" అని దబ్బా గట్టిగా నేల మీద కొడుతున్నాడు. "నేను పోలేను .... ఎవరు చేసి చస్తారీవని .... నీ అబ్బకంటె మిడిసిపడతావా ...." కోటి అతని కరకు చేతుల్లో మెలికలై తిరిగిపోతున్నాడు. "అమ్మా! అమ్మా!" అని ఏడుస్తున్నాడు.

మాచి గట్టుమీదికి వచ్చి ఏడుపు విని తల ఎత్తి చూచింది. రాతిలో కప్ప లాగా ఆమెలో బ్రతికిన భర్త కోరిక నిర్జీవమైపోతున్నది. ఆమెలో సహనం పూర్తిగా జారిపోయింది. మనస్సుకు ఇప్పటివరకూ పట్టిన గొడుగు వంటి ఆశ వికావికలై చినిగిపోయింది. చూస్తూనే, దగ్గరగా వచ్చి, నిశ్శబ్దంగా రెండోరెక్క పట్టుకొని, విడిపించుకుపోతూ "ఏం పోరాదూ?" అని వెగటుగా అన్నది. "మీ నాయనకంటె పొడుస్తావా నువ్వు!"

ప్రక్క ఇండ్లవాళ్ళు. గట్టు మీద నడిచేవాళ్లు ఆగి విన్నారు ఆశ్చర్యంగా. ఇళ్ళల్లోవారు నవ్వుకుంటూ బైటికి వచ్చి ఆగారు. బరువైన కొయ్యను మాదిరిగా కోటిని ఇంట్లోకి లాక్కుపోతూంటే అతను పెనవేసుకొని "అమ్మా!" అంటున్నాడు.

మాచి రెప్పలనిండా నీరు నిండింది. లోపల చాప మీద కోటిని పడవేసి తను పడుకొంటూ–

"ప్రొద్దున్నే పాకీ బండి తోలుకుపోదువు గాని.... మీ నాయన దానిమీదే వుండేవాడు" అన్నది.

ఆ రాత్రి మాచి ఒళ్ళు తెలియని గాఢ నిద్రపోయింది.

* [భారతి, జనవరి, 1943] *

# హరిజన సమస్య

చలం

గంటకి నలభై మైళ్ళ వేగంతో ఎగిరిపోతున్న కారు ఏమీ మారు మాట లేకండా ఆగిపోయింది రోడ్డు మధ్య. అరగంట సేపు డ్రైవరు కెలికి చూసినా ఉలకలేదు, పలకలేదు. ఈ అద్దె కార్లు ఇంతే, నమ్మడానికి వీల్లేదు అనుకున్నాడు వెనక సీట్లో కూర్చున్న డైరెక్టరు. అనుకుంటే చాలు, యజమాని మాటని గ్రహించి పరిగెత్తే సజీవమైన జంతువుమల్లే, మంత్రబలంతో ఎగిరే పుష్పకం మల్లే వెళ్ళే కారు, ఏ మాత్రం ఇన్‌టిమేషన్ లేకండా వుత్తరాయిమల్లే అయిపోవడం ఎంత ఆశ్చర్యం అనుకున్నాడు. అతని పక్కన కూచున్న కథకుడు! గదుల్లో చెయ్యడానికి సిగ్గు పడే పనుల్ని కార్లలో చెయ్యడానికి ఉపయోగించు కోడమే గాని, కారు బానెట్ తెరిస్తే దయ్యాలుంటాయో, పేగులుంటాయో కూడా తెలీదు వాళ్ళిద్దరికీ.

"ఇంక లాభం లేదంటావా?"

"ఏబ్బే ఫరవాలేదు కూచోండి."

"ఫరవా ఏం లేదు లే. రాత్రికి తిండి లేక పోయినా, కప్పుకు పడుకోడానికైనా ఏం లేదు."

ఆ రోడ్డు తమ కారు వెళ్ళడానికి మాత్రమే బోర్డువారు నిర్మించి నట్టున్నారు. అరగంటలో ఏ బండిగాని, కారుగాని, మనిషిగాని అటు రాలేదు.

చుట్టూ చిట్టడివి. ఆ అడివితో ఏ మృగానికీ, పిట్టకీ కూడా అవసరమున్నట్టు తోచదు. "ఈ సిట్యుయేషన్ చాలా బావుందోయ్. నీ కథానాయికని ఇట్లాంటిచోట strand (స్ట్రాండ్) చేయించు" అన్నాడు డైరెక్టరు. సాయంత్ర మవుతోంది. ఇంకా యాభై మైళ్ళు పోవాలి. మధ్యాన్నం ఎండనించి కారుని రక్షించిన చెట్లు, బెంగ పుట్టించే నీడల్ని పొడుగు చేసుకుంటున్నాయి.

మిధ్యావ్యవహారం మీద బైలుదేరినందుకు బాగా జరిగింది. ప్రొడ్యూసర్ తాను వలచి తెచ్చుకున్న బరువు బాలీసుని కథానాయిక చెయ్యా లంటాడు. "నీ మూడు లక్షలూ గోదావరిలో పొయ్యక పోయినావా, ఇంతదూరం వొచ్చి ఫిల్ము పేర. తగలెయ్యడమెందుకు?" అన్నాడు డైరెక్టరు. తనకి వశ్యురాలు కాని అనాఘ్రాత పుష్పాన్ని అని చాటుకునే ఒక పేరెక్కిన నక్షత్రాన్ని కథానాయికగా తీసుకుని తాత్కాలిక ప్రాణనాయికను చేసుకోవాలని డైరెక్టరు తాపత్రయం. తన పినతండ్రి కూతురూ, తనకి ప్రేయాస్పదురాలైన విద్యావతిని మనస్సులో పెట్టుకుని వర్ణించి కథ రాశాడు కథకుడు. తమ అంతరార్ధాలని ఎవరూ బైట పెట్టక తర్కించుకున్నారు మూడు నెలలు. చివరికి విసుగెత్తి, ఎవరూ వినని కొత్త కన్యను సంపాయిస్తామనే మిషతో బైలుదేరారు, talent (టాలెంట్) అన్వేషణలో. ఆ పల్లెటూరు వెళ్ళి వొస్తావుంటేనే ఈ విఘాతం పాపం, వాళ్ళకి. ఆమె తన ఫోటో పంపి, పెద్ద ఉత్తరం రాసింది. ఒక యాభైవేలు తాను పెట్టుబడి పెడతా నంది. యాభైవేల మాటతోనూ ప్రయాణమయింది వీళ్ళిద్దరి తోనూ. అప్పటికప్పుడే పాడింది, ఆడింది, నాటకాలు వొప్పచెప్పింది, చాలా బాగానే వుంది వ్యవహారం. అసలు మర్నాడు బైలుదేరదామనుకున్నారు. కాని ప్రతి అదృష్టానికీ అడ్డంగా ఓ వక్రగ్రహం వుంటో వుంటుంది. ఆ మధ్యాన్నం డైరెక్టరు నిద్రపోతూ వుండగా గుండెల మీద కూచుని లేవకొట్టాడు కాంతా రాయుడు. అతని దా పూరని కూడా తెలీదు డైరెక్టరుకి, కాంతారాయుడు మూడు హత్యలకన్నా కారకుడని ప్రసిద్ధి. లక్షాధికారి, ప్రభుత్యపు మంత్రుల్లో ఒకరిని సింహాసన మెక్కించిన మనిషి. డైరెక్టరు కళ్ళు తెరిచాడో లేదో, బొబ్బిలి పాపా రాయుడి మల్లే, ఒథెల్లో వేషంలో రాఘవాచారిగారి మల్లే శబ్దం లేకండా గర్జించాడు.

"అది నా తమ్ముడి భార్య, దానికి సినీమాల పిచ్చెక్కింది. దాన్ని చేర్చుకున్నావా, మీ ఫిల్ముకి వేరే డైరెక్టర్ని చూసుకోవాలి. నువ్వు పొలిమేర దాటవు. నా పేరు కాంతారాయుడు!" అని అంతర్ధానమైనాడు.

ఎగబడి కారులోకి యాభై వేలతో పాకే ఆ కాంతాలలామని తప్పించుకుని

పరుగెత్తుకువొచ్చారు పిళ్ళిద్దరూ. మధ్యలో కారు ఆగింది. వెనక కాంతారాయుడు రావటం లేదు కద! ఈ డ్రైవరుకి లంచం ఇచ్చి ఆపించలేదు కద!

"దగ్గిర ఊరు ఎంత దూరం వుంటుంది?"

"ఏమోనండి. నా కీ రోడ్డు కొత్త."

ఏమైనా కానీ ఇంక ఆ నిర్జీవ ప్రదేశంలో నిలవకూడదు.

"మేం వెడుతున్నాం. కారు బాగైతే వెనకాల తీసుకురా."

నడక సాగించారు. చీకటి పడ్డది. దోవలో పాము లుంటాయో, పులులే దూకుతాయో! దూరంగా దీపం, దీపాలు; మెల్లిగా. అవి గ్లాసు లైట్లు. ఇంకా కొంచెంలో చాలా మధురమైన సన్నాయి వాయిద్యం.

అమ్మా! ఏదో వూరు. పెళ్ళిగావును. కాని పెళ్ళిళ్ళ కాలం కాదు. అదృష్టాన్ని నమ్మలేదు ఇంకా వాళ్ళే దెయ్యాలేమో! కాకపోతే పొరుగూరు వెళ్ళే పెళ్ళి ఏమో! కాక కాంతారాయుడు కాడు కద! ఏమీ ఆశ్చర్యం వుండదు. లైట్లతో, వాయిద్యాలతో ఎదురొచ్చి వాళ్ళిద్దర్నీ పట్టుకుని కట్టి తీసికెళ్ళి ఏ పోలేరమ్మకో బలి ఇచ్చినా, ఈ నైజాంలో ఇంక దిక్కూ మొక్కూ ఎక్కడ? ఏం చెప్పిందో ఆ ఆడది? తనని వెనకనించి రమ్మన్నారని చెప్పలేదు కద బావ గారితో!

సమీపించారు. తోటలు, ఇళ్ళు, గుంపు. అదేదో సమాధి. తీర్థంలాగుంది. మొక్కుబళ్ళు చెల్లించుకుంటున్నారు. ధైర్యాలొచ్చాయి వాళ్ళకు. "చూశారా మూర్ఖం? మతం పట్టు వొదలా లంటారు ప్రభుత్వం" అన్నాడు కథకుడు.

"జీవితంలో కల్లా ప్రముఖమైన కులం, మతం రాజకీయాల్లోకి రావడం ఆపడం ఎవరి తరం? అందుకనే రష్యాలో దేవుడి పేరు చెపితే నరికేస్తామన్నారు. ఎన్ని ఉపన్యాసాలిస్తే మాత్రం ఆగుతుందా ఈ దేశంలో?"

"రష్యాలో నరికేస్తా మన్నారని నీ కెట్లా తెలుసు?"

"అనుకుంటారు."

"రష్యాలో మల్లే ఇక్కడా చెయ్యాలంటావా?"

"తప్పకండా."

"అట్లా చేసి ఈ మూర్ఖమే పోతే నీ కథలకీ, నా ఫిల్ములకీ ఏం డబ్బు వొస్తుంది? శక్తి పోయిందంటే, ఇంక చలం కథలే గతి."

"అంటే?"

"శృంగారం."

"శృంగారమైతే మాత్రం చలం కథలే ఎందుకు?"

"శక్తితోపాటు పాతివ్రత్యం మార్కెటు కూడా పడిపోతుంది. ఇంక బ్లాక్ మార్కెట్టే గతి, అంటే చలం."

"ప్రేమ లేదా?"

"ఉందిలే. మీ రందరూ ఏం చేస్తున్నా రిప్పుడు మాత్రం? శృంగార ఘట్టాల్లో తెలిసో తెలీకో అతని వాక్యాలేగా దొర్లిస్తున్నారు."

"పోనీ, అభ్యుదయ కథలు తియ్యకూడదూ?"

"అంటే ఆశలేగా? ఆకలేస్తోంది. భోజనం సంగతి ఆలోచించు."

"ఏమిటి ఆ ఫలహారం తరవాత కూడానా? మధ్యాన్నం ఆకలీ, శృంగారం రెండూ కలిసి వొచ్చాయిగా నీకు!"

ఆమె బలవంతం చేసి ఆవడలు, పూరీలు, చంద్రకాంతలు, హల్వా, సేమియా వాళ్ళిద్దరికీ నోళ్ళలో తన చేతులతో కూరింది

"ఇంకా ఆకలి లేదులే. కాని...."

ఒక యువకుడు సమీపించి కుశలప్రశ్నలు, పుట్టు పూర్వోత్తరాలు అడిగాడు వాళ్ళని. డైరెక్టరు పేరు పనిచేసింది. తన యింటికి ఆహ్వానించాడు. పొద్దున్నే బండి చేసి దగ్గిర బస్సులు నడిచే రోడ్డుకి పంపిస్తా నన్నాడు.

ముగ్గురూ పడిపోయిన చెట్టుమీద కూచున్నారు, తమాషా చూస్తో.

"ఏమిటి ఈ తీర్థం?"

"తెలీదా మీకు? హరియోగి గారి సమాధి అది. చంపేశాం ఆయన్ని మేము. ఇప్పుడు ఉత్సవాలు చేస్తున్నాం. మొక్కుకుంటాము: వాజ్యాలు గెలవ డానికి, పిల్లలకి, జబ్బులకి అన్నింటికీ."

"నిదర్శనం వుంటుందా?"

"ఆఁ."

విద్యావంతుడి మల్లే ఉన్నాడా యువకుడు.

"ఎందుకు చంపారు ఆ యోగిని?"

"చాలా మంచి కథ. వింటారా?"

"కానీండి."

"అదేదో సినిమా చూసినట్టుగా వుంది, డైరెక్టరుకి కూడా. ఆ సన్నాయి వాయిద్యం: చామంతి, మందార, చంద్రకాంత పూలు పెట్టుకుని, పట్టుచీరెలు అలంకరించుకున్న యువతులు, పళ్ళాలలో పూజాద్రవాలు పట్టుకుని; లైట్లు, ఇంకా చలిలేని గాలి, చుట్టూ చీకటి, అడివి, ఆ దుంగ మీద వాళ్ళు ముగ్గురూ.

"నా చిన్నతనం. ఇరవై ఐదేళ్ళ కింద గావును, ఎక్కణ్ణించి వొచ్చాడో

ఓ నాడు మా వూళ్ళో తిరుగుతున్నాడు. తెలుగు మనిషే. ఎన్నో ఏళ్ళు ఎక్కడో వుండి వొచ్చాడు గావును. అప్పటికే నడివయసు దాటింది. ఒంటిమీద బట్టలేదు. మాట్లాడడు. కళ్ళెత్తి ఎవరివంకా చూడడు. పిలిచి పెట్టినా, వళ్ళుతప్ప ఏమీ తినడు. త్వరలో అతన్ని మహాత్ముణ్ణి చేసుకున్నారు వీళ్ళే. రాత్రులు ఏ చెట్టు కిందో పడుకుంటే, పోయి గోలచేసేవాళ్ళు, పిల్లలకోసం, రోగాల నయంకోసం, తప్పిపోయిన గొడ్లకోసం, విసుక్కుని లేచిపోయి ఇంకో చెట్టుకింద పడుకునేవాడు. మేము పిల్లలం; పగలు అతన్ని ఏడిపించేవాళ్ళం - పెద్దవాళ్ళు చూడకుండా తిట్టి, రాళ్ళేసి, గడ్డంలాగి. చాలా మందికి కోరికలు నెరవేరాయి అనేవాళ్ళు.

ఓ రాత్రి హఠాత్తుగా మాట్లాడాడు తెలుగులో, పిల్లలకోసం వొచ్చిన ఒకామెని-

"వెళ్ళి ఓ కుర్రాణ్ణి చూసి పడుకో. నా దగ్గర ఏముంది" అన్నాడు నలుగురిలో.

దాంతో హడలిపోయినారు.

ఆమె ఈవూరి పెద్దరైతు భార్య దాంతో అతని మీద ద్వేషం రేగింది. ఆనాటినుంచి అతను మౌనం వొదిలాడు. అతని గురువు మూడేళ్ళు మౌనం ఆజ్ఞాపించాట్ట ఆ గడువు తీరిపోయింది. ఓ చాప చుట్టుకున్నాడు నడుం చుట్టూ. తరవాత ఎవరో బట్ట ఇస్తే అది కట్టుకున్నాడు. ఎందు కీవూళ్లో వున్నావంటే "ఆజ్ఞ" అన్నాడు. అతను మాట్లాడిం తరవాత ఎవరికీ ఏ వరాలూ రావడంలేదు, జబ్బులూ నయం కాలేదు. కడుపులూ రాలేదు. ఎవరన్నా వరం అడిగితే వేదాంతం చెప్పేవాడు. అతని ఖ్యాతిని విని పొరుగూళ్ళనుంచి వొచ్చేవాళ్ల గుంపులు. "నాకు చిరకాలం నుంచి కడుపునొప్పి" అంటే, "కడుపు నొప్పి ఏముంది? కాని నీ ఆత్మలో నొప్పి సంగతి ఏం చేశావు?" అంటాడు.

"చాలా బీదరికం. కటికి దరిద్రుణ్ణి."

"దరిద్రమంత ఐశ్వర్యం ఎక్కడ వుంది? నీ దగ్గిర పెన్నిధులు వున్నాయి, కావాలా నీకు?"

"శల విప్పండి."

"తవ్వు నీ మనసులోకి తవ్వు దొరుకుతాయి."

ఆ మాట లెవరికి కావాలి? మేం పెట్టే బాధలూ; నిరాదరణ పడలేక క్రమంగా హరిజనవాడ చేరుకున్నాడు.

అక్కడ సూరిగాడు కొంచెం మోతుబరి. ఓ రాత్రి అతని వసిపిల్ల వాడికి ఏదో జబ్బు పుట్టింది. తల్లీ తండ్రీ ఆ వసిపిల్ల వాణ్ణి ఈ హరియోగి కాళ్ళమీద ఫడేసి రక్షించమని కాళ్ళు పట్టుకున్నారు.

"మరి బతికిస్తే ఆ కుర్రాణ్ణి నాకు యిచ్చేస్తారా?" అన్నాడు. ఏమంటారు. ఒప్పుకోక! అంతే! ఆ నిమిషాన జబ్బు పోయింది. దాంతో అదుగో దూరాన, ఆ కొబ్బరి తోపులో ఓ గుడిసె కట్టి ఆ సాధువుని దాంటో ఉంచారు. కాని ఆ పిల్లవాణ్ణి తీసుకోనే లేదు యోగి. తలిదండ్రులు మాత్రం ఎన్నేళ్ళకి ఆ కుర్రాణ్ణి యోగిగారి కుర్రవాడి కిందే చూశారు.

ఆ యోగిగారు అక్కడ స్థిరపడగానే ఆ హరిజనవాడకే యోగం పట్టింది. వాళ్ళ పొలాలు పండాయి. వాడి హెచ్చింది, ప్రభుత్వంవారు సహాయపడ్డారు. యోగిగారి కీర్తి హెచ్చింది. మా వూరి ప్రజలు కూడా ఎగబడ్డారు. పొరుగూళ్ళ నుంచి కూడా ఒకటే గుంపులు. మహత్యాలు జరిగాయి అని కొందరనేవాళ్లు. కొందరు ఏమీ లేదనేవాళ్ళు. క్రమంగా ఆయనే తగాదాలు పరిష్కారం చెయ్యడం, పోట్లాటలు మాన్పడం, సలహాలివ్వడం దగ్గరికి వొచ్చింది. సూరిగారి కుటుంబంమీద యోగిగారికి అభిమానంలాగు వుండేది. మొత్తానికి అతని కుర్రాడు వీరన్నని తన సొంత కొడుకులాగే చూసుకున్నాడు. మాతోపాటు వాడూ పక్క వూళ్లో హైస్కూల్లో చదువుకునేవాడు. శలవల్లో మేం పగలంతా యోగి గారి తోటలోనే గడిపేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు రాత్రులు అక్కడే పడుకునేవాళ్ళం. హరిజనులు మా పేటలోకి రాకూడదు. కాని ఒక్క ఆ ఆశ్రమంలో మాత్రం సమానులమై కలుసుకోడానికి మావాళ్ళకి అభ్యంతరం వుండేది కాదు. మొత్తానికి ఆనాటి మా ఊరి యువకులందరమూ ఆయన శిష్యులం ఒక విధంగా. ఆయన మామూలు పురాణాల ధర్మసూక్తులే చెప్పేవాడు. సత్యం, శౌచం, అహింస, దయ, ఇట్లాంటివి. కాని అవి ఒక అనుభవంతో, నిశ్చయంతో వొచ్చి, మా మనసుల్ని నాటుకునేవి.

ఆయన వాక్కు వినడమే, ఆయన దగ్గిర కూచోడమే మాకో సంతోషం.

మేం కాలేజీకి వెళ్ళి నేర్చుకోడం, పత్రికలు చదవడం, దేశంలో పెద్దల్ని కలుసుకోడం, మా కాలేజీలో డిస్కషన్లు చెయ్యడం, రాజకీయాల పుస్తకాలు చదవడం - వీటితో మాలో మాకు భేదాభిప్రాయాలేగాక యోగిగారి ధర్మ బోధనలు వుత్త పురాతనపు చాదస్తాలనిపించాయి. శలవలకి ఇంటికి వొచ్చి నప్పుడు ఆయనతో వాదించేవాళ్ళం. ఆయన అన్నిటికీ అంగీకరించేవాడు. కాని ఆ అంగీకారం మాకు తృప్తిగా వుండేది కాదు.

"ఈ పూజలూ, భజనలూ వుత్త అర్థంలేని పనులు. పురాతనపు మూర్ఖత్వాలు" అంటే—

"నవీన మూర్ఖత్వాలు పురాతన మూర్ఖత్వాలకన్న నయమా?" అని నవ్వాడు.

"నవీన పద్ధతుల్లో మూర్ఖత్వం లేదు."

"కొన్నాళ్ళకి ఇవీ పురాతనమైన మూర్ఖత్వాలై పోవా?"

"అసలు దేవుడున్నాడనడమే మూర్ఖం."

"ఎందుకు?"

"వున్నాడని ఎట్లా తెలుసు?"

"లేడన్ని యెట్లా తెలుసు?"

"లేనిదాన్ని తెలుసుకోడ మెట్లా?"

"ఉన్నదాన్ని తెలుసుకున్నావా?"

"దేన్ని?"

"నిన్ను."

"తెలీకేం?"

"తెలుసుకుంటే ఇంక దేవుడి ప్రశ్నే లేదు."

వేపచెట్టు కింద అరుగు మీద కూచుని జ్వాలల మల్లె పొదుగ్గా మెరిసే కొబ్బరాకుల వంక చూస్తో ఆయన నవ్వులో, చిన్న హేళనలో ఆయనతో సంభాషించిన రోజులు చాలా గొప్పవి. ఏదో శాంతమైన వాతావరణం. మా ఆశల నించి, ఉద్యమాలనించీ, సందేహాలనించి తిరుగబాట్లనించి దాటిపోయిన వాతావరణం ఉండేది ఆయన దగ్గిర.

"ప్రస్తుత కాలానికి దేవుడు చాలా అనవసరం" అన్నాం మాలో ఒకరం ఓ వెన్నెల రాత్రి.

"ఏం? నాకు మల్లేనే దేవుడూ ముసలివాడైనాడు గావును."

"అది కాదు. మానవుడే సర్వశక్తిమంతుడైనాడు."

"ఇప్పుడేం, ఇదివరకూ సర్వశక్తి మంతుడే."

"కాని ఇదివరకుకన్న ఇప్పుడు."

"తనని తాను తెలుసుకుంటున్నా డన్నమాట."

"కనక దేవుడు అనవసర మనుకుంటున్నాడు."

"చాలా మంచి లక్షణం."

"మరి మీరు ఈశ్వర భక్తిని ఎందుకు బోధిస్తారు?"

"శక్తిహీనులకి, మీబోటి ధీరులకి కాదు."

ఆయన మమ్మల్ని చూసి నవ్వుతున్నాడనిపించింది. ఆయనకి తెలిసిందో ఏమో కొంచెం వుండి, మళ్ళీ అన్నాడు. "ఎబ్బే. ఈశ్వరుడు చాలా అనవసరం. ఎందుకంటే అవసరం వొచ్చిననాడు కోపగించడు. 'ఈనాటికి నాతో పని కల్గిందా?" అని ఎత్తిపొడవడు."

"అయితే దేవుణ్ణి మేం వొదిలెయ్యడం తప్పు కాదంటారా?"

"అనవసరమైనదాన్ని ఆహ్వానించడం చాలా అనవసరం. కాని ఈశ్వరుడి అవసరం చాల తప్పని అవసరం."

"మాకు అవసరం కాదు."

"చెపితినిగా, అవసరం కాదన్నా కూడా చాలా అనవసరం."

ఇట్లాంటి platitudes (ప్లాటిట్యూడ్స్) మాట్లాడేవాడు ఆయన.

కాలేజీలో మార్పు చెంది ఆయన్ని ధిక్కరించిన వాలో ముఖ్యుడు సూరన్న కొడుకు. యోగిగారి ప్రేమ పుత్రుడు, వీరన్న. అతను తమాషాగా తయారై మానించి కూడా దూరమౌతున్నాడు. హరిజనుల్ని అగ్ర కులస్తులు చాలా ఘోరం చేశారనీ ఇంక ఒక్క వారం, ఒక్క రోజు హరిజనుల ఆ దుర్గతిని సహించ కూడదనీ, హరిజన విప్లవం వెంటనే లేవ తీయాలనీ అతని నిశ్చితాభిప్రాయం. ఏ ఉపన్యాసంలో, ఏ సంభాషణలో, యెక్కడైనా అప్రస్తుతంగా అదే మాట, అదే కలవరింత. అతని కేమన్నా పిచ్చి యెక్కిందేమోననిపించింది. ప్రతి పత్రికకీ వ్యాసాలు పంపేవాడు, అదే పద్ధతి మీద, అచ్చు కానీ, కాకపోనీ; ప్రతి శలవల్లోనూ తన పేటలో హరిజనులకి ఉపన్యాసాలిచ్చి రెచ్చకొట్టి ఒక సైన్యంగా తయారు చేస్తున్నాడు. ఈ ఉద్రేకాన్నే యోగిగారి ముందు వెళ్ళబోసేవాడు.

"హరిజనులకి జరుగుతున్న ఈ అన్యాయాన్ని ఎట్లా అంగీకరిస్తున్నారు మీరు?" అన్నాడు దూకుడుగా.

"ఆ అన్యాయాలు నా అనుమతి కోరవందే" అన్నాడు ఆయన నవ్వుతో.

"మీరు వాటిని అంగీకరిస్తారా?"

"నే నేమిటి? ఎవరూ ఏ అన్యాయాన్నీ అంగీకరించరు."

"కాని, ఈ అగ్ర కులం వాళ్ళు అంగీకరిస్తున్నారు."

"అంటే - వాళ్ళకేదో న్యాయం కనపడుతోందన్న మాట."

"ఏం న్యాయం? స్వార్థం."

"ఆచారం, కాలం."

"అవి వొప్పుకుంటారా మీరు!"

"నా అంగీకారంతో గాని, అనంగీకారంతో గాని లోకం మారితే ఇంక కావలసింది ఏముంది?"

"నేను ఆచారాన్ని ఒప్పుకోను."

"ఛాలా మంచి షని."

"వాళ్ళు ఒప్పుకుంటారు."

"చాలా మంచి పని."

"రెండూ ఎట్లా మంచివౌతాయి?"

"నీళ్లూ, నిప్పూ రెండూ మంచివైనట్టే"

"సరే లెండి. కాని నే నిదంతా మార్చబోతున్నాను."

"తప్పకుండా మార్చు."

"మీ రేమంటారు?"

"ఇప్పు డేమంటాను? మార్చావంటే - కబీరు, బుద్ధుడు, రామానుజాదికన్న గొప్పవాడి వంటాను."

"ముందు ఈ వూరిని మార్చబోతున్నాను."

"మార్చెయ్యి. అదేదో నేనూ నేర్చుకుంటాను."

"ఏమిటి?"

"మార్చే విద్య."

"ఏం లేదు. బలవంతంగా చొరబడటమే!"

"చొరబడి మళ్ళీ బయటికి వొస్తావా, అక్కడే వుంటావా?"

నవ్వాము.

"ఆ ఆచారాన్ని పగలకొడతాను. ఎవ రడ్డమొస్తారో చూస్తాను."

"చూడనీ రేమో!"

"వాళ్ళకి ఏం అధికారం వుంది, మానవుడు మానవుణ్ణి పశువుగా చూడటానికి?"

"నువ్వూ అదేగా చేస్తున్న పని?"

"నేనా?"

"మరి బలవంతంగా చొరబడేది పశువేగా?"

ఎంత నవ్వాము!

"సర్వ సోదరభావం కలిగిస్తాను."

"సోదరుడితో బలవంతంగా కలబడి?"

"కలబడితేగాని బుద్ధి రాదు."

"బుద్ధి తెచ్చుకునే ప్రమేయం లేనే లేదా ఏమిటి, ఇతర్లకి బుద్ధి చెప్పించటమేగాని?"

వీరన్నకి చాలా కోపం ఒచ్చింది.

"మీ వన్నీ వుత్త మాటలు. తీరిగ్గా కూచుని దేవుడి న్యాయం, ఏర్పాట్లు అనే మత్తు మందు, బద్ధకం. నాకు మరణమన్నా భయం లేదు."

"జీవితమంటే భయమన్న మాట?"

ఓడిపోయినా ననిపించిందో, లేక పూర్వపు గౌరవం తిరగ బెట్టిందో "అయితే ఏం చెయ్యమంటారు?" ఇట్లానే హీన స్థితి ననుభవించ మంటారా?" అన్నాడు వీరన్న.

"అన్ని స్థితుల్లోకీ హీనస్థితి ద్వేషం; మనుషో, దేవుడో తనకి హీన స్థితి నిచ్చాడనే కోపం, తిరుగుబాటు."

"ఇదంతా పూర్వంనించీ బ్రాహ్మలు బోధించిన విషం; తక్కువ జాతుల్ని అణగతొక్కి వుంచడానికి."

"అగ్ర జాతుల్ని అణగతొక్కడానికి ఈనాడు తక్కువ జాతులు బోధిస్తున్న కాలకూట విషం ఈ ద్వేషం" అని గట్టిగా అన్నారు యోగిగారు.

"మీరు అగ్ర జాతుల వేపా?"

"ద్వేషం లేనివారి వేపు."

"వారికి లేదా ద్వేషం?"

"ప్రస్తుతం పైకి లేదు. నువ్వు నీ ద్వేషంతో దాన్ని రగిల్చిందాకా."

"ఒక్క కులాలే కాదు; దేశాలు దేశాల మీద, బీదలు ధనికుల మీద తిరగబడి తమ హక్కులకోసం నిలబడే జ్ఞానం పటుత్వం వొచ్చాయి ఈనాడు."

"తిరగబడడం జ్ఞానమూ, పటుత్వమూ కావు, అజ్ఞానం, బలహీనత, నిజమైన పటుత్వం తిరగబడదు. ఇదివరకు లొంగిపోయిన బలహీనతే తిరుగు బాటులోకి రూపం మారింది. అంతే."

"మరి ఇట్లా అణిగి, నలిగి క్షీణించవలసిందే?"

"బలం లేనప్పుడే అవన్నీ జరుగుతాయి."

"ఇంక మాకు సుఖమనేది అక్కర్లే దా?"

సరైన మాటలకి వొచ్చావు. సుఖం దేనిమీద ఆధారపడి వుందో ఆలో చించుకో. పటుత్వం, స్నేహం, సత్యం, సహనం - వీటి మీద. దేవుడు లేక పోనీ, ఈ విషయాలు ప్రతి హృదయంలో వెలుగుతున్నాయి. వాటినించి తప్పి సుఖం లేదు. ఒకరు అన్యాయం చేస్తున్నారని నువ్వు న్యాయం తప్పితే, నిన్ను కాపాడేందుకు రక్షణ ఏదీ? తగూపెట్టి హక్కులు సంపాయిస్తావు. సుఖా న్నెక్కణ్నించి తెచ్చుకుంటావు?"

ఇట్లా వాదించుకునే వాళ్ళు వాళ్ళిద్దరూ. కాని యోగిగారి మాటలు వీరన్నకి నచ్చలేదు. చీకిన పురాణ నీతు లనేవాడు.

మా కెవరికీ తెలీకుండానే గ్రామ విప్లవాన్ని సిద్ధం చేశాడు. దసరా, మా వూళ్లో పెద్ద పూజలు, పందిళ్ళు, సంతర్పణలు, కలశాలు, ఊరేగింపులు.

ఆ హడావిడిలో ఓ రోజు సాయంత్రం వచ్చి పడ్డారు హరిజనులు ఊరి మీద. కర్రలతో. నాకు తెలీగానే హడలిపోయినాను. ఎందుకంటే వీరన్న అంతర్యం నాకు తెలుసు.

"ఎబ్బే - యీ ప్రభుత్వం చేసే శాసనాలు ఏం లాభం లేదు. ఎన్నటికీ కలుపుకోరు మమ్మల్ని. ఎన్ని శిక్షలతో బెదిరించినా, ఇంకా గ్రంథాలు వెతికి తప్పించుకుంటారు. అట్లా కాదు. హరిజనులు విప్లవం చేసి మీ స్త్రీలకి హరిజన బిడ్డల్ని కనాలి" అనేవాడు.

అదీ నా భయం.

మా వూళ్ళో పెద్ద హరిజన సమస్య లేనేలేదు. ఆ ముసలివాళ్ళని నొప్పించడం యెందుకని మరీ ఇళ్ళల్లో కలుపుకోలేదు మేము వాళ్ళని - అంతే.

"పోనీ వీరన్న పదేళ్ళు ఆగవోయ్. ఈ ముసలి వాళ్ళని చావని, మనం దరం ఏకమవుదాం." అన్నాను.

"అప్పటికి నువ్వు ముసలివాడవై అప్పటి ముసలాళ్ళ మల్లేనే పట్టుబడతావు. నువ్వు లేకపోతే తక్కినవాళ్ళు నీ మాట సాగనీరు. అదేం లాభం లేదు" అన్నాడు అతను చాలా కసిగా. నిజమే ననిపించింది నాకూ.

ఆ దసరానాడు ముందుగా హరిజనులు స్త్రీల గుంపు మీద పడ్డారు. వూరి మగవాళ్లు చాలామంది పొలాల్లోకి వెళ్ళిపోయినారు మధ్యాన్నమే. నాకేం తోచ లేదు. ఈనాడు హరిజనులు దుర్మార్గం చేసినా, రేపు మా వాళ్ళు వాళ్ళని నాశనం చెయ్యక మానరు. చప్పున యోగి జ్ఞాపకం వొచ్చారు. ఒక్క పరుగు తీశాను ఆశ్రమానికి. నా వీపు వెనక హరిజనులు బలవంతం చేస్తున్న స్త్రీల అరుపులు, వాళ్ళకి అడ్డువడ్డ మా యువకుల గోల.

ఆశ్రమం చాలా ప్రశాంతంగా వుంది. చిలకలు గుంపులుగా ఎగురుతున్నాయి వేపచెట్ల మీదకి. నా కళ్ళ ముందు నెమ్మదిగా తొలిగిపోయినాయి ఉడతలు. గాలి తీరుబడిగా వీస్తోంది. చెట్టుకింద శాంతంగా కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు స్వామిగారు, ఇద్దరు ముసిలమ్మలతో. నన్ను చూడగానే చిరునవ్వుతో, "రా, కూచో" అన్నాడు.

హడావిడిగా నా కబురు కక్కాను. వెంటనే ఆ డెబ్బై ఏళ్ళు దాటిన వృద్ధుడు లేచాడు.

"చేశాడా, అంత పని!" అంటూ నా కంటే వడిగా పరిగెత్తుతున్నాడు. ఆయన అట్లా ఆదుర్దా పడడం నేను ఎన్నడూ చూడలేదు. పుటకలేదు చావులేదు అనే వేదాంతికి అంత ఆదుర్దా, మమకారం ఎందుకు? ఎవరి కోసం?

ఆయన చాలాసార్లు చెప్పారు మా వూరి పెద్దలతో—"కాలం మారుతోంది.

ఎందుకు ఏర్పడ్డదో ఈ వర్ణభేదం — ఈనాడు చాలా అన్యాయం, అసహ్యం. ఈ భేదాన్ని తీసెయ్యండి. రెండు పేటల్నీ కలిపెయ్యండి" అని.

"పెద్దలు తమరుకూడా అట్లాంటి వర్ణ సంకరాన్ని బోధిస్తారా?" ఋషులు పెట్టిన నియమాలు" అన్నారు వాళ్ళు.

"ఈ నాటి ఋషిని, నేను. నేను చెప్పేమాట వినండి" అనేవారు ఆయన. కాని ఎవరు వింటారు?"

అయిదు నిమిషాల్లో చేరుకున్నాం మా వూరు. ఆ దృశ్యం ఏం చెప్పను? ఈ లోపల మా స్త్రీలని ఎన్ని అవమానాలు చేశారో! దూరంనించి పొలాల్లోంచి పరుగెత్తుకు వొస్తున్నారు మా వాళ్ళు — కఱ్ఱలతో, కొడవళ్ళతో, చేతి కత్తులతో.

సరాసరి అమ్మవారి పూజ పందిరిలోకి వెళ్ళాం. అక్కడ జరిగిన అసహ్యం వర్ణించలేను. విగ్రహాన్ని పగలకొట్టారు. అమ్మగారి పీఠానికి ముందే వీరన్న నా భార్యని పట్టుకుని కింద పడేసి .... పందిరి గుంజని పీకి ఒక్క దూకు దూకాను అడ్డుపడ్డ స్వామిగారిని కింద పడతోసి. ఇంకా తన పెంపుడు కొడుకు మీదే మమత.

వీరన్న నన్ను చూసి అరుస్తున్న నా భార్యని వొదిలి పక్కనున్న కఱ్ఱ తీసుకుని నా మీదికి దూకాడు. తరవాత ఏం జరిగిందో—ఇద్దరం కొట్టుకున్నాం. చూసేసరికి రెండు దెబ్బలూ మధ్య అడ్డం వొచ్చిన యోగిగారికి తగిలాయి. ఆయన "హరీ హరీ" అంటో ప్రాణం విడిచారు.

నిర్ఘాంతపోయినాము ఆ రక్తం చూసి. అంతే. అక్కడితో ఆగిపోయింది ఆ వైరం. ఎక్కడివాళ్లు అక్కడ నిలిచిపోయినారు.

హరిజనులూ, మేమూ అందరమూ కలిసి ఆయనకి సమాధి కట్టించాము. ఎంతమంది మా స్త్రీలని హరిజనులు ఏం చేశారో కిక్కురు మనకుండా ఊరు కున్నాము. వీరన్న కోరిక నెరవేరింది. స్వామిగారి అనుగ్రహాన పిల్లలు లేని వాళ్ళకి కొంత మందికి తొమ్మిది నెలల్లో పిల్లలు కలిగారు. మా ఊళ్ళో హరిజన సమస్య లేదు. ఆదర్శమైన గ్రామంకింద వినుతి కెక్కింది. హరిజన సమస్యలను సాధించడానికి ప్రాణా లర్పించారని యోగిగారి కీర్తిని పత్రికల నిండా అచ్చు వేయించుకున్నాము. నాకూ, వీరన్నకూ, ఆర్నెల్లు ఖైదుపడ్డది. ప్రతిసంవత్సరం హరియోగిగారికి ఈ ఉత్సవాలు చేస్తున్నాము. మొదటనుంచీ అంత గొప్ప సంస్కర్తకి ఆశ్రయమిచ్చి ఆయన అహింసా బోధనల ప్రకారం నడుచుకున్న యోగ్యుల కింద మా ఊరి పేరుని దేశమంతా చాటుకున్నాము. మా మూలానే హరియోగిగారు అంత గొప్పవారైనట్టూ ప్రగల్భాలాడుతున్నాము ఈనాడు.

* [ఆ రాత్రి? కథల సంపుటి, 1946] *

# నరసన్న పాపాయి

**అడవి బాపిరాజు**

**రు**ద్రేశ్వరం గుడియెదుట శివరాత్రి ఉత్సవంలో, గుడిలోకి రాబోయాడని మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు. మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!! మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!!!

నిజమే. ఆ బాలుడు హరిజనుడే! అంత మాత్రాన మా అన్నయ్య వాడిని చావగొట్టడమే! ఆ కుఱ్ఱవాడు చేసిన తప్పు? శివరాత్రినాడు రుద్రేశ్వర స్వామి గుడిలోకి మా అందరితోటీ రావాలని ప్రయత్నించాడు.

మేము కోనేటిలో స్నానాలుచేసి, పట్టుబట్టలు కట్టుకొని, పళ్ళూ కొబ్బరికాయలూ పువ్వులూ ఆరతికర్పూరం ఊదవత్తులు మొదలయినవి పట్టుకు బయలుదేరాం. మా ఊరుకు రుద్రేశ్వరం ఎనిమిది మైళ్ళు ఉంటుంది. రాత్రి బళ్ళు కట్టుకు బయలు దేరాం. తెల్లవారగట్లకు రుద్రేశ్వరం వచ్చాం. మా రెండెడ్లబండే మాకు దేరా అయింది. దాని చుట్టూ తెరలు కట్టుకున్నాం. చాపలు కట్టాం. వంటలకు అన్ని సరంజాములు మా అమ్మ చేసింది. ఆ తర్వాతనే తెలతెల్లవారేసరికి కోనేరులో దిగాం.

ఆ బాలుడు మావూరు పెద్దమాలపల్లిలో వుండే అబ్బాయి. వాళ్ళ అయ్య మావూళ్ళో ఉన్న కరణం గారి పాలేరు.

మా అన్నయ్య వాడిని చావకొడుతూ వుంటే వాడు పెట్టినగోల రాతినైనా కరిగిస్తుంది. నేను వెక్కి వెక్కి ఏడ్చాను. ఆ అబ్బాయి సొమ్మసిల్లి మూర్ఛపోయాడు. నేను ముందుకు పరుగెత్తి వాడిమీద నా చెంబులో వున్న నీళ్ళుచల్లాను. వాడికి మెలుకువ వచ్చి లేచి గుండెలు కరిగిపోయేటట్లు ఏడుస్తూ తూలుతూ నడిచిపోయాడు.

నాకు నరసన్న ఏడుపు వినిపిస్తున్నది. స్వామికి అర్చన చేయించే పూజారి మంత్రాలు వాడి ఏడుపులా ఉన్నవి. గుడిలో మ్రోగించే గంటలు వాడు యెక్కి యెక్కి రోదించినట్లే వున్నవి. నేను అప్పుడు చిన్నబిడ్డనే అయినా నాకు నరసన్నను మా అన్నయ్య కొట్టడం నన్నే కొట్టినట్లయింది. నన్నుకూడా మా అన్నయ్య కొడ్తాడేమో అనిపించింది. నేనూ వెక్కి వెక్కి ఏడ్చాను. నాకు ఎనిమిది సంవత్సరాలు ఈడు ఉంటుంది

"ఒసే రవణా! ఎందుకే యింకా ఏడుస్తున్నావు?" అని మా అమ్మ కొంచెం ఘాటుగా అడిగింది.

"దానిని రెండువేస్తే వూరుకుంటుంది" అని మా అన్నయ్య. ఎంత కోపం? మా అన్నయ్యకు నేను వూరికే భయపడ్డానా? వచ్చిన వేలకొలది జనంలో తొక్కిసలాడుతూ బయటకు వచ్చాం.

నరసన్న ఏడుపు, జనకోలాహలం, డప్పులు, బూరాలు. 'శివ శివ శివోహం' అనే భక్తుల కేకలు నా నిశ్శబ్దబాష్పాలు, మా అన్నయ్య నన్ను తిట్టడం, మా అమ్మ నన్ను కేకలు వెయ్యడం, నరసన్న ఏడుపు, ఏడుపు! మా అన్నయ్య వాణ్ని గుళ్ళోకి వస్తున్నాడని చావకొట్టాడు.

నరసన్న పెద్దవాడయ్యాడు. నేనూ పెద్దదాన్నయ్యాను. నాకూ పెళ్ళయింది. నరసన్నకూ పెళ్ళయింది.

రుద్రేశ్వరం గుడియెదుట మా అన్నయ్య శివరాత్రి ఉత్సవంలో వాడు గుడిలోకి రాబోయాడని అతన్ని చావగొట్టాడు. అది నా పెళ్ళిలోనూ నాకు జ్ఞాపకమే! వాడికి పెళ్ళి అవుతోందంటేనూ నాకు జ్ఞాపకమే!

నరసన్న మా అత్తవారికి పెద్దపాలేరయ్యాడు. ఆ వూరికి పెద్దమాల అయ్యాడు. కాని గుడియెదుట వాణ్ణి మా అన్నయ్య కొట్టితే వాడు ఏడ్చిన ఏడుపే నాకు స్నేహితురాలయింది. అదే నాకూ నరసన్నకూ మధ్య ఏదో విచిత్రమైన పవిత్రమైన సంబంధం ఏర్పాటు చేసింది.

మా అన్నయ్య అతన్ని కొట్టినసంగతి నేను మరచిపోలేదు. మా అన్నయ్యే మరచిపోయాడు. ఆ కొట్టడం చూస్తు వున్న మా అమ్మా వాళ్ళూ మరచిపోయారు. ఆఖరుకు నరసన్న మరిచిపోయాడు.

"ఏమయ్యా నరసన్నా! నీ భార్య కడుపుతో వుందట!"

"అవునండి ఖామందుగారూ!" అన్న అతని మొగం పూవులా వికసించింది.

నరసన్న ఒడ్డూ పొడుగూ అయ్యాడు. నరసన్న నల్లని రాయి చెక్కిన విగ్రహంలా మూర్తితాల్చాడు.

నరసన్నకు చదువులేదు. కాని వాడు చెప్పిన సలహా తిమ్మరుసు సలహా!

నరసన్న మా పాలేరు అవడానికి నేనే కారకురాలిని. అతడు మా పాలేరయినందుకు మాకు కోటివిధాల లాభమే అయింది. ఆ వూళ్ళో (మా వూరు 'పాడు') మా పొలంలా పండే భూమేది?

నరసన్న రుద్రేశ్వరం శివరాత్రి వుత్సవంలో గుడిలోకి వెళ్ళబోతోవుంటే మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!

మాలలూ మాదిగలూ యెన్నిసార్లు పెద్దకులాల వారిచే దెబ్బలు తినలేదు!

మాలలూ మాదిగలూ యెంతమంది క్రిష్టియన్ మతంలో చేరలేదు!

మాలలూ మాదిగలూ మాకు దూరంగా వుండాలి! మేము అంటు అవుతాము. నరసన్న భార్యను యెవరూ చూడకుండా నా దగ్గరకు రమ్మనేదాన్ని. నా తల దువ్వమనేదాన్ని. రత్తాలు మొదట నవ్వేసింది. తర్వాత నా బ్రతిమాలడాలు, నా కోపపడడాలవల్లా భయపడుతూ ఒప్పుకొని నాకు తల దువ్వింది. నా ఒళ్ళు ఝల్లుమంది. నరసన్న రుద్రేశ్వరం గుడిలోకి వెళ్ళినట్లయింది. గుడిలోకి వెళ్ళినా వెళ్ళని నేను! గుడిలోకి వెళ్ళబోయే మా అన్నయ్యచేత దెబ్బలు తిన్న నరసన్న! నరసన్న భార్య నాకు తల దువ్వింది. నేను నరసన్న భార్య రత్తాలు తల దువ్వాను.

ఓట్ల రోజులు. కాంగ్రెసువారికీ, కమ్యూనిస్టులకూ పోటీ.

మాల మాదిగలలో – వాళ్ళని హరిజనులంటారు – కాంగ్రెసు వాళ్ళనీ కమ్యూనిష్టులనీ ఏదో ఫెడరేషననీ యీ ముగ్గురికీ పోటీ!

మా ఆయన నరసన్నను పోటీ చేయమన్నారు. ఆయన కాంగ్రెసువారు. నరసన్న చిన్నతనంలో చదవలేదు. కాని మా వారే రోజూ నరసన్నకు చదువు చెప్పారు. అతనికి వచ్చిన చదువు యెంతో పెద్దది. రుద్రేశ్వరుని గుడియెదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలు అతని ఓనమాలు.

ఎంతమంది హరిజనులు గుళ్ళయెదుట, బజారులలో, అంగళ్ళవీధిలో, పొలాలలో దెబ్బలు తినటంలేదు?

వాళ్ళు ఏ దేవుణ్ణి చూడగలరు? వెంకటేశ్వరుడు, చిదంబరస్వామి,

రామలింగేశ్వరుడు, శ్రీరంగశాయి వాళ్ళకు కనబడతారా? మా రుద్రేశ్వరుడే నరసన్నకు కనబడలేదు.

నరసన్న భార్య కడుపుతో వుంది! నరసన్నకు కొడుకు పుడ్తాడా, కూతురా? ఆ పాపాయికి రుద్రేశ్వరుడు కనబడడు.

"రత్తాలూ చదువుచెప్తా చదువుకోవూ?" అన్నాను.

"నాకు చదువెందుకండీ కామందుగోరూ!" అన్నది రత్తాలు పకపక నవ్వుతూ! నరసన్న మాకు పాలేరయిన కొద్ది రోజులకు రత్తాలుతో అలా అన్నాను. అంతటితో వదిలానా రత్తాలుచేత 'వీరవల్లడు' చదివించాను.

నాకు బాగా చదువు చెప్పించారు మావాళ్ళు. ఇంటి దగ్గిరే ఇంగ్లీషు చదవా! మావారు ఏవో బందరువెళ్ళి ఇంటరుమీడియేట్ ఫేలయివచ్చి వ్యవసాయం పెట్టారు.

ఆయన "మన నరసన్న హరిజనుడు రవణా! ఎన్ని శతాబ్దాలనుంచి వాళ్ళు అలా బాధపడుతున్నారూ? వాళ్ళు మనుష్యులు కాదనా మనవాళ్ళు రవణా!" అని నన్ను దగ్గిరకు చేర్చి ఏదో తనలో అనుకున్నట్లుగా అన్నారు.

"నరసన్నను మా అన్నయ్య కొట్టాడండీ!"

"ఎప్పుడూ?" ఆయన ఆదుర్దా యెంతో మూర్తితాల్చింది.

"చిన్నతనంలోనండీ! రుద్రేశ్వరస్వామి గుళ్ళోకి రాబోయాడు. మా అన్నయ్య వాణ్ణెరుగును. మా అన్నయ్య చావగొట్టాడు!" చిన్ననాటి ఆ దృశ్యం అంతా జ్ఞాపకంవచ్చి నాకూ కళ్ళనీళ్ళు తిరిగాయి.

మావారు నన్ను తమ హృదయానికి పొదివికొని, "నీ హృదయం నవనీతం రవణా" అన్నారు. ఆయన ముద్దులు నాకు గాఢమైన ఔచిత్యమూ, ఆనందమూ, యెంతో సిగ్గూ కలిగిస్తాయి.

"నరసన్న భార్యకు తలదువ్వాను!" నా కళ్ళల్లో భయమూ, ఏమంటారు యిక అన్న అల్లరితనమూ రెండూ నర్తించాయి.

ఇక నన్ను మావారు తన కౌగిలిలో నలిపివేశారు. నా రవికముడి వీడిపోయినా. నాకు సిగ్గు పొంగుకువచ్చినా ఆయనకేమీ! అల్లరి అబ్బాయి.

"రత్తాలు పాపాయి నెత్తుకుంటుంది!" ఆయన కళ్ళు నా కళ్ళల్లోకి అతి గాఢంగా చూచాయి.

నా కంటిరెప్పలు అరమూతలుగా వాలినవి.

"ఆ పాపాయి రుద్రేశ్వరం గుడిలోకి వెళ్తాడా అండీ?"

"రుద్రేశ్వరమే? కాశీ విశ్వేశ్వరమే!"

"ఆ పాపాయిని మా అన్నయ్యవంటివారు ఎవ్వరూ కొట్టరు కదాండీ" నా గుండె దడదడలాడింది.

రత్తాలు పురిటికి కష్టం అయింది. అంత బండలాంటి నరసన్న ఒకటే గోల!

మావారు పెద్ద డాక్టర్ని తీసుకువచ్చారు.

రత్తాల్ని వాళ్ళ గూడెంలో గుడిసెనుండి మా ఇంటికి తీసుకువచ్చారు. మా దంపుళ్ళగది పురిటిగది అయింది.

డాక్టరుగారు మూడుగంటలు కష్టపడ్డారు. నరసన్న కూతురు ప్రపంచ రంగంలో ప్రవేశించి 'కేరు'మంది.

నేను లోపలికి పరుగెత్తాను. సిద్దిలా చేతులు కాళ్ళు ఆడిస్తూ అల్లరి చేస్తూంది ఆ పాపాయి.

ఇంకో హరిజన పాపాయి ప్రపంచంలోకి వచ్చింది. అదీ విసిరేసినట్లు ఊరిబయట! దానికి చింపిబట్టలు. దానికి తలదువ్వుకోటానికి నూనె వుండదు! దానికి చదువు వుండదు? దానికి కడుపునిండా తినడానికి తిండి వుండదు! అదీ రుద్రేశ్వరం గుడియెదుట గుళ్ళోకి వెళ్ళబోయి ఏ మా అన్నయ్యవల్లనో తన్నులు తినాలి.

నాకు దడదడయెత్తి ముచ్చెమటలు పోశాయి. నరసన్నను మా అన్నయ్య రుద్రేశ్వరం దేవాలయం ఎదుట శివరాత్రినాడు చావగొట్టాడు కాదూ!

ఆ హరిజన పాపాయీ వాళ్ళమ్మా నీళ్ళు పోసుకొని వాళ్ళ గూడెం వెళ్ళిపోయారు. చిట్టికృష్ణునిలా తయారయింది ఆ చిట్టిపాప. పదిహేను రోజులలో వుంగరాల జుట్టు, అల్లనేరేడు పండులాంటి ముక్కు, నల్ల దొండపళ్ళు దాని పెదవులు, గవ్వలలాంటి వేళ్ళు ఆ బొజ్జ, ఆ చిన్నకాళ్ళు, ఆ చిన్నారి చేతులు అందాలు ఒలకపోసుకుంటూ, నులకమంచంమీద దొర్లడమే! నేనూ మా ఆయనా రాత్రిళ్ళప్పుడు నరసన్న ఇంటికిపోయి, రత్తాలునీ, పాపాయినీ చూసి వచ్చేవాళ్ళం!

నా చీరలూ, దుప్పట్లూ, దోళ్ళ దోపిడీ ఇచ్చాను. ఆ చిన్న పాపాయికి చిట్టిచొక్కాలు ఎన్నో కుట్టి ఇచ్చాను. ఆ ముద్దు పాపను చూచినపుడల్లా మా ఆయన చిన్నపాపడై కన్పించేవారు. నా రవిక జేబులు పిక్కటిల్లేవి.

ఊళ్ళోవాళ్ళు మేము కులం నాశనం చేశామని తిట్టుకుంటున్నారట. రాములవారిలా ఆజానుబాహువులు కలవారూ, అందమైనవారూ, బంగారం ఛాయ కలవారూ, సాధుమూర్తి అయిన మా వారంటే అందరికి భయమూ, భక్తీ అయినా మమ్మల్ని అందరూ తిట్టేవారు.

వాళ్ళంతా రుద్రేశ్వర దేవాలయంలోకి నరసన్నవంటి హరిజన బాలకులు వస్తే చావగొట్టే జాతివాళ్ళు! మా అన్నయ్య నరసన్నను ఒక శివరాత్రినాడు చావ కొట్టాడు. మా అన్నయ్య మాఇంటికి మేం నరసన్న భార్యను పురిటికి తీసుకు వచ్చినప్పటినుండీ రావడం మానివేశాడు. నరసన్నే నాకు అన్న! 'అవును రవణా!' రుద్రేశం తల్లి కడుపున బుట్టిన అతడే నీకు అన్న! అతడే మనకింత తిండి పెడుతున్నాడు!" అని వెన్నెల లాంటి చిరునవ్వు నవ్వుతూ మా ఆయన అన్నారు ఆత్మీయత వెనక ఆర్థిక సంబంధం.

మావారు భగవంతులే!

నరసన్న ఎన్నికలలో నెగ్గాడు. చెన్నపట్టణం శాసనసభకు సభ్యుడట.

ఆరోజు మావారు కాంగ్రెసు నాయకులకూ ఊళ్ళవారందరికీ విందు చేశారు. నరసన్న మావారిపక్కనే కూర్చున్నాడు విందులో.

మా నరసన్న, నరసన్నగారు సభ్యుడు. ఇప్పుడూ మా అన్నయ్య నరసన్నను కొడతాడా రుద్రేశ్వరం గుడి ఎదుట! ఏమో, మా అన్నయ్య ఎంతకైనా తగును!

నరసన్నకు మా దంపుళ్ళసావిడి అయిదు వందల రూపాయలు పెట్టి చక్కని ఇల్లులా సిద్ధంచేసి మావారు అందులో ప్రవేశించబెట్టారు. ఇంక మా స్థితి? నాకు నరసన్న పాపాయి అప్పురాలు.

"నేనూ, నరసన్న భార్య రత్తాలూ — రత్నమ్మా, ఖద్దరు వడకడం ప్రారంభించాము. మావారు ఎప్పటినుంచో ఖద్దరు కడుతున్నారు. ఇప్పుడు నరసయన్న అన్నా రత్నం మరదలూ, మేనకోడలు భరతాంబా అందరూ ఖద్దరు కడుతున్నాం.

నరసన్న అన్నా, అతని కుటుంబమూ శుభ్రంగా తిండి తింటున్నారు. శుభ్రంగా బట్టలు కట్టుకుంటున్నారు. రుద్రేశ్వర దేవాలయం ఎదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలూ, అతని ఏడుపూ నరసన్నకు ఆశీర్వచనాలు!

భరతదేశంలోని హరిజనులందరూ రుద్రేశ్వర దేవాలయం యెదుట మా అన్నయ్యచేత దెబ్బలు తినాలా?

భరతదేశంలోని హరిజనులందరూ ఇంత తిండీ, ఇంత బట్టా సంపాదించుకోవాలంటే శాసనసభ్యులవ్వాలా?

ఇంతకూ మా నరసయ్యన్న పాపాయిని నేనే పెంచడం, పిల్లలులేని వాళ్ళు ఇంకోళ్ళ పాపని తెచ్చుకు పెంచుకుంటే పిల్లలు కలుగుతారంటారు. భరతాంబ నాదగ్గిరే. "నన్ను "అత్తా" అంటుంది. నా దగ్గిర పండుకునే నిద్ర పోతే ఓ రాత్రివేళ వాళ్ళమ్మ వచ్చి తీసుకుపోయేది.

ఓ రోజున ఆ పెంకిభరతం అల్లరిచేసింది. నా దగ్గిర పడుకొని నిద్ర పోయి రవిక పిన్ను ఊడిపోయి నా బంగారునిధులు, పొడిబంగారు కలశాలు, కర్కశపు ఉబుకులు, చిన్నబుద్ధ పుణుకులు ఎరగని, పనికిరాని వట్టి అందాలు, భరతాంబ నోటితో అందిపుచ్చుకుని, వట్టి మొనలు పునకడం ప్రారంభించింది. నాకూ నిద్రపట్టింది కాబోలు. వళ్ళు ఝల్లుమని మేనెల్లా తీపులు ప్రవహించి ఆనందం ముంచెత్తి ఎవరో బంగారు పాపాయి నా గర్భం పండించి నా పాలు పుణుకుతున్నట్లయి మెలుకువ వచ్చింది. భరతం కొంటిపాప నిద్రలో పుణుకు మని వట్టి పట్టి పాలు తాగుతున్నది.

ఆసి అల్లరిదాన అని సిగ్గుపడి మా ఆయన నిద్రపోతూ ఉండటం చూచి, నెమ్మదించుకొని, దిబ్బెసలాంటి భరతాంబ పిరుదులపై రెండు చిన్న దెబ్బలు తగిలించి వాళ్ళ అమ్మని పిలిచి భరతాన్ని అందిచ్చాను.

అక్కడనుంచి రోజూ కలలు! రెండు నెలలకు నాకు నెలతప్పింది. నా కన్న, నా భరతం నాకు వరమిచ్చింది.

ఇంకా మా రత్తాలు — రత్నం - సంతోషం ఇంతా అంతా! మా ఆయన నన్ను పూజించారంటే, వారు పదహారుకళల చంద్రులయ్యారు.

తొమ్మిది నెలలలో వెన్నెల ముద్దకట్టి నాకు ఓ పాపాయి ప్రత్యక్షమైంది.

"ఆసి బంగారుతల్లీ, అచ్చంగా తండ్రిపోలిక, వదినగారూ!" అన్నది రత్నం పాపాయికి నీరుపోస్తూ!

ఈ నా కన్నతల్లి భరతాంబ మరదలు. మావారి ప్రేమమూర్తి కట్టిన వరలక్ష్మి, నరసన్న మా అన్నయ్యచేత దెబ్బలు తిన్నప్పుడు ఏడ్చిన ఏడుపులో ఉన్న కరుణరసం నిండిన కలశం వచ్చింది. ఆమెను మేము "పూర్ణ స్వరాజ్య లక్ష్మి" అని పేరు పెట్టుకున్నాం.

* [రాగమాలిక, సంకలనం నుండి, 1954] *

# చెప్పులు కుట్టేవాడు

గోపీచంద్

నన్ను మీరు చూసే వుంటారు. కాని నేను మీకు గుర్తు వుండను. మీరు ఎన్ని రాళ్ళనూ రప్పలనూ చూడటం లేదు! అవన్నీ మీకు గుర్తువుంటున్నయా? వుండవు. అదే విధంగా నేనూ మీకు గుర్తు వుండను. నాతో మీకు పని లేదా వుంచే వుంటుంది. రాయితో మాత్రం మీకు పనివుండదూ? వుంటుంది. మేకు ఏ గోడనో కొట్టవలసి వస్తుందనుకోండి. అప్పుడు ప్రక్కన వున్న రాయిని తీసుకొంటారు; దిగగొడతారు. తరువాత ఆ రాయిని విసిరి పుచ్చుకొని అవతల పారవేస్తారు. ఆ రాయి మీకు ఉపయోగించింది. గనుక గుర్తు వుంటుందా? ఉండదు. నేనూ అంతే. ఏ చెప్పో తెగితే నాతో పని చేయించుకొంటారు. కాని నేను మీకు గుర్తు వుండను. కాకపోతే పని చేసినందుకు ఏ కానో అర్ధణో నా మీదకు విసరి పారవేసి వెళ్తారు.

నాతో పని చేయించుకునే వారితో, నాకు మాట్లాడ బుద్ధి అవుతుంది. వారి కష్ట సుఖాలు కనుక్కో బుద్ధి అవుతుంది. నాకూ వారికీ తెగని సంబంధం ఏదో వున్నట్లు అనిపిస్తుంది. కాని వారు వడనిస్తేనా!

"చెప్పుల మడమలు బాగా అరిగిపోనాయ్ బాబు

గారు," అనే వాణ్ణి. ఎందుకనో వారు విననట్టే నటించేవారు .... మొహం అటు వైపుకి తిప్పుకునేవారు.

"మడమ వేస్తా బాబూ, లేకపోతే కాలు దెబ్బ తింటుంది" అనేవాణ్ణి.

"చెప్పిన పని చెయ్యవాయ్," అనేవారు.

"అట్లాగే బాబూ," అని వారు అడిగినట్లు ఉంగటం వేసి ఇచ్చేవాణ్ణి. కాని వారు బజార్న నడుస్తూ కనపడినప్పుడల్లా మడమ వెయ్యకపోతినే అని మనస్సులో దేవుతూనే వుండేది. "ఉంగటం బాగుందా బాబూ?" అని అడగ బుద్ధి అవుతూ వుండేది. కాని వారు అడగనిస్తేనా? ఎరగనట్టు, మొహం అవతలికి తిప్పుకొని వెళ్ళిపోతుండేవారు. అట్లా ఎందుకు చెయ్యాలి? నాకు అర్థం అయ్యేది గాదు. వెళ్ళనిచ్చేవాణ్ని.

ఒక రోజు ఒకాయన చెప్పుల కాళ్ళతో ఈడ్చుకుంటూ వచ్చాడు. ఒక చెప్పు ఉంగటం తెగిపోయింది; ఒక చెప్పు కాలిని కప్పే నడిమిభాగం లేచిపోయి వుంది. అట్లా వున్న చెప్పులు చేత్తో పట్టుకు రావటం న్యాయం. ఈ సంగతి నాకు తెలియంగా లేంది — అందరికీ తెలియదా? అందరికీ తెలుసు కాని అలాగే చెప్పుల్ని కాళ్ళతో అతి కష్టం మీద ఈడ్చుకుంటూ వచ్చాడు. కుట్టమన్నాడు. చెప్పులు, జాతి చెప్పులు బాగా వున్నాయి. వాటిని చూడగానే నాకు మనస్సు లేచి వచ్చింది. ఎంతో జాగ్రత్తగా చక్కగా కుట్టాను. ఆయన అడక్కుండానే పాలిష్ చేశాను. ఆయన కాళ్ళ ముందు పెట్టాను చూడ్డానికి ఎంత బాగున్నాయి అనుకున్నావు! బండి లాగటానికి మువ్వలు, కుచ్చులు వేసుకొని నిలబడిన కోడె దూడలకుమల్లే వున్నాయి. ఆయన తొడుక్కున్నాడు. ఆయన కాలు ఎక్కడ నొచ్చుతుందోనని ఉంగటానికీ, కాలిని కప్పేదానికీ మంచి మెత్తని తోలు వేసి కుట్టాను. ఆ మెత్తదనం కాళ్ళకు తెలియకుండా వుంటుందా? అందుకని, "ఎట్లా వున్నయ్యండీ," అని అడిగాను.

"ఉన్నయ్ లేవాయ్," అని ఆయన ఒక అణా విసురుగా పారవేసి వెళ్ళిపోయారు. ఎందుకంత కోపం? ఒక మంచి మాట అంటే ఆయన సొమ్మేం పోయె! అనరు.

నేను కూర్చునేది నాలుగు బజార్లు కలిసిన దగ్గర. ఒక ప్రక్కగా, జనం నడిచే దారిలో కూర్చుంటాను. అస్తమానం అక్కడే కూర్చోవలసి రావటంవల్ల, ఎండకి తట్టుకోలేక, చిన్న దేరా గుడ్డ దొరికితే, దానిని పెల్లలమీద లేపి, దాని కింద కూర్చొని వుంటాను. నేను చెప్పులు బాగా కుట్టగలను. అయితే నాతో చెప్పును మరామత్తు చేయించుకునేవారే గాని కుట్టించుకునేవారు లేరు. ఒకవేళ

ఎవరన్నా కుట్టించుకుందాం అనుకున్నా నన్ను నమ్మి ముందుగా ఎవ్వరు డబ్బిస్తారు? నా దగ్గర చెప్పుకు కావలసిన పెట్టుబడి పెట్టడానికి నయాపైసా లేదు. మొట్ట మొదట్లో ఎట్లాగో ఒక రూపాయి పోగుజేసి, పెద్ద షాపులవాళ్ళు, పనికిరాని తోళ్ళ తుక్కు అమ్ముతుంటే కొన్నాను. అదే నా పెట్టుబడి. ఆ తోళ్ళ తుక్కు ముందు వేసుకుని కూర్చొని యాపారం మొదలుపెట్టాను. పొద్దున్నే గంజినీళ్ళు తాగివచ్చి కూచునేవాణ్ణి. నాకుమల్లే చెప్పులు కుట్టేవాళ్ళని నేను చాలామందిని చూశాను. వాళ్ళు చూట్టానికి గలీజుగా వుండటంవల్ల చెప్పులు కుట్టించుకునే పెద్దమనుష్యులు వాళ్ళ దగ్గరకు వచ్చేవారుకాదు. అందుకని అందిన గుడ్డ పీలికలు అన్నిటినీ చేర్చి పొడుగ్గా కుట్టి ఒక తలగుడ్డ తయారు చేశాను. దాన్ని కాసిని ఎఱ్ఱ నీళ్ళలో ముంచి కంటికి నదరుగా వుండేటట్టు చేశాను. అది చుట్టుకొని పనిలోకి వెళ్ళేవాణ్ణి. మొదటిరోజు తలకు చుట్టుకొని, పిల్లలు బజార్లో ఏరుకొచ్చిన అద్దం ముక్కలో చూసుకున్నాను. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. డాబుసరిగానే వుంది. నన్ను చూసుకుంటే నాకే నవ్వు వచ్చింది. నవ్వాను తుసుక్కున.

"ఎందుకట్లా నవ్వుతావ్? నీ కేమన్నా పొయ్యేకాలం వచ్చిందా?" అంది గుడిసెది.

"ఇటు చూడు" అన్నాను.

"పోతు పేరంటాలల్లే వున్నావు" అంది, అని తనూ నవ్వింది.

తల వంచుకొని నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని మరీ నవ్వింది. అది నవ్వితే, దాని నవ్వు కిఱ్ఱు చెప్పుల మీద తగరం మెరిసినట్లు మెరిసేది.

నా గుడిసెది నాకు చెప్పులు కుట్టటంలో కూడా బాగా సహాయం చేసేది. నేను పొద్దున్నే పనిలోకి వెళితే అది కూడా వుడకేసి తొమ్మిది పది గంటలకల్లా నా సరసనే జేరేది. దానికి కూడా చెప్పులు కుట్టడం కాస్త వచ్చు. ఎవ్వరు నేర్పారు? నన్ను చూచి అదే నేర్చుకుంది. అయితే పాలిష్ చెయ్యడం మాత్రం నాకన్నా బాగా చేసేది. అణిచిపెట్టి రుద్దేది. చెప్పుమీద దాని చెయ్యి పడితేచాలు; మిల మిల మెరిసిపోయ్యేది.

అది వచ్చి సరసనే కూర్చోగానే, పని దానికి అప్పజెప్పి నేను కూటికి పొయ్యేవాణ్ణి. నాకు నలుగురు పిల్లలు. అందులో ఒకటి చంటిది. చంటిదానిని, వాళ్ళ అమ్మ ఒళ్లోనే వుంచి మిగిలిన ముగ్గుర్నీ తీసుకొని గుడిసెకు వెళ్ళేవాణ్ణి. వాళ్ళకు అన్నం ముద్దలు చేసిపెట్టి, నేను యింత తిని, మళ్ళీ పనిలోకి వచ్చి, దాన్ని కూటికి పంపేవాణ్ణి. అది తిని వచ్చి నా సరసనే కూర్చొని సాయంకాలం

దాకా నా సరసనే కూర్చొని, నాతోపాటు పని చేసేది. పిల్లలు ఆ చుట్టుపక్కల ఆడుకుంటూ వుండేవారు.

నాకు ఎవ్వరన్నా భయం వుండేది కాదు; పోలీసులంటే మాత్రం భయం. ఉత్త పుణ్యానికి వచ్చేవాళ్లు; నానా కూతలూ కూసేవాళ్ళు. చివరికి అణో బేడో పుచ్చుకు వెళ్ళేవాళ్ళు. ఒక రోజు పోలీసాయన వచ్చాడు.

"లే ఇక్కడ నుంచి" అన్నాడు.

నేనూ నా గుడిసెదీ కాళ్ళా వేళ్ళాబడి బతిమాలాం. కాని ఆయన వినలేదు. "ఇక్కడ కూచోటానికి వీల్లేదు, పో!" అని అక్కడున్న తోళ్ళ ముక్కల్ని కాళ్ళతో యిటూ అటూ తన్ని పారేశాడు. ఆ తోళ్ళ ముక్కల్ని తంతుంటే నా పిల్లల్ని తంతున్నట్టే అనిపించింది నాకు. "పో ఇక్కడ నుంచి. నీ అబ్బగాడి స్థలం అనుకున్నావా!" అని నన్ను బూటుకాలెత్తి తన్నబోయాడు. తన్నాడే అనుకున్నా. తంతే తన్నాడు.

పొమ్మంటాడు అక్కడనుంచి? ఎంత తేలిగ్గా అన్నాడు! కాని ఎక్కడకు పోను? ఎక్కడికి పోయినా ఏ స్థలమూ నాది కాదాయె! డబ్బున్న వాళ్ళమల్లే ఏదన్నా కొట్టు అద్దెకు తీసుకోమంటాడా! పక్క సందుల్లోకి ఎక్కడికన్నా పొమ్మంటాడు. అక్కడికి పోతే చెప్పులు కుట్టించుకునే బాబులు ఎవ్వరు దొరుకుతారు?

వాళ్ళమ్మ కాళ్ళు చుట్టేసుకుని పిల్లలు గొల్లున ఏడ్చారు. నేనిక తట్టుకో లేక తల గుడ్డలో నుంచి ఒక పావలా డబ్బులు తీసి, "ఇంతకంటే యిచ్చుకో లేను బాబూ," అని ఆయన చేతిలో పెట్టపోయా. అందరూ చూస్తున్నప్పుడు యివ్వటం తప్పనుకోలేదు.

ఆ డబ్బును చూచి యిటూ అటూ చూచి ఆయన ఉగ్రుడైపోయాడు, "లమ్డీ కొడకా, నాకు లంచం యిస్తావ్రటా?" అని బూటు కాలుతో డొక్కలో ఒక తన్ను తన్నాడు. అనుకున్నంత పనీ అయింది. నేను దూరంగా వెళ్ళి పడ్డాను. పావలా ఇవ్వబోవటం తప్పయిందట. డబ్బు ఇవ్వటం నాకు మాత్రం యివ్వాలని వుంటుందా? నేను మాత్రం ఇవ్వగలిగి యివ్వబోయానా? బెదిరించటం, అణో బేడో తీసుకోవటం వాళ్ళకు రివాజేనాయె. అందుకని తప్పదని ఇవ్వబోయా. అదే తప్పయిపోయింది. డొక్క జివ్వున లాగుతూ వుంది.

గుడిసెదీ పిల్లలూ ఒక్కటే ఏడుపు. గల్లంతుకి దారేపోయే వాళ్ళందరూ జేరారు. అందరూ నన్ను తిట్టేవాళ్ళే. "నాలుగు పైసలు జేరేటప్పటికి వళ్ళు

బలిసింది. వీడి బతుక్కి వీడు పోలీసాయనకు లంచం యిస్తాడు?....... ఏంరా! కళ్ళు నెత్తి కొచ్చినయ్యేటరా?"

"లేదు బాబూ."

"లేకపోతే నీబతుక్కి తోడు పోలీసాయనకి లంచం యిచ్చేదాకా వచ్చావా? ఆయన ఎవరనుకున్నావు? ఎంత కరెక్టు మనిషి! వీణ్ణి జైల్లోకి తోయించండి పోలీసుగారు, అప్పుడు గాని వీడికి బుద్ధి రాదు."

బుద్ధి గడ్డి తిన్నది బాబూ, నా తప్పు ఈసారికి కాయండి" అని బ్రతిమాలుకున్నా .... ఆయన వినలేదు. వినే వీలు లేకపోయిందని, నాకు తరువాత తట్టింది. ఎవర్నని ఏం లాభం?

తోలు ముక్కలు ఏరుకొని, డేరాగుడ్డ చంకనపెట్టుకొని చెప్పులు మూట కట్టుకొని, నేనూ, గుడిసెదీ, పిల్లలూ గుడిసెదారి పట్టాం. నాలుగు రోజులు ఎవ్వరికీ మెతుకు లోపలకు పోలేదు. ఏం చేస్తాను? ఒకటి రెండుసార్లు నేను కూర్చునే స్థలం వైపుకు వెళ్ళి చూశాను. అది ఖాళీగానే వుంది. బారువుమంటూ వుంది. చెప్పులు కుట్టుకోవటానికి నేను గోడకు కొట్టిన మేకులు యింకా అక్కడే వున్నయ్. నన్నంతా మరచిపోయినట్లే వున్నారు. మరచిపోక నేను అజలోవాణ్ణా, లెక్కలోవాణ్ణా?

మరుసటి రోజు, ఆ బజారు విడిచిపెట్టి మరొక బజార్లో కూచున్నాను. రెండు మూడురోజులు కాస్త కొత్త అనిపించింది. గాని అక్కడా బాగానేవుంది. గుడిసెదీ పిల్లలూ అక్కడకు వచ్చి కూర్చునేవారు. మళ్ళీ రోజులు మామూలుగా గడిచిపోతున్నాయి. పోలీసు చేసిన పని అందరం మరచిపోయాం. కష్టపడి సంపాదించి, వొక చెప్పులు కొట్టు పెట్టాల నేనూ గుడిసెదీ ఒక రోజు అనుకున్నాం, బజార్లో ఒక చెప్పులకొట్టు చూచినప్పుడల్లా అటువంటికొట్టు పెట్టాలని నేను ఎప్పుడూ అనుకుంటూ వుండేవాణ్ణి. ఆరోజు అందరం సంతోషంగా నిద్దర పోయాం. కొట్టు పెట్టుకుంటే నాది – అనేది ఒక్కటి ఏర్పడుతుంది. ఏ పోలీసు భయమూ ఉండదు. కొట్లో కూచొని గుడిసెదాన్ని సరసన కూచోబెట్టుకొని.... ఆలోచిస్తూ అట్టానే నిద్దురపోయాను.

ఆరోజు మొదలుకొని అందరం కష్టపడి పనిచెయ్యటం మొదలుపెట్టాం. పెద్దపిల్ల కొంచెం అక్కరకు వచ్చింది. పని ఎక్కువయి గుడిసెది నాతోనే కూర్చున్నా, అది కూడు ఉడకేసి పెట్టేది. పది రూపాయలు వెనక వేశాం.... యిరవై రూపాయలు వెనక వేశాం, ఇంకొక నెల పదిరూపాయలు వెనకవేస్తే కొట్టు అద్దెకు తీసుకోవచ్చు – అనుకున్నాం. ఒక కొట్టు మేమున్న స్థలానికి

దగ్గరలోనే వుంది. అది అద్దెకు తీసుకొని, జేరి నెమ్మదిగా బేరం సాగిద్దాం అనుకున్నాం ఒకరోజు. కానీ, అన్నీ మనం అనుకున్నట్లు సాగుతయ్యా? అందులో నాబోటివాడికి! సాగవు. ఒకరోజు గుడిసెది వచ్చి పక్కన కూర్చుంది. పాలిష్ చెయ్యవలసిన చెప్పులు వుంటే అవి తీసుకొని పాలిష్ చెయ్యటం మొదలుపెట్టింది. నా కన్ను పడింది. ఏదో కొత్తగా కనిపించింది. అది ఎట్లా పాలిష్ చేస్తుందో నాకు తెలుసు. ఇవ్వాళ ఎవరో కొత్త మనిషివచ్చి పాలిష్ చేస్తున్నట్టు అనిపించింది. నెమ్మదిగా చూశాను దాని చేతుల్లో యిదివరకు సత్తువ లేదు. చేతులు వణుకుతున్నాయి.

"ఏందే?" అన్నాను.

"ఏం లేదు' అంది.

దానికళ్ళు ఎర్రగా వున్నయి. మెడమీద చెయ్యివేసి చూశాను. వళ్ళు కాలతావుంది.

"జరం వచ్చిందే" అన్నాను.

"అదే పోతది" అన్నది.

కానీ జరం పోలేదు. రోజు రోజుకి ఎక్కువయింది. పైగా దగ్గు, వట్టి పొడిదగ్గు. ఏవో అవీయివీ నూరిపోశాను. తగ్గలేదు.

"డాక్టేరు దగ్గరకు తీసుకువెళ్తా" అన్నాను.

"వద్దు. డాక్టేరు తీసేస్తాడా ఎట్లా?" అంది.

"సూది మందిస్తే తగ్గుద్దే" అన్నాను.

"ఏ సూది మందిస్తే వచ్చింది?" అంది.

దానికి డాక్టేరు దగ్గరికి రావటం యిష్టంలేదు. దాని ఆలోచన నేను కనిపెట్టాను. డాక్టేరుదగ్గరకు వస్తే కూడబెట్టిన డబ్బు అయిపోతుంది. మరి కొట్టో!! నేనుకూడా నాలుగు రోజులు పస్తాయించి చూశాను. జరం తగ్గలేదు. పొద్దున్న తగ్గినట్టుండేది; పొద్దుగూకే తలికి యెక్కడనుంచి వచ్చివడేదో, గుడిసంతా గోల అయిపోయింది. పిల్లల్ని ఆకట్టటం నాతరం కాలేదు. పనిమీదకు మనసే పోయేది కాదు. ఒకరోజు, కాదు గూడదని పట్టుపట్టి డాక్టేరు దగ్గరకు తీసుకుపోయా.

ఆయన బాగా పరీక్ష చేసి "వూపిరితిత్తులు చెడిపోయినై" అన్నాడు.

"ఏందీ?"

"వూపిరితిత్తులోయ్, వూపిరితిత్తులు."

"ఎందుకు చెడిపోయినై బాబూ?"

డాక్టేరు చెప్పాడు. తప్పు నాదే అన్నాడు. నేను ఎప్పుడూ దాన్ని దుమ్ములో కూచోబెట్టానంట. ఆ దుమ్ము ముక్కుల గుండా లోపలకువెళ్ళి గుండెలు చెడిపోయినయ్యంట. అందులో జనం ఎక్కువగా తిరిగేచోట కూర్చో బెట్టగూడదంట. నేను దాన్ని అక్కడే కూచో బెట్టానంట. చేతులారా చేసుకున్నానంట. ఇదేం అన్యాయం? జనం లేనిచోట కూర్చుంటే పొట్ట నిండేది ఎట్లా? అప్పుడప్పుడూ నా దగ్గరకు వచ్చి చెప్పులు జాగు చేయించుకునేవారు ముక్కుకి గుడ్డ అడ్డం పెట్టుకు వచ్చేవాళ్ళు. ఎప్పుడన్నా అయితే సరిపోతుందిగాని ఎప్పుడూ రోడ్డుపక్కన కూర్చునే మా కెట్టా కుదురుతుంది—ముక్కుకి గుడ్డ అడ్డం పెట్టుకోవటం? దుమ్ములో పుట్టాం దుమ్ములో పెరిగాం. ఎక్కడని ముక్కుకి గుడ్డ అడ్డం పెట్టుకునేటట్టు?

ఏదైతే, ఎట్టాగయితే, గుడిసెది కాలంచేసింది. దాని జబ్బుకి ఉన్నదంతా ఖర్చుపెట్టాను. నేనూ పిల్లలం మిగిలాం. ఇక కొట్టు పెట్టాలనే ఆశలేదు నాకిప్పుడు. చచ్చేదాకా బతకటం ఒకటే మిగిలింది. అక్కడే కూర్చుని చెప్పులు కుడుతున్నా. పెద్దపిల్లవచ్చి కూర్చుని నాకు తోడుపడుతూ వుంటుంది. అది అచ్చగా వాళ్ళ అమ్మలాగే పాలిష్ చేస్తుంది. అప్పుడప్పుడూ రోడ్డుమీద రేగే దుమ్ము జ్ఞాపకం వచ్చి గుండె గభేలుమంటుంది. కాని ఏంచెయ్యను? దుమ్మును దాటి ఎక్కడికి పోయేటట్టు? దుమ్ములో పుట్టాం. దుమ్ములో పెరిగాం, దుమ్ములోనే చస్తాం.

* [ ఏప్రిల్, 1961] *

# ఊరబావి

కొలకలూరి ఇనాక్

ఊరబావి చుట్టూ జనం మూగారు. తొంగి చూచిన వాళ్ళ ముఖాలు చిట్లించుకొని వికారంగా కనిపిస్తున్నారు. బారెడు పొద్దెక్కినా బావి గచ్చు మీద నీటి చెమ్మలేదు. బావి పక్క మురుగు గుంటలో బ్రతుకు తెల్లవార్చుకొంటున్న కప్ప ఒకటి కుంట వెలుపలకు వచ్చి, తల బైటకి వెళ్ళ బెట్టి చూస్తూ ఉంది.

జనం వస్తున్నారు, వెళుతున్నారు. తాము పుట్టి భూమిమీద పడ్డాక ఇటువంటిది చూళ్ళేదు, వినలేదు అని వృద్ధులే చెబుతున్నారు. మునసబు రావడంతోనే కొందరు తప్పుకొని తోవ ఇచ్చారు. మునసబు తొంగి చూశాడు. నీళ్ళు ఎర్రదాలు దిరిగాయి. నీళ్ళమీద పూర్తిగా మునక్కుండా, తేలకుండా, గిలకలకు కట్టిన మోకులు కారణంగా నాలుగు కాళ్ళూ పైకి ఎగదట్టిన తోలు ఒలిచేసిన ఎద్దు దట్టెం మాంసంలోని సారం నీళ్ళలోకి దిగిపోతే పాలిపోయిన దట్టెం!

"ఎవుడీ పన్జేసింది?" మునసబు కళ్ళలోంచి దిగివచ్చిన కోపం మీసాల మీదుగా పాకి పెదాల కొసల్లోంచి జారి, పళ్ళ మధ్య పదునుదేలుతూ ఉంది. మునసబు ఆ ఆలోచనలోనే ఇంటికి చేరుకున్నాడు. కరణం, వెట్టివాళ్ళు, రైతులు వెంటనే ఉన్నారు. ఏ జీతగాడూ ఆ చుట్టుపక్కల లేడు.

"ఎవుడు జేసుంటాడీ పని?" అందరికీ ఇదే ప్రశ్న! కొందరికి చూచాయగా 'వాడే' అనిపించింది. "అన్నిటికీ ఆడే అంటం ఏం బాగుంటది" అనీ అనిపించింది. అనుమానం స్థిరమయింది. రాముడి కొడుకు చిదంబరం ఇంతచేసి ఉంటాడు.

మునసబు తన ఇంటి ప్రహరీ ప్రక్క అరుగు మీద కూర్చున్నాడు. రైతులు కొందరు ఎదటి వీధిలో నిలబడ్డారు. వెట్టి మనిషి తెచ్చి ఇచ్చిన చుట్ట ముట్టించుకొని, గవదలు చొట్టలు పడేటట్లు పొగపీల్చి, దవడలు ఉబ్బించి పొగ వదలి, చుట్ట కొరికి కాండ్రించి ఉమ్మివేసి "వాడే!" అన్నాడు. అని చుట్ట పొగ గట్టిగా పీల్చి కాస్తంతసేపు గొంతులోనే పొగ ఉంచుకొని, వదులుతూ "చిదంబరం" అన్నాడు. పొగ కందెనతో యంత్రం కదిలి, తిరిగి, పొగతో పాటే యంత్రంలో పొట్టూడిపోయిన వడ్లగింజ బియ్యంగింజ అయి బైటికి వచ్చినట్టు చిదంబరం పేరు వెలుపలికి వచ్చింది.

"అంతే!", "ఆడే!", "ఎంత పిదపకాలం", "ఏదో మూడింది", "నాశనం నాశనం అయిపోతారు!" వీధిలో ప్రహరీ అరుగుకి ఎదురుగా ఉన్న రైతులు ఏమేమో అనుకొంటున్నారు. నాగరికత ఏర్పడక పూర్వం, సంఘం సరిగ్గా రూపురేఖలు దిద్దుకోక పూర్వం, దేనికీ వ్యవస్థ సక్రమంగా నిర్ణయం కాని సమయంలో, ఏదీ నిర్ణీతంగా లేని దశలో, క్రమంగా, ఋజువుగా నీతికి కట్టుబడి ఉండాలని కోరే మానవ సమాజంలో వేదం ప్రతి విషయానికి ఆధారం అయినట్టు వేదగత విషయం అధికారికమయినట్టు, ఇంత నాగరికత, సభ్యత, సంస్కృతి, మానసిక స్వాతంత్ర్యం ఉన్నాయనుకొంటున్న ఈ రోజుల్లో ఆ గ్రామంలో మునసబు మాట చెలామణి అవుతూంది. ఒక్క మాటలో ఆ ఊరిలో మునసబు మాట వేదవాక్కు!

ఆ ఊళ్లో రమారమి నాలుగు వందల గడపలో వంద గడప హరిజనుల పల్లెలో ఉంది. ఎండాకాలంలో ఆ పల్లెలో నీటి ఎద్దడి. పాపిష్టి గుటక దిగటానికి గటక ఉండదన్న జనవాదం నిజమయితే. హరిజనులేం పాపం చేసుకొన్నారో, తంచనుగా వేసవిలో పల్లెలో ఉన్న ఒకే ఒక్క బావి వట్టిపోతుంది. రాత్రంతా ఊరిన నీరు, తెల్లవారు జామున నాలుగు కావిళ్ళు మోస్తే, బావిలో నీటిచెమ్మ లేకుండా పోతుంది, రాత్రి బెత్తెడెత్తు నీరున్న బావి పగలు చెమ్మలేకుండా అయి పోతుంది.

ఊళ్లో ఉన్న అయిదు బావుల్లోను మూడు ఎండాకాలం ముష్టెత్తు కొంథాయి. రెండు బావుల్లో శ్మశానం ప్రక్కతోవలోనే ఉన్న బావి ఏటెల్లకాలం

జలసమృద్ధితో ఉంటుంది. పిడికెడు జల! ఎప్పుడో తప్ప ఆ బావి నీళ్ళు తెచ్చుకోదు ఊరు. ఊరికి విసిరేసినట్లుందా బావి! ఆరోజు ఊరంతా ఆ బావినీళ్ళే తెచ్చుకొన్నారు. ఊరు పూర్వం ఈ బావికి దగ్గరగా ఉండేది. జనం పెరగటంతో ఇళ్ళు పెరగటం ప్రారంభమయి, శ్మశానం వైపుకాక దక్షిణంగా పెరిగాయి.

ఎద్దు దట్టెం వేలాడుతున్న ఈ బావి పూర్వం పల్లెకు దగ్గిరగా ఉండేది. ఊరు పెరిగిన తరవాత ఊరుకూ పల్లెకూ దగ్గిరయింది. పల్లె పెరుగుదల ఆ బావికి దక్షిణంగా జరగటంతో దక్షిణం వైపు బావి అగత్యం ఏర్పడింది. ఆ బావి ఎండాకాలం వట్టిపోతుంది. ఊరికీ పల్లెకూ మధ్యగా ఉన్న ఈ బావినే అందరూ ఊరబావి అంటారు. పల్లెకూ ఊరికీ మధ్యనున్న కంకరరోడ్డు మలుపు తిరిగేచోట ఉంది ఊరబావి. ఆ బావిలో ఏడాది పొడుగునా నీటికి ఎద్దడి ఉండదు.

రైలు స్టేషను దిగి, కోసున్నర దూరంలో ఉన్న చరిత్ర ప్రసిద్ధ దేవాలయ దర్శనార్థం కాలినడక వెళ్ళే యాత్రికుల సౌకర్యం కోసం ప్రభుత్వం తవ్వించిన బావి అది. మొదటి నుంచీ ఊరు ఆ బావిని వాడుకొంటూ ఉంది. బావి చాలా పెద్దది. ఎనిమిది గిలకల బావి. రెండు నిలువుల నీరు ఏ క్షణమూ తగ్గిపోదు. పాత కట్టడమే అయినా గట్టి కట్టడం. క్వారీ రాయితో కట్టిన బావి! ఏభైమంది ఏ కష్టం లేకుండా పడుకోటానికి అనువుగా చుట్టూ సిమెంటు చప్టా ఉంది. సిమ్మెంటు పెళ్ళలు లేచిపోయి, ఈ మధ్య గుంటలువడి ఎర్రరాళ్ళు కనబడుతున్నాయి. బిందెలు, బానలు, కడవలు పెట్టడానికి అనువుగా అరిగి పోయి కుదుళ్ళు ఏర్పడ్డాయి. తాళ్ళు తగిలి, కడవలు, బొక్కెనలు, గీసుకు పోయి, సిమ్మెంటు రాలి, రాళ్ళు అరిగి కోపులు పోయి, బావికి వార్ధక్యం వచ్చింది. బావిలోపల నీళ్ళపైన రాళ్ళ మధ్యనించి పుట్టుకువచ్చి రావిమొక్కలు నాలుగైదు పైకి నిక్కి చూస్తూ ఉన్నాయి.

ఎండాకాలం ఎక్కువగా ఆ బావిలో నీళ్ళు ఊళ్ళోవాళ్ళు తోడుకు పోతుంటారు. మిగతా సమయాలలో వాళ్ళకు ఊళ్ళో బావులనీళ్ళే ఉబ్బిడి సబ్బిడి.

ఊరబావి నీళ్ళు ఊళ్ళోవాళ్ళు తోడుకుపోతున్న సమయంలో పల్లెల్లో వాళ్లు వస్తే, యాచిస్తే, ఇష్టం అయితే, రైతు తను తోడి వంపులేసుకొనో, కావిళ్లు వేసుకొనో, వచ్చినమగవాళ్ళకూ, బానలూ బిందెలూ తీసుకువచ్చిన ఆడవాళ్ళకూ పోస్తారు. పల్లెవాళ్లు తీసుకుపోతారు. రైతుకు ఇష్టం లేకపోతే, శ్రమ సహించలేక పోతే, కష్టం అయితే అప్పటికి పల్లెవాళ్ళకు నీళ్ళుండవు. ఊరబావిలో నీళ్ళు పల్లెవాళ్ళు తోడుకోరు. వీల్లేదు. ఎవరయినా నీళ్ళుతోడి పోసిందాకా, పోసే మనిషి వచ్చిందాకా వాళ్ళు ఆగవలసి ఉంటుంది— ఎంత సేపు అయినా సరే! ఒక్కొక్క రోజు మధ్యాహ్నం వచ్చినవాళ్ళు సాయంకాలం గానీ నీళ్ళు తీసుకుపోలేరు.

ఆ ముందురోజు ఉయదం బానతో బావి దగ్గరకు వచ్చింది స్త్రీ! పల్లెలో నించి వచ్చింది. పొద్దు రెండు బారలెక్కింది. ఆమె పేరు ఎవరికీ తెలియదు. పల్లెలో తెలిసిందంతా ఆమె చిదంబరం భార్య అనే! ఊళ్ళో మాత్రం ఆమె రాముడి కోడలుగా తెలుసు! పోయిన ఎండల్లో పెళ్ళయి ఆమె కాపరానికి వచ్చింది. ఆమె ఒడ్డూ పొడుగూ ఉన్న మనిషి. అలంకారాలు అంతగా లేవు. యౌవనం కలిగించిన సంపద శరీరం అంతటా ఉంది. భారీ విగ్రహం! ఒక సారి చూస్తే, ఎవరికయినా మళ్ళీ చూడాలనిపిస్తూంది. కను ముక్కు తీరు తీరు బడిగా చెక్కిన బొమ్మను స్ఫురింపజేస్తాయి. అవయవాలు కుదిరికగా ఉన్నాయి. కళ్ళలో కళ ఉంది.

ఆమె బాన పట్టుకువచ్చి, బావి చప్టాకు ఎడంగా, కంకర రాళ్ళు గుచ్చుకో కుండా ఇసక కుదురు చేసి బాన పెట్టింది. అప్పుడు నీళ్ళు తోడుకుంటున్నది వృద్ధుడూ, బాలుడూ కాదు - యువకుడు! అందుకే "రొండు కడవ లిందులో దిమ్మరించు, దొరా!" అంది. "అట్టాగేనే!" అన్న యువకుడు బానలో రెండు కడవలు తోడి పోశాడు. నిండింది. తను తోడుకున్న కడవలు మట్టుల్లో పెట్టు కుని, కావిడిబద్ద భుజంమీద పెట్టుకోపోతూ ఆగి, ఆమె ముఖంలోకి చూశాడు. అక్కడే నిలబడివుంది. కావిడిబద్ద కిందపడేసి దగ్గిరగా వచ్చి ఆమె ముఖంలోకి చూచి కిసుక్కున నవ్వి "ఏఁవింకా నిలబడ్డా" అంటే ఆమె "ఎందుకేం దట్టా నవ్వుతా?" అని "ఎవుళ్ళెత్తుతారేంది?" అని ముగించింది. "అంతెత్తు లావుండా! వెత్తుకోలేవేంది?" అంటే "ఎవుళ్ళన్నా వొత్తార్లే! అన్నదే ఆమె సమాధానం!

"నేనెత్తేదేంది, సెప్పు?"

"నువ్వెత్తేదేంది దొరా! నువ్వేందెత్తేది?"

"పొట్టు, ఎత్తుతా, పొట్టువే" యువకుడు ముందుకు వంగాడు. ఆమె "సరే" అని పైట చెంగు బిర్రుగా లాక్కుని తలమీద కుదురు చుట్టుకొని వంగింది. ఆమె కళ్ళు, ముక్కు, పెదవులు, మెడ, గుడ్లు మిటకరిస్తూ చూచి, కళ్ళు మూసి, మూస్తూ తెరుస్తూ నిలువెల్లా చూచి, బాన అంచు పట్టుకొని పైకెత్తేడు. ఆమె బాన అడుగున రెండు చేతులేసి తలమీదికి తెచ్చుకొంటూంది. బిర్రుగా బిగిసిన చీరె, బలంగా బిగిసిన చేతులూ, శరీరం చూస్తూ బాన నెత్తిన పెట్టిపెట్టకముందే, అతను, హడావుడిగా చేతులుతీసి, దొంగలాగా అయి పోయాడు. "ఏంది? ఏందిది?" అంటూ ఆమె వెనక్కి జరిగింది. బాన నెత్తిన నిలువలేదు. ఆమె చేతులు గుండెలమీదికి వచ్చాయి. బాన ముందుకు, యువకుడి మీదికి పడింది. పగిలింది. నీళ్ళు అతని ఒళ్ళంతా పాకాయి. చేయి ఎత్తి చాచి

యువకుడి చెంపమీద కొట్టింది. విసవిసా నడుచుకొంటూ పోయి మామతో చెప్పింది. అపైన భర్తకు తెలిసింది. పల్లె పల్లెంతా మంట పుట్టింది.

"ఆడికెన్ని గుండెలూ అంట? అడగూతురు వంటిమీద చెయ్యేత్తాడా? అణ్ణెత్తురు కళ్ళజూత్తా!" అని ఎవరో కోప్పడుతుంటే, చెప్పులు కడుగుతూ కూర్చున్న రాముడు పక్టెడనారు కొరికి ఉమ్మేసి "ఊరుకోండెసె! ఏందో కుర్ర నాగమ్మ ఏడిసేడని ఎందుకట్టా యిదవేది? యేఁవౌరుగుద్దంట? ఆడి పావం వాణ్నే గొట్టుద్ది! ఐనా ఎందుకేందీ కవర్లాట? నోరు మూసుకోండెసె! అల్లరి అదమాయింపులూ ఏందీ గోల? ఏ చెర్లో కప్పలా చెర్లోనే ఇఁవడాలి గందా! ఎందుకంటా ఈ కచ్చులు? పోనిండెహే! దేవుడెవుడెవుడి కెంతెంత బెట్టాడో అంతే జరుగుద్ది? ఎవుళ్ళ కర్మ కెవుళ్ళు కర్తలు? మజ్జలో మనఁవేంది జేసేది? నోళ్ళు మూసుకొని మీ ఇళ్ళకు మీరు బొండరే!" అన్నాడు. వచ్చినవాళ్ళు వెళ్ళి పోయారు. అప్పుడే తాటి గెల భుజం మీద వేసుకొని, బొడ్లో కత్తి దోపుకొని వచ్చిన చిదంబరం ఆ సంగతంతా విని బొడ్లో కత్తిదీసి గెల నడిబొడ్డులో నాలుగంగుళాలు దిగేట్టు నాటి, "నా తప్పు! పొద్దున్నే తాటి ముంజలకు తగలడ్డం నా ఖుత్తక్కువ! దీన్నాడికి బోసీయకుండుంటే సరి! పేచే లేదు" అన్నాడు. "ఆ ఊళ్ళోడితో తగాదా బెట్టుకో వొద్దురోయ్!" అని తండ్రి హెచ్చరిస్తే, "నా కెందుకేంది తగాదా దిగాదా? దీన్ని బాయికాడికి నీళ్ళకు బంబకుండుంటే సరి! అంతా సరవుద్ది!" అని జవాబు చెప్పాడు. అంతటితో తండ్రి ఊరుకోలేదు. "మాటకు మాట తెగులు, నీటికి పాచి తెగులు అన్నట్లు, ఎందుకిట్టా జేసే వంటాఁవటాని అడిగేవు? దండగ! ఆడేదో అంటాడు. వింటా నువ్వూరు కొంటావని నేనెట్టా అనుకుంటా? మర్నామాటిని నువ్వా ఊసే మరిచిపో! ఏటంటా? అంటే "అట్టాగేలే" అని చిదంబరం కావిడి వేసుకొని బావి దగ్గిరకి పోయి ఎవరో తోడిపోస్తే ఆ రోజుకు సరిపడే నీళ్ళు తెచ్చాడు.

ముందు రోజు జరిగిన ఈ సంగతంతా మునసబు చెవిని పడకపోలేదు. బావిలో ఎద్దుదట్టెం వేస్తే ఊళ్ళోవాళ్ళు ఆ బావి తమకు వదిలివేస్తారని దొంగ తనంగా చిదంబరమే ఈ పని చేసి ఉంటాడని గట్టి నమ్మకం కుదిరింది. ఎద్దు దట్టెం పడ్డ ఆ ఊరబావి నీళ్ళు ఊళ్ళోవాళ్ళు ఇంకా ఏ విధంగా తాగుతారు? చుట్ట గట్టిగా పీల్చాడు మునసబు.

పొద్దుణ్నించి చిదంబరం ఎవరికీ కనబళ్ళేదన్న మాట మునసబు తెలుసు కొన్నాడు. అనుమానం బలపడింది. 'యాఁవయ్యాడీడు?' అందరికీ కలిగినట్టే మునసబుకూ ఈ ఆలోచన కలిగింది. వీధికి అవతల పక్క, మునసబు

కూర్చున్న అరుక్కి ఎదురుగా చేతికర్ర నేలమీద ఆనించి కుందు కూర్చున్న వెట్టిమనిషిని చూచి, "ఎట్టోణ్ణడిగితే సరిపోలా" అని ఎవరో రైతు ఇచ్చిన సలహా మునసబు వినలేదు; పొగ వెలుపలికి వచ్చేసరికి మెదడు మారుమూలల్లో ఆలోచన మెరుపై మెరిసింది. చుట్ట కొస కొరికి, తుపుక్కున ఉమ్మివేసి, పొగ పీల్చి తీవ్రంగా వదిలివేసి, చుట్ట నేలమీద పడేసి, ఎదుట ఉన్న అందరినీ చూచి విశాలంగా నవ్వాడు.

ఆ నవ్వుకు అర్థం వుంది. నిన్న నాంచారయ్య ఎద్దు చచ్చిపోయింది. అతను రాముడుకు రైతు. ఆ ఇంటిల్లపాదీ నాంచారయ్యకు పొలం పనులు చేస్తారు. రాముడే నాంచారయ్య ఇంటిల్లపాదికీ చెప్పులు కుట్టివ్వాలి. అందువల్ల ఆ చచ్చిన ఎద్దు రాముడికే అస్తి! ఊరబావిలో దద్దెం నాంచారయ్య ఎద్దుదే! ఆ పని చిదంబరందే! మునసబు నవ్వు పూర్తిగా మీసాలతో కలిసి వలుపు తిరక్క ముందే వెట్టివాళ్ళతో రాముడు కొడుకును పట్టుకు రమ్మని ఆజ్ఞా పించాడు.

రెండేళ్ళకి పూర్వం వేణుగోపాలస్వామి దేవాలయం దగ్గిర ఉత్సవం జరుగుతుంటే చెరువు గట్టు మీద కూర్చుని చూస్తూ ఉన్న చిదంబరం గుండెలో కోర్కె నృత్యం చేసింది. "సోఁవీ, దాంతో నాగ్గాని పెళ్ళయిందంటే నీకు పాతి క్కొబ్బరికాయలు గొడతానని మొక్కుకున్నాడు గానీ పూర్వాపరాలు ఆలోచించలేదు.

కోరుకున్న యువతితో పెళ్ళి జరిగాక, మొక్కుబడి తీర్చుకుందామంటే అన్ని ప్రబంధకాలయ్యాయి.

పూజారి "నేననేదేఁవుంది. ఎవురొచ్చి కొబ్బరి కాయలిత్తే వాళ్ళ పేరే గొడతా" అన్నాడు. ధర్మకర్త "దైవచింత గలిగితే ఇబ్బందులు చిక్కుదేసే దెట్టా?" అన్నాడు.

మునసబు "నీ కోర్కెను కాదనేదేఁవుంది? నువ్వావని జేత్తే సూత్తూ ఊరుకోటానికి ఊళ్ళోవాళ్ళ చేతులకి గాజుల్లేవు. ఆపైన్నీయిట్టం" అన్నాడు.

రాముడు "మంచిదేరా మరి అదెట్టా యీలవుద్దో యేందో, ఆలోసించుకో. మజ్జలో నేనేం జెప్పేది — యేఁవన్నా జేయ్ ఫరవాలేదు, కత్తులూ, కటార్లూ మాత్రం ఈ సమయంలో ముట్టుకోవద్దు, ఎటుదెబ్బబడ్డా కట్టఁవే. ఇగ నీయిష్టం" అన్నాడు.

అందరూ అంత నేర్పరులు కారు. అందుకే నాంచారయ్య దగ్గిర నించి పల్లెలో నారయ్యదాకా అందరూ అదంత మంచి పని గాదన్నారు. ఇంట్లోనే ఆ

మొక్కుబడి తీర్చుకుంటే పోదా అనిపించి, దేవుడి సొమ్ము దేవుడికే చెల్లించాలని నిర్ణయించుకొన్నాడు. అది భయంలోంచి పుట్టిన నిర్ణయం. అర్ధ రాత్రి ఎవరూ లేని సమయంలో గుళ్లో జొరబడి మొక్కుబడి తీర్చుకువస్తే సరిపోదా అనుకొని అది పిరికివాళ్ళు, దైవ భక్తి లేనివాళ్ళు చేసే పని అని భావించుకొని తనను తానే తిట్టుకొన్నాడు చిదంబరం.

చివరకు పోలీసు అధికారి సాయంతో మొక్కు తీర్చుకొన్నాడు. అయితే అది ఊరి గుండెలో పుండు అయింది. చిదంబరం కలిస్తే కారం జల్లినట్లు ఉంటూ ఉండేది. ఆ గాయం ఇంకా మానలేదు. సంవత్సరం అన్నా కాలేదు.

ఆ మధ్య ఊరి ప్రతినిధి మునసబు గుండెలో పుండు మానిపోతూ సెల వేసింది అందుకూ కారణం చిదంబరమే! రంగస్థలం రైల్వే స్టేషన్!

ఆ రోజు భార్యతో బస్తీకి బయలుదేరాడు చిదంబరం. సినిమా చూచి రావాలని టికెట్లు తీసుకున్నాడు. సిగ్నల్ ఇచ్చి ఉంది. రైలు అప్పుడే రాదని పించింది. ఫెన్సింగ్ పక్క చిటికేసర చెట్టు కింద సిమ్మెంటు బెంచీ ఖాళీగా ఉంది. భార్యతో పాటు కూర్చున్నాడు. ఊళ్ళోనించి వచ్చిన నలుగురు కూర్చునే చోటు ఖాళీ లేకపోవడం చూచి చీమలు ఒంటిమీద పారాడినట్లు అయిపోయారు. వాళ్ళను చూడగానే సహజంగా లేచి నిలబడబోయాడు చిదంబరం. అసహ జంగా ఆగిపోయాడు. లేవలేదు. కారణం పక్క భార్య కావచ్చు. వాళ్ళు తన రైతులు కాకపోవడం కావచ్చు. ఇష్టం లేకపోవడం కావచ్చు. మూడు భావాల సమాహార రూపం పనిచేసి ఉండవచ్చు. త్రిగుణీకృతాంహంకారం కావచ్చు.

"యేరా, కళ్ళు గానపట్టంలా?" అంటే చిదంబరం తల ఎత్తి వాళ్ళ కళ్ళ ల్లోకి చూచి, "కనిపిస్తున్నాయి." అన్నాడు. "వొళ్ళు పొగరెక్కిందా?" అంటే "లేదు" అని చెప్పిన చిదంబరం లేవలేదు. "ఉతకండ్రా నాలుగు, వొళ్ళు పొగరు" అని ఒకతను చేయి ఎత్తాడు. దెబ్బ పడబోతోందని చిదంబరం తెలుసుకొనేలోగా ఆమె ఎత్తిన చేయి పట్టుకొని "ఉండవయ్యా, పెద్దమణిసి! యేంది చెయ్యెత్తా? ఆఁ!" అంటూ అదమాయించింది. అరుపులు, వినిపించాయి. పోర్టర్లు, ప్రయాణీకులు పోగయ్యారు. స్టేషన్ మాస్టరు వచ్చాడు. "యేం దయ్యోవ్, ఆడగూతురు మీద చెయ్ జేసుకుంటున్నావో" అని సర్దారు. "ప్రయా ణికులు ఎవరైనా ఇక్కడ కూర్చోవచ్చు. తప్పు లేదు. ముందెవరు వస్తే వాళ్ళే కూర్చుంటారు. వాళ్ళను కూర్చోవద్దు. అనే అధికారం మాకూ లేదు. మరొకరికీ లేదు. అంచేత ఇక్కడ తగాదా వద్దు" అన్నాడు స్టేషన్ మాస్టరు. అంతలో రైలు వచ్చింది. ఎవరంతట వాళ్ళే రైలెక్కారు. పైకి తగాదా ఆరిపోయింది.

లోన రగులుకోవటం మొదలైంది ఎండు గడ్డి వామిలాగా. ఆ రోజు నుంచి పల్లెవాళ్లు యథేష్టంగా ఆ బెంచీల మీద కూర్చుంటున్నారు. అందువల్ల మంట ఆరిపోలేదు.

దీనితో మునసబు గుండెలో పుండు మరీ పచ్చిగా అయిపోయింది. బావి దగ్గిర జరిగిన అత్యాచారంతో కాకి పొడిచిన ఎద్దు పుండు లాగా గుండె తీపులు తీసుకొంటూ ఉంది.

చిదంబరం తీరు ఊళ్ళో వాళ్ళకు నచ్చలేదు. పల్లె వాళ్ళు సంతోషంగా చెప్పుకోలేదు. సత్యనారాయణ లా డిగ్రీ పొందాడు. బస్తీలో అద్దె గదికి బోర్డు కట్టాడు. ఎప్పుడో తప్ప ఏడాది పొడుగునా ఊళ్లోనే ఉంటాడు. చదువుకొనే రోజుల్లో సమ్మెల్లో పాల్గొన్నాడు. 'గాంధీజీ' అన్నాడు. జైలులో ఉన్నాడు. కొంతలో కొంత విద్యార్థి నాయకుడుగా చెప్పుకోబడ్డాడు. హక్కులూ, సమానతా, స్వాతంత్ర్యం వంటి మాటలు అన్నాడు, అంటే విన్నాడు. ఆ రోజు "ఒరేయ్, తమ్ముడూ, చిదంబరం!" అన్నాడు "ఏం దొరా?" అనటం విన్నాడు.

"దొరా గిరా అనొద్దురా! నువ్వు రెండు మంచి పనులు చేశావు. నాకు నచ్చాయి. నిన్ను మెచ్చుకొంటున్నాను. అభ్యుదయం కావాలని కావాలని కాకుల్లాగా అరిస్తేరాదు. తెచ్చుకొంటే వస్తుంది. మేం స్వాతంత్ర్యం తేవాలని అరిచాం. తెచ్చుకోకపోలేదు. తెచ్చుకున్నాం. ప్రయత్నం.... ప్రయత్నం అవసరం అంటరానితనం పోవాలని గొంతు చించుకొన్నా, కాగితాలు కరాబు చేసినా, బడ్జెట్ కేటాయింపులు జరిగి లక్షలు తగలేసినా, గోడమీద పిల్లులాంటి బిల్లులు, శాసనాలుచేసినా ప్రయోజనం లేదు. సమానత్వం ఇచ్చేది కాదు. తెచ్చుకొనేది. మీరు తెచ్చుకొనే ప్రయత్నం చేయకపోతే, మేం అందరితో సమానం అని నమ్మకపోతే, ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే అన్నట్లుగా అవుతుంది. తమ్ముడూ, నువ్వు జేసిన పనులు నేను ఆనందంగా అంగీకరిస్తున్నాను. 'ఊరు అనే మనిషి రెండు చేతులు వంటి మాలపల్లె, మాదిగ పల్లెలను తెగగొట్టుకొని దూరంగా పారేసుకొని 'మేం ఏమీ చేయలేకపోతున్నాం, మేం ఏమీ చేసుకోకుండా ఉన్నాం' అని ఏడ్చి ఏం ప్రయోజనం? ఈ ఊరికే కాదు, ఈ దేశానికే ఈ చీడ పట్టింది. ఈ జాతి రక్తంలోనే ఇది ప్రవహిస్తూంది. ఎప్పుడీ చేతులు అతుక్కునేది? ఎప్పుడీ దేశం చేతులు ఉపయోగించుకొనేది? ఎప్పుడూ మా దేశం అభ్యుదయం సాధించిందని గుండెమీద చేయివేసి చెప్పుకోగలిగేది?"

అంతా విని, ఆ రోజు భుజం మీద పలుగూ, దాని మీద వేలాడదీసిన పారా సరిజేసుకొంటూ చిదంబరం ఇంటికి వెళ్ళిపోయాడు.

ఎద్దు ముసలిదయింది. కాలం తీరి చనిపోయింది. బ్రతికి ఉన్నంతకాలం బాగా పనిచేసింది. అప్పుడెంత ప్రాణప్రదం అయిందో, చనిపోయి అంత భయ కారణం అయింది. ఎంత మక్కువ ఉంటే మాత్రం ఎంతకాలం దాన్ని సావిట్లో ఉంచుకోగలడా నాంచారయ్య?

రాముడూ, చిదంబరమూ బండి కట్టుకువచ్చి, ఎద్దును బండిమీద కెక్కించుకొని, దున్నల్ని పూని, తోలుకొని వచ్చారు. పల్లెకు పడమట ప్రక్క పోరంబోకులో ఎద్దును పడేసి, చిదంబరం బండి కట్టుకొని ఇంటికి వెళ్ళిపోయాడు. ఎద్దు తోలు ఒలిచి సలవతీసి పారేసి ఎద్దు చర్మంతోగాని ఇంటికిరాడు రాముడు. పోరంబోకులో వేపచెట్టు కింద ఎద్దు దట్టెం మీదా ఆకాశం నిండా తిరునాళ్ళలో జనంలాగా కాకులూ, గద్దలూ, రాబందులూ.

ఆ సాయంకాలం తోలు నానవేసి, నజ్జు నజ్జు సలవజేసి, సున్నం, నల గ్గొట్టిన కరక్కాయా, తంగేటి చెక్క కలిసిన గెలగాబులో ఊరవేశాడు రాముడు.

రాత్రి చీకటి పడ్డ దాకా వేపచెట్టు కింద ఎద్దు దట్టెం కాకులూ, గద్దలూ, రాబందులూ పీక్క తినగా మిగిలింది ఉంది. రాత్రి ప్రక్క ఊరినుంచి వచ్చిన వ్యక్తి దాన్ని చూచినట్టుగా చెప్పుకొంటున్నారు. అయితే తెల్లవారే సరికి అది ఊర బావిలో ఉంది. చిదంబరం దుడుకు పిండం! ఇది వాడి పనే! లేకపోతే పల్లెలో వాళ్ళు ఎవరైనా చేసి ఉండాలది.

ఊర బావికి పది హేనుబారల దూరంలో రాముడి ఇల్లుంది. ఇంటి చుట్టూ ముళ్ళకంచే, చిల్లికంపలోంచి పెరిగి పిడికెడంత మొదళ్ళేసిన వేపచెట్టు అలవగా ఉన్నాయి. లోపల పది సెంట్లు నేల, రెండు నిట్టాళ్ళ ఇల్లు అది. క్వారీ రాళ్ళ కట్టడం. మట్టిగోడలు, పైన సిమ్మెంటు పూతలేదు. కప్పు గట్టిది కాదు. తాటాకు కప్పు. ఇంటి వెనుక ఎడం భాగంలో పెంటపోగు, కుడిపక్క గడ్డివామి, ఇంటి ముందు ఎడంవేపు గోడలోని పశువుల కొట్టం, అందులో రెండు బండి దున్నలు, పాడిగేదె కూడ ఉన్నాయి. ఇంటి ముందు ఆరు ఖాళీ గుంజల మీద పరచి తాటాకుల పందిరి. పడమటి శాంబరానికి తాటాకు లేచి తొర్రిగా ఉంది.

పందిరి మధ్య రాముడు కూర్చున్నాడు. కుడిపక్క పనిసంచి తోలుది ఉంది. ఎడం పక్క ఎరుపు దిరిగిన నీళ్ళు మూకుళ్ళో ఉన్నాయి. వెనుక ఖాళీ గుంజ కానించి, నిండ నీటితో తాబేటి కొయ్య ఉంది. ముందు పనిరాయి, పక్కనే గూటం. ఆరె, పనికత్తి. రాముడు చిటికెన వేలుమీద సరవుతున్నవారు. అంతకు ముందు ఎవరో ఇచ్చిపోయిన పాతచెప్పుల జత, ఉంగటం తెగితే, నీళ్ళలో వేసి

ఉంచాడు. దానికి ముందు అటకమీద చెప్పుడోలు మడత తీసి అట్టలు కోసుకొని, మళ్ళీ పైన పెట్టి వచ్చాడు.

"రావన్నా, సెప్పులు గాలా?"

"కాకేందిరా పిల్ల సన్నాసి, నిన్నే జేస్తినిగా!" అని చెప్పాడు వచ్చిన మనిషితో రాముడు. ఆ వచ్చిన మనిషి పక్క ఊరిలో జరుగుతున్న పెళ్ళికి పోవటానికి సిద్ధమయి వచ్చాడు. పెళ్ళికొడుక్కి కిర్రు చెప్పులు కుట్టించాడు. అందుకు రాముడు పెట్టింది పేరు.

"బాగుందయ్. మొకంలే, తీసుకుపో" రాముడు చెప్పులిచ్చాడు.

"తరువాత, దమ్ములో ఇస్తా."

"అట్లాగే లేసే." చెప్పులు తీసుకొని కూడా వెళ్ళకుండా ఉంటే రాముడే అడిగాడు: "రాత్రికి వొత్తావా?" అతను ఏమీ చెప్పలేదు. మళ్ళీ అన్నాడు: "లేబోతే పప్పన్నం తిని గుర్రుబట్టి నిదరబోయి లా లేసొత్తావా?"— "ఎట్టా? రేత్రికి రావాల్సిందే! ఇంటికాడ అది పిల్ల నాయాళ్ళతో సావలేకుండా ఉంది. ఎందల్లా ఏం కతా?— అది సరేగాని రాఁవన్నా, మనోడు చిదంబరం సేసేడం టున్నారే అదంతా!" ఇప్పుడు సమాధానం చెప్పటం రాముడి వంతు అయింది. "ఛా! ఛా! ఆడట్టాటోడు గాదురా! సేత్తే సెప్పి మరీ సేత్తాడు. దొంగెవ్వారం వాడి ఇంటా వంటా లేదు ఆణ్ణాకొడుకురా! యాఁవనుకుంటున్నావో యాఁవో!"

"యేందో. అందరూ ఆడే జేసేడంటా అని అంటున్నారు."

"ఆళ్ళ నోళ్ళలో పురుగులు బడతా యెపుడన్నాసరే!"

"బాగయింది, రావఁన్నా! పీడ ఇరగడయిపోద్ది ఆళ్ళాబాయి మన కొది లేత్తే! యెట్టా జరుగుద్దో యాఁవో సూద్దాం!"

'యేందో! అనుకొంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు. రాముడు మళ్ళీ పనిలో తలదూర్చాడు. చెప్పు ఉంగటం దగ్గర నానింది. చెప్పు పనిరాయి మీద పెట్టి గూటంతో గట్టించి తోలులోంచి ఉంగటం కోసుకొని, ఆరెతో బెజ్జం పైకెత్తి ఉంగటం తోలు దూర్చి, కుట్టువారు సవరు జేసుకొని ఆరెతో బెజ్జం వేసి, కన్నం లోంచి వారు లాగుతూ కుట్టటం ముగించాడు.

బావి దగ్గిర జనం ఉన్నారు. తొంగిచూస్తున్నారు. అక్కణ్ణుంచే అరిచాడు రైతు: "రాఁవుడూ! యారేయ్, రాఁవుడూ! అయ్యిందా?"

అయిందని చెప్పాడు. రైతు వచ్చి పాత చెప్పుల జత చేతికి తీసుకొని ఉంగటాలు చూచుకొని, నేలమీదవేసి కాళ్ళకు వేసుకొని "వొత్తానా" అంటూ వెళ్ళిపోయాడు.

"యాఁవత్తాడో యాఁవో?" రాముడు సణుక్కొన్నాడు కల్లాల్లో ఏమయినా ఇస్తాడనుకోవటానికి ఆ రైతు తన రైతు కాడు. ఊరబావి చూడటానికి వచ్చాడు. వచ్చేటప్పుడు ఉంగటం తెగింది. రాముడి కిచ్చాడు రాముడు కుట్టి యిచ్చాడు. తీసుకువెళ్ళిపోయాడు. ఏమయినా ఇద్దామనే తలంపే లేదు. ఒక మనిషి తనకు ఊరికినే పనిచేయటం కోసం, తన కాళ్ళు కాపాడటం కోసం, దేవుడే సృష్టించి ఇక్కడ పారేశాడని నమ్ముతాడు. అతనొక్కడేకాడు, రైతులంతా అంతే!

ఈ మనిషి చేసిన పనికి, పల్లె జీవితంతో డబ్బు ప్రసక్తి లేనిరోజుల్లో, ఆ మనిషి పంటల కాలంలో పండిన దాంట్లోంచి అంతో ఇంతో ఇచ్చేవాడు. అలాగే ఏటి పొడుగునా సరిపడే వస్తువులు లభ్యమయ్యేవి.

కాలం పోయింది. ఇప్పుడంతా మారిపోయింది. రైతుల బ్రతుకే కరువైన రోజుల్లో అంతంత మాత్రం అయిపోయింది. పెద్ద రైతులు ఇప్పటికీ పంటల కాలంలో కొద్దో గొప్పో యిస్తారు. చిన్న రైతులు ఇవ్వలేరు. అయితే ఆ రైతులు పొందే హోదా ఈ రైతులూ కావాలనుకొంటారు గానీ మరేమీ ఆలోచించరు.

కొత్తగా కోసిన అట్టలు బాగా నానాయి. పనిరాయి మీద గూటంతో గట్టిస్తున్నాడు. పండి రాలిన వేప పళ్ళు తింటానికి వచ్చిన గండుచీమ బాగా తిని, ఒళ్ళు కొవ్వెక్కి, ఉండవలసిన చోట ఉండక పందిరిలోకి వచ్చి, అంతటితో ఆగక రాముడి కాలి మీదెక్కి, దిగిపోక, తొడమీద కుట్టింది. కట్టు పంచె విదిలించినా పోలేదు. పట్టుకు లాగితే మొండెం తెగివచ్చింది. తలకాయ పంచెలో ఇరుక్కుపోయింది.

తొడ చురచుర మంటుంటే పంచె తొలగించి చూచుకొన్నాడు. చీమకుట్టి నంత భాగం నెత్తురు కమ్మింది. ఎర్రగా అయింది. చేత్తోగట్టిగా రుద్దుకున్నాడు. ఎర్రటి మచ్చ అయింది ఇంకా మంట. గూటం తిప్పి రుద్దుకొని, కొంచెం తగ్గిన తరువాత కొత్త అట్టలు పనిరాయి మీద పెట్టి గూటంతో గట్టించబోతూ ఆగి పోయాడు. దెబ్బ వేయలేకపోయాడు.

ఈ అట్టల తోలు ఏ ఎద్దుదో, ఏ దున్నదో ఏమో, ఈ చర్మంమీద ఎన్ని చెర్నాకోలం దెబ్బలు పడ్డాయో, అసలు పళ్ళేదో, చేయివేస్తే అగమేఘాల మీద పరుగెత్తిందో, అసలు నడవలేక నానా యాతనా పడిందో, చచ్చిపోయినా మనుష్యులకు ఉపయోగపడుతూ ఉంది పశువు! 'బ్రతికి ఉండీ, చచ్చీ, ఉపయోగ పడని మనుష్యులకు శరీరం మీద ఎంత మమకారమో! ఎంత అనురాగమో!' రాముడు పని చేయలేకపోయాడు. తాబేటికాయ ఎత్తిపట్టి గొంతులో ఇన్ని నీళ్ళు పోసుకుని తాగి, "అమ్మాయ్" అని, "ఊఁ" అనటం విని. "అడ్డింక్షా

రాలా?" అని ప్రశ్నించాడు రాలేదంటే 'యాఁడ దగలడ్డాడో యాఁవో' అనుకున్నాడు.

ఆమె కోడలు. చిదంబరం భార్య! రాముడు భార్య రెండేళ్ళ క్రితం చనిపోయింది. సత్యనారాయణ అనకపోలేదు చిదంబరంతో "మీ అమ్మ కాలంతీరి చావలేదురా, వైద్య సదుపాయం లేక చచ్చిపోయిందీ" అని. అది రాముడూ విన్నాడు. ఆ మాట నమ్మలేదు. వైద్యం ఉండి ఎంతమంది చావటం లేదూ? ఆమెకు రోజులు తీరిపోయాయి. పోయింది. అంతే! 'భూమ్మీద నూకలుండాలే గాని చావటం అంత సులభమా? అసలు చావు వస్తుందా?' ఏమేమో ఆలోచించాడు రాముడు.

చిదంబరం ఒక్కడే కొడుకు! భార్య చనిపోయిందగ్గిరనించి వేళకింత తిండి లేకపోయింది. కొడుక్కి పెళ్ళి చేశాడు. పోయినేటినుంచి ఆ బాధ తప్పింది. ఇంటిపట్టునే వేళకింత తినగలుగుతున్నాడు. ఆడవాళ్ళు కొందరే మగవాళ్ళకు గర్వకారణంగా మసలుకోగలుగుతారు. రాముడి కోడలు అటు పుట్టినింటికీ ఇటు మెట్టినింటికీ గర్వకారణం! "నా కోడలు" అని తృప్తిగా అనుకోగలడు రాముడు. "నాభార్య" అని రొమ్ము విరుచుకొంటూ తిరగ్గలడు చిదంబరం. ఆమె రాకతో ఆ ఇంటికి సిరిసంపదలు వచ్చాయి. ఉన్న అయిదెకరాలలో పోయి నేడు పంటలు బాగా పండాయి ఊరంతా సంతోషంతో ఉండటంవల్ల రైతులు కల్లాలలో ధారాళంగా ఇచ్చారు. భార్య మరణంతో ఇంట్లోనించి పోయిన పాడి గేదెను కోడలు రాకతో మళ్ళీ కొనుక్కోగలిగాడు. పనిసామాను పందిట్లోంచి తీయకుండా తలగుడ్డ తీసి తలకింద పెట్టుకొని అక్కడే మేను వాల్చాడు రాముడు, గతం ఆలోచన మాని బావివైపు చూస్తూ.

ఊరబావి దగ్గిరికి వచ్చిపోయేజనం తగ్గిపోయారు. అప్పుడొకళ్ళూ ఇప్పుడొకళ్ళూ వస్తూ పోతూ ఉన్నారు. బావిలో దట్టెం ఆలోచన బాధగా ఉంది. ఎవర్నటం? ఏమనటం? బావివైపు బాధగా చూశాడు. తరతరాల మానవుడి అస్వతంత్రతకూ, బానిసత్వానికీ చిహ్నంలాగా ఉంది బావి. శిథిల సంస్కృతి గుండెలో పేరుకొన్న కల్మషంలాగా కుళ్ళులాగా లోపల దట్టెం!

అటు చూడలేకపోయినప్పుడు, బావి పక్క నుంచి మలుపు తిరిగి, ముందుకు వచ్చి, తన ఇంటికే వస్తున్న వెట్టివాళ్ళను చూచి పడుకొన్న రాముడు లేచి కూర్చున్నాడు. "రాఁవాయ్, యారోయ్ రాఁవాయ్" అంటూ వెట్టిమనిషి పిలిచాడు. "యేందయ్యో, వాయ్ వాయ్ అంటన్నావ్, మాటలు తిన్నగా రావేంది? అన్నాడు రాముడు ఎగాదిగా చూస్తూ. "అదిగాదు, రాఁవన్నా, మునసబుగార్లు

బంపిత్తే వొచ్చేం" అన్నాడు రెండో వెట్టిమనిషి. రాముడికి మునసబు పేరు వినే సరికి ఎందుకో భయం కలిగింది. అయినా అడిగాడు. "ఎందుకేంటి?"

వెట్టివాళ్ళు ఇద్దరూ కొంచెం కొంచెం చెప్పారు. రాముడు నిజంగా భయ పడ్డాడు. ఏం చేయాలో తోచలేదు. తప్పకుండా చిదంబరాన్ని చితకగొడతారు. 'యాఁవవుద్దో యేందో!' సణుక్కొన్నాడు. "ఆడింటిపట్టు నేడుంటాడురా? లేడు" అని అటూ ఇటూ చూచి "ఒత్తాళ్ళే" అన్నాడు.

ఖాళీ గుంజలకు నడుంమోపి, చేతికర్ర గడ్డానికి అనించుకొని, కర్రమీద అని, నిలబడ్డాడొక వెట్టిమనిషి. మరో మనిషి కర్ర మోకాళ్ళమధ్య పెట్టుకొని కుందు కూర్చున్నాడు. "యాడికి బోయాడేందీడు?"

"యాఁవో!" వాళ్ళిద్దరి కాళ్ళవైపు చూశాడు గట్టి చెప్పులు! అరగని చెప్పులు! ఇంకా ఏడాది అయినా మన్నే చెప్పులు!

అంతలో చిదంబరం వచ్చాడు. నడినెత్తి ఎండను వేసుకొని వచ్చాడు. కాళ్ళు ఎర్రదుమ్ము కొట్టుకొని ఎర్రబారాయి. కాళ్ళకు చెప్పులయినా లేవు. చెప్పులు కుట్టటం చేతకానివాళ్ళ కాళ్ళకు ఎప్పుడూ చెప్పులుంటాయికాని, చెప్పులు కుట్టే తన కొడుక్కు కాళ్ళకు చెప్పులు లేవు! రాముడు గుండెలో నవ్వు కొన్నాడని.

చిదంబరం ఆరడుగులు ఎత్తు మనిషి. విశాలమైన వక్షస్థలం! బలమైన చేతులూ, కాళ్ళూ! తండ్రిపోసిన పిరికిమందు తాగి మరింత బలంగా రూపొందిన శరీరం. ఎవరికీ ఏ కష్టమూ తన జీవితంలో ఇంతవరకూ కలిగించలేదన్న ధైర్యంతో పటిష్టం అయిన దేహం! ముగ్గురు దొంగల్ని కలేసి పట్టుకొన్న సామర్థ్యం ప్రసాదించిన శక్తి! అన్యాయం ఎంత ఘోరమయిందయినా ఎదుర్కొ గల దీక్ష! రెండెడ్లు పూనితే బిర్రుగా లాగగల బండి ఒక్కడే అనాయాసంగా లాగగల బలం!

ఆమె అన్ని విధాలా భర్తకు తగిన శరీర సౌష్టవంలో, బలంలో ఎవరు ఎడమో, కుడో తేల్చి చెప్పటం వీలుకాని దాంపత్యం వాళ్ళది! వాళ్ళిద్దరికీ తేడా ఉంది. చిదంబరం నెమ్మది తండ్రి దగ్గిర నించి పంచుకున్న వారసత్వపు హక్కు. ఆమె చురుకుదనం, ఆవేశం, పట్టుదల, పగ వంశ పారంపర్యగా సంక్రమించిన గుణాలు. నలుగురు మగాళ్ళు కష్టపడిచేసే పని ఆమె అవలీలగా చేయగలదు.

తలగుడ్డతీసి తండ్రికిచ్చి, చేతిలో కొడవలి కిందపడేసి, భుజంమీదనించి దించిన గెలలు గోడకానించి, ముక్కుమీద, కళ్ళక్రింద, బొణతల్లో, చెవులపైన

తలవెంట్రుకలలోంచి జారే చెమట తుడుచుకొని, "ఏంది కత, శానా పెద్దోళ్ళొచ్చారిటు?" అన్నాడు చిదంబరం.

విషయం అంతా విని, కత్తి తీసుకొని, దెబ్బకొకటి చొప్పున గెలలోంచి కాయలు రాలగొట్టి, ముచ్చికలు తీసి కోసి తండ్రికీ, వెట్టివాళ్ళకూ భార్యకూ ఇచ్చి మసిగుడ్డకు చేతులు తుడుచుకొని, "అయితే యేం జేద్దావంటా?" అన్నాడు తండ్రితో చిదంబరం. "ఇంకొకాక్కాయ" అంది లోపలినించి భార్య. "ఒత్తాన్నా" అంటూ ఒక గెలా, కొడవలీ తీసుకొని లోపలికిపోయి "నువ్వు గోసుకుందిను" అన్నాడు. ఆపైన వాళ్ళిద్దరూ ఏమేమో మాట్లాడుకొన్నారు బైటికి వినిపించలేదు.

పందిట్లోకి వచ్చి కూర్చుంటే "రా, బోదాం" అన్న వెట్టివాళ్ళకు "గరువంతా దిరిగి వొచ్చేనుగా, కాళ్ళు పీకుతున్నాయి. మాపిటేల వొత్తా, మున సబుగారితో జెప్పండి" అన్నడు. "అట్టా ఈల్లేదు" అంటే "మీయిట్టవింకా" అని ఊరుకొన్నాడు.

"ఆడు రాలేనంటున్నాడు గందా, నేనొచ్చి జెబుదా బదండి" అని రాముడు సాగాడు. ఏమీ అనలేక వెట్టివాళ్ళు అతని వెంట బయలుదేరారు.

అప్పటికి బావిదగ్గర ఎవరూ లేరు. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చాడు. రోహిణి కార్తె! రోళ్ళు బద్దలయ్యే ఎండ! దానికితోడు పడమటి శాంబరం గాలికి రేగిన ఎర్రదుమ్ము ఆకాశానికి భూమికీ మధ్య వేలాడదీసిన కాషాయపు బట్టలాగా ఉంది. అంత గాలి తోలినా ఉక్కగా ఉంది. చెమట పడుతూంది. ఒళ్ళు చిఱచిర లాడుతూంది.

ఊళ్ళో వాళ్ళంతా ఆ రోజు శ్మశానం పక్కనుంచే నీళ్ళు తెచ్చుకొన్నారు. లేత కొబ్బరి బొండాంలో నీళ్ళలాగా తీయగా ఉన్నాయని చెప్పుకొంటున్నారు.

ఎవరూ లేని సమయం చూచి చిదంబరం, అతని భార్య ఊరబావిలోకి తొంగిచూశారు. ఎవరూ ఎవరితోనూ ఏమీ మాట్లాడుకోలేదు. దద్దెం కాళ్ళు నాలుగూ నాలుగు మోకులకు కట్టబడి, గిలక పట్టీలు కలుసుకొనే మూలలో బంధింపబడ్డాయి. ఆ ముడులు చూశాడు చిదంబరం. ఏనుగు ముళ్ళు! ఆ ముళ్ళు వేసిన వ్యక్తి నేర్పుకు ఆశ్చర్యపోయాడు. ఎగుడుదిగుడులేని కుదిమట్టమైన ముళ్ళు! ఎవరైనా చూస్తారేమోనని వాళ్ళిద్దరూ ఇంట్లోకి వెళ్ళిపోయారు.

వెట్టివాళ్ళ వెంట రాముణ్ణి చూచి "ఆడేడిరా, ఈణ్ణి తీసుకొచ్చారూ?" అన్నాడు మునసబు. "ఆడికొంట్లో ఎట్లాగో వుంది దొరా, డీలా పడిపోయాడు. ఇంటికాడే ఉండాడు. యేంది, దొరా, రమ్మన్నారంటా?" రాముడు అడిగాడు.

నాంచారయ్య మునసబు కూర్చున్న ఈజీచైర్‌కు ఎదురుగా గోడకు వీపు

ఆనించి కూర్చున్నాడు. పక్కనే కుర్చీలో సత్యనారాయణ. లంకంత ఇల్లు! "ఈళ్ళ కుటుంబమే ఇట్టాటిది గాదు, మంచోళ్ళు" అని నాంచారయ్య అంటే "ఈడు మంచోడే, మనకిదెలియందేముంది? ఈడు కడుపు నాడు సెడబుట్టాడు. ఈణ్ణి కట్టేసి నాలుగంటితే ఆడు లగెత్తుకొత్తాడు. అట్లాటోళ్ళకి సురుకు దగిలితే దప్ప మాటిన్రు! దెబ్బే దేవేంద్రలోకం!" అన్నాడు మునసబు.

"పీణ్ణి కొట్టి ప్రయోజనం లేదు. లా ఒప్పుకోదు. పీడిచేత నిజం చెప్పిస్తే బాగానే ఉంటుంది. అంతేగాని...." నసిగాడు సత్యనారాయణ, "హారీ, పిల్ల సన్నాసీ! దెబ్బే దేవుడురా ఈళ్ళకి. శా! పిల్లకాక్కేం దెలుసు ఉండేలు దెబ్బ, నువ్విట్టా ఉండు. ఆడెట్టా జెబుతాడో విను" అన్నాడు మునసబు. లేచాడు "కట్టేంద్రా వాణ్ణి సావిడిగుంజకి!

"నేనేం జేయలా, దొరా!" అంటున్నా ఎవరూ వినలేదు. వెట్టివాళ్ళు రాముణ్ణి సావిట్లోకి తీసుకుపోయారు. "నువ్వు జేయకపోతే నీ కొడుకు. ఆడు జేయకపోతే ఆడి అబ్బ! మీరిద్దరూ ఏపీ ఎరగని నంగనాచు లయితే మీ పల్లె వోళ్ళు...." అరిచాడు మునసబు. రాముణ్ణి గుంజకు కట్టేశారు చింతబరికె తీసు కొని మునసబు వచ్చాడు. "సెప్పు! ఎవ్వళ్ళీపని జేసింది?"

"నేను గాదు!" చింతబరికె నాగుబాములా కాటు వేసింది. "ఎవుడు?"

"నే నెరుగను, ఆడెరగడు."

"మరెవుళ్ళు?" చింతబరికె శివావతారమై విలయ నృత్యం చేసింది. రాముడి వంటిమీద వాతలు తేలాయి. ముఖంమీద దద్దురు లేచింది. గడ్డంమీద చిట్లి రక్తం వస్తూంది కనుబొ౦ణత వాచింది. "నీ కొడుకు సేసుంటాడు."— "ఆ డెరగడు. దేవుడు తోడు. నాకు దెలుసు. ఆడట్టాటి పన్జేయడు. దొంగపనాడొల్ల గాదు. సెత్తే నెరిదుగా సేత్తాడు. నామాటిను, దొరా!" "యేందిరా యినేది?" కొట్టాడు. కొట్టి కొట్టిస్తే యీ నొప్పి పుట్టింది. రాముడి కళ్ళలో నీళ్ళింకిపోయాయి.

సత్యనారాయణ కళ్ళు చెమ్మగిల్లాయి. నాంచారయ్య ప్రాణం చివుక్కు మంది. ఎంత లేదన్నా రాముడిది నాంచారయ్య వయస్సు. అంత పెద్దవాణ్ణి. గొడ్డును బాదినట్టు బాదుతుంటే సహించలేకపోయాడు. సహించలేక చేసేదీలేదు. "మనసోబుగారు! మీరిట్టా రండి!" అని చేయి పట్టుకొని వరండాలోకి తీసుకు పోయి ఈజీచైర్‌లో కూర్చోబెట్టాడు. మునసబు రొప్పుతున్నాడు. "దెబ్బలేసిన మీరే ఇంతగా ఇదయిపోతన్నారే, తిన్నోడు — ముసలి ప్రాణం ఎంత ఇదయి పోవాలి? ఆఁ!" నాంచారయ్య సర్దాడు.

నాంచారయ్యను చూచి "నువ్వూరుకో" అని మునసబు అంటే, నాంచారయ్య నొచ్చుకున్నాడు. ఎంతలేదన్నా మునసబు నాంచారయ్య కంటే చిన్నవాడు. చిన్నా పెద్దా లేకుండా మాట్లాడటం బాధ కలిగించింది.

ఇంటి దగ్గిర చిదంబరం తండ్రి ఊళ్ళోకి వెళ్ళిందగ్గిరనించి ముళ్ళ మీద కూర్చున్నట్లుగా ఉన్నాడు. పొద్దు వాలుతున్నప్పుడు ఊళ్లో జీతగాడు, పల్లెకుర్రవాడు పరిగెత్తుకువచ్చి "అన్నా, అన్నా! అయ్య వాళ్ళు వోతల్దేలేటట్టు గొట్టేడు మునసోబు, కొట్టేసేరు" అని చెప్పాడు. ఇక కూర్చోలేకపోయాడు చిదంబరం. పైపంచె భుజాన వేసుకొని కర్ర చేత పుచ్చుకొని బైలుదేరాడు. భార్య బ్రతిమాలింది. "నువ్వెళ్ళొద్దే" "నువ్వుండె సెసీ." భర్త విదిలించాడు. హెచ్చరించింది. "నిన్ను జంపేత్తారే" "ఛీ! పో!" చిదంబరం వినలేదు. ఊళ్లోకి బయలుదేరాడు. నడవలేదు. పరుగెత్తలేదు. పరుగెత్తినట్టు నడిచాడు.

చిదంబరం మునసబు ఇంటి ముందుకు వచ్చేసరికి మునుపటి ముగ్గురే ఉన్నారు వరండాలో. వీధినిండా జనమే! చిదంబరం కనిపించగానే లేచి నిలబడ్డాడు మునసబు.

"దొరా!"

"యేంరా!"

"ఎందుకు మా అయ్యని గట్టేసింది?"

"కారణం చెప్పాలా నీకు?"

"ఆఁ!"

"ఎమికలిరగదన్నే వోళ్ళేక, సణ్ణాయిషీ అడుగుతావంటారా?"

"మాటలు ఎక్కువ వొద్దు దొరా!"

"రేయ్, పట్టుకొండిరా యీణ్ణి."

వెట్టివాళ్లు పట్టుకోబోయారు. ఇద్దరినీ విదిలించి కొట్టాడు.

"మా అయ్య నొదిలిపెట్టండి. నే బోతా, ఎందుకన్నా మంచిది." చిదంబరం వెనుదిరిగాడు. మునసబు దుడ్డుకర్ర దీసుకొని ముచ్చికల గుంట మీద వెనకనుంచి చాచి కొట్టాడు. అంతే. స్పృహతప్పి పడిపోయాడు. వెట్టివాళ్లు అతన్ని ఈడ్చుకొనిపోయి సావిట్లో గుంజకు కట్టేసి ముఖం మీద నీళ్ళు చల్లి పరిచర్య చేశారు. రాముడు బాధతో విలవిలలాడిపోతున్నాడు. కొడుకుని చూడలేకపోతున్నాడు. ఇద్దరికి అవు కట్టుగొయ్య దూరం. చిదంబరం కళ్ళు విప్పాడు. తండ్రిని చూశాడు.

"అయ్యా!" పిలిచాడు,

"అయ్యా!" పలికాడు.

"అయ్యా, నువ్వు అను. ఈణ్ణి సంపేత్తా!"

"అత్తప్పురా! వొద్దురా!"

"అయ్యా!"

"నా మాటినర, వొద్దురా."

మునసబు వచ్చాడు. "నన్ను సంపేత్తావంటరా-యేదీ సంపు సూద్దాం." చాచి కర్రతో నడుం మీద కొట్టాడు. ప్రాణరక్షణ కోసం చిదంబరం వెంటబెట్టుకొన్న కర్ర! స్పృహ తప్పినచోట పడిపోయిన కర్ర!

"అయ్యా!"

"ఒద్దురా!"

చిదంబరం కోపం పట్టలేక ఊగిపోతున్నాడు. ఖాళీ గుంజ ఊగింది. సావిడి సంచలించింది. క్షణ కాలం మునసబు గుండె ఆగిపోయింది.

తీరికగా మునసబు అడిగాడు. "యెవుర్రా ఈ పన్జేసింది?"

చిదంబరం మాట్లాడలేదు.

"సెప్పు." సమాధానం లేదు. మాట మాట కొక దెబ్బ వేస్తున్నాడు. "దేవుడు గావాలా నీకు!" దెబ్బ! దేవాలయంలో కొట్టిన కొబ్బరికాయ పగిలినట్లు తల పగిలింది. నీరు రాలేదు. నెత్తురు వచ్చింది. మునసబు చేయి వణికింది. చిదంబరం స్పృహతప్పి పడిపోయాడు. రక్తం కారిపోతూ వుంది. ఏనుగు బలం! ఎలక గుండె!

వెట్టివాళ్ళు మాసిన గుడ్డ పేలికలు తెచ్చి కాల్చి, మసిచేసి, తల మీద రక్తం కారుతున్నచోట అద్దారు. రక్తం ఆగిపోయింది. స్పృహ రాలేదు. తను అన్ని దెబ్బలు తిని కంట తడి పెట్టని రాముడు, తను అస్తారు బస్తంగా పెంచుకొన్న కొడుకును, ఇంతవరకు ఎప్పుడూ దెబ్బతిని ఎరుగని కొడుకును, హృదయంలో హృదయంగా పెరిగిన కొడుకును అన్యాయంగా తన కళ్ళఎదుటే కొడుతుంటే, ఏమీ చేయలేని స్థితిలో చూస్తూ ఉన్న రాముడు అవురుమని ఏడ్చాడు. ఆ ఏడుపు ఎక్కడో స్నాయువుల్ని మీటితే చిదంబరం కదిలాడు. స్పృహ వచ్చింది.

మునసబు వరండాలోకి రాగానే పిచ్చెక్కిన మనిషి ఊగిపోతున్నట్లు అయి, "వాడే గనక ఛస్తే, నీకు నేను ఉరిశిక్ష వేయించకపోతే, నా పేరు సత్యనారాయణ గాదు" అన్నాడు సత్యనారాయణ.

"య్యేడిసేవులే!"

"అదీ జరుగుతుంది." దూకుడుగా వెళ్ళిపోయాడు.

"యేందిది? మణుసులు జేసే పనేనా యిదంట? పశువులు జేత్తాయిట్ట! నువ్వు....నువ్వూ మణిసివిగాదు, పశువ్వి — ఛీ!" అన్నాడు నాంచారయ్య.

"నాంచారయ్యా!" గర్జించాడు మునసబు.

"నువ్వుండవయ్యా మళ్ళీ మణిసెల్లే మాట్టాడొత్తన్నా!" నాంచారయ్య వెళ్ళిపోయాడు.

వాళ్ళిద్దరూ కనుచూపు కందకుండా పోయిందాకా చూచి, వణుకుతున్న చేతుల్ని అదుపులోకి తెచ్చుకోజూశాడు. మరీ కుడి చేయి సంచలించిపోతూ ఉంది. మూలనున్న దుడ్డుకర్ర భగవంతుడి చేయిలాగా ఉంది. అది లేకపోతే దుర్మార్గుడు తప్పించుకొని పోయేవాడు. వరండాలో అది నవ్వుతున్నట్లుంది. మునసబు అదో మాదిరిగా కూర్చున్నాడు. మంచివాళ్ళు, కొంచెం స్నేహితులు ఇద్దరు కోపగించుకొని వెళ్ళిపోయారు. అయితే కొందరు విరోధులు ఇంతకాలానికి నువ్వు చేసిన మంచిపని ఇదొక్కటే అని మెచ్చుకున్నారు. "అధర్మం అరికట్టాలనే నీ లక్ష్యశుద్ధి నేను శంకించను గానీ మార్గం సక్రమమయిందని మాత్రం నేను విశ్వసించలేను" అని కరణం చెప్పాడు. ఆలోచించిన కొద్దీ మెదడంతా పురుగు తొలుస్తున్న పేడలాగా అయిపోతోంది. ఎందుకో అకారణంగా భయం కలుగుతోంది. ఎక్కణ్ణించో సన్నటి శబ్దం వినబడుతోంది. ఎక్కడో గుండె మారుమూలల్లో నిప్పురవ్వ రాజుకొంటూ ఉంది. ఏదో దైన్యం నిట్ట నిలువునా వ్యాపించింది. ఇటువంటి భావాలు పుట్టే స్వభావం కాదు మునసబుది. తనేదో చేయరాని దుష్కార్యం చేసినట్లు దానికి సంబంధించిన శంక, అవ్యక్తరూపంలో భయంగా, దిగులుగా, కనిపించని నీడగా ఒళ్ళంతా ఆక్రమించుకొంది. ఇటువంటి అనుభవం, అంత త్వరగా అందరికీ కలగదు. లెక్కలేనన్ని హత్యలు చేసి, చెక్కు చెదరని కోటగోడలా నిలబడగలిగే మనుష్యులు ఎందరో ఉంటారు. వాళ్ళందరికీ ఇటువంటి అనుభవం కలిగితే, ఆపైన ఏమీ చేయలేరు. ఇటువంటి అనుభూతికి ఆస్కారం ఇచ్చిన హృదయం కొంతవరకు కోమలమయిందే అయి ఉంటుంది. వయస్సు, అధికారం, అభిజాత్యం, అందం ఉన్న మనిషి ఎంత త్వరగా, అవధి లేకపోతే పాడయిపోగలడో, చెప్పాలంటే మునసబు నిదర్శనం.

పల్లెలో పాడుబడ్డ బావి ప్రక్క తాతల్నాటి మర్రి చెట్టు క్రింద పెద్ద లయిదుగురు కూర్చున్నారు. జీతగాళ్ళు, చదువుకొంటున్న కుర్రకారు, వ్యవసాయపు కూలీలు అందరూ చేరారు. బావిలో ఎద్దు దట్టెం ఎవరు వేలాడదీసి ఉంటారనేది ఆలోచించారు. తెలియలేదు. వాళ్ళిద్దరూ చేసి ఉంటారా? చేయరు,

అయితే అన్యాయంగా మునసబు వాళ్ళను శిక్షించాడు. దానికేం చేయాలి? ఏం చేసినా నిలవ నీడలేకుండా అయిపోవడం తప్ప గత్యంతరం లేదు. నిదానంగా ఆలోచించాలనుకున్నారు. కుర్రకారు దెబ్బకు దెబ్బ అన్న తీరులో మాట్లాడారు.

ఏం చేయాలా అని తీవ్రంగా వాళ్ళు ఆలోచించుకొంటున్నప్పుడు ఊళ్ళో వాళ్ళు ఊరబావిలోంచి పల్లెవాళ్ళతో ఆ ఎద్దుదట్టెం తీసేయించాలని తీర్మానించుకొని, ఒక రైతును పంపించారు. ఆ సమయంలో ఆ రైతు పల్లె పెద్దల్ని అడగటం తప్పిందికాదు. వాళ్ళు చెప్పిన సమాధానం సహజమయిందే! ఆ బావి మేం ముట్టుకోకూడదు. అందువల్ల మేమా పని చేయుము అన్నది జవాబు!

ఊరి పెద్దలకు కోపం వచ్చింది. ఆ విషయం వినటంతో, ఇంత కంటే కావరమా, పొగరా అని తిట్టారు. అసలు ఇది పల్లె అంతా కలిసి చేసిన పనే అనుకొన్నారు. జీతగాళ్ళనూ, వెట్టివాళ్ళనూ, అలగా జనాన్ని వెంటబెట్టుకొని రైతులు వచ్చారు. ఊరబావి దగ్గర పోగయ్యారు. సూర్యుడు పడమట కుంగిపోతున్నాడు. నాలుగూ మోకులూ విప్పి నాలుగు గిలక మీద వేసి అందరూ కలిసి లాగి, పైకి వచ్చిన దట్టెం అందుకొని వెలుపల తీసిపడెయ్యాలని పథకం. అలాగే చేశారు. ఎద్దుదట్టెం నీట్లో తడిసి బరువెక్కింది. పైకి లాగటం కష్టమే అయింది. పైకి వచ్చింతరవాత ఎలా పక్కకు తప్పించటమో తెలియలేదు. ఒక జీతగాడు ఆ ప్రయత్నంలో అప్రయత్నంగా కాలుజారి బావిలో పడ్డాడు. అది చూస్తూ ఉన్నవాళ్ళలో కొందరు భయంతో, సంభ్రమంతో మోకులు వదిలేశారు. మిగతా వాళ్ళకు బరువు ఎక్కువయింది. నిలదొక్కుకోలేక వదిలేశారు. దట్టెం నీళ్ళలో పడింది మునిగిపోలేదు. కొంచెంగా తేలుతూ ఉంది. దానికింద పడ్డ జీతగాడు తలపైకెత్తిందాకా పైనున్న వాళ్ళపై ప్రాణాలు పైనే పోతున్నాయి. దట్టెం పైకి తీయాలన్న ఆలోచనపోయి, జీతగాణ్ణి పైకి తీయాలన్న ప్రయత్నం ఎక్కువయింది. ఒడ్డుకు వచ్చిన జీతగాడు "దట్టెం బలి గోరింది" అన్నాడు. అందరికీ భయం పట్టుకొంది. ఒక్కొక్కరే జారుకొన్నారు. పక్క పల్లెవాళ్ళను రేపు పిలిపించాలి అనుకొంటూ రైతులు వెళ్ళిపోయారు. చోద్యం చూస్తున్న పల్లెవాళ్ళు ఇళ్ళలోకి వెళ్ళిపోయారు. బాగా చీకటి పడింది.

చిదంబరం భార్య చాలా సేపటినించి కళ్ళు వాచిపోయేటట్లు ఏడుస్తూ ఉంది. ఇంతసేపు బావి దగ్గర సందడి ఏడ్పులోకి వినబడుతూ వచ్చింది. ఇప్పుడు విచిత్రంగా నిశ్శబ్దం ఆవరిస్తే బావివైపు చూసింది. బావి నిర్మానుష్యం అయిపోయింది. ఆమె ఏడ్పు ఆగిపోయింది.

సావిట్లో కొడుకు స్పృహ వచ్చిన తరువాత రాముడు దిగులులోనే

ఆనందం పొందాడు. బాధ అనే సారవంతమయిన భూమిలో ఆనందం అనే చిన్న మొక్క పుట్టుకువస్తే భూమికే అందం వచ్చినట్లు రాముడి దుఃఖం, దిగులు బాధ అందగించాయి. చిదంబరం గుండె రాయి అయింది. "యేందయ్యా యిదీ?"

"ఏఁవుందిరా!"

రాముడు గుండె చెరువయింది. ఎవరి వయస్సు ఓర్చుకోగలిగే దెబ్బలు వాళ్ళకు తగిలాయి. ఇద్దరి శరీరాలు రాత్రి తోలే చల్లని గాలికి తీపులు తీసుకుంటున్నాయి. ఒంటిమీది దెబ్బలకంటే హృదయం పొందే చిత్రవధ ఇద్దరూ తట్టుకోలేకపోతున్నారు.

ఆకస్మికంగా "అదెట్టుండో" అనే ఆలోచన వచ్చింది. చిదంబరం వణికిపోయాడు. పట్టరాని కోపం వచ్చింది. ఊరికే ఊగిపోతున్నాడు. "మళ్ళీ యాఁవయిందిరా?"

"యాంలా."

పల్లెలో చిదంబరం భార్య ఆ రాత్రి అన్నం వండుకోలేదు. ఆలోచిస్తూ కూర్చుంది. ఇంట్లో దీపం కూడా ముట్టించలేదు. పక్క ఇంటి ముసలమ్మ "ఇట్టుంటే ఎట్టాగే, పిల్లా? మేఁ మిట్టాటియే శానా జూసేంలే! రేపొద్దున్నే ఆళ్ళే వత్తారింటికి" అంటూ వచ్చి దీపం వెలిగించి, పొద్దుటి అన్నం బలవంతంగా ఇంత తినిపించింది. "నువ్వీడే పండుకో, అవ్వా!" అని నిశ్చయంగా అడిగితే, "అట్టాగే లేయే" అంటూ అవ్వ మంచం వాల్చుకొని, పడుకొన్న మరుక్షణం గురకపెట్టింది.

దీపం వెలుగుతుంది. దుఃఖం ఆగటంలేదు. తలుపు వారగా చెప్పులు, మూలన కర్ర ఉన్నాయి. చూచింది. రెండు మూడుసార్లు "అవ్వా! అవ్వా!" అని పిలిచింది. ఆమె ఉలకలేదు. పలకలేదు. గుర్రు గుర్రు మంటూ నిద్రపోతూ ఉంది. ఆమె నడి మంచం మీద కాళ్ళు బాచిపట్టు వేసుకొని కూర్చుంది. నిద్ర పోయే ప్రయత్నంలో లేదు.

ఊళ్లో మునసబు అకారణంగా వణికిపోతున్నాడు. ఆ భయంతోని గురవయ్యను— బొద్దు మీసాలు, ఎర్రకళ్ళు, భయంకరంగా ముఖం, పగలు చూస్తే రాత్రి కలలోకి వస్తాడు. పసిపిల్లలు చూస్తే అవురుమని ఏడుస్తారు— తనతోపాటు ఉండమని కబురుచేస్తే వచ్చాడు. ఇంట్లో ఎంతకీ గాలి రాకపోతే వరండాలోకి మంచం మార్పించుకొన్నాడు మునసబు. పక్కనే చాప వేసుకొని పడుకొన్నాడు నీరుకావి పంచె కట్టుకున్న గురవయ్య. "ఆ దుడ్డుకర్ర ఆ మూల నించి దీసెయిరా!" అన్నాడు మునసబు. "నేనుండగా మీకేంది, పోఁసీ భయం?"

గురవయ్య అభయం ఇచ్చాడు. "లై లేసుకు బడుకుందాంరా."

"శా! యేంది. పోఁనీ మీకింతిది? నేనే నీడ? గుండెమీచ్చెయేసుకొని పొండుకో, పోనీ! లై టుంటే నిద్ద్రరాదు నాకు!"

ఇద్దరూ పడుకొన్నారు. మరుక్షణంలో ఇద్దరూ నిద్రపోయారు. ఒకరు నిశ్చింతగా, మరొకరు కోపం వల్ల ఇద్దర్ని కొట్టటంవల్ల శరీరం అలసిపోయి నిద్రపోతున్నారు.

రాముడింట్లో దీపం వెలుగుతూంది. ఎవరో తలుపు తట్టుతున్నారు. "యాఁవే! యావే!"

"యెవరు!" ఆమె లోపల్నుంచే అడిగింది. "నేనే!"

"నేనంటే యెవుణ్ణువు?" అంతదాకా ఆమె నిద్రపోలేదు. అంతు తెగని ఆలోచనల మధ్య కొట్టుకులాడుతూ ఉంది. తలుపు తీసింది. యువకుడు! ఆలోచనలు రూపం దాల్చాయి. "నువ్వా!" "అఁ! యేందే, నేన్నీమీద నెయ్యే సేనా! ఎందుకట్టా గోక్షైశా? అఁ!"

"యెందుకిట్టా వచ్చా?" తలుపు కానించి ఉన్న చేతికర్ర తీసుకొని చాచి తలమీద కొట్టింది. "అమ్మో" అన్నాడు యువకుడు. "నువు రాచ్చసివే! రాచ్చసివే!" అన్నాడు. మళ్ళీ కర్ర పైకెత్తింది. వెనక్కి తగ్గాడు. ముందుకు వచ్చింది. వెనుదిరిగాడు. వెంటబడింది. మొదట గబగబా, తరవాత పరుగు పరుగునా, మళ్ళీ గబగబా, తరవాత నెమ్మదిగా తల తడుముకొంటూ యువకుడు ఊళ్లోకి వెళ్ళిపోయాడు.

ఆమె తలుపు గడియ వేసింది. అవ్వ నిద్రపోతూ ఉంది. ఆమె ఒళ్ళు ఒణికిపోతూ ఉంది. దీపం వెలుగుతూ ఉంది. మళ్ళీ మంచం మీద కూర్చుంది. ఆలోచనలు దరిచేరుకొంటున్నాయి.

మునసబు పడుకొన్న వరండాలో వెలుతురు లేదు. ఆకాశంలో వెన్నెల లేదు. లక్షల నక్షత్రాల వెలుతురు భూమిమీదికి రావటం లేదు.

సావిట్లో – చీకటిలో చిదంబరం చేతికట్లు ఎవరో విప్పుతున్నారు. "అయ్యా!" అన్నాడు చిదంబరం తండ్రి అనుకొని. "యాంరా" అన్నాడు రాముడు అల్లంత దూరంనించి. "యెవురు నువ్వ అడిగాడు చిదంబరం.

రాముడు అడిగాడు : "యెవ్వురక్కడుందీ?"

"యెవురో?"

"యెవురో, యేంజేత్తన్నాడేంది?"

"కట్లిప్పుతున్నాడు."

"ఉష్, అరవద్దు!" మూడో వ్యక్తి కంఠస్వరం.

మళ్ళీ నిశ్శబ్దం! రాముడికీ, చిదంబరానికి కట్లు విడిపోయాయి. "పొండి! పారిపొండి!" హెచ్చరిక. "పోం, దొరా!" రాముడు.

"వెళ్ళండి. ఈణ్ణించి వెళ్ళిపొండి." "వెళ్ళం, దొరా!" రాముడు.

"వెళ్ళకపోతే తంతాను. వెళ్ళండి. ఆ కంఠ స్వరం గుర్తుబట్టారు. సావిడి వెనక ఏదో శబ్దమయింది. ఆ మనిషి ఈ శబ్దం విని గడ్డిచాటున నక్కాడు.

ఎవరో నడుస్తున్న అలికిడి స్పష్టంగా వినిపించింది. జీతగాడు పశువులకు గడ్డి వేయటానికి వస్తున్నాడేమోననుకొని, నెమ్మదిగా లేచి, ఆ మనిషి సావిడి చాటుగా వీధిలోకి వచ్చాడు. సావిడి వెనక మనిషి నడిచిన అలికిడి రెండు క్షణాలు స్పష్టంగా వినిపించింది తరువాత వినబడలేదు. తండ్రీ కొడుకులు మాట్లాడుకొంటున్నారు. "సత్యనారాయణ దేవుఁడు లాంటాయనయ్యా!" "అవున్రా!"

"యెళ్ళిపోదాం, పద!" "యాడికి?"

"ఇంటికి." "యెళ్ళి?"

"యెళ్ళేఁవుంది? యెళదాం."

"ఒరేయ్, మునసోబుగారు పంపకుండా మనం యెళితే, రేపు మళ్ళీ బట్టుకొచ్చి చితగ్గొడితే దిక్కేఁవుందిరా మనకి! ఈ ఊరినించి పారిపోలేంగా! రేపు నిజం తెలిసి ఆళ్ళే ఒదిలేత్తారు."

అంతటితో ఆగిపోలేదు. "ఆళ్ళొదిలేసిందాకా యెందుకుండాలేం దిక్కడ? యెళ్ళిపోదాం! రమ్మంటే రావొచ్చు. దవురుజెన్నెంజేత్తే కర్రుచ్చుకోడం. తాడో పేడో తేలిపోద్ది."

"ఒరే బాబూ, నువ్వు పిల్లోడివిరా. ఈళ్ళని తుస్కారించి బతకటం కట్టంరా. ఆళ్ళొకటేత్తే నువ్వొకటేత్తావ్. ఆళ్లు నలుగురొత్తే, నువ్ నలుగురేసుకు పోతావ్. ఆళ్ళు ఊరంతా తెగబడొత్తే, పల్లెంతా కలిసి తిరగబడ్డా ఆళ్ళని జయిచ్చటం కుదురుద్దా? తన్నుకోటాలూ, సావటాలూ తప్ప ఎందుకొచ్చిన పోట్లాటలురా యియ్యి?"

"ఎన్నాళ్ళేం దీళ్ళ దవురుజెన్నెం?"

"నువ్వు మణిసివి! ఆళ్ళు మణుసులు! మణిసీ మణిసీ మరియాదగా ఉంటే సరిపోద్దిగా! ఆళ్ళట్టామారాలంటే మనఁవే దవురుజెన్నెం చేత్తే యెట్టా ఈలవుద్ది?"

"యేందో నీ యేడు పెప్పుడూ యింతే."

"నా మాటినరా. బాబూ! ఎవురో పున్నెం గట్టుకొని బాయినిట్టా చేసేరు గందా! ఇదీ మంచికే వొచ్చింది! మనమీద అనుఁవానం వుందంటావా, అదేరే సంగతి! ఉణ్ణి. నట్టఁవేఁ వొచ్చింది! ఈ దెబ్బతో పల్లెవోళ్ళ నీటెద్దడి తగ్గిపోద్ది! ఇప్పుడు మనఁవ్ జారిపోతే అంతా గుల్లయిపోద్ది! నా మాటినరా! నీ గుంజ దగ్గిర నువ్ గూసో! నేనీడ గూసుంట! సరిపోలా?"

"తాళ్ళివ్వే కట్టేసుకోటానికి, యాడుండయ్యో ఏందో!" అయ్యి మనల్ని కట్టేత్తాయా? నీతి! నీతిరా? నీతి కట్టేత్తది మనల్ని!"

తండ్రీ కొడుకుల కట్లు విప్పబడినప్పుడు వినవచ్చిన అలికిడి, సావిడి వెనక ఎక్కడ ఆగిపోయిందో, అక్కడ మళ్ళీ అలికిడి అయింది. అక్కణ్ణించి, అగ్గిపుల్ల గీసిన శబ్దం! అగ్గిపుల్ల వెలుతురు. తాటాకు మంట. వెంటనే గుప్పున మంట! "మంట! మంట!" అప్పటికి పరుగెత్తిన అలికిడి! "ఔనురా! యేందిదీ?" రాముడు ఆలోచన! "దొంగలు! దొంగలు! పట్టుకోండి...." ఇక చిదంబరం అరవలేదు. రాముడు నోటిమీద చేయివేశాడు. "అరవొద్దురా!" తండ్రి హెచ్చరించాడు. సావిడి వెనకనుంచి మంటలు నాల్కలు చాస్తున్నాయి. పూర్తిగా రగుల్కోలేదు. కొంచెం వెలుతురు. వాళ్ళను కట్టిన తాళ్ళు కనిపించాయి. రాముడు తాడు అందుకొన్నాడు. కొడుకును కట్టేస్తున్నాడు. ఆ సావిట్లో అదే గుంజకు. మండుతున్న సావిడి "యేందిది?" చిదంబరానికి ఏమీ అర్థం కాలేదు. "అరవొద్దు" రాముడు దూముడి వేశాడు. తాడు తీసుకొని తనను కట్టుకొన్నట్టు వేసుకొన్నాడు. సావిడి వెనక పెద్ద మంట లేచింది. "అయ్యా! మనఁ విందులోనే కాలి సద్దాఁవా యేంటి?"

"ఒద్దురా! ఒద్దనే ఒద్దు....దొరా! దొరా! సావిడి గాలిపోతుంది. దొరా! దొరా!" పెద్దగా అరిచాడు. చిదంబరం నోటివెంట మాట రాలేదు. కాలుతున్న వైపు చూస్తూ ఉండిపోయాడు.

చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు లేచారు. వీధిలో జనం పోగయ్యారు. ఎవరో గేదెల్ని, ఆవుల్ని, ఎద్దుల్ని, దూడల్ని పలుపులు విప్పేశారు. సత్యనారాయణ తండ్రీ కొడుకుల దగ్గరికి వచ్చాడు. "మీరిదే దగలడ్డారా?" అన్నాడు. కొంచెం ఆలోచించి "మంచిపని చేశారు" అన్నాడు. రాముడు తాడు తొలగించుకొన్నాడు. కొడుకు తాడు దూముడి లాగేశాడు. "అరవద్దు! ఏమీ మాట్లాడవద్దు! నోరు మూసుకొని ఉండండి! ఎవరేం అడిగినా ఏమీ తెలియదని చెప్పండి రండి" అంటూ వెలుపలికి వచ్చి "వీళ్ళని చంపేయటానికి సావిడికి నిప్పు పెట్టుకోవాలా? ఎక్కడుందా దా మునసబు! నే నిప్పకపోతే వీళ్లు చావాలనేగా మునసబు ఎత్తుగడ?"

అందరూ కలిసి సావిడి ఆర్పారు. సగం కాలిపోయింది. తలమీద కట్టిన కట్టు సంగతి మర్చిపోయి, ఒళ్ళు నొప్పులు తెలియకుండా, మంటలార్పిన చిదంబరం, వాతలు పెట్టే శ్రమ గుర్తించకుండా నీటి కడవలు అందించిన రాముడు మంటలారిపోయాక ఒకర్నొకరు చూసుకొని కళ్ళు తుడుచుకొన్నారు. అక్కడ చేరినవాళ్ళు తలకొక విధంగా వాళ్ళిద్దర్ని చూశారు. ఎక్కువ మంది జాలిపడ్డారు.

మునసబు ఇంటిముందు హడావిడిగా ఉంది. ఎవరో అతణ్ని మంచానికి కట్టివేశారు. వరండా మూలలో దుడ్డుకర్ర లేదు. అతని మంచం దగ్గరుంది. అతని కుడిచేయి సరిగా లేదు. మణికట్టు పైన విరిగిపోయింది అంతే. మరే దెబ్బలేదు. నలుగురూ చేరిన తరవాత అతనికి స్పృహ వచ్చింది. రాముడూ, చిదంబరం అక్కడికి వెళ్లేసరికి మునసబు భార్య ఏడుస్తూంది. ఎవరో కట్టు విప్పుతున్నారు. అప్పుడు నిద్రలేచాడు గురవయ్య. చిదంబరం మునసబు మంచంవైపు చూశాడు. చేతులు తలవైపు పట్టెకూ, కాళ్ళు కాళ్ళ కట్టకూ కట్టి వేయబడ్డాయి! మూప్ప నేర్పయిన ముళ్లు! చక్కని ముళ్లు. ఏనుగు ముళ్లు! అతనికి ఊరబావి గిలకల పట్టెలకు మోకులు వేసిన ముళ్ల గుర్తుకు వచ్చాయి!

రాముడికి మునసబు మీద జాలివేసింది. కళ్ల చెమ్మగిల్లాయి. నొక్కటం రాకూడదనుకున్నా గానీ మీ కట్టం సూల్లేను దొరా!" అన్నాడు. పెద్దలడిగారు: "ఎవరీ పన్జేసింది?" అని. "ఈళ్ల మాత్రంగాదు." మునసబు చెప్పాడు. రాముడు, అంత పెద్దవాడు అవురుమని ఏడ్చాడు. అందుకు ఎదుటివాళ్ళ కష్టంతోపాటు తమ కష్టం గుర్తుకు రావటం కావచ్చు.

వల్లె కవతల, సమాధుల దొడ్డి దగ్గిర, ఆపైన ఆకాశం అంతా కావురు కమ్మింది. తెల్ల బూడిదలో కలిపిన కుంకుమ సుడిగాలి వచ్చి ఆకాశంలోకి ఎగిరి పోతే ఎట్లా ఉంటుందో అలాగే ఉంది. మునసబు తలఎత్తి చూశాడు. "నా వావులు తగలడతున్నయ్. పొండి పోయి ఆర్పండి. గొడ్లకి నోటి కాడ మేతబోద్ది!" అన్నాడు. ఎందుకో అందరికీ అది నిజమే ననిపించింది. కొందరు పరుగెత్తుకు పోయారు. వాళ్ళతోపాటే రాముడూ, చిదంబరమూ వెళ్ళారు. వాము లార్పటం సాధ్యం కాలేదు. బస్తీ ఫైరింజన్ వాళ్ళకు కబురు చేయటం కోసం ఎవరో స్టేషనుకు పోయారు.

సత్యనారాయణ, నాంచారయ్య మునసబును చూడటానికి పోలేదు. 'ఆళ్ళకి నేనంటే కోపం' అనుకున్నాడు మునసబు. అతని జవజీవాలు కుంగి పోయాయి. ఒక్క రాత్రితో మనిషి పదేళ్ల గడిచిన వాడయ్యాడు. గురవయ్యా

మళ్ళీ నిద్రపోలేదు. మంచం పక్కనే కూర్చున్నాడు. జీవితంలో ఎప్పుడూ కంట తడి పెట్టని మునసబు కళ్ళలో నీళ్లు చూడలేకపోయాడు. తెల్లవారింది. తెల్లవారినా, రావణాసురుడి కాష్టంలా వాములు కాలుతూనే ఉన్నాయి. అప్పుడే ఫైరింజన్లు వచ్చాయి. అరగంట నీళ్ళకోసం తిరిగాయి.

తెల్లవార్లూ వెలుగుతూ వున్న దీపం బారెడు ప్రొద్దెక్కినా రాముడింట్లో పెద్దది కాలేదు. ఆడవాళ్ళిద్దరూ నిద్రపోతూనే ఉన్నారు.

ఉదయమే వచ్చే రైలులో మునసబును బస్తీకి తీసుకు పోయారు. బావిలో ఎద్దుదట్టెం మురుగుతూ ఉంది.

మధ్యాహ్నానికి ఫైరింజన్లు వాము లార్పాయి. ఆర్పింది గడ్డి తగలడకుండా కాదు, బూడిద కొట్టుకుపోకుండా! రాముడూ, చిదంబరం తిరిగి మునసబు ఇంటికి వచ్చారు. "మీరెందుకు, ఇంటికి బొండిరా" అని ఎవరో అంటే, "యాఁవయినా అయితే మా నెత్తికి జుట్టుకొంటది, మేం బోం. పైగా మునసోబు గారు మమ్మల్ని బొమ్మనలేదు" అన్నాడు రాముడు.

ఇద్దరూ ప్రహరీ లోపల గోడకానుకూ్కుర్చున్నారు. ఒళ్ళంతా నొప్పులు కడుపులో ఆకలి!

ప్రక్క ఊరు పనివాళ్ళు మేమాపని చేయటానికి రామంటే ఏంచేయాలో దిక్కుతోచలేదు ఊరి పెద్దలకు. బావిలో దట్టెం బావిలోనే ఉంది.

ఎడం చెవికి పైన చిదంబరం తల పగిలింది. అక్కడే తల పగిలిన యువకుడు కట్టునుగూర్చి ఎవరడిగినా సావిడిబొంగు పొడుచుకొందని చెప్పాడు. తండ్రీ కొడుకుల్ని కొట్టిన మునసబు కుడిచేయి విరిగిపోయింది.

ఊరి పెద్దలు కరణం ఇంటి దగ్గిర కలుసుకున్నారు. ఏం చేయాలో ఆలోచించుకొంటున్నారు. నిన్న ఉదయం నించి జరిగిన సంగతులు పరిశీలించు కొంటున్నారు. ఇది ఒక్కడి పనికాదు. పల్లె అంతా కలిసి చేసింది. వాళ్లు పెచ్చు మీరి పోయారు. ఏదయినా తెగిందాకా లాగకూడదు. అంచేత ఆ బావి సంగతి పట్టించుకోకూడదు! ఏమయినాసరే అంతు తేల్చుకోవలసిందే! ఇవాళ ఇదయింది, రేపు ఇంకొకటవుతుంది. దేనికయినా హద్దుండాలి. కొంచెం అలుసు ఇస్తే వాళ్ళకు పట్ట పగ్గాలుండవు. అవసరం అయితే తన్నయినా తోవలోకి తీసుకు రావాలి. పెద్దవాళ్ళూ వయస్సులో చిన్నవాళ్ళే అయినా అనుభవంలో పెద్దవాళ్లు. చిన్నవాళ్ళూ వయసులో పెద్దవాళ్ళయినా ఆలోచనలో చిన్నవాళ్ళూ అన్నారు. చివరకు కొట్లాట జరిగినా; దౌర్జన్యాలు జరిగినా నష్టపోయేది ఊళ్ళోవాళ్ళేననీ, చావు మూడినా, వాళ్ళు పల్లె వదలి వెళ్ళిపోయినా, జైళ్ళలో పడినా కష్టం కలిగేదీ

ఊరివాళ్ళకేననీ, ఆ విషయమే మునసబుతో చెబుదామనీ అందరూ నిర్ణయించుకొన్నారు.

సత్యనారాయణ అంతా వింటూ ఉన్నాడు. పల్లెవాళ్లు భయంవల్ల, ఊరు వదిలిపోయి బ్రతకలేమన్న భయంవల్ల అణిగిమణిగి ఉంటున్నారు. ఊరివాళ్లు భయంవల్ల, నష్టపోతామనే భయంవల్ల, తమకు కష్టం కలుగుతుందన్న భయంవల్ల, వ్యవసాయపు కూలీలు దొరకరన్న భయంవల్ల సర్దుకొంటున్నారు. భయంవల్ల పల్లెవాళ్లు, ఊరివాళ్ళు మంచిగా ఉండాలనుకొంటున్నారు. భయంవల్ల అహింసాపరులు కాబోతున్నారు. ప్రేమవల్ల కాదు, హార్దికంగా కాదు, అర్థం చేసుకొని కాదు, భయంవల్ల! భయంవల్ల!!

భయం ప్రాతిపదిక మీద బ్రతుకుతున్న ఈ ఊరు, ఈ దేశం ఎంత కాలం జీవిస్తాయి? ప్రేమ ప్రాతిపదికమీద బ్రతికే సమాజం, వ్యవస్థ ఏ రోజు పుడతాయి? పోనీ, నిర్భయంగా జీవించే మానవ జీవితం ఎంత దూరంలో ఉంది?

రెండో రోజు ఉదయం చేతికి పిండికట్టుతో రైలుదిగి మునసబు సరాసరి ఇంటికి తీసుకుపోబడ్డాడు. నాంచారయ్య కనిపించి పరామర్శ చేస్తే "ఆ బాయి సంగతి మనకొద్దు! ఆళ్ళనే యాఁవన్నా జేసుకోఁవను"

"నువ్ బొమ్మన్నదాకా ఆళ్ళింటికి బోరంట."

"రేయ్, మీరింటికి బోండిరా! ఆ బాయి వాడుకోండి."

రాముడూ, చిదంబరం పల్లెవైపు సాగారు. అప్పుడే వచ్చిన ఊరి పెద్దలు తమకూ అదే ఇష్టం అని చెప్పారు.

ఇంటి ముందు పందిట్లో దిగాలుపడి కూర్చున్న చిదంబరం భార్య నిన్నటి నుంచి అన్నం, నీళ్ళు ముట్టుకోని ఆమె భర్తనూ, మామనూ చూచి, వెయ్యేనుగుల బలంతో వాళ్ళ కెదురుపోయింది. వాళ్ళ దెబ్బలు చూచి, పెదవులు కొరుక్కుంది. భర్త తల వంచుకున్నాడు, మామ, "ఏం పర్వాలేదులే" అన్నాడు. ఇంట్లోకి వచ్చారు. పల్లెలో వాళ్ళంతా ఆ ఇంటిచుట్టూ మూగారు. బావి సంగతి విన్నారు. అయినా ఎవరూ కదల్లేదు. "యేం?" అంటే, "బాయి బలిగోరిందట, మనకొద్దది, ఇట్లా జంపాలని జూత్తున్నారీళ్ళు!" అన్నారు. చిదంబరం భార్య నిట్టనిలువునా వణికిపోయింది. ఎగాదిగా అందరి ముఖాలలోకి చూచింది. తల వెంట్రుకలు విదిలించి ముడి వేసుకొంది. "అట్టానా! అట్టానేనా! యేంది? అట్టాగేనా? అయితే అవుతా! నేనే బలౌతా! నేనే బలౌతా!" రెండు అంగల్లో దున్నల దగ్గిరకు పోయింది. మెడ పలుపులు విప్పింది. కాడి మెడలమీద వేసింది. "ఏందే నీ

గోల!" భర్త మాట వినిపించుకోలేదు. దున్నలకు పట్టెళ్ళు బెట్టింది. అదిలించింది. బావి వైపు వెళ్ళాయి. "యేందే యిది!" భర్త అన్నాడు.

"నువ్వుండె!" భర్తతో చెప్పింది. చీరె తిప్పి గోచి పెట్టింది. చేంతాడు బావిలోకి వేసింది. పై కొన గిలకల పట్టెకు కట్టింది. మెట్ల మీదుగా బావిలోకి దిగింది. ఎద్దుదట్టెం కాళ్ళకు కట్టి ఉన్న మోకుల కొసలు చేతబట్టుకొంది. పైకి వచ్చింది. ఒక వక్క ఉన్న రెండు మోకులు ఒక వక్క గిలకల పట్టెకు కట్టింది. రెండోపక్కకున్న రెండు మోకులు గిలకలమీద వేసి. దున్నల మెడల మీద ఉన్న కాడికి కట్టింది. పట్టెళ్ళు బిగించింది. వడుగుల రెండు దున్నల్ని రెండు చేతులతో చాదికొట్టింది. చేయి మీదవేస్తే ఆగని దున్నలు ఒక్కదూకులో ముందుకు వెళ్ళాయి. క్షణంలో దట్టెం పైకి వచ్చింది. రాముడు, చిదంబరం ఒకరి ముఖాలొకరు చూచుకొన్నారు. ఇద్దరూ వెళ్ళారు. రెండు వేప నిట్టాళ్ళు తీసుకువచ్చారు. అప్పుడందరివైపు చూచింది. వింతగా అందరూ చూస్తున్నారు. "మీలో మొగోళ్ళు లేరా! అంతా ఆడోళ్ళేనా? మొగోళ్ళుంటే రండి సాయం సెయ్యండి" అంటూ అరిచింది చిదంబరం భార్య. రాముడు రెండు నిట్టాళ్ళు ఒక గిలకల పట్టె మీద నుంచి, ఎద్దుదట్టెం వెన్నుపూస కిందగా, మరో గిలకల పట్టె మీదికి, దట్టెం ఎగదట్టేటుగా పెట్టించాడు. పల్లెవాళ్ళు తాళ్ళు పట్టుకొన్నారు. రెండోవైపు రెండు మోకులు విప్పివేశారు. ఆమె దున్నల్ని అదిలించింది. ఒక్క ఉదుటన దట్టెం వచ్చి వెలుపల పడింది. ఆ దున్నలు అలాగ్గే ఎద్దుదట్టెంని ఊరి వెలుపలికి ఈడ్చుకుపోయాయి.

చిదంబరం ఇందాకటి నుంచి ఆలోచిస్తున్నాడు. బావిలోంచి మోకులు తెచ్చి ఆమె పట్టెకు వేసిన ముళ్ళు గూర్చి. చక్కని ముళ్ళు! అందమయిన ముళ్ళు! నేర్పుగల ముళ్ళు! ఏనుగు ముళ్ళు!

"నీళ్ళు పాడయిపోయాయి. తోడి పారబోసి పూడిక తీసుకుందాంవ్ బాయికి" అన్నాడు రాముడు. పల్లెవాళ్ళు చిన్నా పెద్దా పోగయ్యారు. చేంతాళ్ళు, కడవలు, బిందెలు, మోటలు. తట్టలు, పారలు, పలుగులు బావి దగ్గిరికి చేరాయి. పని చకచకా సాగిపోతూ ఉంది. పండుగ ఉత్సాహంతో ఉంది పల్లె! ఊరిజనం ఇళ్ళముందు నుంచే చూస్తున్నారు. ఇంత జరుగుతున్నా అందరికి ఆ దట్టెం బావిలోకి ఎలా వచ్చిందో ఏకగ్రీవంగా అర్థం కాలేదు. చిదంబరం ఇంట్లోకి పోయి ఆమె చెప్పులు చూశాడు. దుమ్ముకొట్టుకొని ఉన్నాయి. గరువు దుమ్ము! రేగడిదుమ్ము! వింతరంగు కలగాపులగంగా కలిసిపోయింది. అంతలో చిదంబరం భార్య దట్టెం పల్లె వెలుపల పోరంబోకులో వేపచెట్టు కింద వదలి

ధున్నల్ని తోలుకువచ్చింది. చిదంబరం అటక మీద ఉండవలసిన నాలుగు బండి మోకులూ కనిపించకపోయేసరికి భార్య ముఖంలోకి చూశాడు.

నీళ్ళు తోడి పారబోశారు. పూడిక తీశారు. కొత్త నీరు ఊరుతూ ఉంది. బావిలో ఉన్నవాళ్ళు పైకి ఎక్కివచ్చారు. పిల్లలు "నాకు రెండణాలు దొరికాయి. నాకు పావలా!" అంటున్నారు.

"ఈ ఇత్తడి చెంబు ఎవుళ్ళదో!" "ఈ కడవ పగల్లేదు, సూశావా! "ఈ తాడు నాదే" అంటూ బావిలోనుంచి దొరికిన సొమ్ములు గూర్చి సరదాగా చెప్పకొంటున్నారు.

చిదంబరం భార్య, రాముడి కోడలు, ఆమె, కడవా తాడు తెచ్చి, కడవ మునిగేంతవరకు ఊరిన నీళ్ళలోనించి ఊరబావి నీళ్ళు కడవెడు తోడుకొని రెండు రోజులనించి పొయిలోనుంచి లేవని పిల్లిని లేపటంకోసం తీసుకుపోయింది. పల్లెవాళ్ళు నీళ్ళు తోడుకొంటున్నారు. తాగుతున్నారు. స్నానం చేస్తున్నారు.

ఊరు చూస్తూ ఊరుకొంది.

* [ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 2-7-69, 9-7-69] *

# పాపానికి జీతం

జి. ఖాను

'యహేయ్....' అని పంచలో నుండి గంభీరంగా పిల్చిన గొంతుకు సమాధానంగా 'వోయ్.... ఇదో.... వత్తన్నా' ఇంటి లోపలనుండి కమ్మని గొంతు విన్పించింది.

కొద్దికాలం గడచింది. గంభీరంగా పిల్చిన ఇంటాయన తన పనిచేసుకోడం మొదలుపెట్టాడు. తాను ఇల్లాలిని పిల్చిన సంగతి మర్చిపోయినట్లు.

ఇంట్లోనుండి పలికిన స్త్రీ వచ్చి మండిగం మీద కాలుపెట్టి భర్తవైపు తొంగిచూసింది. ద్వార బంధానికి ఆనించిన ఆమె చేతి ఎర్రని గాజులు గలగలమని కలగానం చేశాయి. ఆ మానవుడు విన్పించుకోలేదు తన పనిలో మునిగిపోయి.

అతను చేస్తున్నపని ముగింపుకు వచ్చేముందు కలిగే మౌనగాంభీర్యం అది అని ఆ ఇల్లాలికి అనుభవపూర్వకమైన సంగతి.

పోగరపోసిన దిమ్మలపైన పట్టెళ్లు పెట్టి, యాతారెతో ఉంగటాలు కుడుతున్న మొగుడు అరుంధతి అరచేతి వెడల్పు కన్నులకు మాంఛి పసందుగా అనిపించాడు అప్పుడు.

రోజూ చూసే దృశ్యమే అది: చినిగిపోయిన ఈతాకుచాపపైన, వనిరాయి,సానరాయి,నీళ్ళతొట్టి ముందు పెట్టుకొని, గుమ్మట వట్టుకొని వదును చేసిన తోలు సాగగొడుతూ, ఊధగబండపైన,

సానరాయిపైన కత్తులు సుతారంగా నూరుతూ చెప్పులు కుట్టడం_ప్రతినిత్యం చేసేపని అదే! కానీ అరుంధతికి యల్లమంద సుందరంగా అనిపించాడు ఆనాడు! వేళావిశేషమేమో!?

చెప్పులు పూర్తి అయ్యాయి. మరలా ఇంకొక జత చెప్పులకు అచ్చులు పోసుకొన్నాడు. రెప్ప వాల్చకుండా భర్తను చూస్తున్న భార్యకు అర్థంకాలేదు.

'కుట్టిన సెప్పులు దొరగోరి కిచ్చిరాకుండా మల్లా యేందిది?' అనుకొన్నది లోలోపల.

'యెందుకో....పిలిసింది?' – తీయగా అన్నది.

తలెత్తి చూశాడు ఎల్లమంద. కన్నుల లోతుల్లోకి చూశాడు. అరుంధతి కాటుక కన్నులలో వెన్నెల రేక తళుక్కున మెరవనే మెరసింది.

'పనుంది ...' మూతిమీద నవ్వుతూ, వాలుచూపు చూస్తూ అన్నాడు.

'నాతో పనేందిప్పుడు....' గునుస్తూ అన్నది.

'నీతోగాకుంటే...మరెవురితో జెప్పు....' వాడి చూపులు చూస్తూ అన్నాడు.

'వూ....సరింగా జెప్పు ....పనుంది నాకు....' ఎల్లమంద ముఖంలోకి చూస్తూ అన్నది.

'యామబ్బా తొందర....నువ్వట్టానుంచో....నిమిశాల్లో జోడు కుట్టేత్తా.... సర్లైగాని........ఈ కుట్టిన సెప్పులు....తీసుకెళ్ళి మన దొరగోరికి....నువ్విచ్చి రావాల....నే నెల్లేవాణ్ణేగాని పాలెం శివయ్యగోర్కి .యెంతరేత్రయినా సెప్పులు కుట్టి తెత్తానని మాటిచ్చినా....నువ్వెల్లి యిచ్చిరావాల....సరేనా?'

క్షణం తటపటాయించి తలూపింది అరుంధతి.

'బువ్వలో కేంజేశావ్....మాపిటికి?'

'రొయ్యిపొట్టు కారంజేసి....కోడిగుడ్డుడ కేసినా....'

'సర్లే....తొరగ ...బోయిరా.....ఈ సెప్పులయ్యేతలికి....' అన్నాడు. కత్తితో అచ్చులుకోస్తూ.

దగ్గరకువచ్చి చెప్పులు తీసుకొని చూచి 'రంగెయ్య లేదే....సరింగా' అన్నది.

'ఊఁ ...నిజవేఁ నిజ్జూసి....మరిసిపోయిన....' అన్నాడు కొంటెగా చూసి, కోరమీసాలపైన నవ్వుతూ. అన్నభేది, చిలుమురాళ్లు ఉంచిన రంగు పిడతలో నుండి రంగుతీసి చెప్పులకు రుద్ది బ్రష్ చేశాడు.

చెప్పులు చీకటిముద్దల్లా మెరుస్తున్నవి.

'నేనొచ్చేదాకా....పిల్లలు జాగర్త....' చెప్పులు తీసుకొంటూ అన్నది.

'వూఁ....అట్టాగేలే....తొరగరా....తెలిసిందా?' అన్నాడు రహస్యంగా. ఆ మాటలకు అరుంధతి హృదయాకాశంలో ఎన్నో కోర్కెల విహంగాలు రెక్కలు విప్పుకొన్నాయి. చిరునవ్వు ఎర్రని పెదాలలోనుండి దూసుకొని వచ్చింది.

చెప్పులు చేతబట్టుకొని, భర్తను కన్నులారా చూసి బయలుదేరింది అరుంధతి. నాలుగు కొంపలు దాటి దారిమలుపు తిరగగానే పిల్లవాణ్ణి భుజంమీద వేసుకొని కూతురు ఎదురైంది.

'అమ్మోయి....నేనొత్తానే....' ఏడుపు ప్రారంభించింది.

ఈ మాటలకు భుజంమీద పిల్లవాడు లేచి తల్లినిచూసి, చేతులుచాచి ఏడుపు సాగించాడు. అరుంధతి పిల్లాడి బుగ్గలు పుణికి, కూతురుజుట్టు నిమిరింది.

'మమ్మగదూ....దొరగోర్కి ...ఈ సెప్పులిచ్చి....తొరగా వొత్తానే.... సుబ్బయ్య కొట్లో ...చెనగ పొప్పు....జీడీలూ....తెత్తాగా....అబ్బాయికి....గూత్తి బువ్వేసి, వుట్టిమీన పిడతలోవున్న నెయ్యేసి, తినిపిచ్చి చిచ్చికొట్టు....మీబాబు.... వనిమీదున్నాడే ...అమ్మా .. ....అల్లరి సేయమాక....పో' అని చెప్పులు నెత్తిమీద పెట్టుకొని ముందుకు సాగింది

పిల్ల సంతోషంతో, సంబరంగా ఇంటిదారి పట్టింది. 'కవ్వొచ్చె.... కన్నుగొట్టె ........ నిదరబో బూచోడా' అని పాడుతూ చంకలోని పిల్లోణ్ణి నవ్విస్తూ ఇంటికి వెళ్ళింది.

తుమ్మల తోపులో నెమ్మదిగా క్రిందికి జారుతున్న సూర్యుని ముఖం తీయని ఊహల మననంతో కాబోలు అరుణ వర్ణాంకితమై పోయింది. అతగాడు పశ్చిమ దిగ్భాగంలో రేగిన పుండులా కనిపిస్తున్నాడు. పతనానికి పూర్వస్థితి మహోన్నతంగాను వుండవచ్చు, భయంకరంగాను వుండవచ్చు అనే సత్యాన్ని రుజువు చేస్తున్నాడు కర్మసాక్షి.

చిల్ల కంపలో వున్న డొంక దాటి, సీమ తుమ్మ పీకలు దాటి, వంట కాలువ వెంట ఊళ్లోకి బయలుదేరిన అరుంధతి గుండెలో దిగులు కలుక్కుమంది.

మౌనంగా తన ప్రవాహపు పెదవులతో గట్టులను ఒరసుకొని నర్మ సంభాషణ కావిస్తున్నట్లు సాగుతున్న పంటకాలువ తనతో ఏదో రహస్యం చెబుతున్నట్లనిపించింది.

ఎన్నిసార్లు ఆ పంటకాలువవెంట ఊళ్లోకి వెళ్ళలేదూ? ఎందుకో ఈనాడు అరుంధతికి ఏనాటి సంగతులో జ్ఞప్తికి వచ్చాయి. ముఖ్యంగా తొలి రోజుల మధురస్మృతి ఒక్కటి లీలగా మనసులో మెదిలింది.

'భర్తతో అరుంధతి తల్లిగారింట' నుండి క్రొత్త కాపురానికి ఈ కాలువ వెంబడే ఊళ్ళో నుండి వస్తున్నది. భర్త కన్నుల్లోకి మూగగా చూడ్డం తప్పితే, అంత బాగా మాట్లాడడానికి పరమ సిగ్గుగా వుండేది అప్పుడు. దానికి తోడు ఆ రోజు దొరసాని, దొరగారు ఏమో మాటలు అన్నారు. దొరగారు మరీని. 'ఒరే! నీ పెళ్ళాం మా ఇదిగా వుందిరా' అన్నాడు భర్తతో. ఆ మాటతో ఎల్లమంద సిగ్గు పడిపోయి అరుంధతిని చూశాడు. ఆమె ముఖం మరీ క్రిందికి వాల్చేసు కొన్నది. తర్వాత మాట్లాడకుండా కాలువ వెంట వస్తుంటే అన్నాడు అప్పుడు భర్త: 'ఇదిగో! నీకంటే కాలవ నయం. గుస గుసమని కబురులు ఎట్టా సెబుతా వుందో సూడు! నీకు సేతగాకపోతే నే సెబుతా ఇను' అని చెవి దగ్గర నోరు పెట్టినట్లు పెట్టి బుగ్గ మీద గట్టిగా ముద్దెట్టుకొన్నాడు. ఒళ్ళంతా జలదరించి పోయింది అప్పుడు ...

ఆనాటి సంఘటనను తలుచుకొంటూ అరుంధతి నడుస్తున్నది.

బాగా కురిసిన వర్షానికి పుంజుకొని అదో మోస్తరు ఎరుపు రంగులో దుండిగ చెట్లు మెరిసిపోతున్నవి. చిన్న ఈత చెట్లపై ప్రాకిన పాలతీగపైన ఎన్నో పూలు పుష్పవతులయ్యాయి. గచ్చాకు పొదలు పిచ్చిగా అల్లుకొన్నాయి. తెల్ల జిల్లేడు చెట్లపైన సన్నముక్కుల తేనె పిట్టలు కూనరాగాలు తీస్తున్నవి.

మనసు సరిగా లేనప్పుడు చెలరేగే రక రకాల ఊహల్లో పుడమి తల్లి గుండెలో నుండి నానా విధాలైన మొక్కలు తలసూపాయి.

జ్ఞాపకాలు తొలుస్తుండగా అరుంధతి ఈ ప్రకృతిని చూస్తూ చూడనట్లుగా తన్ను తాను మర్చిపోయి ఊళ్ళోకి వచ్చింది. వంతెన దాటింది. అవిసె చెట్టు క్రింద వున్న బడ్డీ కొట్టు దాటి రచ్చబండ దాటబోతున్నది.

రచ్చబండపైన మోతుబరి రైతులు, ఊరి పెద్దమనుష్యులు, కుర్రకారు సాధారణంగా సమావేశమౌతారు. ఆ రోజు అంత సందడిగా లేదు. నలుగు రైదుగురు కూర్చొని ధూమపానంచేస్తూ లోకాభిరామాయణమో గ్రామాయణమో ముచ్చటిస్తున్నారు.

తలపై పాదరక్షలు పెట్టుకొని, నాజూకుగా, హుందాగా నడుస్తున్న అరుంధతి వాళ్ళ కన్నుల్లో పడింది.

'ఎవ్వరా అది మా సర్దాగా నడుస్తుందీ!?' ఒకడు అన్నాడు.

'నిజమేఁ.... మహా ఒయ్యారంగా నడుస్తుందోయ్ బొమ్మ....ఏం....వ్రతం చెడ్డా ఫల ముంటాదా మార్కండేయులూ?' ఇంకొకడు వంత పాడాడు.

'ఒరే కుర్ర కుంకల్లారా! నోరు మూసుకొంటే మంచిది. అదేం మాణిక్యం కాదు ఇష్టమొచ్చినట్లు వాగడానికి? ఈమె మొగుడికి ఈ సంగతి తెలిసిందో మక్కెలు యిరగొట్టడం ఖాయం....కాబట్టి నాయనలారా ప్రమాదం....పైపెచ్చు ఈ యమ్మ మంచిది .... ఎప్పుడో గాని ఇటు రాదు .... మీ సంగతి చూచు కోండి ... కాదంటారా బస్తీకి పోండి' అని లోకం తెలిసిన మనిషి చీవాట్లు పెట్టేటప్పటికి క్షణం సేపట్లో అక్కడ నిశ్శబ్దం తాండవించింది.

అరుంధతి రోడ్డు మలుపు తిరిగి, చుట్టూ ఎత్తయిన గోడలున్న మేడ ముందు గేటు తీసుకొని లోపలకు అడుగు పెట్టింది. అక్కడ ఎడం వైపు గొడ్ల సావిళ్లు ఉన్నవి. వాటికి దాపుగా వేపచెట్టు ఉన్నది. కుడి వైపున పెద్ద గడ్డివాము లున్నవి. వాటికి ఉత్తరాన, మేడకు ముందు ధాన్యపు పురి వున్నది. వీటి మధ్య గుండాకాని, ప్రక్కల వెంటకాని వెళ్ళినా మేడ ఎదురుకు వెళ్ళవచ్చు.

అరుంధతి మేడ దగ్గరకు వెళ్ళి మెట్లెక్కి 'అమ్మగోరూ!' అని పిలిచింది ఎక్కడనుండీ అలికిడి, అజా లేదు.

చొరవగా దగ్గరకు వేసిన పెద్ద తలుపు నెట్టుకొని, లోపలికి వెళ్ళేటప్ప టికి లోపలనుండి మనిషి వస్తున్న సద్దు విన్పించింది. అలానే ఆగిపోయింది అరుంధతి. వచ్చిన వ్యక్తి అరుంధతి నెత్తిపై పెట్టుకొని తెచ్చిన చెప్పులు ధరించ బోయే దొర భుజంగరావు. అమ్మగారనుకొన్న స్థానే దొరగారు ప్రత్యక్షంకాగానే క్షణంసేపు అరుంధతి స్థాణువయ్యింది.

ఎప్పుడో మనసులో అనుకొని, అనుకొని, అనుకొన్న యువతి, అనుకోని విధంగా, చల్లని సాయంకాలం, ఒంటరిగా కన్నుల ముందు, ఎవరూ లేనప్పుడు కన్పించగానే కల నిజమై ఎట్టయెదుట నిల్చినట్లనిపించింది భుజంగరావుకు. గుండె గుహలో రుచి మరగిన వాంఛల మృగాలు కళ్లు నులుముకొని భయాన కంగా గర్జించిన వైఖరి అతని ముఖంలో ప్రస్ఫుటమయింది.

నెత్తి మీద పాదరక్షలతో పుత్తడి బొమ్మలా నుంచున్న అరుంధతి మొదట భద్రకాళిలా, తర్వాత రతీదేవిలా, ఆ తర్వాత అరుంధతిలా అనిపించింది భుజంగానికి.

ఈ సంరంభంలో చేతిలో వున్న తెల్లనిమాత్ర లున్న సీసా, అతని గుండె లాగే జారిపోయి, క్రింద పడి పగిలిపోయింది. మాత్రలన్నీ చిందరవంద రయ్యాయి.

'అరే' అని క్రిందకి వంగాడు భుజంగరావు. 'అయ్యో!' అంది అరుంధతి చెప్పులు చేతబట్టుకొని.

'ఈనాటికి గుండె పగిలిపోయింది....' అన్నాడు భుజంగరావు.

'దొరగోరూ! ఏందంటున్నారు?'

'అబ్బే! ఏం లేదులేవేఁ ... సీసా పగిలిపోయింది అని అనబోయి.... ఇట్లా....' సర్దుకొన్నాడు మాటను.

'ఆ మాత్ర లెందుకుండి మరి....'

'పంచదారకు బదులుగా ... ఏసుకుంటారులే.... ఇంతకీ ఆడు రాకండా నువ్వొచ్చావేం....ఏంటే సంగతి' కన్నుల్లోకి చూస్తూ కన్నుగీటాడు భుజంగరావు.

ఒళ్ళు కంపించింది అరుంధతికి 'పనుండి .... రాలేదు దొరగోరు....ఇయి గోండి సెప్పులు....నే వొత్తా నండి....పొద్దోయింది ........' చెప్పులు గోడ వార నుంచింది.

'పోదువు గానిలే ఆగవేఁ....కొంచెం సేపు........మీ దొరసాని లేదు....మీ దొరసానుంటే అప్పుడే పొయ్యేదానివా? ఏందబ్బా....తొందర ....మరీ....మరీ....' ఆరిపోయిన గొంతులో నుండి మాటలు పెగల్లేదు.

అరుంధతి కాళ్ళ క్రింద భూమి ఆ మాటలతో జారిపోయినట్లనిపించింది. ఒళ్ళంతా చెమట మయమయ్యింది.

'ఇంటికాడ పిల్లోళ్ళు దొరగోరు .... మా వోడు తొరగా .... వచ్చెయ్యే మన్నాడు .... నే వొత్తా ...' వణుకుతూ మాటలు వెలువడుతున్నాయి.

'అట్టాగేనేఁ....పండక్కి పెట్టిన కోక బావుందా? అపోఁ....మీ దొరసానికి నువ్వీ సంగతి చెప్పలేదంటగా....అందుకడుగుతున్నా .... నచ్చకపోతే .... చెప్ప రేపే కొంటా....మంచిది.... ఏమంటావ్?' చిన్నగా నవ్వాడు. ఆ నవ్వులో సహజత్వం కనబడలేదు.

'యెందుకు లెండి .... ఆ కోక....బాగున్దండి' పైటతో ముఖం తుడుచుకొన్నది.

'అహాఁ....' తేరిపార జూచాడు అరుంధతిని. భుజంగరావు మనస్సులో కాంక్షల భుజంగం బుస్సుమన్న తీరు ఆతని కన్నుల్లో దాగలేకపోయింది.

'యింగ .... నే .... బోతాను .... దొరగోరు' వెనక్కు మళ్ళింది.

'ఊఁ .... వుండవన్న మాట కూసేపు కూడ .... సరే గాని .... పోయేటప్పుడూ .... వేపచెట్టు దగ్గర వసారాలో వున్న సుక్క గేదెకు .... వాములో గడ్డేసి .... పో' అని నిట్టూర్చాడు భుజంగరావు.

ఒక్క అంగలో ద్వారబంధం దాటి ముక్కోటి దేవతలను ప్రార్థించింది అరుంధతి.

మెరుపులాగా తొంగి చూసి ఏదో పని సాధ్యమైనంత తొందరగా ముగించి, ధాన్యపు కొట్టు మీదుగా గడ్డివాము దగ్గరకు బయలుదేరాడు భుజంగ రావు. తలలో ఉల్లోలంగా ఆలోచనా కెరటాలు విషనాగుల్లా సుళ్ళు తిరుగుతుంటే ఆ కెరటాల మధ్యలో అనుకొన్న అంగనరూపం సముద్ర మథనంలో సాక్షాత్కరించిన లక్ష్మీ రూపంలా అనిపించింది. ఏవో మధురోహాలు గుండెలో పదునై కన్నులలో నుంచి వెలికి వస్తున్నవి. నీతి, నిజాయితీ, ధర్మం, న్యాయం, దారుణం, దానవత్వం — ఈ భావాలన్నీ ప్రచండమైన వాయువు తాకిడికి తేలిపోయి, పారిపోయే మేఘాల్లా మనసులోనుండి క్రమంగా పలాయనమైనాయి. అతని కళ్ళు చూస్తున్నాయి. మనసు కళ్ళు మూసుకుపోయాయి.

గబ గబా గడ్డివాములో నుండి రెండు వాట్లు లాగి తీసుకొనివచ్చి వసారాలో కవర్లాడుతున్న గేదె ముందు వేసి, దూగర దులుపుకొని వెనుతిరిగే టప్పటికి ఎదురైన భుజంగరావును చూసి, పాము పడగ క్రింద చేరిన కప్పలా భయవిహ్వల అయ్యింది అరుంధతి. దారికి అడ్డంగా వెకిలిగా నవ్వుతూ నిలబడ్డ భుజంగం ఆమె ప్రాణానికి యమునిలా అనిపించాడు.

'దొరగోరు .... ఏందిది' మానం, మర్యాద కరడుకట్టి గొంతులో ధ్వనించింది.

'అరందా! .... నిజంగా .... తెలియదంటే?....పదేళ్ళ నుంచి .... ఇందు కోసం .... కాసుకున్నానే ........ నువ్వొప్పుకో .... యీ మేడకి రాణిని చేస్తా కావాలంటే .... నువ్వు కోరుకున్నది .... ఇప్పుడు గావలంటే ఇప్పుడే....ఇస్తాను ....రా....ఒక్కసారికి .... రా....' కనులు తిరుగుతుండగా దగ్గరకు వచ్చాడు.

'దొరగోరు .... ఎవురితో పరాసికా లాడుతున్నావో తెలుసునా? నువ్వే మవుతావో గెపితికి దెచ్చుకో....' కోడెనాగులా బుసలు కొట్టింది.

'ఊ....ఊఁ....ఏందే .... నీ మొరాయింపు .... ఈడకొచ్చి .... యేడకి బోదామనుకొంటన్నావ్?.... అదురుష్టం కొద్దీ. . ఇంటో ఎవరూ లేరు....ఇదీ నీకూ మంచిదేనే.... మరియాదగా రా....' పైట కొంగు పడేసి పట్టుకొన్నాడు. దిమ్మెర పోయింది అరుంధతి. పిచ్చి బలంతో పట్టుకొన్న పైట కొంగును గట్టిగా గుంజు కొన్నది. భుజంగం పట్టు జారిపోయి ముందుకు తూలి పడ్డాడు. అరుంధతి వసారాలో నుండి బయటకు వచ్చింది.

'సీ....యదవ సచ్చినోడా! కొంగు పట్టుకుంటావట్రా....నిన్నూ....నిన్ను

....పూనేయిస్తా.... రేపీపాటికి నీశవం తీసుద్ది సూడు....యల్లమంద పెళ్ళాం వను కొన్నావో లేదో....నా మొగుడు నీ గుండెలో నిదరబోతాడు .... నీ సెర్మం.... ఒలుత్తాడు....దొరవనుకొంటే దెయ్యానివయ్యావు....' నాలుగడుగులు ముందుకు వేసింది రోషంగా.

క్రింద పడిన భుజంగం మనసు రంగుల రాట్నంలా గిర్రున తిరిగింది. యల్లమంద గండ్ర గొడ్డలితో తన పైకి లంఘించాడు! ఇంకేముంది! తన తల గరుక్కున తెగిపోయింది! రక్తం? రక్తం! అంతా రక్తం! !

'ఏదీ అరుంధతి? వెళ్తుందా? వెళ్తే! ? అమ్మో! ఇది వెళ్ళకూడదు. వెళ్ళి నట్లయితే కొంప మునుగుతుంది? తాను బ్రతకడం కల్ల? నలుగురిలో నగుబాటు! మరి? ? ఊఁ .... ఇక....అంతే మరి! ... అంతకన్నా దారి లేదు .... ప్రాణం అన్నిటికన్నా తీపి! .... ఎదుటి వెయ్యి ప్రాణాలకన్నా తన ప్రాణం రక్షించు కోడం అవసరం .... కాబట్టి....' భుజంగం మనస్సు అనుకొన్నది.

భుజంగం కళ్ళకి కనబడింది గాటిలో వున్న గసిక. గబుక్కున తీసు కొని పరుగుతీసినట్లు నడిచాడు. అరుంధతి మాన సంరక్షణార్థం ముందు పరుగెత్తు తున్నది. అరుంధతి బయటకు పోతే ప్రాణం పోతుందనే భయంవల్ల భుజంగ రావు అరుంధతిని వెన్నంటాడు భయంతో, ఒక విధమైన అశక్తతతో. వెనక పరుగెత్తి వస్తున్న పాదాల చప్పుడు విని అరుంధతి మెడ కొంచెం త్రిప్పిందో లేదో భుజంగం చేతిలోని గసిక దెబ్బ కణతలకు తగలనే తగిలింది. దెబ్బ తగిలిన చోట జివ్వుమన్నది. చర్మం చిట్లిపోయింది. ఎర్రని నెత్తురు స్ర్రున ఎగజిమ్మింది. కన్నులు బైర్లు కమ్మాయి. అరుంధతి నరాలు పట్టు తప్పాయి. ఆమె కూలిపోయింది. భుజంగం పాదాలవద్ద రాలిపోయింది. అతని కుడిపాదం ఆమె రక్తంతో తడిసిపోయింది.

ఆమె నోట్లో నుండి ఏవో అస్పష్టమైన మాటలు దొర్లాయి.

'అమ్మో! .... నా దేముడు ... నా పిల్లలు....ఆఁ....' అరుంధతి కన్నులు మూసుకుపోయాయి.

పల్లెలో అరుంధతి పిల్లలు నిద్రలో కెవ్వుమన్నారు. ఎప్పుడూ లేనిది యెల్లమంద చెయ్యి కోసుకొన్నాడు. గూటిలోని దీపం బుడ్డి కొండెక్కింది.

చీకటి పడింది. భుజంగం మనస్సులో చీకటి బడింది.

'అయ్యో!.... ...భగవంతుడా! ఏమనుకొంటే ఏమైంది?....ఇప్పుడెలా....?? ఏమిటి చేయడం....? ఈ ప్రమాదం నుంచి గట్టెక్కేదెలా? నేను తీసుకొన్న.... గోతిలో .... గోతిలో .... అవునవును....గోతిలో .... ఓహో .... దేవుడికి వంద

దండాలు .... ఎంత .... మంచి .... ఆలోచన లిచ్చాడు.... .... వంద కొబ్బరి కాయలన్నా........' భుజంగం పిచ్చిగా నవ్వుకొన్నాడు. కనురెప్పలు ఎగరేశాడు. పంచ ఎగ గట్టుకొన్నాడు. పలుగు, పార తీసుకొన్నాడు. చకచకా కొద్దిసేపట్లో ఆరు అడుగుల పొడవు, మూడడుగు వెడల్పు గల గోతిని త్రవ్వాడు వేపచెట్టు క్రింద. పడిపోయిన అరుంధతి దేహాన్ని తీసుకొనివచ్చి, ఆ గోతిలో నెట్టి మట్టితో కప్పి, చదును చేశాడు. అనుమానం ఎవరికీ కలుగకుండా పలచపలచగా ఎండు గడ్డి వెదజల్లాడు. తన పాపం పాతి పెట్టుకొన్న భుజంగం ఒక విధమైన వెర్రి తృప్తితో నిట్టూర్చాడు.

చీకటి ముదిరింది. చుక్కల వెలుతురు ముదిరింది. రివ్వుమని దూబరలు ఆ చీకటిలో ఎగురుతున్నవి. ఎక్కడో ఉత్తీతపిట్ట శివం ఎత్తినట్లు అరుపు. దూరాన నీళ్ళు పెట్టిన మాగాణిలో నుండి కప్పల అరుపులు. ఏవో పక్షుల కలవ రింపులు. చీకటి గుండె స్పందనల్లా కీచురాళ్ళ శబ్దం.

మత్తుగా, మగతగా అరకన్నులు మూస్తున్న భుజంగరావుకు 'దొరగోరూ! ....ఓ దొరగోరు....' అని పిల్చిన ఎల్లమంద గొంతు వినగానే మత్తు, మగతా విచ్చిపోయి గుండె చచ్చినంత పనయ్యింది. ఒక్క ఉదుటున లేచి కూర్చొని. పడక గది తలుపు తెరచి, మధ్య గది బయట తలుపు తెరచాడు. ఎదురుగా ఎల్లమంద కన్పించాడు. అతని రాకలోని ఆంతర్యం అర్థమై గుండె చిక్కబట్టు కొన్నాడు.

'ఏం రా....ఏంది ...ఈ రేత్రేళ వొచ్చే వేం....డబ్బు గావలిసొస్తే.... నీ పెళ్ళాంతో చెప్పి .... పంపకపోయావా? .... సారాకి డబ్బులు లేవా? ఎంతగావా లేంది....' విసుగు ప్రదర్శించకుండా మెత్తగా మాట్లాడుతున్నాడు.

'నాకేమొద్దు దొరా....మా యింటిది .... ఇంగా కొంపకు రాలేద్దొరా.... అందుకని సూస్సిసి మీకాడ కొచ్చినా .... యేమైందో దొరా....' యల్లమంద గొంతుకలో వణుకు, బాధ కనబడుతున్నాయి.

'ఏందిరా నువ్వనేది? నీ పెండ్లాం రాలేదంటావా? నీ మొకం .... నాకు చెప్పులిచ్చి .... యెంటనే వొచ్చింది కదరా .... దాని దుంప దెగా ... యెంత ఆలస్యమైనా .... ఇంత అలిస్యంగా .... ఈ పాటికి.... యెల్లుంటది లేరా.... పో'

'ఏందో దొరా....నా కెట్టాగో వుంది' దిగులుగా అన్నాడు.

'వోరే.... యెల్లమందా! .... నువ్వొఠి పిచ్చోడివిరా .... నీ పెళ్ళాం.... సర్దాగా .... సిన్మా కెళ్ళిందేమో లేరా' వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

'దొరా....' కంచులా మ్రోగిన కంఠనాదం విని మంచులా అదిరిపడ్డాడు భుజంగరావు అతని ప్రాణాలు తావులు తప్పాయి..

'ఏందిరా నీ గీరుమాణం!.... దొంగరెడ్డిగోడు .... నీ పెళ్ళాం .... రోడ్ద మ్మట గుస గుసలాడతా పోతుంటే .... నేను రా.... సూసింది .... యిప్పుడు.... జెప్పు .... ఏందో....' పెదాలపై అదో రకంగా నవ్వాడు.

'దొరా .... అట్టానగాకు దొరా .... అదటువంటిది గాద్దొరా .... అగ్గి.... అగ్గిలాంటిది దొరా అది....' పిడికిళ్లు బిగించాడు.

'వారే .... యెల్లమందా!....నే నేమన్నా(న్రా).... నే చూసింది చెప్పానుగాని ....కత గాదురా....నీ పెళ్ళాం సంగతి నాకు తెలియదురా పిచ్చోడా .... రాకపో ద్దంటావా? .... ఇంటికి బోరా నువ్వు .... ఇదుగో చిత్తుగ తాగి .... పోరా....' వెకిలిగా నవ్వుతూ భుజంగం ఎల్లమంద చేతిలో పెట్టాడు

అయిష్టంగా తీసుకొన్నాడు ఎల్లమంద. అతని మనసులోని కసీ, దోషం, పౌరుషం కళ్ళను కుంచింపజేశాయి. పళ్ళు కొరికాడు. చీకటిలో అతని కళ్లు పగ బట్టిన కోడెత్రాచు కన్నుల్లా ఉన్నాయి. భుజంగం అప్రయత్నంగా ఒక్క అడుగు వెనక్కు వేశాడు.

'వొత్తా ... దొరా .... దండాలు .... దొరా....' అంటూ కదిలాడు ఎల్ల మంద. బిగబట్టిన ఊపిరి వదిలాడు భుజంగం.

కొద్ది రోజుల్లో అరుంధతి సంగతి ఊరంతా పొక్కిపోయింది. రకరకాల వ్యాఖ్యానాలతో వదంతులు ప్రచారమయ్యాయి. ఎల్లమంద పిచ్చివాడిలా తిరుగు తున్నాడని సానుభూతిగా అనుకొన్నారు అందరూ. బరువు తీర్చుకొన్నట్లు అనిపించింది భుజంగరావుకు ఆ మాట వినగానే.

కొత్త చెప్పులు తొడుక్కున్న భుజంగరావుకు కుడికాలు చెప్పు పట్టెడ కరవడంచేత మొదట రాసుకుపోయింది. తర్వాత ఎఱ్ఱగా పుండు పడింది పైన. ఇంకా రెండు మూడు రోజులైన తర్వాత బరువు చేసింది. కాలు కదపడానికి వీలు లేనంత పరిస్థితి ఏర్పడింది. భుజంగరావుకు తన కాలును చూచుకొన్నప్పుడు ఎందుకో అరుంధతి రక్తం అక్కడ అంటుకొని ఉన్నట్లు భ్రాంతి పొందేవాడు. అందుకనే ఆ కాలు మీదే చెప్పు పుండు పడగా మరింతగా క్రుంగిపోయాడు. ఆ కాలును చూస్తున్నంత సేపూ తాను చేసిన దౌష్టం, అమానుషకార్యం కన్నుల ముందు గజ్జె కట్టి ఆడేవి. ఆ రోజు, అరుంధతిని పాతిపెట్టిన తర్వాత ఎన్నో లెక్కలేనన్ని బాల్చీలతో స్నానం చేసి, ఆ కాలు రుద్ది రుద్ది గట్టిగా తోమి, సబ్బుతో కడిగి, మట్టితో పామి శుభ్రం చేసుకొన్నాడు. కానీ, అ తర్వాత కాలును ఎప్పుడు చూచుకొన్నా ఏమిటో రక్తసిక్త మయినట్లు కనిపించేది. అటు వంటి దక్షిణ పాదానికి ఇప్పుడు పాదరక్షచేత కల్గిన వ్రణం పులిమీద పుట్టలాగే అనిపించింది భుజంగరావుకు.

అప్పటి నుండి దయ్యం పట్టుకొన్నవాడిలా క్రుంగి, కృశించిపోయాడు భుజంగం. ఎరుపు రంగు దిక్కుల్ని, విరిసిన మందారాల్ని, ఎక్కడైనా ఎర్రని రంగును చూస్తే .... ఎర్ర రంగును చూసి బెదిరే పశువులా తన పాదాన్ని చూసుకోడానికే బాధ పడిపోయేవాడు లోలోపల.

మొదట్లో ఆ పుండును తోలు కాల్చి, కొబ్బరి నూనెలో కలిపిన నల్లని మిశ్రమాన్ని రాయడం జరిగింది. సాధారణంగా ఆ వైద్యంలో అటువంటి పుండ్లు నయం కావడం కద్దు. భుజంగానికి పై మందు ఎందుకో ఏ మాత్రం పట్టు ఇవ్వ లేదు; సరిగదా మరింత విషమించింది.

అతని పరిస్థితి చూసిన అతని దగ్గరవాళ్ళు, స్నేహితులు, బంధువులు ప్రక్కన ఉన్న పట్నానికి వెళ్ళి డాక్టరు సలహా తీసుకోమని ఎంతగానో చెప్పి చూశారు. ఆ మాటలు భుజంగం చెవికెక్కలేదు. భార్య ఏడుస్తూ చెప్పిచూసింది. ఇదిగో రేపు, ఎల్లుండి అని గడిపేశాడు చాలకాలం. చివరకు ఏ మాత్రం నడువ లేని పరిస్థితి ఏర్పడింది. కాలు మోకాలి చిప్ప వరకు బాగా వాచిపోయింది. ఆ ఎర్రపుండు భుజంగాన్ని వెక్కిరించినట్లనిపించింది. భుజంగం బాధగా కాలును చూచుకోబోతే ఆ ఎర్రపుండులోనుండి అరుంధతి అట్టహాసం చేస్తున్నట్లనిపించేది. అప్పుడు భుజంగం నిలువెల్ల కంపించిపోయేవాడు. కళ్ళు గట్టిగా మూసుకొనే వాడు. వణికిపోయేవాడు. నిట్టూర్చేవాడు. కళ్ళు తెరచిచూస్తే అంతా మామూలే తర్వాత!

ఇలా రెండు, మూడుసార్లు జరుగగా మానసికంగా, శారీరకంగా కుమిలి క్రుంగిపోయాడు భుజంగం. ఆనాటి దృశ్యం మనస్సులో మెదిలితే ఎదురుగా అరుంధతి పైకి లఘించినట్లు అనిపించేది. సలుపు, పోటు పెరుగుతున్న కాలు వైపు చూచుకోబోతే పుండులోనుండి అరుంధతి తొంగిచూసి భీతావహంగా నవ్వినట్లు అనిపించేది. తన జీవితాన్ని, ప్రశాంతతను వేటాడే దుర్భర సంఘటన నుండి విముక్తి పొందటం ఎలా అనే ఆందోళనలో సతమతమైపోయేవాడు భుజంగం. పదేపదే ఈ విధంగా జరగడం మూలాన అతని మెదడు మొద్దుబారి పోయింది. ఈ పరిస్థితుల్లో ఒకనాడు స్పృహ తప్పి పడిపోయాడు. భార్య కేకలు పెట్టింది. చుట్టుప్రక్కలవాళ్ళు చేరారు. డాక్టర్ దగ్గరకు తప్పితే గత్యంతరం లేదని వాళ్ళే నిర్ణయించుకొని, భుజంగాన్ని పట్నం తీసుకు పోయారు.

భుజంగాన్ని పరీక్షించిన డాక్టర్లు పెదవి విరిచారు. అసలే డయాబిటీస్ రోగి అయిన భుజంగం ఇంత కాలంగా ఆ పుండు గురించి నిర్లక్ష్యం చేయడం

వల్ల ప్రమాదం ముంచుకొని వచ్చిందని నిర్ధారించారు. రోగి అర్థంకాని భయంతో ఆందోళనతో బాధ పడుతున్నట్లు కూడా చెప్పారు. ఈ విషమ పరిస్థితుల్లో ఆ పుండును ఆపరేషన్‌చేస్తే అది సెప్సిస్ అవడం తప్పదు. ఏదో అని ఆపరేషన్ చేసినామనే సంతృప్తి తప్ప ప్రయోజనం శూన్యం అని తన అభిప్రాయాన్ని వెల్లడించారు.

ప్రాధేయపడిన వాళ్ళ ప్రార్థననుబట్టి భుజంగానికి ఇన్సులిన్ ఇంజక్షనులు ఇచ్చారు. కన్నులు విప్పిచూసిన అతను భయంగా అందరి ముఖాలు చూశాడు. ఆ ప్రశ్నల ముఖాల్లో ఏమి కనిపించిందో ఏమో మరలా ప్రయత్నపూర్వకంగా కన్నులు మూసుకొన్నాడు. అతని ఒళ్ళంతా చెమటతో నిండిపోయింది. అతను వణికిపోయాడు. కన్నులలో నుండి రెండు అమాయకమైన కన్నీటిబొట్లు తొంగిచూశాయి. కొద్దిసేపటికి తెరచిన అతని నోటిలోనుండి 'అ( అ(....రం.... దా....దా....' అనే అక్షరాలు వెల్వడ్డాయి. దగ్గర ఉన్న మనుష్యులు, డాక్టర్లు అయోమయంగా ఒకరి ముఖాలొకరు చూసుకొన్నారు. భుజంగరావు భార్య బావురుమన్నది.

కిటికీలోనుండి కనబడుతున్న అరుణ వర్ణాంకిత పశ్చిమదిగ్భాగం అర్థమైనట్లుగా నవ్వినట్లనిపించింది.

* [భారతి, నవంబర్, 1969] *

# మార్పుకు మార్గం

సి. యస్. రావు

ఆరోజు చినుకుగాలి, వాతావరణం అంతా యీదరగా ఉంది. చీకటిపడి ఓ గంటేనా కాకపోయినా ఎంతో రాత్రయినట్లుంది. వీధులన్నీ బురద బురదగా వున్నాయి. వీధిన నడిచేవాళ్ళ అడుగుల చప్పుడు తాటాకిళ్ళ కప్పులుమీద చినుకుల చిటపటతో గాలి రొదతోను కలిసిపోయి గందరగోళంగా వుంది.

పొలంపనులు పూర్తిచేసుకొని తిరిగివస్తున్నారు కూలీలు. కూలీలలో చాలామంది మాలపల్లిలోకే మళ్ళుతున్నారు. మాటమంతీ ఆడుకుంటూ ఆడవాళ్ళు నెత్తిన పమిటకొంగు కప్పుకొని, మగవాళ్ళు తాటాకు నెత్తికి అడ్డుపెట్టుకొని ఒక్కొక్కళ్ళే మాలపల్లిలోకి పోతున్నారు. ఒక్కొక్క గుడిశలోనే దీపాలు వెలుగుతున్నాయి. పొయిలు రాజుకుంటున్నారు. యిళ్ళ కప్పులమీంచి పొగ మందకొడిగా లేచి వాన చినుకులతో సరసమాడుతోంది.

సుబ్బడు వంట్లో బాగోక ఆరోజున పనిలోకెళ్ళలేదు. లోపల కిరసనాయిలు దీపం వెలుగుతోంది. ఏమీ తోచక లోపలికెళ్ళి దీపాన చుట్ట ముట్టించుకొని వచ్చి నులక మంచంమీద ముడిచిపెట్టుకొని కూర్చున్నాడు. దవడలు నొప్పిపుట్టేలా పీల్చినా ఆ చుట్టలోంచి పొగ రావడం

లేదు. చుట్ట పూర్తిగా ఆరిపోవడమూలేదు. పుత్రమ్మ పొయ్యిదగ్గరే వుంది. అన్నం తెడ్డుతో కలియబెడుతోంది.

ఇంటికి పోతున్న మరియమ్మ సుబ్బడి గుడిశముందు ఆగి 'పుత్రమ్మత్తా! మావకేదో వుత్తరం వచ్చిందట. మాట్టగారు సొప్పమన్నాడు" అంది.

"ఏడనుంచే?" అని సుబ్బడు కలిపించికున్నాడు.

"ఏమో. అయ్యన్ని నాకు సెప్పేదేటాయన" అని వెళ్ళిపోయింది మరియమ్మ.

"దీని తల్లి సిగ తరిగించి యీ వానలో ఎవడెదతాదేటిప్పుడు. రేపు పొద్దుటేల ఎల్లి తెచ్చుకోవచ్చులెద్దూ" అన్నాడు సుబ్బడు పుత్రమ్మకు వినబడేలా.

బాగానే వుందిలే వరస. మన వుత్తరం యాడనుంచొత్తదేటి? వత్తే ఆడికాడనుంచేగా, ఆడికాడనుంచి పాతిక వరకా దబ్బొత్తే ఎగేసుకెడతావు గాని వుత్తరం వత్తే ఎల్లలేవు మరి! నువ్వెల్లకపోతే నేనే ఎల్తాను. బిడ్డ కాడినుంచి వుత్తరం వత్తే వదిలేసి రేపుటేలదాకా నేనుండలేను సుమా" అని బయలుదేర బోయింది పుత్రమ్మ.

"ఓసి నీ సిగతరగ. ఉండెహె, నువ్వు కూడొండు బేగా నేనె ఎల్లి సదివించుకొత్తాను." అని తాటాకు గొడుకేసుకొని బయలుదేరాడు సుబ్బడు. సుబ్బడు మాష్టారింటికెళ్ళి అరుగువార నిలబడి రెండు మూడు కేకలు పెట్టాడు.

"ఎవరూ!" అంటూ తలుపు తెరచేడు మాష్టారు.

"నేనండి. సుబ్బడ్ని. పెసిడెంటుగోరి పాలేర్నండి."

"ఏరా సుబ్బా! నాలుగైదు రోజుల నుంచి నీకు ఉత్తరం వచ్చిందని కబురంపుతూ వుంటే ఎక్కడో అయిపూ జాడలేవు. అంత తీరికలేకుండా పోయిందేమిట్రా?"

"అదేటండి బాబూ! నాకీయాలేకదండి కబురందుత."

"అయితే యింతవరకు నీకు కబురే అందలేదన్న మాట, బాగానేవుంది. మాలపల్లిలోకి వెళ్ళే ప్రతివాడికి చెప్పాననుకో. వాళ్ళకి నా మాటంటే లెక్కా జమా."

"ఉత్తరం ఏడనుంచండి?"

"ఓరి నీ తొందర మండ ఆగరా నేను మాత్రం చూశానా! అసలా ఉత్తరం ఏమూల తగలబడిందో చూడనీ ముందు" అని ఉత్తరాల కట్టవిప్పి వెతకడం మొదలెట్టాడు.

"అపడిందా అండి?"

"వెతుకుతున్నాగా వుండు ఈ వెధవ ఉద్యోగానికి వేళాపాళా లేదు. వచ్చే జీతం పాతిక. చేయాల్సింది గొడ్డు చాకిరీ. పోష్టు మాష్టర్ని పోస్టు బంట్రోతుని అన్నీ నేనే యింటింటికి ఉత్తరాలిచ్చి రావడం దబ్బాలోపడ్డ ఉత్తరాలన్నీ తీసి రోజూ ముద్రకొట్టడం వాటిని కట్టపెట్టి సబాపీసుకి పంపడం చిల్లర దుకాణంలా కవర్లు, కార్డులు అమ్మడం— పైగా స్కూలుకెళ్ళి టైముకు సంతకం పెట్టడం రామ రామ మరబతుకై పోయిందనుకో అమ్మయ్య దొరికిందిరా." అంటూ గొణుక్కుని సణుక్కొని ఉత్తరం తీశాడు బయటకి.

నిజానికి ఆ మాష్టారు ఆ వూళ్ళో స్కూలు మాష్టరు పోస్టు మాష్టరు ఆయుర్వేదం డాక్టరు కూడాను. ఊళ్ళో పెద్దింటి వాళ్ళకి వచ్చిన ఉత్తరాలైతే ఆరోజు కారోజే స్వయంగా తీసుకెళ్ళి చెప్పజెప్పి వస్తాడు. మాలపల్లికి శెట్టిబలిజ పేటకి వచ్చిన ఉత్తరాల్ని వాళ్ళకి కబురంపి వాళ్ళు వచ్చిననాడే యిస్తాడు. అదీ అతని పద్ధతి. అందుకే నాలుగైదు రోజుల క్రితం వచ్చిన ఉత్తరం ఆరోజు దాకా సుబ్బడికి చేరలేదు.

"కాస్త సదివిపెట్టండి." అన్నాడు సుబ్బడు.

మాష్టారు ఉత్తరం చదువుతోంటే సుబ్బడు శ్రద్ధగా వింటున్నాడు.

"అమ్మకి నాన్నకి నమస్కారములు. మన ప్రాంతానికే నాకు బదిలీ అయింది. వచ్చే వారంలో బహుశా శనివారం నాడు మన వూరు వస్తాను. పిన్ని కులాసాగానే వుంది" అలా ఉత్తరం వింటూంటే సుబ్బడికి ఎంతో ఆనందంగా వుంది.

"నీ కొడుక్కి ఏమిట్రా వుద్యోగం?" ఉత్తరం చదివాక అడిగాడు మాష్టారు.

"అదేదో ఇంజనీరం అటండి నాకూ బాగా తెల్దు."

ఉత్తరం తిరగమరగ తిప్పి చంపావుకదట్రా యింజనీరా యింజనూ మరా అంటా వేంరా?

"నాకు తెలికండా, వత్తానండా, ఇంటికాడ అడది ఉత్తరం ఏటోనని ఎదురు నూత్తూ వుంటది."

"అది సరేరా! ప్రెసిడెంటుగారి పొలంలో పాకమీద మొన్న మంచి లేతానపకాయలు చూసాను రేపు నువ్వు పొలం నుంచి వచ్చేటప్పుడు ఓపింది తుంపుకురారా!" అన్నాడు మాష్టారు రివాజుగా.

"అట్టాగేనండా!" అని సుబ్బడు యింటికి బయలుదేరాడు.

సుబ్బడు కోసం పుత్రమ్మ ఎదురుచూస్తోంది. చూరుకిందకి దూరగానే "ఏటి రాసాడు? అబ్బాయికాడ నుంచేనా ఉత్తరం?"

"ఆడికాడనుంచే నీకూ నాకూ నమసకారాలంట మాట్టరు సదువుతుంటే పెద్దింటోళ్ళ కుఱ్రోడు రాసినట్టనిపించిందే"

"సరేలే నీ సంబరానికేం! యిసయ యేటో సెప్పు"

"యిసయానికేముందేటి? మన పక్క పట్నానికే బదిలీ అయినాడంట. శనోరమన్నాడు మనూరొస్తడంట"

"శనోరవా? శనోరం ఎప్పుడూ అయ్యో రేపే శనోరం మరిప్పుడెలా గంటావు?" అని కాస్త కంగారు పడింది పుత్రమ్మ.

"యేటే ఆ కంగారు ఆడేవన్నా పరాయోడా? యాడనుంచో కలకటే రొచ్చినట్టు ఇదై పోతావేటి– మనతో బాటే ఆడూనూ."

"అది సరేలే మన్తో బాటే అని నాకూ తెల్సు. కూకోటాకి ఓ కురిసేయా తొంగోటాకి ఓ పట్టెమంచవా ఏవున్నాయి మనకాడ. ఆడు మా సెల్లికాడ పువ్వులా పెరిగాడు. ఆడిక్కడో పూటేనా వుండగలడా అంట."

"ఔను మరి. మీ సెల్లి నరసమ్మ కొలువు సేత్తంది కాబట్టి. పెళ్ళి పెడాకులు లేకుండా తెచ్చిందంతా యీడికే పెట్టి పువ్వులా సూసుకుంది. ఎక్కడో మనదేశం కాని దేశంలో సదివించింది; పెంచింది. పెద్దోడ్ని సేసింది. ఏడాదికోపాలేనా సూట్టానికి యీలు లేకుండా పెంచింది. అయినా ఎందుకూరుకున్నాం. యాడైతేనేం బాగోటం కావాలిగాని అని వూరుకున్నాం. అంత మాతరం చేత కన్నోళ్ళని కాదంటాడేటి ఆడు...." అన్నాడు కాని మనసొప్ప లేదు.

తను పడుకున్న నులక మంచం గట్టిగా బిగించాడు అంత రాత్రివేళ. కఱ్ఱ పెట్టెలో వున్న గళ్ళ దుప్పటి తీసి దానిమీద పరచాడు. గడ్డి తరగడానికి గుడ్డ చుట్టే దుప్పటీ కింద తూపు దిక్కున దాచాడు. ఒక్కసారి పరిచిన పక్కని చూసి తృప్తిపడ్డాడు. పుత్రమ్మ యిదంతా చూసి 'పైకి డాబేగాని ఆడంటే తనకి మనసులో యిదే!' అనుకుంది.

"ఆడికి సర్కారు కొలువా మరోటా! ఆడుండమంటె మట్టుకు వుంటాడే ఓ పూటకంట. ఏయో రెండు గుడ్లు సూడు మా కాపులింటికాడ నేనో రెండు వచ్చుళ్ళు అట్టుకొత్తాను" అన్నాడు పుత్రమ్మతో.

"అల్లాగేలే" అని పుత్రమ్మ నడుం వాల్చింది చాపమీద.

నిద్దట్లో కూడా పుత్రమ్మకి కొడుకొచ్చినట్టు పిలిచినట్టు అనిపించి కళ్ళు తెరిచి చూసి మళ్ళీ కళ్ళు మూసుకునేది.

సుబ్బిడు వెలుగు రాకుండానే లేచి "మరి నే పొలం ఎడతన్నాను యింకా

నిద్దరేటి, లెగిసి పని సూసుకో అడొచ్చేత్తాడు మరి" అని దీపం బుడ్డిని చుట్టం టించుకొని దుప్పటి కప్పుకొని కఱ్ఱ చేత పట్టుకొని పొలం వెళ్ళిపోయాడు.

సుబ్బడికి సొంత పొలం అనేది ఏమి లేదు. చిన్నప్పుడే ప్రెసిడెంటుగారి కమతంలో దూడల్ని కాయడానికి చేరాడు. ఏడాదికి రెండు బస్తాల ధాన్యం సంక్రాంతి పండగకు ఓ లాగుగుడ్డ తువాలు ఓ పూట చద్దికూడూ అప్పట్లో వాడికి జీతం. అలా చేరిన సుబ్బడు ఆ కమతానికి పెద్ద పాలికాపు. కమతం పేరు ప్రెసిడెంటుగారిదే అయినా చూసేదంతా సుబ్బడే— కూలీలను పెట్టడం, పని చేయించటం, పంట పచ్చడి చేయటం సుబ్బడి వంతు. పంట అమ్మటం సొమ్ము చేసుకోవటం, దాచుకోవటం ప్రెసిడెంటు వంతు.

అంత బాధ్యతను మోస్తున్నా సుబ్బడు ఎప్పుడూ కక్కుర్తి పడలేదు. ఏటా యిచ్చే పదిహేను బస్తాల ధాన్యంతోనే బతకడం అలవాటు చేసుకొన్నాడు. వళ్ళు వంచి పని చెయ్యటం కూడ సుబ్బడికి అలవాటే; అందుకే ఆ కమతాన్ని అంతకాలం అంటిపెట్టుకొని వుండగలిగాడు. తనూ ఓ కమతం ఏర్పరచు కోవాలని ఓ మెట్టు పైకెక్కాలనీ అనుకోవటం, నేరంకాదుగాని అనుకొని వుంటే ఎప్పుడో ఆ కమతానికి దూరమై పోయేవాడు.

చీకటి తోటి పొలం వెళ్ళిన సుబ్బడు పొలంలో దూడల్ని చూసుకొని జనానికి పనులు పురమాయించి పాల కావిడి పట్టుకొని చద్దన్నాల వేళకి ప్రెసిడెంటుగారిల్లు చేరుకున్నాడు. పాల చెంబుల్ని అరుగు మీద పెట్టాడు.

ప్రెసిడెంటుగారి భార్య సీతమ్మ వచ్చి పాల చెంబులు లోపలికి పట్టు కెళుతూ "గొడ్ల సావిట్లోకి రా కాళ్ళూ గిన్నే కడుక్కొని కూచో అన్నం పట్టు కొస్తాను" అంది.

సుబ్బడు గొడ్ల సావిట్లోకి వెళ్ళి దూలంమీదున్న అల్యూమినియం గిన్నెను తీసి గోళెంలో నీళ్లెట్టి కడుక్కొని ఓ స్థంభానికి జారబడి కూర్చున్నాడు. సుబ్బడు ఆ కమతంలో దూడల్ని కాయటానికి చేరినప్పట్నుంచీ ఆ సావిట్లోనే దూడల పక్క తిండి తింటున్నాడు. అప్పట్లో కుండ మూకుట్లో తినేవాడు. పుత్రమ్మ కాపురానికి వచ్చిం తర్వాత అల్యూమినియం గిన్నెలో తింటున్నాడు.

సీతమ్మ అన్నం పట్టుకొచ్చి గిన్నెలో పెట్టింది. చల్లా గంజీపోసి చింత కాయ తొక్కు నంజుకుందికి వేసింది.

"ఈ యేల మావోడొత్తన్నాడండి పట్నం నుంచి" అన్నాడు సుబ్బడు.

"ఏం చేస్తున్నాడు మీవాడు పట్నంలో?"

"ఏదో ఇంజనీరటండి, నాకు బాగా తెల్దు, మొత్తానికి మంచి కొలువే నటండి, పోట్టుమాట్టరుగారు కూడా అన్నారు."

ఇంతలో ప్రెసిడెంటు అటు వైపు వచ్చి "ఏరా సుబ్బా నిన్న రాలేదు?" అని అజమాయిషీ చేశాడు.

"నిన్న కాతంత పులసరంగా వుండి రానేక పోయానండి."

"రోగం వక్క రోజుకే తగ్గిపోయిందా? నిన్న వంట్లో పులసరంగావుంటే ఈవేళ పొద్దున్నే చద్దికూడెందుకు మెక్కుతున్నావురా! అన్నీ సాగుబడి రోగాలు త్వరగా కానియ్. ఈ వేళేనా చెరుకు చుట్టు అరగొట్టించు" అని లోపలి కెళ్ళ బోతూంటే బిల్ కలక్టరు వచ్చాడు.

'ఏం' అన్నట్లు చూశాడు ప్రెసిడెంటు.

"సమితి నుంచి సూపర్‌వైజరూ, కొత్త ఇంజనీరుగారూ వచ్చారండి. మన రోడ్డుకి పోసిన కంకర గుట్టలు చెక్ మెషర్‌మెంట్ చెయ్యడానికి వచ్చారంట. తమర్నీ కంట్రాక్టుగారినీ ఆఫీసు దగ్గరకు పిల్చుకు రమ్మన్నారు."

"కంట్రాక్టరెవడు? ఏదో రివాజుకి ఆ పోతురాజుగార్ని పెట్టాను. పెట్టుబడంతా మందే కద. నువ్వెల్లి వాళ్ళిద్దర్నీ యిక్కడకే తీసుకురా" అని బిల్ కలక్టరును పంపించేశాడు ప్రెసిడెంటు.

"ఒరే సుబ్బా! నువ్వు త్వరగా కానిచ్చి కోడిని కోసి మరీ పో పొలం! ఇంజనీరూ వాళ్ళూ వచ్చారట" అని లోపలి కెళ్ళిపోయాడు.

సుబ్బడు తిండి తిని గిన్నె కడుక్కొని నీళ్లు తాగి గిన్నె దూలం మీద బోర్లించుకొని వీధి వైపు వెళ్ళాడు. ఇంతలో జీపు వచ్చి ఆగింది.

ప్రెసిడెంటు బయటకొచ్చి "రండి-రండి" అంటూ జీపులోంచి దిగిన యింజనీర్ని సూపర్‌వైజర్నీ ఆహ్వానించాడు. సుబ్బడు వక్కకు తొలిగాడు.

జీపులోంచి దిగిన ఇంజనీరు పరిచయంవున్న యింటిని పరకాయించినట్లు చూసినాడు. సుబ్బడు యింజనీర్ని పరకాయించి ఒక్కడుగు ముందుకేసి పిలవ బోయాడు. అంతలోనే "ఏరా నే చెప్పిన పనయిందా?" అన్నాడు ప్రెసిడెంటు సుబ్బడితో.

"సిత్తం. ఇంకా నేదండి."

ఆ మాట విని ఇంజనీరు అటుతిరిగి "నాన్నా నువ్వా" అంటూ దగ్గిర కెళ్ళాడు.

"ఏరా సుబ్బా మీ అబ్బాయి ఇంజనీరా చెప్పావే కాదే! ఏదో పట్నంలో మీ మరదలు దగ్గర ఉంటున్నాడు చదువు చెప్పిస్తోంది అనేవాడివప్పుడప్పుడు. అంతేగాని ఇంజనీరయ్యాడని ఎప్పుడూ అనలేదేం?" అన్నాడు ప్రెసిడెంటు.

"అదేటండి ఓసారి యీడ కొలువు కోసరం తమర్ని సిపారసు చెయ్యమని సెప్పాను కాదటండే ఆ యాల్ల కాగితం మీద కూడా రాసుకొన్నారు."

ప్రెసిడెంటుకి ప్రాణం లేచొచ్చింది. "అవున్నోయ్. నే మరిచేపోయాను. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. మంత్రిగారికి చీఫ్ ఇంజనీర్‌గారికి మన ఎమ్మెల్యేతో కలిసి వెళ్ళి చెప్పాను గుర్తుకొచ్చింది. అవునూ వీరెప్పుడూ మనసైడు రాలేదను కొంటాను" అని ఇంజనీర్ని, సూపర్‌వైజర్ని ఉద్దేశించి "రండి లోపలికి వెళదాం" అన్నాడు.

"పరవాలేదు లెండి అరుగుమీదే కూర్చుందాం బల్ల ఉందిగా" అన్నాడు ఇంజనీరు వినయంగా.

"అరుగుమీద కూర్చోవటం ఏమిటండి నా కలాంటి పట్టింపులు ఏమీ లేవు. స్వతంత్రం వచ్చినప్పటినుంచీ ఖద్దరు కడుతున్న మనిషిని, అప్పట్నుంచీ యీ వూరికి నేనే ప్రెసిడెంటును. ఏ ఆఫీసరొచ్చినా నా పక్కన కూర్చొని భోంచెయ్యాల్సిందే. ఏ కులమైనా కానివ్వండి. అసలు మా నియోజకవర్గం రిజర్వు నియోజకవర్గమా దాంతో మా ఎమ్మెల్యే కూడా హరిజనుడే అయినా మా యింటికి వస్తే నా పక్కన కూర్చుని భోంచెయ్యాల్సిందే. ఇంక వూళ్ళో మాల మాదిగలంటారా వాళ్ళను ఆ మాత్రం దూరంలో ఉంచటం ఊరు కట్టుబాటుని పట్టి తప్పదు. మరి పదండి. పదండి లోపలికి పదండి. కాస్త ఫలహారం చేసి రోడ్డుమీదకు వెళదాం. తిరిగి వచ్చేసరికి భోజనాలు తయారౌతాయి." అంటూ ఆర్భాటంగా ఓ అడుగు ముందుకేసి "సుబ్బా! నువ్వెళ్ళిపోక లోపలికిరా అబ్బాయితో మాట్లాడి వెళుదువుగాని" అని లోపలికి దారితీశాడు ప్రెసిడెంటు.

ఇంజనీరు ఒక్కసారి తండ్రిని చూశాడు.

మోకాళ్ళపైకి పంచీ, మాసిన గడ్డం, చేతిలో కర్రా, రేగిన తలా, గుండెలమీద సగం నెరిసిన రోమాలూ, కాయదీసిన శరీరంమీద మాసిన తువ్వాలూ కళ్ళనిండా ఆనందం.

ఇంజనీరు నాలుగు మెట్లెక్కి లోపలి కడుగు పెడుతూ వెనక్కి తిరిగి తండ్రి కోసం చూశాడు. తన అడుగులంత తేలిగ్గా తన తండ్రి పాదాలు కదల్లేదు. అక్కడే నిలబడిన చోటే అంటి పెట్టుకొని ఉన్నాయి.

"రా!, నాన్న," అన్నాడు ఇంజనీరు.

అది విని "రా! సుబ్బా, రమ్మంటూంటే అక్కడ నిలబడిపోయావేం" అన్నాడు ప్రెసిడెంటు.

అధికారం ఆహ్వానం ఆ పిలుపులో ధ్వనించాయి.

సుబ్బడు వాళ్ళ వెనకే నడిచాడు.

'తన కొడుకు ఇంజనీరు కావటం మూలాన ప్రెసిడెంటు మంచివాడు కావటంచేతా తా నెన్నడూ దాటని ఆ సింహ ద్వారం దాటి లోపలి కడుగు పెట్టగలుగుతున్నాను ఇవ్వాళ్ళ!' అనుకొన్నాడు సుబ్బడు.

లోపల గదిలో డైనింగ్ టేబిల్ మీద ఫలహారా లమర్చి వున్నాయి. 'రండి చేతులు కడుక్కోండి. సబ్బూ, టవలూ అక్కడే ఉన్నాయి' అని చెప్పి వాళ్ళు చేతులు కడుక్కొంటూ వుంటే బొమ్మలా నిలబడిన సుబ్బడిని ఉద్దేశించి 'చూడు సుబ్బా అన్నట్టు నే మరచిపోయాను. ఈవేళ మన షావుకారు ధాన్యం తూచుకొని డబ్బిస్తానన్నాడు. దగ్గరుండి ధాన్యం తూపించి ఆ డబ్బు తీసుకో. నేను ఇంజనీరుగారి వెంట వెళ్ళాలి' అని తనకి ఇబ్బంది లేకుండా పాలేరు సుబ్బడ్ని వదిలించుకున్నాడు ప్రెసిడెంటు.

"మరి నే వత్తానురా అబ్బాయ్" అన్నాడు సుబ్బడు నెమ్మదిగా. గొంతు జీరబోయి మాట స్పష్టంగా లేదు.

చెయ్యి తుడుచుకుంటూ ఇంజనీరు దగ్గర కొచ్చాడు.

"అమ్మ నీ కోసం నిన్న రేతిరి నుంచీ ఎదురు చూస్తుందిరా!"

"ఈ పనయిపోగానే నే నింటికే వెళతా నాన్నా. నీ పని చూసుకొని త్వరగా వచ్చెయ్."

సుబ్బడు వెళ్ళిపోయాడు.

ఇంజనీరు కుర్చీలో కూర్చున్నాడు. మనసంతా చిందర వందరగా ఉంది.

"మీరు కూడా కూర్చోండి" అన్నాడు ప్రెసిడెంటు తనూ కూర్చుంటూ సూపర్‌వైజర్‌ని ఉద్దేశించి.

ముగ్గురూ కూర్చున్నారు ఫలహారాలు తింటున్నారు.

ఇంజనీరు ఎటో పరధ్యానంగా చూస్తూ తింటున్నాడు.

"మీ నాన్న అన్న మాటలు మీరు వినే ఉంటారు. మీ ఉద్యోగం గురించి మొదట్లో సుబ్బడు నాతో చెప్పాడు. వెంటనే నేను చీఫ్ ఇంజనీరుకీ, మంత్రిగారికీ కూడ గట్టిగా చెప్పాను. నా మాట వాళ్ళు కాదనర్లెండి, ఎంచేతంటే మా నాన్నగారు గాంధీగారు కాకినాడ వచ్చినపుడు ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టయ్యారు. అప్పట్లో పోలీసులు ఈయన పేరు తెలియక లిస్టులో రాయలేదు అనుకోండి లేకపోతే అదో పదెకరాలు మనక్కాలి సేదే – అదంతా పైవాళ్ళకు తెలియటంతో మన మాటేదీ కొట్టెయ్యరు."

"మన సమితి ప్రెసిడెంటుగారు కూడా మన ప్రెసిడెంటుగారు ఎంతంటే అంతేనండి" అని పాడాడు సూపర్‌వైజరు.

కాసేపు మౌనంగా ఉండి "మీరు మన ఇంజనీరుగారికి చెప్పలేదా" అన్నాడు ప్రెసిడెంటు.

"మీరు చెబితేనే బాగుంటుందని నే చెప్పలేదండీ."

"ఏమిటీ!" ఇంజనీరు కలగజేసుకొన్నాడు.

"మరేం లేదండి. చెక్ మెషర్‌మెంటుకి రావటం అవసరంలేదూ అని. ఎంచేతంటే వర్షాకాలం వచ్చేస్తోందనీ, ఇంజనీరు ట్రాన్స్‌ఫర్ కావటం కొత్తగా మీరు రావటం ఇదంతా ఆలస్యం అయిపోతుందని సూపర్‌వైజరుగారు కంకర గుట్టలు కొలవటంతోటే నే దగ్గరుండి కంట్రాక్టరుతో చెప్పి కంకర పరిపించేశాను. ఓ మాట మన సమితి ప్రెసిడెంటుగారితో కూడా అన్నాననుకోండి. మీరు వచ్చారని తెలిస్తే సూపర్‌వైజరుగారిచేత 'యం బుక్సు' పట్టించుకొని నేనే వచ్చేవాడిని" అన్నాడు ప్రెసిడెంటు.

చెక్ మెషర్‌మెంట్ కాకుండా కంకర పరిపించడం లాభమే. ఇంజనీర్ బిల్లు ఆపెయ్యొచ్చు కాని యింజనీరు ఏమీ మాట్లాడకపోయినా మనసు లోలోపల సణుక్కుంది. అందుకే తన ఉద్యోగం ఈయనే యిచ్చినట్లు మాటాడుతున్నాడు ఈనాడు ఇంజనీరుకి డిమాండు లేకపోవచ్చుగాని తను ఇంజనీరింగు పూర్తిచేసిన నాటికి పాసు కావటమే తడవుగా ఉద్యోగాలు వొచ్చాయి. అందులోనూ షెడ్యూల్డు కాష్టువాడు తనకంటే తక్కువ మార్కులు వచ్చిన షెడ్యూల్డు కాష్టు స్టూడెంట్సందరికీ వచ్చాయి ఉద్యోగాలు. అయినా యీయన మెహర్బానీ నిలుపుకొని తన పని నాచేత చేయించుకొందుకు నాకు యీ ఉద్యోగం తనే యిప్పించినట్లు మాట్లాడుతున్నాడు. ఉపకారం చేస్తే నా పాలేరు సుబ్బడు కొడుకు నా మాట కాదంటాడా అనుకొంటాడు. ముక్కుకు సూటిగా పోతే అడ్డమైన అలగాజాతి వెధవలనీ అందలం ఎక్కిస్తే కళ్ళు నెత్తికెక్కుతాయి అంటారు" – అలా మనసు అల్లుకొంటూ పోతోంది యింజనీరుది.

"రోడ్డు ఓసారి చూద్దురుగాని మీరు కూడా రండి వెళ్దాం" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆ రోడ్డుమీంచే మా జీప్ వచ్చింది. చూసేదేముంది లేండింక."

"పోనీ ఊరి చివర హరిజనులకు ఇళ్ళ స్థలం అక్వైర్ చేయించాను ఓసారి చూద్దాం రండి" అన్నాడు ప్రెసిడెంటు. ఈ హరిజనోద్ధరణని గుర్తుచేస్తూ.

"ఊరి చివరేగా హరిజన కాలనీ లుండేవి. చూసేదేముంది లెండి. ఊరి మధ్యనుంటే చూడాలి గాని" అని ప్రెసిడెంటు మాటలకు అడ్డు తగిలాడు యింజనీరు.

"డొంక తిరుగుడు లాభం లేదనుకొని సూటిగానే దిగాడు ప్రెసిడెంటు'

"మన చెక్ మెషర్ మెంటు సంగతి ఏం చేస్తారు? 'యం. బుక్' మీద మీరు సంతకాలు చేస్తేనేగాని బిల్లు చేయడానికి వీల్లేదని సూపరువైజరు ఆపుకొని కూర్చున్నాడు."

"ఆఫీసు కెళ్ళాక చూస్తా లెండి. నేనోసారి మా యింటి కెళ్లొస్తాను" అంటూ లేచాడు యింజనీరు.

"మీరక్కడ కెందుకు సార్ పుత్రమ్మకు నే కబురంపుతాను యిక్కడికే వస్తుంది. అక్కడ కూర్చుందుకూ నించుందుకూ ఉండదు."

"పరవాలేదులెండి. అక్కడ పుట్టిన వాడినేగా. పెరగటం ఎలా పెరిగినా, ఎక్కడ పెరిగినా" అంటూ బయల్దేరాడు యింజనీరు.

"అవునవును. ఆ మాట నిజమే నేనూ వస్తానుండండి, ఈ మధ్య మాల పల్లికి వెళ్ళడమే లేదు" అంటూ వెంట పడ్డాడు ప్రెసిడెంటు.

ప్రెసిడెంటూ, యింజనీరూ, సూపరువైజరూ జీపులో మాలపల్లి దగ్గర కెళ్ళి జీపు వెళ్ళినంతవరకూ జీపులో వెళ్ళి జీపు దిగి మాలపల్లిలో నడుస్తున్నారు. జనం అంతా పనుల్లోకి పోవటంచేత నిర్మానుష్యంగా ఉంది.

కొత్త జనాన్ని చూసి కుక్కలు మొరిగాయి. కోళ్ళు, మేకలూ బెదిరాయి.

నులక మంచానా వేళ్ళాడుతున్న ముసలిది 'ఎవరోరు' అని కళ్లు విప్పి పరకాయిస్తూ పలకరించింది.

"నేనే సత్తి ప్రెసిడెంటుగార్ని."

"నువ్వా బాబూ! అప్పుడే యెలక్స నొచ్చేసిందా? నువ్వొత్తే ఎలక్స నొచ్చినట్టే లెక్క నాకు."

"ఇంకా లేదే మూడేళ్లేగా అయింది. యింకో రెండేళ్ళకిగాని రాదు యెలక్షను. నా చిన్నప్పుడు మా వీధి పెరడూ తుడిచేది" అన్నాడు ప్రెసిడెంటు వాళ్ళతో.

ఆ ముసలిదాని మాటలు విన్నాక యింజనీరు ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు.

"ఓటు మూలంగా కనీసం యెలక్షన్ల ముందు యీ గుడిసెల్లో జనాన్ని పెద్దవాళ్ళు పలకరిస్తారు. వాళ్ళ పెద్దరికాలు నిలబెట్టుకొందుకు మళ్ళీ అయిదేళ్ళ దాకా యెక్కడివాళ్ళక్కడే. స్వాతంత్ర్యం తెచ్చిన పెద్ద మార్పు యిదేనేమో– కాని యీ వేళ తన ప్రెసిడెంటుగారింట్లో అడుగు పెట్టడం ఆయన ప్రక్కన కూర్చుని ఫలహారం చెయ్యటం తన తండ్రి చిన్నప్పట్నుంచీ ఆయన దగ్గరే

పని చేస్తూన్నా యీవేళ లోపల గదిలోకి అడుగుపెట్టటానికి, అడుగు ముందుకు వెయ్యలేకపోవటం యెక్కడ తనపక్కనే కూర్చుంటాడోనని పని పురమాయించి తన తండ్రిని ఆయన వదిలించుకోవటం అన్నీ ఇంజనీరు మనసులో గజిబిజిగా సాలెగూళ్ళు ళ్ళుకొన్నాయి. ఆ సాలిగూళ్ళ మధ్య నుంచి స్పష్టమైన నిజం మనసు చాటుతోంది. అనుభవం నొక్కి వక్కాణిస్తోంది. "ఈ అంతరాల్నీ అంటరాని తనాన్నీ చట్టాలూ సంస్కరణలూ ఆలయ ప్రవేశాలూ హరిజన కాలనీలో నిర్మూలించలేవు. వీటికి సరైన పరిష్కారం ఆర్థిక సమానత్వం సాధించటంలో ఉంది. ఆర్థిక స్తోమత పెరిగితే - అంతస్థు పెరుగుతూనే అంతరాలూ తగ్గుతాయి. మనిషికి ధైర్యమూ వస్తుంది. అంటరానితనమూ జంకుతుంది, నన్ను యీనాడు ఆయన ప్రక్కన కూర్చోబెట్టినది ఆయన సిద్ధాంతాలు కాదు. మా నాన్న ఆయనకు చేసిన సేవలూ కాదు. నా ఆర్థిక స్తోమతె నా హోదాయే.

యింతలో తను పుట్టిన గుడిసె దగ్గర పడింది. కన్నతల్లి బయట కొచ్చింది,

"వచ్చావా బాబూ" అని పలకరించింది. ఆలోచనలు చెదరిపోయాయి. 'అమ్మా' అంటూ ముందుకు నడిచాడు యింజనీరు.

* [ 1972] *

# శిలువ వేసిన మనుషులు

కేతు విశ్వనాథరెడ్డి

యెంతటి హిందూ పతివ్రత పేర వెలసినా, వూరికి వెలిగా అరుంధతీయవాడ, తగిన పతిని పొందాలని వెదుకుతూ అరుంధతిని పరీక్షించటానికి వచ్చిన వశిష్ఠుని జుట్టులా, గడ్డంలా అడ్డదిడ్డంగా పెరిగిన చీకి చెట్లు, చీకి చెట్ల మధ్య 'మాదిగిండ్లు.'

స్వచ్ఛమైన పాల పొడి ఆరబోసినట్లున్న వెన్నెల్లో – ఆ పెద్ద చీకి చెట్ల నీడ వడుతోంటే, ఆ కొట్టం – దాని రాతి గోడలు పదిలంగా వున్నాయి. దగ్గర రాళ్ళ గనులున్నాయి కాబట్టి, అడవులు దగ్గర్లో లేవు కాబట్టి కొట్టం మీద బోద నిండుగానూ లేదు; మెండుగానూ లేదు. కాయ కష్టంతో బిరుసెక్కిన నల్లని శరీరం మీద కుళ్ళ మావిన యెర్ర చిరుగుల చీరలా వుంది బోద.

ఆ కొట్టం గంగిది. రాళ్ళదొడ్డిలో పాలీషు రాళ్ళు రుద్దుతుండే ఆ గంగిది. కొట్టంలో గుడ్డి దీపం ముందు గంగి కంటిదీపం కర్రెంకడు. ప్రభుత్వం ప్రచురించిన మూడవ తరగతి తెలుగు వాచకంలో తల దూర్చి, "పుష్టికరమైన ఆహారము" అనే పాఠాన్ని వల్లిస్తున్నాడు. వాడికి తొమ్మిదేళ్ళుంటాయి. గనిలోంచి గట్టున విసిరేసిన నాసి రకం నల్లకంచురాతి ముక్కలా వుంటాడు.

సగం ముద్ద చద్దిసంగటినీ, వేలుగుండం వూరిమిండినీ రరకకాల అవతా రాలున్న దేవునిలాంటి సత్తుపల్లెంలో పెట్టి, "పొద్దు పోయింది సదివింది సాల్లే బువ్వ తిని పడుకో" అంది గంగి. పళ్లెంలోని బువ్వను కళ్లెత్తి కర్రెంకడు చూశాడు. పాఠంలోని 'శక్తిని యిచ్చునవి' 'పుష్టిని యిచ్చునవి' 'రక్షణ యిచ్చునవి' 'ధాన్యములు, దుంపకూరలు, అరటిపండ్లు, చెక్కెర, బెల్లము, నెయ్యి, నూనె,' 'పాలు, గుడ్లు, మాంసము'; 'పండ్లు, ఆకుకూరలు, వుప్పు' పళ్ళెంలో కన్పించలేదు. యీ మాయ యెవరిదో వాడికర్థం కాలేదు. వాడు వాళ్ళమ్మను అడిగాడు:

"అమ్మా యీ పాటంలో సూడు 'శక్తిని, పుష్టిని, రక్షణను యిచ్చు వస్తువులను కలిపి తినవలెను' అని రాసినారు. పుష్టికరమైన ఆహారం మనకెందుకు లేదు?"

వెంకడి ప్రశ్న అర్థం కాక గంగి తెల్లబోయింది. తేరుకొని కొడుకు తెలివి తేటలకు మురిసిపోయింది. కొడుకు ప్రక్కన చతికిలబడి, నోరు తిరక్క అవస్థపడుతూ అడిగింది:

"పుట్టికరమైన అకార మంటే, అదేందిరా?"

"పుట్టికరమైన అకారం కాదు. పుష్టికరమైన ఆహారము" గర్వంగా వాళ్ళ టీచరు హనుమంతు పోజులో వెంకడన్నాడు.

గంగి, కొడుకు పలికినట్లు పలకాలనుకొని పెదాలు కలిపి చూసింది. కానీ సాధ్యం కాలేదు. గంగికి చేతుల కష్టం తెలుసుగానీ కేవలం పెదాల కష్టం తెలియదు, సిగ్గుపడుతూ అడిగింది:

"అదంటే యేందిరా?"

"అంటే .... అంటే .... సెప్తా వుండు. యీ బొమ్మ సూడు."

"కూరగాయల బొమ్మ."

"రైటు" వెంకడు సాలోచనగా పేజీ తిప్పి, వుత్సాహంతో చదివాడు— బొమ్మలలో వున్న యిద్దరు పిల్లలను చూపిస్తూ:

'ఒకడు యిందాకా చూచిన యెలుకవలె చిక్కి వున్నాడు. మరొకడు ఒక మాదిరిగా వున్నాడు. నిజమే కాని మీరు రెండు బొమ్మలను వేరు వేరు పిల్లలను కొనుచున్నారు. అది నిజము కాదు. రెండునూ ఒకే పిల్లవానివి. మొదటిది వానికి మంచి పోషణ లేనప్పుడు తీసినది. రెండవది వానికి మూడు నెలలు పుష్టికరమైన ఆహారం పెట్టిన తర్వాత తీసినది.'

"తెలిసిందా?"

గంగి బొమ్మలోని యెలుకవలె వుండే పిల్లవాని వైపు చూసింది. కొడుకును చూసింది. ప్రక్కన్నే అల్లంత దూరంలో చింకి యీతచాప మీద పడుకొని నిద్రలోకూడ అవస్థపడుతున్న రోగిష్ఠి నాలుగేళ్ళ కూతురును చూసింది. గంగి మనసు వికలమైపోయింది. ఆవిడ కడుపులో యెవరో రాక్షసంగా దేవి నట్లుంది? ఆవిడ గుండెల్లో యెవరో పాశవికంగా శూలాలు గుచ్చినట్లయింది, యెవరిమీద కోపమో తనకే అర్థంగాక కొడుకును కసిరింది.

"తిండి తిన్నా ముందు సచ్చిన్నాబట్టా. నీ పాటాలు ముండ మొయ్యా!"

యెలాంటి పాఠాలైనా ముండ మొయ్యవు. మనుషుల్లో ఆడవాళ్ళే ముండ మోస్తారు. గంగి ముండమోసి నాలుగేళ్లు కావచ్చింది. రాళ్ళగనిలో పనిచేసే మొగుడు. గనిలో నాలుగంగుళాల మందం బండలు లారీకి యెత్తుతున్నప్పుడు బండజారి మీదపడి చస్తే ముండ మోసింది.

కొత్తగా పెళ్ళయిన రోజులూ. ఆ రోజుల్లోని చిన్నచిన్న సంబరాలు, చెట్టంత మొగుడి చావూ, గని వోనర్లు మొగుడి ప్రాణానికి కొసరి కొసరి, గొణిగి గొణిగి, తూకంవేసి యిచ్చిన రెండు వందల రూపాయలూ, యెదిగొస్తున్న కొడుకూ. యెదగలేక చావలేక మొగున్నీ, తన్నూ చంపేందుకే పుట్టిన రోగిష్ఠి దయ్యపు పిల్లా. రోజూ ప్రొద్దున లేచినప్పటినుంచీ ప్రొద్దుపోయేదాకా చేతులరిగినా, నడుం విరిగినా, కాటుక మెరిసేటట్లు కూలి డబ్బులకోసం దుద్దవలసిన పాలీషు రాళ్ళూ, చాలీ చాలని తిండీ. కొడుకు భవిష్యత్తూ యేవేవో జ్ఞాపకానికి వచ్చి, గంగి రోగిష్ఠి కూతురు దగ్గర కూచొని దాన్ని వెర్రిగా చూస్తోంది.

అమ్మ యెందుకు కసిరిందో వెంకడికి అర్థం కాలేదు. అమ్మలకు కోపం యెక్కువని వాడనుకున్నాడు. సత్తుపళ్ళెంలోని సద్ది సంగటిని గబగబా మింగి, చెల్లెలు వోబి పక్క ముడుక్కున్నాడు. అలికిడికి ఆ పిల్ల కదిలింది. చెల్లెల్ని యెగాదిగా చూస్తేనే వాడి చైతన్యం మేలుకొంది.

వోబి నిజంగా యెలుకే. పాఠంలోని యెలుకే. కాళ్ళు బోద పుల్లల్లా వుంటాయి. కడుపు బానలా వుంటుంది. నోరు మాత్రం పెద్దది. దానికి పుష్టికరమైన ఆహారం లేదు. వుంటే బాగుండేది. యెందుకులేదో? వూళ్ళోని పెద్ద రెడ్ల పిల్లలు బాగుంటారు. కోమటోళ్ళ పిల్లలు అంత వూరివుంటారు. మాలవాడలోని ఫాదరీ పిల్లలు-డేవిడ్‌గాడూ-బాగుంటారు. హాళ్ళేం తింటారో! పాఠంలో చెప్పినవన్నీ తింటారేమో! తమకేమో పొద్దున యిన్ని గంజినీళ్ళు. పైటాల యింత సంగటీ. రాత్రి సద్ది సంగటో, కార్రకూడో: యెప్పుడన్నా నీళ్ళ మజ్జిగ, పాలూ,

గుడ్లూ, మాంసమూ, పండ్లూ, నెయ్యీ, నూనె యేవీ వుండవు. వుప్పూ, మెరప కాయా. యెర్రగడ్డా తిని చావాలి.

వెంకడికి తమ పరిస్థితిమీద కోపం ముంచుకొచ్చింది. దుఃఖం వచ్చింది. ఆ అలసటలోనే వాడా రాత్రి నిద్రపోయాడు. గంగి పస్తు పడుకొని ఆ రాత్రంతా కుళ్ళుకొంది.

మరుసటి రోజేదో శెలవు కాబట్టి పిల్లలు కొంతమంది వూరికే మాదిగిండ్లకు మధ్య వుండే చింతవనంలో ఆడుకుంటున్నారు. సమితి ప్రెసిడెంటు కొడుకు శంకరరెడ్డి. ముక్కుసెట్టి కొడుకు కొండిసెట్టి ఫాదర్ కొడుకు డేవిడ్, కర్రెంకడూ కలిసి వేలిగుండ్లాట ఆడుతున్నారు. ఆటలో కొండిసెట్టి యెక్కువ సార్లు ఓడినా, లంచం పెట్టడంలో పెద్దచేయి కాబట్టి, దోకటం బాధ తప్పించు కున్నాడు. ఆటలో యెవ్వరోడినా మిగతా మిత్రులకు లంచమివ్వాలి. మామూలుగా యే లంచమూ యివ్వలేని కర్రెంకడు దాతలకు యేజంటుగా వ్యవహరిస్తూ నిత్యం దాతల తరుపున ఆటలో దోకాలి.

ఆ బృందానికి కొండిసెట్టి బంగారు బాతు రోజూ తినటానికి ఆవోయివో తెచ్చి యిస్తాడు. లేదా అంగట్లో కొత్తగా తయారయిన తినుబండారాల సమా చారం చెప్పి, మిత్రులను వూరించి, అవి బార్టర్ పద్ధతిలో యెలా లభిస్తాయో మార్గం చెపుతాడు. ముక్కుసెట్టి అంగట్లోని పదార్థాల కోసం యెప్పుడయినా రాళ్ళ దొడ్డిలో పాలిష్ రాయిని దొంగిలించే పని కూడా కర్రెంకడిపై మిత్రులు వేస్తుంటారు. కర్రెంకడు వాళ్ళ దయాబద్ధుడు. ఆరోజు కొండిసెట్టి జీడీల రుచి చూపించాడు. మిత్రుల నోటి తీపు తీరక మరికొంచెం తెమ్మనేవేళకు కొండిసెట్టి, జట్టురాజు శంకరరెడ్డిని యేమీ అనలేక డేవిడ్‌మీద తిరగబడ్డాడు.

"నీ కవసరమయితే దొంగగా పాలపొడి తెచ్చి మా అంగట్లో యిచ్చి కొనుక్కుంటావే! మాటి మాటికీ చిక్కేది నేనేనా? పాలపొడి తేపో. మనందరికీ కావలసిన జీడీలు పెట్టిస్తాను."

పాలపొడి వినే వేళకు వెంకడి మనస్సు వూరింది. వాడు ఆతురతగా డేవిడ్‌వైపు తిరిగి అడిగాడు:

"యేం పాలపొడి?"

"అదే! వాళ్ళ నాయనకు మూటెలకొద్దీ పాలపొడి వస్తాన్లా - గోధుమలూ, నూనే."

"మా నాయన ఇంట్లో వుంటాడు." డేవిడ్ గొణిగాడు.

"నేను చూశాన్లె. అంబళ్ళ పొద్దున బస్సెక్కిపోతే, తేరా సీ యబ్బని

గంటేమీ పోదు. మాటి మాటికీ కొండి సెట్టేనా పాపం! పాలపొడి తేపో" శంకర రెడ్డి మందలించాడు.

వాడు సమితి ప్రెసిడెంటు కొడుకు. ఆయన పులి. పులిబిడ్డ పులిబిడ్డే. పులులు గొర్రెల్ని కనవు - గొర్రెల్ని తింటాయికాని. పిల్ల పులిరాజు ఆజ్ఞను డేవిడ్ పాటించక తప్పదు.

"సరేలే. వొరే వెంకట్ నువ్వు తోడు రారా."

డేవిడ్ వెంకన్ని తీసుకొని యేసుపురంవైపు నడిచాడు. యేసుపురమూ వూరికి వెలిగానే వున్నా, అరుంధతీయవాడకు యెడంగా వుంది. దారిలో వెంకడు అడిగాడు:

"వొరే దావీదూ? ఆ పాలపొడి యేం చేస్తార్రా?"

"పాలు చేసుకుంటార్రా."

"అవి తాగితే బలం వస్తుందా? పాలపొడి పాలు బాగుంటాయా?"

"బ్రహ్మాండంగా వుంటాయి"

"నువ్వు రోజూ తాగుతావా?"

"వొఁ."

డేవిడ్ తన గొప్పకోసం ఆమాట అన్నాడు కానీ, వాడు పాలపొడి పాలు మాత్రమే తాగవలసిన అవసరం లేదు. వాళ్ళ నాన్న ఫాదర్‌జాన్ దొరల నోట్లోంచి వూడి పడ్డవాడు. ఇంట్లో దొరల వద్దతే. దొరల బిడ్డలు యింటి బయట నిజం చెప్పరు.

"నే నెప్పుడూ పాలపొడి చూల్లేదు. పాలు తాగలేదు" వెంకడు నిట్టూర్చాడు. డేవిడ్ పలుకలేదు.

"దావీదూ? కొంచెం పాలపొడి నాకియ్యరా?" వెంకడు సందేహిస్తూ అడిగాడు.

"యెందుకు?"

"మా సెల్లెలూ, నేనూ తాగుతాంరా. మా సెల్లెలు కోసంరా. పాలు తాగితే జబ్బులు పోతాయి కదరా. మన తెలుగు పాఠంలో సెప్పినారు కదరా- పాలు పుష్టిని యిస్తాయని. కొంచెం స్రా."

డేవిడ్ వెంకడి ముఖంలోకి చూసి వూరుకున్నాడు.

"నా బొంగరం యిస్తాలేరా. గోలుగుండ్లు యిస్తాలేరా. నెమలి యీకలు యిస్తాలేరా!"

డేవిడ్ బిగుసుకపోయాడు.

వెంకడి అహం బాగా దెబ్బతింది. డేవిడ్‌ను కింద పడవేసి తందామను కున్నాడు. కానీ వెంకడి రక్తం అంత సులభంగా తిరగబడదు.

"సరే లేరా - నీ జత నా కెందుకు?"

డేవిడ్ మాటవరుసకు వెనక్కి పిలుస్తున్నా వినిపించుకోకుండా వెంకడు యింటివైపు చీకిచెట్ల మధ్యగా పరుగెత్తాడు. వాడి మనసు నిండా ఆపుకోలేని ఆక్రోశం వుంది. ఇంటి దగ్గర ఆ సమయంలో అమ్మ వుండదనే విషయం జ్ఞాపకానికి వచ్చి రాళ్ళదొడ్డివైపు మళ్ళేడు. వేపచెట్టు కింద పక్కన్నే గోనెపట్ట మీద పిల్లని పడుకోబెట్టి. రాళ్ళు రుద్దుతున్న గంగి పైసా డబ్బుల కోసం వస్తున్నాడనుకొని "సిల్లల్లేదురా" అంది.

"అక్కర్లేదులే."

"ఆడుకోను పోవేరా? పోనీ యీ దయ్యమ్మొండనన్నా ఆడిపించు. నా దుంప తెంచుతాంది. వొకటే యేడుపు. తిన్నా యేడుపే, తినకపోయినా యేడుపే. రాకాసి నోరు, సెరువు కడుపు."

చెల్లెలిని చంకలోకి తీసుకున్నాక వెంకడి క్షోభ యింకా యెక్కువయింది వాడు బెరుకు బెరుగ్గా అమ్మను అడిగాడు.

"అమ్మా! పాలపొడి పాలు మంచియేనా?"

"కాదురా మంచియి కాదు."

నిజానికి గంగికి యే పాలపొడి గోలా తెలియదు, మంచివి అంటే కొడుకు యే గొడవ పెడతాడోనని అబద్ధం చెప్పింది.

"మంచియని పాదరీవాళ్ళ దాపీదు చెప్పినాడే! పాదరీ యింట్లో పాలపొడి దండిగా వుంటుందట. అడిగి తీసుకోవే. వోటికి రోజూ పొయ్యొచ్చు. రోగం పోతుంది. పాదరీని అడగవే!"

"పాదరీ మనకియ్యడు. మనం మతంలో సేరలే. మన కియ్యడు." గంగి నిట్టూర్చింది. మతం పుచ్చుకున్న వాళ్ళకు కూడా పాలపొడి యెందరికో దక్కదని గంగికి తెలియదు. పైగా గంగి చెయ్యిచాచదు. ఇంటి దేవుడు తిరుపతి వెంకన్ని వదలదు. కొడుకు పేరు దేవుని పేరేనాయె!

"పాలు తాగితే పుష్టి కలుగుతుందే. మనం మతంలో సేరదామే. పాల పొడి దొరుకుతుందేమో."

"పనీ పాటా లేదు. వసపిట్ట వాగినట్లు వాగుతావు. పిల్ల నెత్తుకొని ఆడించరా అంటే యేందో పుట్టి పుట్టి అంటావు. వాళ్ళనీ వీళ్ళనీ సూసి అట్లా బతుకుదామంటావు. అంత పొద్దు పోకుంటే రెండు రాళ్ళు రుద్దు, పావలా డబ్బులు వస్తాయి."

మాట జారినందుకు గంగి బాధపడిపోయింది. రాళ్ళ కష్టంలో కొడుకుని దించ కూడదని గంగి బయటికి చెప్పుకోని శపథం. అమ్మ మాటలతో వెంకడికి ఆత్మజ్ఞానం కలిగింది!

"అవునే యీ సదువొద్దు. రోజూ పాలీషురాళ్ళు రుద్ది వోబికి పాలూ పండ్లూ కొందాం."

గంగి మనసు గిలగిల లాడింది.

పనిపిల్లాడి కష్టంతో తినటమా: వాడు చదువుకొని చిన్న ఉద్యోగం చేసినా తమ కష్టాలు గట్టెక్కుతాయి. ఈ రోజుల్లో తమ కులమోళ్ళకు మంచి వుద్యోగాలు వస్తాయంటున్నారు. వాడి బ్రతుకు కంచు బండలపాలు కాకూడదు. వాళ్ళ నాన్న యీ కంచురాళ్ళకే బలి అయ్యాడు. తన బ్రతుకు యీ కంచురాళ్ళ మధ్యే తెల్లవారుతోంది. కొడుకు రాళ్ళమనిషి కాకూడదు.

గంగి వొక నిశ్చయానికి వచ్చింది కొడుకును కేకవేసింది:

"నువ్వా నీ యెదవసోదీ కట్టిపెట్టు. నువ్వు సదువుకొని వుద్దోగం సేస్తే నాకిదేసాలు. రాళ్ళు రుద్దా వద్దు. బండల కిందపడి సావా వద్దు. నువ్వు సదు వొదిలితే నేను వురేసుకొని సస్తా. నోరు మూసుకొని కొంపకెళ్ళు. లేదా ఆడుకో- ఆ పిల్లనాడ పడేసి."

అమ్మ అంకమ్మ శివాలు చూసి వెంకడు అదిరిపోయాడు. నిజానికి వాడికి ఆ క్షణంలో యే పనిమీదా ధ్యాసలేదు. ఏడికి యేదో కావాలి. వాడికి తినే తిండి సహించటంలేదు. కట్టే బట్ట సహించటం లేదు. ఉండే కొంప సహించటం లేదు. "పుస్తకంలోని పుష్టికరమైన ఆహారము" పాఠం వాడి తలకెక్కింది. పాఠంలోని బొమ్మలూ బొమ్మలోని వొక బొమ్మలాంటి వాడి చెల్లెలి ఆకారమూ వాన్ని బాధిస్తున్నాయి. ఆ బాధ తాత్కాలికంగా నివారణ కావాలన్నా వాడికి యిప్పుడు పాలపొడి కావాలి. దేవిడ్ దాన్ని యివ్వలేదు.

చెల్లెలిని మళ్ళీ పట్టమీద పడేసి గొణుక్కుంటూ చింతవనం వైపు అర్థ రహితంగా వెంకడు నడిచాడు. పాల పొడిని కనీసం చూడాలని వాడికి మనసు పడింది. అయితే వనంలో శంకరరెడ్డి, కొండిసెట్టి, దేవిడ్‌లు లేరు. వాడికి యేడుపు వచ్చింది. ఆ సమయంలో అటు వచ్చిన సీతారాముడు తారసపడ్డాడు. సీతారాముడు హనుమంతు టీచరు కొడుకు. వెంకడి క్లాసే. సీతారాముడు వెంకడు వొంటరిగా కన్పించడం చూసి ఆశ్చర్య పడ్డాడు.

"యేందిరా యిక్కడున్నావు. నీ జతగాళ్ళేరి?"

"వాళ్ళు మంచోళ్ళు కాదు. ఆ దావీదుగాని జత మానేసినా."

"యేం?"

కారణం చెప్పడానికి వెంకడికి సిగ్గేసింది.

"చెప్పరా. వాళ్ళతో మనకేం? మనిద్దరం యిప్పట్నుంచి వొక జతగా వుందాం. ఆ శంకర్రెడ్డిగాడు తోడేలు. సెట్టిగాడు కోతి. దావీదుగాడు నక్కెదవ"

"నిజమేరా. ఆ దావీదుగాన్ని కొంచం, కొంచమంటే కొంచం పాలపొడి అడిగినా, నాకోసం కాదురా. మా చెల్లెలు వొబి వుందే దానికోసంరా, దానికి పాలు తాపితే జబ్బు పోతుంది. మన పాటంలో రాసినారు కదరా - పుష్టికరమైన ఆహారం పాఠంలో. కానీ ఆ దావీదుగానికి నేనంటే లెక్కలేదు. శంకర్రెడ్డి అయితే లెక్కచేస్తాడు- ప్రెసిడెంటు కొడుకని. కొండిసెట్టి అన్నా దావీదుగాని కిష్టమే- వాడికి అంగడి వుంది, నాకేముంది? నాజతంటే యెవరికి లెక్క? కొంచెం - కొంచమంటే కొంచం పాలపొడి యివ్వరా అని బతిమాలితే యివ్వనే యివ్వలేదు. పోనీ డబ్బు సంపాయించి పాలపొడి కొందామంటే మా యమ్మ తిట్టింది. రాత్రి తిట్టింది. యిందాకా తిట్టింది."

క్షోభను ఆపుకోలేక వెంకడు వెక్కి వెక్కి యేడ్చాడు. సీతారాముడు కరిగిపోయాడు.

"యేడవకురా. యేడవాకు. బోడి పాలపొడేనా. నేనిస్తాలే. నిన్ననే మా నాయనకు ప్రెసిడెంటు రెండు మూటెల పాలపొడి యిచ్చినాడంట. మా నాయన స్కూళ్లో పెద్దటీచరుగదా అందుకని. శంకర్రెడ్డి నాయనదంతా మోసమంట! బడిపిల్లోళ్ళకు పంచమని పాలపొడి మూటెలు దండిగా యిస్తే అవి అమ్ముకుంటాడంట! దావీదుగాని నాయనా అంతేనంట! మా నాయన మా అమ్మతో చెప్తాంటే విన్నా. మా యింట్లో పాలపొడి యిప్పిస్తాలే. నా జతవుండు మా నాయనతో రాత్రిపూట ప్రయివేటు కూడా చెప్పిస్తా."

"అయితే మీ యింట్లోకూడా పాలపొడి వుందా?" వెంకడి ఆశ చిగిర్చింది.

"ఆఁ."

"మీ నాయన తంతాడేమోరా. ముందుగానే మీ నాయనకు కోపం జాస్తి. బళ్ళో యెక్కాలు తప్పితే పింతబరికెతో బాత్తాడు"

వెంకడికి టీచరు యమరూపం మనసులో మెదిలింది. సీతారాముడి క్కూడా వాళ్ళ నాన్నంటే చచ్చేంత భయం లేకపోలేదు. కానీ పిల్లల్లో స్వాభిమానం తక్కువేమీ కాదు. సీతారాముడు నిర్లక్ష్యంగా అన్నాడు:

"పెద్దోల్లంతా అంతేరా. నేను పాలపొడి తెస్తాగా. మా నాయన యిప్పుడు యింట్లోలేడు. మాయమ్మ నేనడిగితే తప్పకుండా యిస్తుంది. కావాలంటే సూడు మా అమ్మ మంచిదిరా. నాతో రా...."

ఇద్దరూ సీతారాముడింటికి చేరుకున్నారు. సీతారాముడు వెంకన్ని బయట వుంచి లోపలికి వెళ్ళాడు. వెంకడు బిత్తర చూపులతో చుట్టూ కలయ చూస్తున్నాడు. లోపలినుంచి సీతారాముడి తల్లి తిట్లు విన్పించాయి. వెంకడు భయంతో, నిస్పృహతో అక్కన్నుంచి జారుకోవాలనుకుంటున్న తరుణంలో యముడు హనుమంతు రానే వచ్చాడు. వెంకడి నోట తడిలేదు. టీచరు మామూలుగానే అడిగినా వెంకడు వణికి పోయాడు.

"యేందిరా వెంకా! యిట్లా వచ్చినావు. మావాని కోసరమా. నువ్వు బాగా చదువుకో, నీకు బాగానే చదువొస్తుంది. మాదిగిండ్లలో యితర పిల్లకాయల మాదిరి తిరిగి చెడిపోవద్దు."

సీతారాముడి తల్లి కొడుకును యీడ్చుకుంటూ, తిట్టుకుంటూ బయటికి వచ్చింది. మొగున్ని చూస్తూనే గొంతు పెంచింది:

"చూడు! వీడూ వీడి దరిద్రగొట్టు స్నేహాలూ. వాని మొగానికి పాలపొడి కావాలంట! వీడు పంచుతాడంట! చెల్లెలికి పాలు వాడు తాపాలంట! వీడు పాలపొడి యివ్వాలంట! ఇంట్లో కర్ణుడు పుట్టినాడు. సంసారం ముండ మొయ్యాల్సిందే."

స్కూల్లో యముడిది జాలిగుండె. పరిస్థితి అర్థమయింది. తంటాలుపడి సీతారామున్ని తల్లి చెరనుండి విడిపించి వెంకడితో అన్నాడు:

"వుండ్రా, పాలపొడి కావాలా! తెచ్చిస్తా వుండు."

హనుమంతు యింట్లోకి వెళ్ళి వాక పొట్లం తెచ్చి, వెంకడి చేతిలో వుంచి అన్నాడు:

"వారే వెంకా! నువ్వు మంచోడివి. నాకు తెలుసు. ఈ పాలపొడి యిచ్చి నట్లు యెక్కడన్నా కూసేవు. మీ అమ్మకి మాత్రం నేనిచ్చానని చెప్పు. లేకపోతే దొంగసొమ్మని యెముకలు విరుస్తుంది. నువ్వు యింటికి పద. మా వాడు తర్వాత ఆడుకోటానికి వస్తాడు."

వెంకడు బెదురుగా తలవూపి, కృతజ్ఞత జాలువారే కళ్ళతో పాలపొడి పొట్లాన్ని మాసిన చింకి చొక్కా కింద పెట్టుకొని ముందుకు నడిచాడు. కొంత దూరం పోయాక వాడికి సీతారాముడి యేడుపు వినిపించింది. అయితే సీతా రాముడి యేడుపుకు కారణాలు ఆలోచించే స్థితిలో వెంకడు లేడు. వాడు ఆనంద శిఖరాల మీదున్నాడు. పాలపొడితో పుష్టికరమైన ఆహారం లభించినట్లూ, ఆరో గ్యం కలిగినట్లూ వాడు తృప్తిపడ్డాడు.

గంగి మొత్తుకున్నా వినకుండా మారాంచేసి పాలపొడి పాలు చెల్లెలు

వోబికి రెండు మూడు గ్లాసుల పాలు పట్టించాడు. అది పాలక రాజకీయ కబంధుల్లా చేతులూ, నోరూ చాచిందే కానీ వద్దనలేదు. వెంకడు సంబరపడి పోయాడు. వాడూ గ్లాసెడు పాలు తాగి తృప్తిపడ్డాడు. కొంత పొడి దాచి ఆనందంతో గంతులు వేశాడు.

రోజు తిరక్కుండానే వోబికీ వెంకనికీ వాంతులూ, విరేచనాలూ తెగ కావడం చూసి, గంగి గుండె బేజారయింది. తెలిసిన వైద్యాలు చేసినా ప్రయో పనం లేకపోయింది. ఆ సాయంత్రానికి వోబి పరిస్థితి పూర్తిగా దిగజారి పోయింది. యెగశ్వాసతో వోబి కొట్టుకలాడుతోంది. పిచ్చి పిచ్చిగా వెంకడు కలవరిస్తున్నాడు.

"పుష్టికరమైన ఆహారం ...మంచి పోషణ. వోబి జబ్బు పోతుంది దాపీదు గాడు దొంగ. సీతారాముడు నా జత అనుమంతు అయ్యవారు దేముడు. పుష్టికరమైన ఆహారము వోబికి శక్తి....పుష్టి .. రక్షణ...."

కొట్టంలో ఆ రాత్రి గుడ్డిదీపం పక్కన వోదార్చే వాళ్ళ మధ్య తల్లి పేగును వెయ్యి రంపాలతో కోసి యమయాతన పెడుతున్న పిల్లల దీనస్థితి చూసి గంగి నెత్తీ నోరూ బాదుకుంది. రక్షించమని గంగి వేడని దేవుడూ లేడు. దేవతా లేదు. కానీ నమ్మిన యింటి దైవం తిరుపతి వెంకన్న దిగిరాలేదు. కుల దేవత అరుంధతి కదిలిరాలేదు. యే మహిమా యెవరూ చూపలేదు. దేవుళ్ళు తమ నిజమైన భక్తులు చెప్పే కథల్లోనే మహిమలు చూపుతారని గంగికేం తెలుసు? గంగి గుండె లవిసేటట్లు యేడుస్తూనే వుంది.

కొట్టం బయట వెన్నెల. తడిసిన పాలపొడిలా ముద్దగట్టిన వెన్నెల. కర్తీ పాలపొడిలా మచ్చల నెలరాజు వెన్నెల. వూరు మీద వూరు వెలివేసిన అరుంధతీయ వాడమీద, వాడలోని గంగి కొట్టంమీదా వెన్నెలే.

కొట్టంలో మాత్రం నువ్వూ నేనూ శిలువ వేసిన మనుషుల నీడలు.

* [ఆంధ్రజ్యోతి, 20 ఏప్రిల్, 1973] *

# మాలా - మనిషి

కలువకొలను
సదానంద

"రామన్న రామ రామో....టిర్ ర్ ర్ ర.... ఛో....ఛో...."

రాట్నం కిరకిరమంటూ శ్రుతి కలిపించింది. హెచ్చు గొంతుకతో, మందగతితో పాడుకుంటూ, తోకలను మెలిపెట్టి ఎడ్లను హుషారుచేస్తూ మోట దోలుతున్నాడు మల్లిగాడు. హాయిగా ఊగుతున్న వరిచేలు, ప్రక్కన మామిడి చెట్లు—కొమ్మనుండి కొమ్మకు జంటజంటగా ఎగురుతూన్న చిలిపి పిట్టలు, నెమరువేసుకుంటూ, సన్నగా బుసలు కొట్టుకుంటూ, జారులో ముందుకూ, వెనక్కూ నడుస్తూన్న కాడెద్దులు, కబిల జానలోంచీ చిటచిట మంటూ బావిలోనికి రాలిపడుతూన్న నీటిజల్లు, దోనెలోంచి కాలువలోకి గల గల మంటూ ఉరకలు వేసే నీటి, వడీ, సవ్వడీ. అసలే పచ్చగా ఉన్న పచ్చిక బీళ్ళమీద పడి ముదురు పచ్చగా కనిపించే చల్లటి చెట్లనీడలు—ఇవన్నీ—మల్లిగాడి పాట విని ప్రకృతి పులకించి పోతూందనడానికి నిదర్శనాలు.

ప్రొద్దు బాగా పైకెక్కింది. ఎండ వేడెక్కి, ప్రకృతి సుందరి మొగానికి పసుపు రాస్తూంది. తిండివేళ దగ్గరపడుతూంది.

బావిగట్టున మామిడిచెట్టు నీడలో మల్లిగాడికి చల్లగా ఉంది. బావిలో చుట్టూ దరిని ఢీకొంటూన్న

నీటి అలలలో, పంటకాలువలోంచి సంతతధారగా వినిపించే గలగలలలో అతడికి చల్లదనం కనిపిస్తూంది. ఆ చల్లదనానికి ప్రత్యనుభూతిగా, ప్రకృతి సౌందర్యానికి ప్రతిబింబంగా అతని మనస్సులో సీత ముఖంలోని అమాయకత, ఆమె కన్నుల్లోని మమత, ఆమె మూర్తిలోని సౌందర్యం ఇంద్రధనుస్సులా కదలాడాయి.

పాట ఆపి ఏదో తీయటి కలలో మునిగిపోయిన మల్లిగాణ్ణి కిణకిణమనే చిరు మువ్వల సవ్వడి ఇలలోకి లాక్కువచ్చింది. అల్లంతదూరంలో మెడ ఊపుకొంటూ ఒక పాడియావు, దాని వెన్నంటి ఓ పేయదూడ వస్తున్నాయి. వాటి వెనుక సీత మూర్తి దాల్చిన సస్యలక్ష్మిలా నడిచి వస్తూంది. ఆమె కట్టుకొన్నది పసుపు తేట పచ్చని నేతచీర; తొడుగుకున్నది పసుపు పచ్చని రవికె; ఎర్రంచు పైట చెరగును నడుములో దోపుకున్నది. కాళీయుని పడగలవంటి నల్లని వెండ్రుకలను ముడి వేసుకుంది. పసుపు పొడి అరబెట్టుకున్నట్లున్న నుదుట ఎర్రటి కుంకుమబొట్టు; భుజంమీద గడ్డిచెక్కే పార; చేతిలో గంప....అడుగడుగునా ఒయ్యారాన్ని ఒలికిస్తూ కబిలబావి దగ్గరికి వచ్చింది సీత.

ఎడ్లను ఆపి, "చాన్నాళ్ళకి దరిశెనం...." అన్నాడు మల్లిగాడు పరిహాసంగా.

సీత ముఖమంతా బిగబట్టి చుట్టూ ఒకసారి పరకాయించి చూసి, ఒక్కసారిగా పకాలుమని నవ్వి, తన ఒడిలోంచి నాలుగు పెసరట్లు తీసి అతని కందించింది.

ప్రక్కన బీట్లో ఆవూ, దూడా పచ్చిక మేస్తున్నాయి. దూరదూరంగా రైతులు, పల్లె పడుచులు తమతమ పనుల్లో మునిగి ఉన్నారు. మామిడిచెట్టు నీడలో మల్లిగాడు పెసరట్లు తింటూ కూర్చున్నాడు. సీత మామిడి చెట్టు బోదెకు ఆనుకుని అతన్ని చూస్తూ నిలుచుంది. పిల్లగాలి ఆమె కురులను, చీరె అంచులను రెపరెపలాడిస్తూంది. వాళ్ళిద్దర్నీ చూసి చెట్లో పిట్టలు గుసగుసలు బోతున్నాయి.

"పెసరట్టు ఎలా ఉంది?" అందామె అతని పెదవులవైపు చూస్తూ.

"బాగా లేదు...."

"ఏం?"

అతడామెను ఆపాదమస్తకం తుమ్మెదలా చూశాడు. "కమ్మదనమంతా నీలో దాచిపెట్టుకొని, ఈ చప్పటి పెసరట్లు తెచ్చిపెడితే బాగుందని ఎలా అనగల్ను?"

ఆమె అమాంతం సిగ్గుపడిపోయి, చిరుకోపాన్ని తెచ్చుకొని- "ఇదిగో మల్లిగా! ఆమాట ఈసారంటే మర్యాద దక్కదు" అంది.

"ఓ యబ్బో! చిలక్కి కోపమొచ్చిందిగాబోలు!?" అంటూ చేయి కడుక్కోడానికి లేచాడు మల్లిగాడు.

"నీకింకా ఈ సంగతి తెలియదా?" అంది సీత చెక్కుడు పార పిడిని సవరించుకుంటూ. అతడు ఆమె కన్నుల్లోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

"గొర్రెల మందలోకి గుంటనక్క జొరబడింది."

"ఎవరి మందలోకి? ఎప్పుడు?" అన్నాడు మల్లిగాడు గబగబ.

"వెర్రిమొగమా! తెల్లారి మా మేనమామ వచ్చాడు."

"ఎవరూ? పేటలో ఉన్నాడన్నావే-వెంకటాద్రి అని. ఆయనేనా?"

"అవును...." అంది సీత వెగటుగా.

"ఏం? కోడలు జేసుకుంటాట్టనా?"

"కాదు. ఏలుకుందామనే వచ్చాడు. నలుగురు బిడ్డల తండ్రి. పెళ్లాం చచ్చిపోయింది. నన్ను చేసుకోవాలని ఎంతోకాలంగా ఉబలాట పడుతున్నాడు. మా అమ్మ బతికున్నంతకాలం సాగిందిగాదు. ఆమె పోయి నెలనాళ్ళయినా అయిందో లేదో మళ్ళీ తయారయ్యాడు...." మల్లిగాడు వినడమేగాని, అనడం అతని వంతుగాదు.

"నేను చూడబోతే కూతురులా ఉన్నాను. ఆ మాట అడగడానికి సిగ్గెలా లేకపోయిందో? ఒంటి నిండుకూ నగలు పెడతాట్ట; పెట్టెల నిండా చీరలు కొనిస్తాడట; కాలు నేలకు తగలకుండా రాణివాసంలో కూర్చోబెడతాట్ట వెంట వచ్చేయమన్నాడు. తిండికీ, గుడ్డకూ మొహం వాచిపోయాననుకున్నాడు. బాగా బుద్ధి చెప్పాను. మాలవాణ్ణన్నా చేసుకుంటానుగానీ, నిన్ను మాత్రం చచ్చినా పెళ్లాడను అనేశాను. చచ్చినట్టు నోరు మూసుకుని వెళ్ళిపోయాడు. ఇక మళ్ళీ వస్తే ఒట్టు...."

"అయితే గట్టిదానివే!....అప్పుడే మొగుణ్ణి కూడా వెతికి పెట్టుకున్నావన్న మాటే! అంత అదృష్టం ఉన్న మాలోడు ఎవడబ్బా వాడు" అన్నాడు మల్లిగాడు వేళాకోళంగా.

సీత ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ పచ్చిక బీట్లోకి వెళ్ళి గడ్డి చెక్కకోసాగింది.

సీత పేదింటి పిల్ల. ఆమెకు నా అన్న వాళ్ళెవరూ లేరు. ఒక్క తల్లి మాత్రం ఉండేది. ఆ ముసలిది ఉన్నంతకాలం సంసారాన్ని ఎలాగో ఈడ్చుకు వచ్చేది. నెలరోజుల క్రితం ఆమె చనిపోయింది. సీత ఏకాకి అయిపోయింది.

సీతను చూచి మల్లిగాడు హృదయం జారవిడుచుకున్నాడు. ఆమె అంద

ఛందాలు, పద్దెనిమిదేండ్ల పడుచుదనం, ఆమె మాటల్లోని అమాయకత్వం, ఆమె చూపుల్లో, చిరునవ్వులో వెల్లివిరిసే నైర్మల్యం—ఇవన్నీ అతణ్ణి ఆకర్షించాయి. కాని, అతడు కులం తక్కువవాడు. ఒంటరిగాడు. మునసబుగారింటి సేద్యగాడు. అన్నీ గుండెల్లోనే అణిచేసుకుని నోరు నొక్కుకున్నాడు.

సీతకు కూడా అతన్ని చూడకపోతే రోజు గడిచేది కాదు. అతనితో నాలుగు మాటలు మాట్లాడకపోతే ఏపనీ చేసేది కాదు. సూదుల్లా పొడిచే అతని చూపులు, అతని నడకలో గాంభీర్యం, నల్లగా మెలికలు తిరిగిన కండరాలతో దృఢంగా ఉన్న దేహం, అన్నిటికంటే అతని మనస్సులో పాలవలె ధారకట్టి ప్రవహించే నైర్మల్యం సంఘం దృష్టిలోని మంచి చెడ్డలను ఆలోచించగల శక్తిని ఆమెలో నశింపజేశాయి.

వీరి ప్రవర్తనకు కొత్తకోటంతా మండి పడుతూంది. మాలపల్లి హడలి పోతూంది.

చెక్కుతూన్న పారను అక్కడే విడిచివచ్చి, కాలువలో ముఖం కడుక్కుని నీళ్ళు త్రాగి, కొంగుతో ముఖం తుడుచుకుంటూంది సీత.

మల్లిగాడు గుండె దిటవు చేసుకుని, "అయితే సీతమ్మా!....మా మాల పల్లిలో ఒకడున్నాడు. నీ కోసం ప్రాణమైనా ఇస్తాడు. నీ కిష్టమైతే పెళ్ళాడతావా?" అన్నాడు.

ఆమె నవ్వుతూ నిలుచుంది. కాస్సేపు ఏదో ఆలోచించింది. చివరికి అంది: వాడూ, నేనూ ఒప్పుకుంటే సరా!"

"మరెవరు ఒప్పుకోవాలి?"

"మనుషులు!"

ఇంతలో మామిడిచెట్లో చిలకా గోరువంకలు ఎగిరిపడేలా "ఒరేయ్ మల్లిగా?" అని ఓ కేక వినిపించింది. సీత తొణక్కుండా, వెళ్ళి, పార చేతికి అందుకుంది. మల్లిగాడు తలెత్తి చూశాడు. కొన్ని గజాల దూరంలో ఓ మనిషి కనిపించాడు. ఆ మనిషి పేరు కోటయ్య. కోటయ్య దగ్గరికి వచ్చాడు. మల్లిగాడి వైపు తీవ్రంగా చూశాడు. "పొద్దు నెత్తి మీదికి వచ్చేస్తూంది. ఇంకా నీళ్ళు కట్టడం పూర్తి కాలేదుట్రా?....త్వరగా తెములూ్చ మరి" అంటూ కబిలబావి దాటుకున్నాడు. కోతకు వచ్చిన చెరకుతోట వైపు నడిచాడు. తోట చివర వరకూ నడిచి, మలుపు తిరిగాడు. గడ్డి చెక్కుతూ సీత కనిపించింది.

కోటయ్య ఆమె దగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు. గడ్డి చెక్కుతుంటే మెల్ల మెల్లగా కదులుతూన్న ఆమె అవయవాలు అతన్ని వెర్రులెత్తించాయి.

అతడు ముఖంలోనికి కోపాన్ని తెచ్చుకుంటూ, "ఇదిగోనే పిల్లా! ఈడొచ్చిన దానివి అదురూ బెదురూ లేకుండా ఇలా ఒంటరిగా రావొచ్చా? చూసే వాళ్ళు సిగ్గులేదనరూ?..." అని ఓ వెకిలి నవ్వు నవ్వాడు, "అయినా గడ్డికోసం ఇంతదూరం రావాలా? ఒక మాట నాతో చెబితే సరిపోయేదిగా?"

సీత గడ్డి చెక్కుతూనే, "సిగ్గు లేనిదని నన్నెవరూ అనరు. ఇంకా ఒంటరి ఆడవాళ్ళ వెంటబడే నీలాంటి వాణ్ణి అంటారు" అంది.

"ఏమన్నావ్? ఈసారి అను!" అంటూ కోటయ్య ఆమె చేతిని ఒడిసి పట్టుకున్నాడు. సీత చేతిని విదిలించుకొని, ఆతని ముఖం నిండుకు ఉమిసి, "చెయ్యి పట్టుకుంటావా? ఎన్ని గుండెలు!" అంటూ త్రాచుపాములా బుసలు కొట్టింది.

కోటయ్య దిమ్మెరపోయాడు. చెంప తుడుచుకుంటూ చుట్టూ చూశాడు. ఎవరూ చూడలేదు. మల్లిగాడు చెరకుతోట మరుగున కనిపించలేదు. కోటయ్య కోపంతో అవమానంతో 'హుం' అని హుంకరించి, చరచరా వెళ్ళిపోయాడు.

కోటయ్య-మునసబు ఆదిశేషయ్యగారి పాలేరు. పేరుకు పాలేరు అయినా, అతనికి ఆ ఇంట్లో గొప్ప స్థానమే ఉంది. అతడు ఒక విధంగా మునసబుగారికి అంతరంగిక కార్యదర్శి అన్నా అందులో బేసబబేమీ ఉండదు.

కోటయ్య ఆవిర్లు గ్రక్కుతూన్న ప్రతీకార వాంఛతో మాలపల్లె దాటు కున్నాడు. రైలు కట్టెక్కాడు. ఊళ్ళోకి నడిచాడు. బడిలోనుంచి భావిభారత పౌరులు ఎలుగెత్తి అరుస్తున్నారు.

"ఇతరులను ప్రేమించుము...."

"కులమత భేదములు పాటింపకుము...."

## 2

లోక పర్యటన చాలించి, అస్తాద్రివెనుక విశ్రమించబోతున్న సూర్య భగవానుడు సీత కాపురముంటున్న పూరిఇంటి కప్పులకేసి చివరిసారిగా కన్నెర్ర జేసి చూశాడు. నిస్సహాయంగా ఏడ్చి ఏడ్చి ఓదార్పు దొరకని అబల ముఖంలా పడమటి ఆకాశం ఎర్రనైంది. నిశిరక్కసి తన కబంధ హస్తాలను చాపుకుంటూ వెన్నంటి తరుముకు రాగా హడలిపోయి పారిపోతూన్న పక్షుల కలకలరవాలు మిన్నుముట్టాయి. ఎడ్లు, వాటివెనుక రైతులు; మేకలు, గొర్రెలు- వాటిని తోలుకుని గొల్లవాడు; కడుపునిండా మేసి వచ్చిన గోమాతలు, వాటిని అదలించుకుంటూ అలకాపరులూ గృహోన్ముఖు లవుతున్నారు.

కొత్తకోట ఒక చిన్నపల్లె. లెక్క బెడితే వంద ఇళ్ళకన్నా మించి

ఉండవు. ఆ గ్రామంలో వారిలో చాలామంది రైతులు అందర్లోకీ పేద రైతుకు పదిగుంటల నేల, కాడెద్దులూ ఉన్నాయి. పల్లెలో చాలవరకూ పూరి ఇళ్ళే. మునసబు ఆదిశేషయ్యది మాత్రం డాబా ఇల్లు.

ఆదిశేషయ్య తన ఇంటివాకిట నిలబడ్డాడు. ప్రొద్దు పూర్తిగా వాటారి పోయింది. సూర్యుడస్తమించినా అతని తాలూకు వెలుగురేఖలు ఇంకా ఆకాశం నుండి ప్రతిఫలిస్తూనే ఉన్నాయి.

సైకిలు మీద బస్తీ సంతకు వెళ్ళిన కోటయ్య తిరిగి వచ్చాడు. తాను తెచ్చిన వస్తువులేవో మునసబు ఇంటిలో చేరవేసి, బయటికి వచ్చాడు. "అలా పొలాల వైపు వెళ్ళి వద్దాం రా కోటయ్యా!" అన్నాడు ఆదిశేషయ్య. కోటయ్య అతన్ని అనుసరించాడు.

రైలుకట్ట ఎక్కారు. మాలపల్లి కనిపించింది. అంతవరకూ మౌనంగా ఉన్న కోటయ్య ఇక ఆగలేక తన అక్కసును వెళ్ళగక్కేశాడు: "బాబుగారూ! ఎం. ఎల్. ఏ. లు మొదలు, తాసీల్దారు మొదలు పెద్ద పెద్ద ఆఫీసర్ల వరకు ఈ జిల్లా మొత్తానికి తమ పేరు తెలియని వారుండరు...."

ఆదిశేషయ్య గర్వంగా మీసం తిప్పుకుని కోటయ్యకు తాను త్రాగే మేలురకం చుట్ట అందించాడు. కుట్రదారుని క్రౌర్యంలా చుట్ట గుప్పు గుప్పున పొగలు చిమ్మింది.

"మీ మర్యాదంతా మంటగలిసి పోయేరోజు దగ్గరబడింది."

"ఏం?" అన్నాడు ఆదిశేషయ్య అబ్బురపాటుతో.

"ఔను బాబూ! మన కులం ఎటువంటిది? మన అంతస్తెంత? ఆ సీత మల్లిగాడు— వీళ్ళ ఇద్దరి వ్యవహారం శృతిమించి రాగాన పడుతూంది."

ఆదిశేషయ్య పలుకలేదు. మౌనంగా వింటూ ఏదో ఆలోచిస్తున్నాడు. కోటయ్య మళ్ళీ అందుకున్నాడు: "ఏ చెట్టుకింద చూడూ వీళ్ళే! ఏ పుట్ట చాటున చూచినా వీళ్ళే? వీళ్ళ కథంతా చుట్టుప్రక్కల ఊళ్ళు కోళ్ళయి కూస్తున్నాయి."

ఆదిశేషయ్య గుప్పు గుప్పున చుట్ట పీల్చుతున్నాడు.

"సాయంకాలం ఆ మల్లిగాడు సంతంతా తెగ తిరిగేశాడు. అంగట్లోని జాజిమల్లెలంతా కొనేశాడు. హోటల్లోంచి ఏవేవో పొట్లాలు పట్టుకొచ్చాడు. లోగుట్టు పెరుమాళ్ళకే ఎరుక! మనుషులంటే వాడికి లెక్కే లేదు. ఎంతవరకు తెగించాడో చూడండి."

ఆదిశేషయ్య, కాలి మిగిలిన చుట్ట ముక్కను అవతల పారేశాడు. కోటయ్య ఇంకా సాగదీశాడు. "పాపం— ఆ వెంకటాద్రి నాతో చెప్పుకుని

ఏడ్చాడు. నేనుండగా దీని కిదేం కర్మ? తిండికి లోటా, గుడ్డకు లోటా; నా మాట కాదని వాడెవడో మాలవాడితో కులుకుతూందే....ఇదేం పాడుబుద్ధి అంటూ కన్నీళ్ళు కార్చాడు. మీ ముసలబుచేత దానికి కాస్త బుద్ధి చెప్పించు కోటయ్యా!" ....అంటూ చేతులు పట్టుకున్నాడు.

ఆదిశేషయ్య మరో చుట్ట వెలిగించాడు. "అంతా నాకు తెలుసును కొటయ్యా: చూచీ చూడనట్లు ఉంటున్నకొద్దీ వ్యవహారం ముదిరిపోతూనే ఉంది. సిగ్గు, అభిమానం విడిచి, ఆ మల్లిగాణ్ణి ఎలా మందలించడం? ఏదో చేయాలి మరి."

అతని కళ్ళముందు చీకటి తెర కమ్మింది. ఆ తెరచాటున తన వేయి నాల్కలను బార జాపుకుంటూ ఆదిశేషుడు ఆదిశేషయ్యలో ఆవేశించాడు!

3

సంఘపు కట్టుబాటులా— రైలుబండి కొత్తకోటను, మాలపల్లిని వేరు చేస్తూ, కర్కశంగా గీ పెడుతూ ముందుకు వెళ్ళిపోయింది. ఉత్తర దక్షిణాలుగా ఇనుపదారి. దానికి తూర్పు వేపు కొత్తకోట. పడమరవేపు మాలపల్లి. మాలపల్లిలో మొత్తం పది పన్నెండు తాటాకు గుడిసెలుంటాయి. వారి జీవితానికి ఆ గుడిసెలే ప్రతిబింబాలు!

మల్లిగాడు తన గుడిసెముందు పాత నులకమంచం మీద కూర్చున్నాడు. అతడి కళ్ళు ఆకాశంలోని చుక్కల్ని లెక్క పెడుతున్నాయి. ప్రతి చుక్కా సీతలా రూపుదాల్చి, చిరునవ్వులు చిందిస్తూంది.

మల్లిగాడికి సీతమీద జాలివేసింది. ఆమె బ్రతుకు తన మూలంగా మంట గలిసిపోతూ ఉందనిపించింది. మల్లిగాడు ఒకమారు ఆత్మవిమర్శ చేసుకున్నాడు. తాను మాలవాడు. సీత శూద్రపిల్ల. ఒకవైపు మిట్ట; ఆ మిట్ట ప్రక్కనే పల్లం. మిట్టాపల్లం ఏకమవడం దుస్సాధ్యం. అలా కావాలంటే మిట్టను త్రవ్వి పల్లాన్ని పూడ్చాలి. అప్పుడు మిట్ట నశిస్తుంది. పల్లం బలుస్తుంది. తాను స్వార్థాన్ని చూసు కుంటున్నాడు. ఆమె స్వార్థాన్ని త్యజిస్తూంది. ఇందులో తాను క్రొత్తగా పతనమై పోయేదేమే లేదు. కాని తన కోసం సీత సర్వ నాశనమై పోవలసిన స్థితి ఏర్పడు తుంది.

ఇన్నాళ్ళబట్టి మనసూ మనసూ కలిశాయిగాని సీత ఒంటిమీద తాను చేయి వేయలేదు. ఆమె నిప్పు కణికలా పవిత్రమైనది. చలువరాయిలా స్వచ్ఛ మైనది.

తమ ఇద్దరి సహవాసం అతనికేదో విచిత్రంగా తోచింది. ఇది కలేమో

నన్న భ్రమ కలిగింది. ఈ కల ఎప్పుడు కరిగిపోతుందో అనే భయమూ రేకెత్తింది. గుడిసెలోంచి ముక్కుపుటాల దాకా జాజిమల్లెల వాసన పలుచగా సోకింది. అతని తల మత్తెక్కింది. అతని అనురాగం, ప్రణయదాహం, యౌవనోద్రేకం ఆనకట్టలు త్రెంచుకుని హద్దుదాటి బయటికి దూకడానికి సిద్ధంగా ఉన్నాయి.

అర్ధరాత్రి గడిచింది. తుమ్మచెట్లో కీచురాళ్ళు గీ పెతుతున్నాయి. దూరంగా చెరకు తోటలో గుంటనక్క కూత వినిపించింది. ప్రేమికుడి భావనా వీధిలా ఆకాశం లోతుగా నీలంగా ఉంది. పళ్ళన్నీ బయటపెట్టి చుక్కలు నవ్వుతున్నాయి. పలుచ పలుచని మబ్బుతెరలు జలతారు మేలిముసుగుల్లా చుక్కల్ని కప్పడానికి ప్రయత్నిస్తున్నాయి. దూరంగా తారు రోడ్డుమీద చీకటిని తరుము కుంటూ ఒక లారీ పరుగెత్తుతూంది. ఆ వెలుగును తరుముకుంటూ వెంటనే చీకటి పరుగెడుతూంది. వెలుగు చీకట్ల సంగ్రామం, ఔన్నత్యానికీ, అధోగతికీ నడుమ నిరంతర వైరుధ్యం.

మల్లిగాడు లేచాడు. గుడిసెలో దూరాడు. చేతి సంచీ అందుకుని బయటికి వచ్చాడు. గట్టిగా నిటూర్చి అడుగు ముందుకు వేశాడు. రైలుకట్ట ఎక్కాడు. నక్షత్రాల వెలుగులో కుబుసం విడిచిన పాముల్లా, రాక్షసిచేతి కత్తుల్లా రైలు పట్టాలు మెరుస్తున్నాయి, మల్లిగాడు రైలు పట్టాలు దాటుకున్నాడు. కొత్త కోటలో ప్రవేశించాడు. అడ్డదారుల్లో పడి నడవసాగాడు.

సాహసికుని లక్ష్యం కార్యసాధనేగాని, అతడి బుద్ధి అపాయాల మీదికి ప్రసరింపదు. మల్లిగాడికి అటువంటి విపరీతమైన కోరిక ఎందుకు కలిగిందో గాని — చేతులు బారజాపి పిలుస్తూన్న ప్రమాదపు బాహుబంధంలోకి నడుస్తున్నాడు. తాను తెగించి వెడుతున్నాడు. సీత ఏమంటుందో మరి? చిరునవ్వుతో స్వాగత మిస్తుందో, లేక వెర్రికోపంతో నిష్ఠూరాలాడుతుందో?

ఊరిలోని ఇళ్ళకు కాస్త ఎడంగా, ప్రత్యేకంగా ఉంది సీత ఇల్లు. తలుపుసందులోంచి గ్రుడ్డి వెలుతురు కనిపిస్తూంది. మల్లిగాడు తలుపుమీద వ్రేలితో చప్పుడు చేశాడు. తలుపు తెరుచుకుంది. లోపలికి నడిచాడు మల్లిగాడు. జీవితంలో ఏనాడూ ఊహింపలేని సంఘటన జరిగినంత ఆశ్చర్యంతో, వలలో తగులుకుని వేటగాడి చర్యకు ఎదురుచూచేంత భయంతో సీత అతని వేపు వెల వెలబోతూ చూచింది.

మల్లిగాడు గంభీరవదనంలో మందస్మితం మెరిసింది. "ఏం సీతా? అలా చూస్తావ్? మాలోడు ఇంటిలోకి వచ్చాడనా!"

సీత చటుక్కున తలుపు వేసేసి గొళ్ళెంపెట్టి, తన జీవిత సర్వస్వాన్ని దోచుకోదలచిన శత్రువు లెవరో లోపలికి నెట్టుకొస్తున్నంత వెరగుపాటుతో తలుపుకు ఆనుకుని కాస్సేపు నిలబడిపోయింది. గడగడలాడి పోతున్న గుండెలు యథాస్థానంలో సర్దుకున్నాక జారి క్రింద జీరాడుతూన్న పైటను గుండెలమీద సర్దుకుని, మల్లిగాడి చేతిని అందుకుంది.

ఆమె అతణ్ణి నట్టింట్లోకి తీసుకువెళ్ళింది.

శ్రీకృష్ణుని సుందర విగ్రహం. ప్రక్కన గోవు, చేత పిల్లనగ్రోవి, అతని పెదవులలోంచి ఏదో మూగపాట వినిపిస్తూంది. అతని కన్నుల్లో పాల వెల్లువ చిందులాడుతూంది. ఆముదపు ప్రమిదె దేవుడి మనస్సులా ప్రకాశంగా వెలుగుతూంది.

సీత మల్లిగాణ్ణి దేవుడి దగ్గరకు నడిపించుకు వెళ్ళింది. "దేవుడికి మొక్కు" అంది గంభీరంగా. ఇద్దరూ చేతులు మోడ్చారు. భక్తితో శిరస్సులు వంచారు. మళ్ళీ ఇద్దరు కన్నులు విప్పి, తలెత్తి చూచేసరికి దేవుడు కనుపించలేదు. దీపం లేదు. చీకటి!

మల్లిగాడు నిట్టూర్చాడు. "మన మీద దేవుడికి కూడ కోపమే సీతా!"

ఆమె అతణ్ణి మందలించింది. "తప్పు! అలా అనకూడదు. దేవుడికి మన మీదేం కోపం? లోకులకు భయపడి కళ్ళు మూసుకున్నాడంతే. పాపం!"

సీత దీపం వెలిగించింది. సిరిచాపమీద కూర్చుంటూ "కూర్చో" అంది. అతడు కూర్చున్నాడు. "ఏం పనిచేశావు మల్లిగా! ఈ అర్ధరాత్రికాడ ఎందు కొచ్చినట్టు?" అంది సీత.

మల్లిగాడు మారు మాట్లాడకుండా సంచి లోంచి మల్లెపూలు పైకి తీశాడు. వాటిని ఆమె సిగలో తురిమాడు. ఆమె భుజాలు పట్టుకుని పూలను మత్తుగా వాసన చూశాడు. సంచీలో నుండి ఖరీదైన రవిక గుడ్డ ఒకటి, రెండు రిబ్బనులు. స్నో సీసా, మైసూరుపాకులూ తీసి చాపమీద ఉంచాడు.

"పీటీకంతా డబ్బెక్కడిది?" అంది సీత.

"నీకోసం కూడబెట్టాను."

"ఇటువంటి పని ఇంకెప్పుడైనా చేశావంటే అసలు నీతో మాట్లాడను."

మల్లిగాడు మైసూరుపాకు ఆమె నోటి కందించాడు. ఆమె సగం కొరికింది. మిగతా సగం తాను నోట్లో వేసుకున్నాడు. ఇంకో మైసూరుపాకు తీశాడు. తాను సగం కొరికాడు. మిగతా ముక్క ఆమె నోటి కందించాడు.

"ఎదవలు! మన పల్లెటూళ్ళలోనే మాలోడో అంటూ నాలిక కోసుకుంటారు.

బస్తీల్లో చూడు—ఎంత ఉమ్మడిగా బతుకుతున్నారో! సాయంత్రం పేటలో హోటలు కెళ్ళాను. అక్కడేమీ భేదమే లేదు అంతా ఏకం. మన ఆదిశేషయ్య కూడా ఉన్నాడెందుకూ? మళ్ళీ ఆయనింట్లో గాంధీపటం మీద పూల మాలేమో ఎప్పటికీ వాడిపోదు."

సీతా అతడిమీదికి ఒరిగి వింటూ ఉంది. "ఈ మనుషులందరూ ఒక్కటైనా మనల్ని ఏమీ చేయలేరులే! నువ్వు నా దానివి...." సీత నవ్వింది. పిల్లవాడు అమాయకంగా ముద్దు పలుకులు పలుకుతూంటే తల్లి పెదవుల మీద వెల్లి విరిసే నవ్వువంటి నవ్వు అది.

మల్లిగాడు తరువాతేమీ మాట్లాడలేదు. సీత కూడ నోరు విప్పలేదు. ఇద్దరి మధ్య మౌనం, నిశ్శబ్దం వ్యాపించాయి. ఆ మూగతనంలోనే ఏదో అవ్యక్తానందం! వారిద్దరికి మారుగా దూలానికి వ్రేలాడుతున్న గిజిగాడి గూటిలో పిచ్చుకల జంట చాలా సేపు ఊసులాడుకుని అలసి సొలసి నిద్రకుపక్రమించింది.

## 4

సీతకు మెలకువ వచ్చింది. కళ్ళు తెరచింది. ప్రక్కకు పొరిలి పడుకుంది. శరీరమంతా తేనెవాకలుగట్టి ప్రవహిస్తూన్నట్లుంది. మల్లిగాడు సర్వమూ మరచి నిద్రపోతున్నాడు. అతడి ఉన్నత వక్షం పైకీ, క్రిందికీ మెల్లగా ఊగుతూంది.

అరమోడ్పు కన్నులతో గడచిపోయిన మధురానుభూతిని నెమరుకు తెచ్చుకుంటూ ఉన్న సీత చెవులకు ఇంటి బయట ఎవరో మాట్లాడుకుంటున్న సద్దు సన్నగా వినిపించింది. సీత ఒళ్ళంతా చెవులు చేసుకుని వినడానికి ప్రయత్నించింది:

"ఒరే నాగులూ! ఇంక ప్రయోజనం లేదు. ఈ మల్లిగాడు ఆయువు మూడి లోపలికెళ్ళాడు. లోపలికి వెళ్ళిన మనిషి దాని దగ్గరే చచ్చినట్టున్నాడు మనం వచ్చినందుకు ఆ వెంకటాద్రి మనస్సు తృప్తికైనా—పీణ్ణి నాలుగు వాయించి, కాలో చెయ్యో విరిచిగాని వెళ్ళకపోతే బాగుండదు. ఇంకాస్సేపు చూద్దాం. మనిషి బయటికి రాకపోతే నలుగురము చూరులాగి...."

సీత గుండె దడదడలాడింది. ఆపాదమస్తకం భయంతో గగుర్పొడిచింది. తనను దేవుడే మేల్కొలిపాడు. జరుగబోయే ప్రమాదాన్ని చెవిలో ఊదాడు. తన మేనమామ వెంకటాద్రి కుట్రను ఆమె గ్రహించింది. తనకూ, మల్లిగాడికీ సంబంధముందని ఋజువైతే మల్లిగాణ్ని హతమార్చి రమ్మని వెంకటాద్రి మనుషుల్ని పంపినట్లున్నాడు.

ఇక క్షణాల మీద కర్తవ్యం నిర్వర్తించక పోతే మల్లిగాడి ప్రాణం దక్కదని సీత గ్రహించింది. ఆతురతతో మల్లిగాణ్ని తట్టి లేపింది. అతడి నిద్ర పూర్తిగా విచ్చిపోక ముందే, వెళ్ళి పో! వెళ్ళిపో!" అంది.

అతడు కళ్ళు నులుముకుంటూ "ఎందుకూ!" అన్నాడు.

"ముందు ఇక్కణ్ణుంచి వెళ్ళిపో!...."

"ఉహూ! వెళ్ళను!"

"నీకు పుణ్యముంటుంది. నీ కాళ్ళు పట్టుకుంటాను. ఇంక జాగు చేయొద్దు. ఇంకా మనం బతకాలనుకుంటే—నామాట విని వెళ్ళిపో ముందు. ఇక్కణ్ణుంచి...." ఆమె నిలువెల్లా తడబడిపోతూంది. ఆమె కన్నుల్లో కరుణా, భయమూ చిందులు త్రొక్కుతున్నాయి.

మల్లిగాడు లేచి గుమ్మం వైపు నడిచాడు. సీత— "ఇటుగాదు. అటు!" అంటూ అతని చేయి పట్టుకొంది. దొడ్డి తలుపు తీసింది. అడుగడుగునా అప శకునాలు ఎదురుకాగా ఏం ప్రమాదం వాటిల్లుతుందోనని శంకించే ఛాందసుడిలా చంద్రుడు వెలవెలబోతూ ఆకాశ గమనానికి ఉద్యుక్తుడౌతున్నాడు.

సీత మల్లిగాణ్ణి దొడ్డివైపు మదురు గోడపై కెక్కించింది. మల్లిగాడు గుభిల్లున అవతలికి దూకేశాడు. అతడు పరుగెడు తూన్నట్లు దబదబమంటూ చప్పుడు వినిపించి, క్రమంగా దూరమైపోయింది.

"అమ్మయ్య!" అంటూ గుండె బరువు దించుకుంది సీత. వెంటనే లోపలికి వెళ్ళి, దొడ్డి తలుపు గడియ పెట్టింది. విసురుగా వెళ్ళి చాపమీద పడి పోయి, వెక్కి వెక్కి ఏడ్చేసింది. తన నిస్సహాయతను, గతిహీనతను, లోకుల క్రూరపు కట్టుబాట్లను, దైవపు చిన్న చూపును తలచుకొని, పసిబిడ్డలా కుమిలి కుమిలి ఏడ్చింది. నలిగిపోయి చాపమీద చెల్లాచెదురుగా పడివున్న మల్లెపూలు వాడిన ముఖాలతో ఆమె ఏడ్పును చూస్తున్నాయి.

కొంతసేపటికి ఆమె ఏడుపు ఆగింది. ముఖమంతా జేవురించింది. నేత్రాలు అగ్ని గోళాల్లా మండుతున్నాయి. అర్థంగాని ఆలోచనలతో ఆమె బుర్రంతా వేడెక్కి పోయింది.

మల్లిగాణ్ణి తాను మనసారా వలిచింది. వాడి కోసం తన ప్రాణాలయినా ఇవ్వగలదు తాను. తన మూలంగా వాడిమీద ఈగ వాలినా తాను భరింప జాలదు. తమ అన్యోన్యతను చూసి కంట్లో కారం జల్లుకుంటున్నారు పాడు మనుషులు. తాము ఏడుస్తుంటే చూచి వికటాట్టహాసం చేయాలనుకుంటున్నారు.

మల్లిగాడు అమాయకుడు. గొర్రె కసాయివాణ్ణి నమ్ముతుంది. మల్లిగాడు

మనిషిని నమ్ముతాడు. అతడు అమాయకుడనేందుకు దీనికి మించిన తార్కాణం ఇక లేనే లేదు. అటువంటి మల్లిగాడు అన్యాయంగా తన కోసం మనుషుల విషపు కోరల నడుమ నలిగిపోవడం సీత కిష్టం లేదు. తన మూలంగా మల్లిగాడు సుఖపడలేడు. ఇది అతడి అమాయకత్వంలా, ఆమె అనురాగంలా పరమసత్యం.

ఇద్దరూ చేయి చేయి కలుపుకొని, చెట్టా పట్టా వేసుకుని బతుకు బాట మీద సాగిపోవడానికి వీల్లేదు. మల్లెల బాటగా ఉన్నది ముళ్ళ బాటై అడుగు ముందుకు వేయనీయదు. ఆ రెండు ప్రాణాలూ ఒకదాని నీడలో ఒకటి పెనవేసుకుని సుఖపడలేవు. ఏదో ఒకటి నశించి తీరాలి. ఆమె బ్రతకాలంటే అతడు నిష్క్రమించాలి. అతడు జీవించాలంటే ఆమె తన పాత్రను చాలించుకోవాలి. లేదా—— ఇద్దరూ కలిసి ఏ గంగలోనో దూకాలి.

మల్లిగాడు బ్రతకాలి. వాడు నూరేండ్లు చల్లగా ఉండాలి. అయితే, తాను బతికున్నంత వరకు అది అసంభవం. పరిస్థితి విషమించి రాబందులకన్నా, అడవి మృగాలకన్నా క్రూరమైన మానవజాతి వాణ్ణి పొట్టను బెట్టుకున్నా పెట్టుకోవచ్చు.

సీత తన అనురాగాన్ని పరీక్షకు పెట్టదలచు కొంది. గోడమీద మేకుకు తగిలించి ఉన్న చేదత్రాడు యమపాశంలా వ్రేలాడుతూంది.

## 5

మునసబు ఆదిశేషయ్య ఆరుబయట పట్టెమంచం వేసుకుని పడుకున్నాడు. సీత, మల్లిగాండ్ర ప్రణయం అతని కొక సమస్య. అతడు అంతవరకు పరిష్కృతం కాని ఆ సమస్యతో బుర్ర వగులగొట్టుకొని అప్పుడే చిన్న కునుకు తీశాడు. కోటయ్య పిలుపుతో అతనికి నిద్రాభంగం కలిగింది. కళ్ళు తెరచి "ఏం కోటయ్యా?" అన్నాడు.

కోటయ్య తన మాటలతో మిళాయించి, కాస్త పెట్రోలు చిందబోశాడు. ఇక అగ్గిపుల్ల గీయడం, ధగధగమంటూ మంటలు లేవడం తరువాయి.

"ఆ మల్లిగాడు బాబూ? అర్ధరాత్రిపూట దానింట్లో దూరాడు."

"దేనింట్లో?"

"ఇంకెవరింట్లో? ఆ సీత ఇంట్లో. అది తలుపుతీసి, వీడికోసం ఎంత ధీమాగా నిలబడి ఎదురు చూస్తూ ఉన్నదనుకున్నారు! వాడు రాగానే, సిగ్గు విడిచిన జన్మ, నవ్వుతూ వాడికి చేయి అందించింది. వాణ్ని లోపలికి లాక్కొని తలుపు వేసుకుంది. ఆ కొంపలో ఇంగా వాడితో కులుకుతూనే ఉంది."

"నువ్వు చూశావా కోటయ్యా" అన్నాడు ఆదిశేషయ్య.

"చూడకపోయినా బావుణ్ను! ఈ పాపపు నోటితో ఆ మాట మీ దగ్గర అనవలసి వచ్చేది గాదు."

ఆదిశేషయ్య చుట్ట వెలిగించుకున్నాడు. గుప్పు గుప్పున రెండుసార్లు పొగ లాగి వదిలాడు. అది వాళ్ళిద్దరి కళ్ళముందు దట్టంగా క్రమ్ముకొంది.

"కోటయ్యా! నా కులానికి మచ్చ రావడం నేను సహించను. నా పేరు ప్రతిష్టలు మట్టిగొట్టుకుపోవడానికి వీల్లేదు. ఆ గంజాయి మొక్కను వేర్లతో సహా పెకలించి పారేస్తాను గానీ, దానిమూలంగా తులసివనం పాడుకావడానికి నేను ఇష్టపడను.... వెళ్ళిరా!" అంటూ అగ్గిపెట్టె అందించాడు ఆదిశేషయ్య.

అగ్గిపెట్టె నందుకున్న కోటయ్య, అగ్గిపెట్టెలో దాగిన అగ్గిలా, సీత పూరింటివేపు నడక సాగించాడు.

## 6

మల్లిగాడు బాధగా మూలుగుతూ—తన గుడిసెలో ఒక మూల పడి ఉన్నాడు. అతని శరీరమంతా గాయాలతో నిండి రక్తసిక్తమైంది. తలకు పెద్ద గాయం తగిలి అందులోంచి రక్తం కారుతూంది. కాళ్ళనిండుకు సీసా పెంకులు దిగబడిపోయి, నొప్పితో గుండెల్ని పిండేస్తున్నాయి.

అసలు తానెలా తన ఇంట్లోకి వచ్చి పడి పోయాడో తనకే తెలియదు. తన స్థితి చచ్చి బ్రతికినట్టైంది.

తాను మదురుగోడ పైకెక్కాడు. అంతెత్తునుండి క్రిందికి దూకాడు. క్రింద చెత్తపోసిఉన్న సీసా పెంకులు, గాజు ముక్కలు అరికాళ్ళనిండుకూ గ్రుచ్చుకున్నాయి. తను బాధతో క్రిందికి వంగాడు. హఠాత్తుగా తన వీపుమీద బడితెకర్రలు మ్రోగుతాయని అతడు ఊహించలేదు. మల్లిగాడు వెరగుపడి పోయాడు. అనుకోకుండా జరిగిన ఈ సంఘటనలో అతని కేమీ తోచలేదు. కళ్ళు బైర్లు క్రమ్మాయి. లేచి పరుగెత్తాడు. మృత్యువుతో పందెం వేసుకుని పరుగెత్తాడు. బడితెకర్రలు తనను వెన్నంటాయి. రాయి తగిలి తాను క్రింద పడ్డాడు. ఒక బడితెకర్ర విసురున వచ్చి తన బుర్రను "తాంగు" మనిపించింది. రక్తధార చిమ్మింది. మళ్ళీ పైకిలేచి ద్విగుణీకృతమైన వేగంతో, ప్రాణాతురతతో పరుగు లంకించుకున్నాడు. ఒక్కసారిగా లంఘించి రైలు పట్టాలను దాటుకున్నాడు వెంట్రుక వాసిలో. కనురెప్పపాటులో—గూడ్సుబండి రైలు పట్టాలమీద దూసుకుపోయింది. మృత్యువు ఓడిపోయింది. మల్లిగాడు తన గుడిసెలోకి వచ్చి పడి తలుపు గొళ్ళెం పెట్టుకున్నాడు.

కదిలితే—కత్తితో నరికినట్టు జివ్వు మంటూంది శరీరం. బాధ నరనరానికి

విద్యుల్లతలా ప్రాకింది. మల్లిగాడికి సీతమీద మమత, అనురాగం ఇనుమడించాయి. ఎందుకో—ఆమెను తలచుకుంటే—అతని కన్నులు ఇంచుక చెమర్చాయి. బ్రతుకు మూడు పువ్వులు, ఆరు కాయలుగా—జీవిత నందనంలో నూరేండ్ల పాటు నవనవ లాడవలసిన ఫలవృక్షం సీత. తాను ఆమె తీయటి బతుకును మలుపుద్రిప్పి, మరు భూముల్లోకి లాక్కువచ్చాడు. ఏది మంచీ, ఏదీ చెడూ అన్న విచక్షణా జ్ఞానం లేని లేడిపిల్ల ఆమె. ఆమె తన పులిపంజాల్లో చిక్కుకోడానికి ఏమాత్రం సందేహించలేదు.

సీత తనను నమ్మింది. తన అడుగుజాడల్లో అడుగులు మోపింది. ఆమెను పాలముంచినా, నీటముంచినా భారం తనదే ఇక. ఆమెను ఏరు దాటించనూ వచ్చు; లేదా మట్టిగుర్రమై నట్టేట్లో ముంచనూ వచ్చు.

మల్లిగాడు ఆమెకోసం, ఆమె బ్రతుకు కోసం—తన బొందిలో ప్రాణ మున్నంతవరకు మనుషులతో పోరాడా లనుకున్నాడు. అతనికి మల్లే అందరూ ధర్మయుద్ధమే చేసే వాళ్ళయితే—గెలుపు అతనిదే అనుకోవచ్చు.

గవాక్షంలోంచి గుడిసెలోపలికి ఎర్రటి కాంతులు చొచ్చుకు వచ్చాయి. ఆ కాంతులు మరీ ప్రకాశవంతమైనాయి. మల్లిగాడు అతి కష్టం మీద లేచి నిలుచున్నాడు. గవాక్షంలో నుంచి బయటికి చూశాడు. కొత్తకోటలో ఒక వారగా — వేయిపామునాలుకలొక్కటై విషం కక్కుతూన్నట్లు — నింగిదాకా మంటలు లేస్తున్నాయి. కానివాడు కళ్ళెర్రజేసినట్లు కొత్తకోటంతా ఎర్రగా మెరిసిపోతూంది. మనుషుల కలకలం స్పష్టంగా వినిపిస్తూంది.

కాలిపోతున్నది ఎవరియిల్లో గుర్తుపట్టడానికి ప్రయత్నించాడు మల్లిగాడు. ఉనికిని బట్టి—అది సీత ఇల్లయి ఉండవచ్చు.

ఈ ఊహ రావడంతోనే అతని రక్త నాళాలన్నీ ఉబికి పోయాయి. బాధంతా పటాపంచలై పోయింది. ఎక్కడలేని శక్తి పుట్టుకొచ్చింది. గొళ్లెం తీశాడు. తూలి పడ్డాడు. లేచి నిలబడి శరీరాన్నంతా స్వాధీనంలోకి తెచ్చుకొని కొత్తకోట వైపు పరుగు తీశాడు.

సీత ఇల్లు ధగధగమంటూ తగులబడి పోతూంది. పల్లెలోని మనుషు లందరూ తమ తమ ఇళ్ళు అంటుకోకుండా జాగ్రత్త పడుతున్నారు. సీత ఇంటి లోనికి ప్రవేశించడానికి ఎవరూ సాహసించడంలేదు.

"అయ్యో! సీతా! నా సీత కాలిపోతుంది. కాపాడండి" అంటూ అరిచాడు మల్లిగాడు దూరంనుంచి. కాలిపోతున్న ఇంట్లోకి ఎవరూ జొరబడలేకపోతున్నారు.

మల్లిగాడు పరుగెత్తుకొచ్చి, కాలిపోతున్న ఇంటి తలుపును ఢీకొన్నాడు.

తలుపు గజగజలాడి ఊరుకుంది. మల్లిగాడు ఈసారి కాలితో గట్టిగా తన్నాడు. తలను తలుపుకేసి మోదుకున్నాడు. అతడి పెనుగులాటకు తట్టుకోలేక తలుపు ఫెళఫెళమంటూ ఊడి పడింది. అక్కడ మూగి ఉన్నవారంతా దిగ్భ్రాంతులయ్యేటట్లు - మల్లిగాడు మంటల్లో లీనమై పోయాడు.

"సీతా! నా సీతా!" అంటూ మల్లిగాడు మంటల్లో విలవిల్లాడాడు.

సీత దూలానికి వ్రేలాడుతూంది. ఆమె ముఖం అగ్నిజ్వాలల కాంతిలో ప్రకాశించిపోతూ—మరణానికీ, జీవనానికీ అతీతంగా కనిపిస్తూంది. ఈ దృశ్యం చూచి మల్లిగాడి గుండె చెరువై పోయింది. చెమటతో తడిసి ముద్దయిపోయిన అతని శరీరం మీదునా కన్నీరు కాలువగట్టి ప్రవహించింది. గొంతు చిరిగి పోయేలా, గుండె బ్రద్దలయ్యేలా విలపించాడు. సీత శవాన్ని గట్టిగా వాటేసుకున్నాడు. ఆమె పాదాలమీద ముమ్మరంగా ముద్దులవాన కురిపించాడు. వురిత్రాటిని త్రెంచి, సీత శవాన్ని భుజంమీద వేసుకున్నాడు. తన కడుపులా మండిపోతూ, లోకంలా మండిపడుతున్న అగ్ని జ్వాలల్ని దూసుకుంటూ వీధిలోకి వచ్చి పడ్డాడు. సీత శవాన్ని మానవజాతి పాదాలమ్రోల కానుకగా వుంచి, పసిపిల్లవాడిలా ఆక్రందిస్తూ, గట్టిగా గుండెలు బాదుకున్నాడు.

మాలపల్లిలో తొలికోడి ఎలుగెత్తి కూస్తున్నది; "కొక్కొ-రోకో!"

## 7

అతడు ఆ మంటల్లోనే మాడి చచ్చివుంటే—మాలవాడి కథ అంతటితో ముగిసేది. కాని, అతడు తన గాథకు భరతవాక్యం చెప్పుకోవలసిన పద్ధతి అదికాదు....

సీత కథ ముగిసిన తరువాత—కొత్తకోటలో ఒక పిచ్చివాడు సంచరించడం మొదలెట్టాడు. "హా సీతా....అంటూ కలియుగ రాముడు బయలుదేరాడు ..." అంటూ నలుగురూ సరదాగా నవ్వుకునేవారు.

పిచ్చిలోకంలో పడ్డ ఒక వారం రోజుల తర్వాత ఒక నాటి రాత్రివేళ ఆ పిచ్చివాడు రచ్చబండమీద, రావిచెట్టుక్రింద తలక్రిందులుగా తపస్సు చేసుకుంటూ వుండడం పంచభూతాలన్నీ చూశాయి. ఆ మాత్రం చూడగల ఓపిక మనుషులకు లేకపోయింది. వాళ్ళు విసుక్కున్నారు.

ఆ పిచ్చివాడి ఒళ్ళంతా కుళ్ళు కంపు కొడుతూ వుంది. వాడు నల్లగా, పరమ అసహ్యంగా వున్నాడు. వాడి శరీరం గాయాలతో, కాల్పులతో నిండి చీమూ, నెత్తురూ ఓడుతున్నాయి.

తల క్రిందులుగా జపంచేస్తూ వున్న ఆ పిచ్చివాడు వున్నట్లుండి

మామూలుగా నిలబడ్డాడు. చేతులు అభయముద్రలో వుంచి "భక్తా! ఏమి నీ కోరిక?" అన్నాడు.

అలా అని, మళ్ళీ వెంటనే తల్లిక్రిందులుగా మరలి. "తల్లీ! నేను మనిషిని కావాలి!" అన్నాడు.

దేవి: నిటారుగా నిలబడి ఇలా అన్నది! "నీకు ఒళ్ళు అనేది వుందా?"

"వుంది తల్లీ, వుంది" అన్నాడు భక్తుడు తల్లక్రిందులుగా.

"అయితే ఆ ఒంటిలో కండలున్నాయా?"

"బాట గంగమ్మకు బలిగొడితే ఏడేండ్ల వరకు మళ్ళీ బలి అడిగితే ఒట్టు!" అన్నాడు భక్తుడు.

"ఒంటినిండుకూ నెత్తురుందా!"

"ఇరవై కల్లుముంతలకు తక్కువయితే నన్నడు."

"ఆ నెత్తురు ఎర్రగా వుందా?"

"నమ్మకం లేకపోతే కోసి చూసుకో!"

"అయితే ఇప్పట్నుంచీ నువ్వు మనిషివే!"

అంటూ 'దేవి' అంతర్ధానమైపోయింది. సంతోషాంతరంగుడైన భక్తశిఖామణి తన ద్విపాత్రాభినయనాన్ని చాలించి, రచ్చబండపైనుండి క్రిందికి దుమికి మాలపల్లికేసి పరుగు తీశాడు. రైలుకట్టమీద నిలబడ్డాడు. ఎలుగెత్తి ఇలా అరిచాడు:

"ఒరేయ్ మాలల్లారా! అక్కడెందుకురా పడి నిద్దరపోతారూ! ఇవతలికి రండిరా! మీరు మాలోళ్ళయితే మాత్రమేంరా? మీరూ మనుషులేరా! మీలో ఉన్నది రక్తమాంసాలురా! అమ్మోరు వరమిచ్చిందిరా! మీ ఇల్లూ, వాకిలీ అంతా ఇవతలికి తెచ్చుకోండిరా! అందరూ మనుషులుగా బతుకుదాములా! రండ్రా! లేచి రండిరా!"

మాలపల్లిలోని హరిజనులందరూ 'పిచ్చివాడు ఏదో పేలుతున్నాడులే' అనుకుని ముసుగుతన్నారు. పాపం! పిచ్చివాళ్ళు!

పిచ్చివాడు మళ్ళీ అరిచాడు: "ఒరే! అదేం మొద్దు నిద్దర్రా మీ తస్సదియ్యా! ఇంకన్నా మేలుకొండిరా! మనుషుల్లోకి రండిరా! గొడ్లను చూసైనా నేర్చుకోండిరా! మనుషుల్తోబాటు కొట్లాల్లోనైనా కాపురమున్నాయి గదరా అవి! మీరేలరా అంతదూరంలో పడి మురిగిపోతారూ?"

గుప్పు గుప్పున పొగలు చిమ్ముకుంటూ రైలుబండి వస్తూంది. ఆ రైలు బండి తన ఒంటికంటితో పిచ్చివాణ్ణి చూచింది. పిచ్చివాడు అల్లంతదూరంలో

వస్తూన్న రైలు బండిని చూశాడు. వాడికి ఎక్కడలేని కోపం పుట్టుకొచ్చింది. పిచ్చివాడు అంటే వాడి దృష్టిలో దుష్ట శిక్షకుడు శిష్ట రక్షకుడు అని అర్థం. తాను క్రొత్త జన్మ ఎత్తినప్పటి నుంచీ వాడిలో కొన్ని అభిప్రాయాలు మొలకెత్తాయి. తాను చెడును నిర్మూలించి మంచిని ఉద్ధరించడానికి అవతరించిన కారణ జన్ముడు! ప్రపంచాన్నంతా సంస్కరించడానికి పుట్టిన అవతారపురుషుడు!

తన మాలపల్లిని, కొత్తకోటను వేరు చేస్తూ పోయే రైలుబండి మీద వాడి ఆలోచనలు ఈ వారం రోజుల్లో ఎప్పుడూ ప్రసరించలేదు. ఇప్పుడా రాక్షసిని నాశనంచేసి వేయాలనుకున్నాడు వాడు. కనుబొమ లెగరవేసి దాన్ని తీక్షణంగా చూస్తూ రాయిలా నిలబడ్డాడు. రైలు దగ్గరకు వచ్చేస్తూంది.

కట్ట తెగిన ఉద్రేకంతో పిచ్చివాడు పళ్ళు పటపట కొరికాడు. "ఏయ్? నిలూ! ఇంక నీ ఆటలు సాగవు. ఇంతకాలమూ మాలా, మనిషీ అని మమ్మల్ని వేరుచేసి, మా గోడు పోసుకున్నావు. మేమంతా మేలుకున్నాం. మనుషులై పోయాం. ఇంక నీ అంతు తేల్చేస్తాం. అక్కడే ఆగి, అటే వెనక్కెళ్ళిపో!"

రైలు వినలేదు. దగ్గరికి వచ్చేసింది. పిచ్చివాడు ఒళ్ళు తెలియని కోపంతో "చెబుతూంటే నీక్కాదూ! ముందరికి రాబోకు! ఆగు! లేకుంటే అక్కడే పడి చస్తావు!" అంటూ హుంకరిస్తూ ఎదురేగి రైలును ఢీకొన్నాడు.

గడ్డ కట్టిన క్రౌర్యంలా, మానవజాతి సృజించిన పెనుభూతంలా— ఇనుప చక్రాల రక్కసి విస్ఫులింగాలు గ్రక్కుతూ పిచ్చివాడి మృతదేహాన్ని మాలపల్లి వైపుకు విసరికొట్టి వికటాట్టహాసం చేసింది!

* [ 1975] *

# సమిధలు

చిలుకూరి దేవపుత్ర

**తూ**రుపింకా ఎర్రబడలేదు....

కాపోళ్ళ బావిగిలక 'కిర్ కిఠ్' మంటూ శబ్దం చేస్తోంది – అలా శబ్దమయిందంటే తెల్లారుతున్నట్టే లెక్క కొల్లప్పకి. జీతగాళ్ళని తెల్లారకనే లేపి నీళ్లు తోడిస్తారు కాపులు.

కొల్లప్ప గుడిసె కెదురుగా ఉన్న గుడిసె లోంచి మారెక్క నిద్దర లేపుతోంది బిడ్డని – "లెయ్యే ఎల్లమ్మా! పొద్దు పుడతాది .... లేసి ముద్ద కెసరుపెట్టు" అంటూ.

ఆ హరిజనవాడలో దాదాపు అన్ని ఇళ్ళల్లో తమ పిల్లల్ని ఆ వేళకే లేపుతారు ముసలోళ్లు. ఆ వేళకే లేచి .... నీళ్లు తెచ్చుకొని వంట చేసే టప్పటికి పొద్దు పొడుస్తుంది. కొంత తిని, కొంత చద్ది కట్టుకుని పోతారు కూలికి.

కొల్లప్ప ఎడం వేపుకి పొర్లి పడుకున్నాడు. గుడిసెలో కుండల చప్పుడవుతూంటే – 'నారమ్మ లేసినట్లుంది .... నెలలు నిండినాయి గదా ఇయ్యాలకే లెయి కుంటేనేం' అనుకున్నాడు.

నారమ్మ కొల్లప్ప కోడలు. ఎనిమిదేండ్ల కిందట ఆ ఊరికి కలరా సోకి నప్పుడు నారమ్మ అయ్యా, అమ్మా సరైన వైద్యం లేక కన్ను మూశారు. అప్పణ్ణించి నారమ్మ తన అక్క

బావల దగ్గరే పెరిగింది. సంవత్సరం కిందట కొల్లప్ప తన ఒక్కగా నొక్క కొడుకయిన పోతప్పకి పెళ్ళి చేసుకొచ్చాడు నారమ్మని. కోడలంటే కొల్లప్పకి ప్రాణం. పోతప్ప ఎప్పుడయినా నారమ్మని కొద్దిగా కసురుకున్నా — "ఆ పాపదేం తప్పురా!" అని ఒంటి కాలిమీద పోయేవాడు పోతప్ప మీదికి. కూతురున్నా అంత బాగా చూసుకునేవాడు కాదేమో!

కొల్లప్ప మనసు గుబులు గుబులుగా ఉంది. లేచి గొంతు కూర్చున్నాడు. కళ్ళు మండుతున్నాయి. అలా కళ్ళు మండుతున్నందు క్కారణం రాత్రంతా నిద్దర లేకపోవడమే.

మామూలుగా ఏ దగ్గు ఆయాసంతోనో, ఇంట్లో గింజలు లేవన్న దిగులు తోనో, చనిపోయిన కొడుకుని తలుచుకునో, పెళ్ళయిన ఆర్నెళ్ళకే ముండ మోసిన నారమ్మని తలుచుకునో, నారమ్మ కడుపున పుట్టబోయే తండ్రి లేని బిడ్డని తలుచుకునో నిద్దరొచ్చేది కాదు కొల్లప్పకి. కానీ, ఆ రాత్రంతా కొల్లప్పకి నిద్దర లేక పోవడానికి ఇవేవీ కారణాలు కావు....

క్రితం రోజు సంధ్య వేళ ఇంటికొస్తూనే కోడలు కాచి యిచ్చిన గంజి యింత తాగి గుడిసె బయట చిరుగుల కంబళి కప్పుకొని కూచున్నాడు—తాపీగా బీడీ అంటించుకుని తాగుతూ. ఆ సమయంలో మల్లేసు వచ్చి చెప్పాడు "కేశవ రెడ్డీ, మల్లారెడ్డి ఇద్దరూ యాకమైనా" రని. ఒక్కసారి ఉలిక్కి పడ్డట్టు "నిజమా?" అన్నాడు. బీడీ నోటికాడి వరకూ పోయి ఆగిపోయింది. 'అవు' నన్నాడు మల్లేసు. కొల్లప్ప గుండెల్లో కలుక్కుమన్నట్టయింది.

"ఈ పెద్దోల్లకి సిగ్గూ, ఎగ్గూ లేదు మామా!" అన్నాడు మల్లేసు. వినిపించు కున్నట్టు లేదు కొల్లప్ప. ఆలోచిస్తున్నాడు — దేన్ని గురించో.

ఉన్నట్టుండి — "ఒరే మల్లేసూ! యిద్దరూ యాకమైతే యట్లరా .... మన పోతిగాని కేసు యేట్లో గలిసినట్లేనా?"— ఆ కంఠంలో చెప్పలేనంత బాధ ఉంది, బరువు ఉంది, ఆవేదన ఉంది.

ఆ బాధకూ, ఆ బరువుకూ, ఆ ఆవేదనకూ కారణం చాలా ఉంది.

దాదాపు ఆర్నెల్ల కిందట పంచాయితెన్నిక లొచ్చాయి. ఎప్పట్లాగే కేశవ రెడ్డి ప్రెశిడెంటు ఎన్నికకి పోటీ చేశాడు .... ఎన్నో రోజుల్నుంచి మల్లారెడ్డికి కూడా ప్రెశిడెంటు కావాలని చాలా మోజుంది. "ప్రెశిడెంటు మల్లారెడ్డి" అని ప్రజల్తో పిలిపించుకోవాలని బోల్డంత ఆశుంది. తన మోజూ, ఆశ తీర్చుకోడానికి కేశవరెడ్డికి పోటీగా నిలబడ్డాడు. నిజానికి పోటీ దార్లిద్దరూ దగ్గర బంధువులే. ఇంకా చెప్పాలంటే బావ బామ్మరుదులు కూడా. పదవీ వ్యామోహానికి బంధుత్వం

అడ్డు రాదుగా – దాంతో వారిద్దరి మధ్యనా శత్రుత్వం వాళ్ళకి తెలీకుండానే చోటు చేసుకుంది.

ఆ ఎన్నికల్లో కేశవరెడ్డికి కొల్లప్ప కొడుకు పోతప్పే కుడి బుజంగా ఉన్న అంగరక్షకుడూ, ప్రచారకుడూను. పోతప్ప చేస్తున్న సేవను మెచ్చుకున్నప్పుడల్లా మురిసి పోయేవాడు కొల్లప్ప. తన కొడుకెంతో ప్రయోజకుడయినట్టు ఉబ్బిపోయి – "ఆడు అంతే సామీ, పిల్లప్పన్నించీ యాపనికయినా గుండ్లు దీసిన బంటు" అనేవాడు. "వాని బయం బక్తి సూస్తే నా కెంత యిష్టమనుకున్నావ్! వచ్చే యాడాది నించి వాని కింకొక యాబయి ఎక్కాస్తారా, జీతం" అని కేశవరెడ్డి అన్నప్పుడు కొల్లప్ప ఆనందానికి పట్ట పగ్గాల్లేవు. ఆ మాటని ఆ రోజంతా ఊరంతా చెప్పుకున్నాడు.

ఎలక్షన్లు దగ్గర పడే కొద్దీ ప్రచారం విపరీతంగా మారింది. ఇరు పక్షాల్లో కోపాలూ ఉద్రేకాలు తారస్థాయి చేరుకున్నాయి. నువ్వెంతంటే నువ్వెంత అని వ్యక్తిగతమైన కొట్లాటలు గూడా జరిగాయి. ఎన్నికల్రోజు రానే వచ్చింది. పోతప్ప ఇంటింటికీ తిరిగి ప్రతి మనిషి వెంట పోలింగ్ బూతు వద్దకు వెళ్ళి ఓటేయించాడు. తన కులం వాళ్ళందరికీ కేశవరెడ్డి యిచ్చిన డబ్బుతో కల్లు, సారా పోయించాడు. ఓట్లేయించాడు. ఏమయితేనేం, కేశవరెడ్డి మంచి మెజారిటీతోటే గెలిచాడు.

ఆ రోజు సాయంత్రం పోతప్ప వరిమడికి నీళ్ళు పారించి వస్తున్నాడు. మల్లారెడ్డి పెద్ద కొడుకు తిప్పారెడ్డి, అతని పాలేరు ఓబిలేసు దార్లో ఎదురయినారు – గడ్డి వాముకి పోతూ. పోతప్పని చూస్తే తిప్పారెడ్డికి అరికాలినుంచీ మండుతుంది. కేశవరెడ్డి గెలవటానికి మూలకారణం వాడేనని, హరిజనవాడలోని వోట్లన్నీ తమకే వస్తాయని అనుకున్నాడు తిప్పారెడ్డి. కాని పోతప్ప మూలాన హరిజన వోటర్లంతా తమకి వేయలేదు.... అందుకే పోతప్ప మీద కుత్తిక వరకూ వుంది కోపం.

అంతదూరంలో పోతప్పని చూడగానే ఓబిలేసు చెవిలో ఏదో చెప్పాడు. సరేనన్నట్టు తలూపాడు ఓబిలేసు. పోతప్ప దగ్గర కొస్తున్నట్టుగానే–"తూ....ఈ నెక్క దొంగ లంజ కొడుకులు. కల్లూ, సారాయీ పోయిచ్చి దొంగోట్లు ఏపిచ్చినారు. అట్ల గెలిసేదేం పెద్ద సుద్ది .... ఆడిది గెలుత్తుంది. ఇట్లా నా కొడుకులుంటే దొంగోట్లెన్నన్నా పడ్తాయి" అన్నాడు ఓబిలేసు.

పోతప్పకి ఛర్రున మండింది. ముందు కెళ్ళినవాడు, వెనక్కి తిరిగొచ్చి "నీకి యేగితుంటే యాల గెలిపించలేక మీ యయ్యని" అన్నాడు, క్రోధంతో.

ఊగిపోతూ – ఈ అదనుకోసమే నక్కలా పొంచున్న తిప్పారెడ్డి, పోతప్ప మెడ కరుసుకొని కింద పడేశాడు. ఎడా పెడా కాల్తో తన్నాడు. తప్పు చేసినవాడిలా చూస్తున్నాడు కొంచెం దూరంలో నిలబడ్డ ఓబిలేసు – "ఊరికే అంటినే" అన్న పశ్చాత్తాపం అతని మొహంలో కనబడుతోంది. ఆపాలని వారించబోయాడు. తిప్పారెడ్డి ఓ తోపు తోసి, నడుంలో ఉన్న కత్తితో పొడిచాడు పోతప్ప కడుపు లోకి. చావుకేక పెట్టాడు పోతప్ప. ఆ కేకలకి దూరంగా గడ్డివాముల్లో, దొడ్డెండ్లలోవున్న మనుషు లొచ్చారు. అప్పటికి కొనఊపిరితో ఉన్నాడు పోతప్ప తిప్పారెడ్డి అప్పటికే పరారయాడు. ఆ పోగయిన వారు పోతప్పని కేశవరెడ్డి ఇల్లు చేర్చారు .... చంపిన వాడి పేరు చెప్పి ప్రాణా లొదిలాడు పోతప్ప.

పోతప్ప కూనీ చెయ్యబడ్డం కేశవరెడ్డి అహం మీద దెబ్బకొట్టినట్టయింది. పోలీసుల్ని పిలిపించి కేసు బనాయించాడు. తిప్పారెడ్డికి ఉరిశిక్ష పడుతుందనే నమ్మకంతోటే జీవిస్తున్నాడు కొల్లప్ప. "తిప్పారెడ్డిగాన్ని ఉరికంబ మెక్కిచ్చే దంకా నేన్నిద్దర పోను" అని కేశవరెడ్డి హామీ యిచ్చాడు కూడా.

కాని .... యిప్పుడు మల్లేసు మాటల్ని బట్టి చూస్తే .... అంతా తారుమా రయినట్టుంది. అందుకే ఆ బాధ! బరువు! ఆవేదన!!!

"మల్లేసూ .... ఏకమెట్లయినార్రా? ఇద్దరి మద్దెనా పచ్చగడ్డేస్తె బగ్గుమని కాలిపొయ్యేది గదా!"

"నీకేం తెల్దు మామా .... మద్దెంత రెన్నికలనీ యిప్పుదొచ్చినాయి."

"ఎట్లెట్లా?" అంతకు ముందు కాల్చి ఆర్పేసిన బీడీని వెలిగించాడు.

"పట్నంలో యమ్మెల్లే సుబ్బరాయుడు గుండెబట్టుకోని సచ్చిపోలేదా మూన్నెల్ల కిందట? ఆయప్ప సచ్చిపోయిందానికి, ఆ తానంలో మల్లా ఎలచ్చన్లు జరిపిత్తన్నారు. రంగారెడ్డి యిప్పుడు పోటీ జేత్తన్నాడు. నిన్ననే మనూరికి ఆయపొచ్చినాడు, లోపల్లోపల ఏమేమ్మాట్లాడుకుండారో యేమో .... రెడ్లంతా ఒగటయినారు.

"అదెట్లా నా కరతంగాలే."

"రంగారెడ్డికి పోటీగా నిలబడినాయప్ప కమ్మాయప్ప. కమ్మోల్లు కమ్మోల్లు అంతా ఒకటయినారు. దాన్నించి రెడ్లు గూడా అంతా ఒకటయినారు."

"ఒకటి కాకుంటే పన్నెండు గాన్లే... మన పోతిగాని కూనీ కేసేం జేస్తార్రా?" మల్లేసుకే ఆ జవాబు కూడా తెలిసుంటుందన్నట్టు అడిగాడు.

"ఏమో మామా! రెండెద్దులూ జోడాయె. నేను బీడాయె అని వాళ్ళు వాళ్ళు ఒగటయితే ఇంగెక్కడి కేసు మామా .... నేను బొయ్యొస్తా. మాయమ్మ బిరీన్నమ్మన్నేది" అని చెప్పేసి వెళ్ళిపోయాడు మల్లేసు.

కొల్లప్ప ఆలోచనలు ఎట్లెట్లో పోతున్నాయి .... కేశవరెడ్డి ఆ పొద్దు యిచ్చిన మాట తప్పుతాడా? ఆయప్ప మాట తప్పినా కోర్టులోనన్నా నాయం జరగదా? తన కొడుకు ఎవురి పరంగా ఉండి సచ్చింది కేశవరెడ్డికి గ్యావకం లేదా! .... పంచాయి తెన్నికల్లో శత్రువులయినోల్లు, మద్దెంతర ఎన్నికల్లో ఎట్లాగటయితారు? అంతకు ముందుండే పాత కచ్చలు అపుడే మర్చిపొయ్యినారా! కులం ఒగటయితే, ఏం జేసినా అన్నేయమనిపించదా!

వెంటనే కేశవరెడ్డి ఇంటి వద్దకు పోయి అతన్ని లేపి అడగాలని ఉంది. తనికి అన్నేయం సెయ్యొద్దని కాళ్ళు బట్టుకొని బతిమాలు కోవాలని ఉంది. అసలుకి — తను పోయి లేపితే ఈ వేళకాడ లేస్తాడా ప్రెసిడెంటు కేశవరెడ్డి. "వద్దనికి రాపోరా .... యాలా పాలా లేదా?" అని కసురుతాడో!....

కేశవరెడ్డి కేసు రద్దు చేయిస్తానంటే తనుండి ఏం ప్రయోజనం? తన బతుక్కి ఫలితమేముంది? బోరున యాడవాలన్నా గొంతులో ఏదో వడ్డట్టు పూడుకుపోయి ఉంది. "వద్దన్నే పోయి అడగల్ల" అనుకుని కంబళిని తలవరకూ కప్పుకొని గొంతు కూచున్నాడు....ఏవేవో ఆలోచనలు తన చుట్టూ మెదలుతూనే ఉన్నాయి .... అందుకే కొల్లప్పకి నిద్దర రాలేదు రాత్రంతా....

అప్పుడే తెల్లారింది.... గుక్కతిప్పుకోకుండా దగ్గు వస్తున్నా ఈ ఆలోచనల ముందు అదేమంత లెక్కలోకి రాకుండా పోయింది.

*　　　　*　　　　*

కొర కొర పొద్దు పొడిచింది.

కేశవరెడ్డి ఇంటి వద్దకు బయల్దేరాడు కొల్లప్ప. గుడిసె వాకిట్లోనించి కోడలు దీనంగా చూస్తోంది 'ఏమౌతుందో ఏమో' అన్నట్టుంది ఆమె మొహం.... కొల్లప్పని చూస్తుంటే.

దారిలో వెంకన్న ఎదురయి— "యాటికిరా పోతా వుండావు" అని పలకరించాడు కొల్లప్పని. వెంకన్న కొల్లప్పకంటే వయసులో చాలా పెద్దవాడు. కొల్లప్ప యే విషయం అయినా సరే వెంకన్నతో చెబితేనే మనసు కుదుటబడేది. తను పోతున్న విషయం తెలియ పరిచాడు.

"ఎంత పనయిందిరా! మూడు దినాల కిందట తిప్పారెడ్డిని వురికంబ మెక్కిచ్చేదంకా నిద్దరపోనని కేశవరెడ్డి చెప్పినాడంటివి.... అపుడే మారిపోయుంటాడా?....అదే ముందదులే అడిగి సూడి .... ఈల్లని నమ్మేకి లేదురా దొంగనా కొడుకులు. ఎప్పుడేకమయితారో, ఎప్పుడు పగదార్లయితారో సెప్పేకొచ్చెల్లేదు ....కేసు రద్దు సేపిత్తానంటే ఆనెంక ఆలోసిద్దాం గాని, నువ్వు ముందు పొయిరా;

నేను ఎగవ సేన్లో ఉంటా — అన్నిసయాలు సెప్పు" అని చెప్పి వెళ్ళిపోయాడు వెంకన్న.

కొల్లప్ప వెళ్లేటప్పటికి కేశవరెడ్డీ, అల్లుడు క్రిష్ణారెడ్డి ఇద్దరూ ఎదురూ బదురుగా ఎత్తులో ఉన్న అరుగుమీద కుర్చీలో కూచుని ఉన్నారు. దేన్నిగురించో చాలా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

కొల్లప్ప పోయి, వాళ్ళు కూచున్న అరుగుకి నాలుగు గజాల దూరంలో నిలబడ్డాడు. పిలవలేదు. పిలిస్తే యామనుకుంటారోనని.

కేశవరెడ్డి, క్రిష్ణారెడ్డి, శరీరాల లావులో ఏ మాత్రం ఒకరి కొకరు తీసి పోరు. నలభై ఏళ్ళకు తగిన హుందా, గాంభీర్యం ఉన్నాయి కేశవరెడ్డికి. ముప్పయి ఏళ్ళ వాడయినా మీసాలు పైకెగదువ్వి తన అహాన్నంతా మీసాల్లోనే కనబరుస్తాడు క్రిష్ణారెడ్డి .... వీరి ఆకారాలకి పూర్తిగా భిన్నం కొల్లప్ప ఆకారం. జుట్టులాగే ఎడ్డి మడ్డిగా పెరిగిన గడ్డం. లోకంలోని దైన్యమంతా ఒక్క చోటే కాపురం చేస్తోన్న కళ్ళు, ముడతలు పడి మరీ నల్లగా కనిపించే శరీరాన్ని చూస్తే కొల్లప్ప వయసుని టక్కున చూడగానే ఎవరూ అంచనా వేయలేరు. ఒకవేళ అంచనా వేసినా తప్పకుండా తప్పే అవుతుంది. ముఖ్యంగా ఆర్నెల్ల కిందట కొడుకు కూనీ చేయబడ్డప్పట్నించి పదేళ్ళు ఎక్కువగా ముసురుకున్నాయి. పొరపాట్న పని చేసుకుంటూ పొలంలో చనిపోతే కాకి పీకేందుకు కండయినా ఉండదేమో అనిపిస్తుంది ...

"ఏమో, కొల్లిగాడొచ్చినాడు మామా!" అంటూ కళ్ళెగరేసి చెప్పాడు క్రిష్ణారెడ్డి వెనక్కి తిరిగి చూసి.

"ఏరా! కొల్లిగా యింత పద్దన్నే వస్తివి" అన్నాడు కేశవరెడ్డి.

"నువ్వూ, మల్లారెడ్డీ యాకమైనారంట గద సామీ!"

"అవును, నీకింకా తెల్దా?"

"మరి, మా పోతిగాని కూనీ కేసూ...." అంటూ నీళ్ళు నమిలాడు కొల్లప్ప.

"ఓ..... అదా .... అందుకేనా? నువ్వొచ్చింది. ఇపుడర్థమాయె—ఇప్పుడర్థ మాయె...." అంటూ అల్లుడి వేపొకసారి చూశాడు కేశవరెడ్డి. తను 'అప్పుడే ఇదంతా పసిగట్టాను' అన్నట్టు తలూపాడు క్రిష్ణారెడ్డి.

కొల్లప్పకు ఎదురుగా ఉండేలా కుర్చీని తిప్పుకుని కూచుంటూ అన్నాడు కేశవరెడ్డి — "బలే మనుసుల్రా .... సేనూ, మల్లారెడ్డి యాకమైనా మంటానే పోతిగాని కూనీ కేసే రద్దు చేస్తామని అనుకుండావ్....మేమిద్దరూ యాకమయితే కచ్చలుండవు కదా! కూనీ కేసు రద్దయితే మాత్రమేమి?"

"ఊర్లో ఎకస్పార్టీ లేకుంటే కొట్లాట్లుండవు గదా?" మామగారి మాటలకి చిలక పలుకులతో తాళం వేశాడు అల్లుడు.

"మీకు పున్నెముంటాది సామీ! అట్ల సేయద్దంగ్రడి .... మీ కాళ్ళు బట్టు గుంటా."

"నీ మాటే నువ్వు మాట్లాడ్తావు గాని, మా మాటగూడా కొంచెమినరా.... ఊరు సల్లగుండల్లంటే మేమిద్దరం యాకమయితేనే గదరా! ఉత్తరమూ, దక్షిణమూ యాకమయిందానికి సంతోషించల్ల గాని; పోతిగాని కూనీ కేసు కొట్టేస్తారు మొగ్రో అని ఏడుస్తావేరా ఎగ్రి లంజ కొడకా!"

"మీరు రాజీ అయ్యి యాకమయితే సంతోషమే సామీ! గానీ, పోతిగాని కూనీ కేసు కొట్టేపిత్తె మాత్తరం అన్నెయం సామీ! .... ఆ పొద్దు 'నీ కొడుకుని సంపినోన్ని ఉరికంబ మెక్కిత్తా కొల్లప్పా' అంటివి. ఈ పొద్దు జూత్తే యిట్ల మాట్లాడుతుండావ్."

"అవ్వగ్నా .... ఆ పొద్దంటి. ఆ పొద్దు నేనూ, మల్లారెడ్డీ యిరోదులం అందుకే అట్లంటి. ఈ పొద్దు మా మద్దెన ఆ యిరోదంలేదు. ఇంగొగ యిసయం నీకి తెల్లనుకుంటా .... నేనూ మల్లారెడ్డి యియ్యమొల్లం కాబోతుండాం.... అరతం గాలే? .... తిప్పారెడ్డికి నా బిడ్డనిచ్చి పెండ్లి సేస్తుండా. కష్టాల్లో ఆదుకొనేది నా కులమొల్లేరా, మీరుగాదు" ఈ మాటలు ఎంతో వ్యంగ్య ధోరణిలో వచ్చాయి కేశవరెడ్డి నోటి వెంట. కొల్లప్ప మనసు చివుక్కుమంది.

"ఎలచ్చన్లో మల్లారెడ్డి పారిటీ వోల్లు నీ మింద సెయ్యి జేసుకుంటారని కంటికి రెప్పాకట్ల కాపల గాసిన మేమెట్ల కట్టాల్లో ఆదుకుంటాం సామీ. నీ గురించే గదా ఆ తిప్పారెడ్డి నా కొడుకుని సంపింది."

"దుడ్లు పారేస్తే వచ్చే మాదిగ నాయాండ్లు .... మీరు గూడా నన్నాదు కుంటారేంరా — కష్టాల్లో. ఆ పొద్దు నీ కొడుకు నా గురించా సచ్చిపోయింది— నోర్ముయ్. తప్పన్నా కొడకా! నీ కొడుకు బాగా తాగొచ్చి ఆ తిప్పారెడ్డిని యిష్టమొచ్చినట్లు తిడ్తే ఊరికే యిడుస్తాడా సంపకుండా?"

"మీరు గొప్పొల్లు సామీ .... ఎట్లన్న మాట మారుస్తారు. అల్లతో రాజీ అయినంక అల్లు సేసినవన్నీ నీకి తప్పుగా కనబడవు, మీరు మీరు ఒగ టయినారు."

"ఒరేయ్! ఎక్కువ మాట్లతో పన్లే .... రెండెకరాల బంజరిప్పిస్తా కర్న మయ్యతో జెప్పి .... నోర్మూసుకొని పో! వద్దన్నే ఏంటికి నా యింటికాడ గోడో మంటావు."

కొల్లప్ప గుండె పిసికినట్లనిపించింది. తనపట్ల ఇంత అధ్వాన్నంగా ప్రవర్తిస్తున్నాడా కేశవరెడ్డి తను ఎన్నాళ్ళనించో "దేవునట్లా వోడు" అనుకుంటున్న కేశవరెడ్డి తనకింత అన్నేయం తలపెడుతున్నాడా! తన కొడుకు కేసు ఎంత తేలిగ్గా తీసుకుంటున్నాడు!! చివరికి – రెండెకరాల బంజరిప్పించి తన నోరు శాశ్వతంగా మూయించాలనుకుంటున్నాడే!!!

"పప్పులు పెట్టి పోరు మాన్పేకి నేనేం పిల్లోన్ని గాదు సామీ! సెట్టంత కొడుకు నాకు దక్కకుండా బోయినాడు. నువ్విప్పించే రెండెకరాలు నాకు వొల్ల! నా కొడుకుని సంపినోనికి సిచ్చ పడల్ల! "అడు ఉరికంబ మెక్కల్ల!!!" అంటూ తీవ్రంగా అన్నాడు కొల్లప్ప. అతని మొత్తం జీవితంలో అలా తీవ్రంగా ఆవేశంతో ఎవ్వరితోనూ మాట్లాడి ఉండడు. కొల్లప్ప అలా మాట్లాట్టం చాలా ఆశ్చర్యంగా ఉంది కేశవరెడ్డికి.... క్రిష్టారెడ్డి కూడా విస్మయంతో చూస్తున్నాడు.

"సిచ్చపడదు.... పడనీను. కేసు రద్దయి పోతాది, యింకా ఎక్కువ మాట్లాన్నావంటే కీళ్ళిరుస్తా నా కొడకా!" కళ్ళెర్ర జేస్తు గుడ్లురిమి అరిచాడు కేశవరెడ్డి.

కేశవరెడ్డి గొంతు గట్టిగా వినబడ్డంతో పొలం పనులకు పోతున్న వాళ్ళు, చుట్టు పక్కల వున్నవాళ్ళు అంతా గుమికూడారు.

"పెద్దోల్లు సామీ! యామన్నా జేస్తారు. యాపక్కకన్నా తిరుగుతారు సామీ!....మీరెట్ల తిరిగినా దొడ్డగున మంటారు.... అదే మమ్మన్నయితే తప్పున్నా కొడుకులంటారు!".... అని కొల్లప్ప మాటల్ని సూటిగా వదలడంతో అగ్గిమీద ఆజ్యం పోసినట్టయింది.

"రేయ్!! ముసిలోడా!! తల తిరుగుతాందా? తక్కువ కులానికి ఎక్కువ కూడు పెడితే తల తిక్కట, మీ మాదిగ నాయాళ్ళకాడ గవురవంగా మాట్లాడ గూడదుకా. ఇట్లే మాట్లాన్నేవంటే నీ రగతం కండ్లసూస్తా. ఈట్నించి ఎల్లిపో!!!" అంటూ గాండ్రించాడు కేశవరెడ్డి.

"నాయం జరుపే పెద్దోలే అన్నేయనికి దిగుతాంటే ఎట్లపోతాను? పోను....! పొయ్యేల్లేదు!! యేంజేసిన సరే!"

"యేరా సెప్తా వుండేది నీక్కాదా!" ఉరిమాడు క్రిష్టారెడ్డి.

"నాయం జరపండ్రి మడి పోతాను!" మొండి కేస్తున్నట్టు మాట్లాడాడు కొల్లప్ప.

దాంతో రెచ్చిపోయాడు కేశవరెడ్డి. కుర్చీతోంచి లేచి వచ్చి "నీకి నాయం కావల్లా లంజ కొడకా!" అంటూ ఎదపైన చెయ్యేసి వెనక్కి తోసాడు. దబ్బున వెల్లకిలా పడ్డాడు కొల్లప్ప....లేచి కూర్చుని వెర్రిగా చూస్తూ అన్నాడు.

"నీ కొడుకుని కూనీ నేసుంటే నీకి నా బాదేందో తెల్చేది. దేవుడు గుడ్డోడు గాదు ..నా ఉసురు తగుల్తాది...." అంటూండగానే–

"నీ యమ్మ, ముసిల్లంజ కొడకా" అనరుస్తూ కొల్లప్ప కడుపు మీద సత్తువ కొద్దీ తన్నాడు. ఆ దెబ్బకు కొల్లప్ప అడ్డంబడి కడుపు పట్టుకొని చుట్టుకు పోయాడు.

చుట్టూ పోగయిన జనంలో కొద్దిగా కదలిక వచ్చింది. అంతవరకు మామూలు కొట్లాటగ చూస్తున్న జనం యింతదాకా జరగడంతో "ఇడిసి పెట్టప్పా! ఆ ముసిలోనితో ఏంది?" అని కొందరు, "పాపం! కొడుకు పోయి నప్పన్నించి పిచ్చిపట్టినట్లుంది.... అట్ల వాన్నెందుకు దంతావు!" కొందరు అన్నారు.

"నీకి తెల్లూరు కోరా .. ఈ ముసిలోనికి కండ్లు నెత్తికెక్కినాయి. లమిడి కొడుకు నా యింటికాటి కొచ్చి యిష్టమొచ్చినట్ల మాట్లాడ్తాడా!" వాగరుస్తూ ఒక యువకుడికి చెప్పాడు కేశవరెడ్డి.

అంత వరకూ కన్నుల పండగ్గా చూస్తోన్న క్రిష్ణారెడ్డికి వ్యవహార మంతా చప్పబడి పోయినట్టనిపించి జోక్యం కలగ జేసుకున్నాడు.

"యిడుసు మామా! ఇంగా రెండు.... ఇట్లా నా కొడుకుల్ని మూలాజా పెట్టగూడదు. అంచేపట్నించి సూస్తండా యీని తల తిరుగుడు మాటలు.... యెయ్యి!!!"

కేశవరెడ్డి రెచ్చిపోయాడు అల్లుడి మాటలకి. అతని ఉద్రేకానికి ఊపిచ్చి నట్టయింది. తన చేతికర్ర తీసుకొని దెబ్బమీద దెబ్బ, దెబ్బమీద దెబ్బ పదేపదే కొట్టాడు. "అమ్మా!.... అబ్బా!!" అంటూ పెడబొబ్బలు పెట్టాడు కొల్లప్ప.

"యాడుంచే నా కొడుకుల్ని అడుంచల్లా!" అంటూ కొల్లప్ప మూతిమీద తన్నాడు.

చితికిన శరీరంలో ఉండటం ఇష్టం లేక రక్తం బయటకు వచ్చింది. కళ్ళు తేలవేసి అస్పష్టంగా ఏదో గొణుగుతున్నట్టు పెదవుల్ని వణుకుతూ కదిలిస్తున్నాడు కొల్లప్ప, అరిచే శక్తి లేక.

జనం మొహాలు జేవురించాయి.... తమ కళ్ళ ఎదుటే దారుణం!.... న్యాయాన్ని కాలరాస్తున్న అన్యాయం!! మంచిని మసిచేస్తున్న దగా... !!!

ఈ ఘోరాన్ని చూసి తీవ్రంగా ప్రతిఘటించాలని ఉంది. కాని.... ప్రతిఘటించి బతగ్గలమా? అనే భావన వాళ్ళని అచేతనంగా ఉంచింది.

*　　*　　*

దీపాలు పెట్టే వేళయింది.... చీకటి దట్టంగా ముసురుకుంది....

చెరువు నీళ్ళు వరి మడికి పారిస్తూ వున్నాడు వెంకన్న. పిల్లకాలువలోని నీరు సన్నగా గల గల మని శబ్దం చేస్తోంది.

"పెద్దయ్యా! పెద్దయ్యా!" అని చిన్న పిలుపు వినబడితే తిరిగి చూశాడు.

"ఎవరూ?" అన్నాడు.

"నేను మల్లేసుని" అంటూ వచ్చి చెంతగా వెంకన్న పక్కనే కాలువ గట్టు మీద కూచున్నాడు మల్లేసు.

"ఈ కయ్యొకటి పారించి వస్తుంటి గదా, నువ్వేలొస్తివి?"

మల్లేసు తనెందుకొచ్చిందీ చెప్పాడు. ఆశ్చర్యంగా చీకట్లోనే మల్లేసు మొహంలోకి చూశాడు వెంకన్న.

"ఉష్! మెల్లగా జెప్పరా.... గోల్లకి సెవులుంటాయి.... ఏందేంది పోలీసోల్లొచ్చిండ్రా?"— వెంకన్న.

"వచ్చిండ్రా కాదు పెద్దయ్యా! కేశవరెడ్డే పోలీసోల్లని పిల్లంపిచ్చినాడు"

"ఎంతన్నేయం!! ఎంతన్నేయం!!! కొల్లప్పని సంపింది గాక!!!"

"ఇంకా అసలిసయం యినూమల్లా."

"ఊఁ ఊఁ.... సెప్పు."

పోలీసోల్లని పిల్లంపిచ్చి.... కొల్లప్పకి అర్నెల్ల కింద ఎర్రి కుక్క కరిసిందనీ, దాన్నించి ఈ పొద్దు పద్దన కొల్లప్ప కెర్రిబట్టి కేశవరెడ్డిని కరిసేకి బొయినాడనీ, ఆయప్ప తన్ని రచ్చించు గొనేకి కొట్టినాడనీ, ఆ దెబ్బలకి కొల్లప్ప చచ్చిపోయినాడని సేటిమెంటిచ్చినాడు... పెద్దయ్యా శానామంది సాచ్చికాలు గూడా సెప్పినారు. ఆ సాచ్చికం జెప్పినోల్లలో నేనొగన్ని పెద్దయ్యా!.... దొంగ సాచ్చిం సెప్పినప్పన్నించి ఏందో తప్పు జేసినట్ల పానం పీకుతాంది పెద్దయ్యా!" ఆ మాటల్లో కొంచెం వణుకు వచ్చింది— మల్లేసు గొంతునించి.

"నువుగానేం జేస్తావురా!.... ఆళ్ళకి ఎదురు జెప్పి బతికే వోడెవుడు, కొల్లప్పకి జరిగిన అన్నేయాన్ని చూసయినా మనం బుద్ధి దెచ్చుకోవల్లరా.... సమయమొస్తే ఈ గొప్పోల్లంతా ఒగటయి పోతుండారు. మనమూ ఒగరి కొగరూ పట్టించుకోం.... కొల్లప్పకి నాయం జరిపించమని మన పేదోల్లంతా కల్సి అడిగించే ఈ పొద్దు నాయమే జరిగేది.... కాని అట్లలేం. కాబట్టే కొల్లప్ప కేశవరెడ్డి పొగరుకి బలయిపోయినాడు. ఈ పొద్దు కొల్లప్పకి జరిగిన అన్నేయం రేపు మీ నాయనకి జరుగుతాది.... ఆయప్పనీ ఏ ఎర్రికుక్కో కర్సినట్ల నేనే సాచ్చిగం జెప్పాలిసొస్తుంది.... అంతే, తప్పదురా.... మన పేదోల్లంతా ఒకటి గానంత కాలం.... అంతే! అంతే!!" ఆవేశంగా చెబుతున్నాడు వెంకన్న.

వరి మడి కయ్యి నీరు నిండి పొర్లుతోంది.

* [ప్రజాసాహితి, ఆగష్టు, 1979]

# అజ్ఞాతవాసం

మధురాంతకం రాజారాం

"అయ్యా, పెద్దాయనా! నువ్వెక్కడుండావా సామీ! బస్టాండులో బిక్కరిస్తి, బజార్లలో దేబరిస్తి, ఓటళ్ళకాడ గుక్కిళ్ళు మింగితి. అందరూ దీన్నదేది 'టవును, టవును' అని. నా పాలిటికిది అడివైపోయ. 'అయ్యా!' అంటి. 'సామీ!' అంటి. 'దేవరా!' అంటి. నా గోడు యినిపించుకునే నాథుడే లేకపోయ.

కూచున్నచోట కూచోని, నిలుచుకున్న చోట నిలుచుకోని మూడు దినాలాయె. 'ఇంత జేసినావా బగుమంతుడా' అని కాళ్ళీడ్చుకుంటా యిట్లా నడిచొస్తా వుంటే, యిక్కడ ఈ నాలుగీధులూ కలిసే చోట నువ్వు కనబడితివి.

నాకు ప్రానాలు లేచొచ్చ. నా కథంతా నీ సెవిలో ఎయ్యాలని నీ కాళ్ళ కాడికొచ్చి పడి పోయినా. నాకు తెల్సు, నీ మనసు పాలకుండ, నీ గుండె ఎండి కొండ. నువు సెవుతిప్పి నా కత యింటావు. కండ్లిప్పి నాగతి చూస్తావు. 'ఒరే గంగడూ! ఇదా నీ కత?' అని వొక కన్నీటి సుక్క రాలస్తావు. ఆ నమ్మకం నాకుంది. అందుకే సెప్తా వుండా.

ఏం సామీ, నీ కెన్నేండ్లొచ్చినాయో నాకు తెల్దు. నాకు మాత్తరం నిరుడు గంగ పండగలో

నలభై ఒకటో, నలభై రెండో, అయి వుండాల. ఇంత కాలంగా నేనెప్పుడూ యిక్కడికొచ్చి నిన్ను జూచినోణ్ణి గాదు. పొస్తకాల్లో బొమ్మలు జూచి, గోడల పైన పటాలు చూసి నువ్విట్లా వుంటావని అనుకున్నా, చూడగానే గుర్తుపట్టేసినా, నాకీవూరు కొత్త. ఈ మనుషులు కొత్త. ఈళ్ళు మాట్లాడే మాటలు కొత్త. ఈళ్ళ చేష్టలూ కొత్తే. కొండ గొర్రెను పట్టుకొచ్చి సంతలో తోలినట్టుంది నా పని. అడివి అడివంటారేగానీ ఈ టవునుకంటే అడివెంతో మేలు. అక్కడైతే ఆకులో, అలుములో మెయ్యొచ్చు. కాయలో, దుంపలో తినొచ్చు. వాగులో నీళ్ళు తాగొచ్చు. ఏ చెట్టు కిందనైనా చల్లంగా పడుకోవచ్చు. ఇక్కడట్లా కాదే! దీనాలి సిగదరగా, ఏపని సేయాలన్నా సెయనీరే! రిక్షా తొక్కతానంటే బండి దొరకనీరు. మూటలు మోస్తానంటే, ఇంతకు ముందట్నుంచీ ఆ పని చేసేవాడు తన్నకుండా యిడవడు. బాయిలో పూడెత్తతానంటే యిక్కడ యింటింటికీ కొళాయిలైపోయి, బాయిలనేటివే లేకపోయె. ఇంక నేనేం జెయ్యాల? పగులంతా నా బతుకిట్లా బండబారిపోయిందా; ఇంక రేత్రుల్లో చీకటి పడేటప్పటికి చూసుకో వలసిందే నా పాట్లు! అరుగులపైన పడుకోనీరు. సత్తరాల్లో అడుగు పెట్టనీరు. గుళ్ళన్నీ మూసి బీగా లేసుకుంటారు. ఎక్కడా తావు దొరక్క రోడ్లపైన అట్లా ఇట్లా తారట్లాడతావుంటే, ఈ దెవుడో దొంగనాకొడుకు దొరికినాడని పోలీసోళ్ళు తరుముకుంటారు. ఆ పుణ్ణాత్ముల కండ్లల్లో పడకుండా వుందామనే సందుల్లోకి మళ్ళితే "లొవ్, లొవ్" మంటూ కుక్కలు పైకొస్తాయి. వర్సగా మూడు రేత్తుర్లూ యిట్లనే తెల్లారిపోయె. ఇది నాలుగో దినం. మళ్ళా సీకటి పడబోతా వుండగా నువ్వు కనిపిస్తివి.

నువ్వంటావేమో—అంతగా ఏపనీ సేతకానోడివి నువ్వింత దూరం ఎందు కొచ్చినావురా పిచ్చోడా! అని. నా సామీ! ఆ మాట మాత్తరం అనొద్దు. నక్క ముదిరితే నరుడవుతుందట! తొండ బలిస్తే వూసర విల్లవుతుందట! ఎంద్రకాయ కొవ్వితే బొక్కలో వుండక బయట కొస్తుందట? నేనేమీ అట్లా పొగరుబట్టి దేశాలపైన పడినోణ్ణిగాదు. ఇంకా గావలిస్తే నా సంగతి మా వూళ్ళో పసల పోలిరెడ్డి నడుగు. పిన పెద్ద రాయప్ప నాయుణ్ణి అడుగు. గుడిలో పూజారి నడుగు. అంత పెద్దోళ్ళ నడిగేది యిష్టం లేకపోతే వూరి ముందర గొడ్లు మేపు కునే పిల్లకాయల్ని అడుగు. ఒకరి సొత్తుకు పోయినోణ్ణి గాదు. ఒళ్ళు దాచుకొని పనికి ఎగనామం పెట్టినోణ్ణి గాదు. మాటదప్పినోణ్ణిగాదు. ఏం జెయ్యమంటావు జెప్పు? చిన్న మెత్తు తప్పుజెయ్యక పోయినా వుండూరొదిలి, కట్టుకున్న కొంప నొదిలి, పెళ్ళాం బిడ్డల్నొదిలి, అయినోళ్ళ నందర్నీ వొదిలి, తలపైన గుడ్డేసుకొని

యిట్లా రావలసొచ్చింది. ఎందుకొచ్చిందంటే — అదేనయ్యా కత! అదే సామీ, ఈ గంగడి కత!

రాయవరం నుంచి రచ్చల దొడ్డికిపోయే రోడ్డుమీద దళవాయి పేటకు తూరుపుగా సిగమాకులగుట్ట దాటుకుంటే కనిపిస్తుంది. అదే సామీ మా వూరు. దాని పేరు పొరకల బయిలు. సుట్టూరావున్న గుట్టల్లో పొరక పుల్లలు బలే యిస్తారం. అందుకన్జెప్పి అ పేరొచ్చిందంట. ఏమాత్తరం వానలు కురిసినా మూణ్ణెల్లు నీళ్ళు పారే కొండనారవ కింద వరిమళ్ళు. పంచ పాండవులు నీళ్ళు తాగినారంటని సెప్పకునే అయిదు కుంటలకింద చెరుకు పైర్లు. ఇంకా యెగువకు పోతే శనిక్కాయలు దివ్వెంగా వూరే య్యెర్రజేన్లు, మళ్ళకు సేన్లకు సుట్టు కైవారంగా మామిడి తోపులు, మా వూరని సెప్పకోవడం గాదు గానీ, ఊరంటే యిదిరా ఊరు అనిపించేటట్టుగా వుంటాది మా పొరకల బయిలు. సేతిలో నాలుగు రాళ్ళు పట్టుకొని ఒక్కసారిగా యిసిరిపారేస్తే ఒకదాని కొకటి బారెడు దూరంలో మూరెడు దూరంలో పడవా? అట్లా వుంటాయి నాలుగూళ్ళూ. కాపోళ్ళుండేది కాపూరు. కమ్మనాయుళ్ళుండేది కమ్మపాలెం. మాలోళ్ళది మాలపల్లె. మాదిగోళ్ళది మాదిగిండ్లు. గ్రామమనే దొకటుండే దానికి దేవుళ్ళుండ బన్లేదా? ఉండారు. ఉత్తరాన మాంకాలమ్మ, అడివిదోవలో మధ్యానాల్లో గొడ్లు, గొర్రెలు పండుకునే మద్దిసెట్లకింద కాటమరాయడు, కాపూరికి కమ్మపాలేనికి నడిమధ్య బజన గుడిలో రాములవారు. కదలకుండా, మెదలకుండా గుండ్రాయిల మాదిరిగా వుండే అ దేవుళ్ళ మాటకేంగానీ, కూచుంటా, నడస్తా, మాటాడతా, నాయాలు విచారిస్తా, దరమాలు కూడబలుకుతా గ్రామాన్ని కాపాడుకొచ్చే దేవుళ్ళున్నూ మాకు ముగ్గురే! అత్తిపెట్లో పూత సూపించొచ్చు, కరణం మల్లయ్య గీత గీసినాడంటే దాటేవాణ్ణి సూపించలేవు. కుందేలికి కొమ్ము సూపించొచ్చు, మణేగారు రాయప్ప నాయుడు ఉత్తరువిస్తే మీరేవాణ్ని సూపించలేవు. తెల్లటి కాకిని సూపించొచ్చు, పెసిడెంటు పోలిరెడ్డి గుడ్లురిమిసూస్తే భయంతో గడగడ లాడకుండా వుండేవాణ్ణి సూపించలేవు. అంత మట్టసంగా, పెద్దంతరం సిన్నంతరం సెడకుండా, ఎగవ గనిమకు దిగువ గనిమకు ఎడం తగ్గకుండా పొరకల బయిల్లో దరమరాజ్జెం జరిగిపోతా వుంటే, ఏ దేవుడికి కన్ను గుట్టిందో గానీ సామీ, ఒక ముసలమొచ్చి పడిపోయింది.

ముసలమంటే మరేందీగాదు, పంచాయితీ వోట్లు!

నీకు తెలియందేముంది గానీ సామీ, రామాయనం తీసుకుంటే రాముడొకడే. ఇద్దరు రాముళ్ళుండరు. భారతం తీసుకుంటే భీముడొకడే. ఇద్దరు

భీముళ్ళుందరు. మా వూరి సంగతీ అంతే! పంచాయతీ పుట్టినప్పటినుంచీ పసల పోలిరెడ్డే పెసిడెంటు. ఆయన కట్టె కడతేరిపోతే ఆ తరవాతేం జేస్తారంటావేమో! ఏం, ఆయన కొడుకు సిన నాగిరెడ్డి లేడా? ఆ బయం మాకేమీ లేదు. ఎన్న సేతిలో పెట్టుకొని నెయ్యి కోసరం ఎదుకులాడే వాళ్ళంగాము.

అయితే దొరతనంవాళ్ళు వుండి వుండీ ఒక తిక్కరూలు తెచ్చి పెడ్తారని మాకేం తెల్సు? ఒక దినం మునిమాపటేళ మా పెసిడెంటు పోలిరెడ్డి పిలవనంపితే ఎళ్ళి సేతులు కట్టుకోని దూరంగా నిలబడినాను. "ఏంరా గంగా! ఎందుగ్గాను పిలిపించినానో తెల్సునా?" అనినాడు పోలిరెడ్డి. "ఎద్దులు గొట్టి ముద్దలు తినే వాణ్ని సామీ! నాకేం తెల్సు? తమరే సెప్పాల" అనినాను.

"ఏం లేదురా గంగా! కాలాలు మారిపోతా వుండాయి. ఈ పొద్దుండిన రూలు రేపు లేదు. ఇప్పుడొకటి కొత్తగా వచ్చిపడింది. మన పంచాయితీకి మేమెవురూ పెసిడెంటుగా వుండకూడదంట. మీలో ఒకరిని పెట్టుకోవాలంట కాదుగిదంటే కుదర్దు. ఒప్పుకోరు. నేను కరణంతో, మణేగారితో మాటాడినా. నిన్ను పెట్టడం వాళ్ళకున్నూ యిష్టమే. అంచేత, నేజ్జెప్పేదేమంటే, మన పంచాయితీకి నువ్వు 'సర్పంచి'గా వుండాల...."

నాకయితే ఆచ్చెర్యమైపోయింది. "సరపంచా! అదేంది సామీ? నేనెప్పుడూ యిన్లేదే!" అనినాను.

"అదే లేరా! పాత సారాయిని కొత్త సీసాయిలో పోస్తా వుండారు. పెసిడెంటనే మాటెందుకో పనికిరాండ్లై పోయింది. ఇక మీదట 'సరపంచి' అనాలంట! రెండూ ఒకటే. మన పంచాయితీ కింక నువ్వే పెసిడెంటువి. అదీ సంగతి! తెల్సిందా?"

నా ఒళ్ళు మాన్నైపోయింది. నోటిలో నుంచీ మాట బయటికి రాలా! ఇదేం చోద్దెంరా నాయనా అని నోరు తెరిచేసినాను. పుట్టి బుద్ధి తెలిసినాక యీ మాదిరి యిద్దూరం ఏనాడూ యినింది లేదు. కాకపోతే నేను.... ఆసాది గంగడు అనే నేను ...వూళ్ళో మారాజులు కాలితో సెప్పిన పని చేత్తో చేసుకపోయే నేను-ఎపుడో గవర్నమెంటోడు జెప్పినంత మాత్తరంలో ఏక్ దమ్మున సరపంచినై పోతానా? ఒకవేళ పోలిరెడ్డి వుండమంటే మట్టుకు నాకు బుద్ధి లేకపోతాదా? అదికాదు పెద్దాయనా! నువ్వు జెప్పు. గుడిలో అమ్మ వారుంది. ఆ యమ్మకు కడ్తే కంచి పట్టు చీర గట్టాల. లేకపోతే దరమావరం సిలుకు చీర గట్టాల. అంతేగానీ బొంత తీసుకొచ్చి కట్టబడ్తారా ఎవురైనా? ఈ యిపరీతం ఎక్కడైనా వుంటాదా? ఏ కాలంలోనైనా వుంటాదా?

ఇంతే గాదు. ఇంకా ఎంతో దూరం సెప్పి సూసినాను. అయితే ఆయన యినిపించుకోలా. "సర్లేరా గంగా! అయిపోయిన పెండ్లికి మేళాలెందుకు? నువ్వు సరపంచివి. అంతే! ఇంతకూ నీకు చేవ్రాలు పెట్టడమైనా వస్తుందో, లేదో? ముందా సంగతి జూడు" అని లేచి, చక్కా లోపలి కెళ్ళిపోయాడు.

నాకు తలపైన రాయి పడినట్టయి పోయింది. గ్రామంలో ఎందరో పెద్దో ళ్ళుండగా, యిదేందిరా ఈ పీడొచ్చి మన గొంతుకు సుట్టుకొనింది - అని దిగులు పడిపోయినా. రేపొద్దున్న ఎవురైనా ఆఫీసరొచ్చి ఈ కాగితంపైన చేవ్రాలు పెట్టు అంటే ఏం జెయ్యాల? ఇరువై ఏండ్లప్పుడు రేత్రి పలుకూటంలో రుద్ది నేర్చిన అచ్చరాలు. మా పక్కింటి అబ్బోడి దగ్గర పేనా అడిగి తీసుకోని కుదురుగా రాసి సూచినా. పొట్ట పగిలేటట్టుగా నవ్వుతాడే గానీ, కుర్రెదవ అందులో తప్పే ముందో సెప్పడే! కడకు తెల్సింది, మూడు రాయాల్సిందానికి బదులు రెండే రాసినానంట! "గండు, గండు" అని వాడెగతాళి పట్టిస్తావుంటే, తల పైకెత్తుకో లేకపోయినా.

ఏం జెప్పేదు సామీ, ఆ చెడ్డదినం కూడా వచ్చేసింది. సూట్లూ, కోట్లూ యేసుకోని ఉద్యోగస్తులొచ్చి వూళ్లో దిగేసినారు. "ఇస్కూల్లో మీటింగంట! నిన్ను రమ్మంటా వుండారు?" అని యెవురో పరుగెత్తుకుంటావచ్చి సెప్పిరి. గుండె టిక్కుమంటా వుంటె బయపడతానే ఎళ్ళి నిలబడితి. మణేగారితో కాసేపు మాటాడినాక ఆఫీసరు దొర లేచి ముందుకొచ్చి "రండి, రండి సరపంచిగారూ! వచ్చి కూచోండి" అని నాకు కురిచీ సూపించినాడు. పెసిడెంటు పోలిరెడ్డి కరణం మల్లయ్య, మణేగారు రాయప్ప నాయుడు యింకా వూరి పెద్దలంతా అక్కడ కొలువు దీరుంటే, ఆళ్ళ మద్యేన నాకు కురిచీ కావలిసొచ్చిందా? వద్దొద్దు నే నిక్కడ్నే నిలబడి వుంటానని గింజుకుంటి. ఊఁహూ, ఆయన యినేకోపులో లేడే! నేను కురిచీలో కూచునే దాకా ఆయన నా పీకల మీద కూచునె. కాళ్ళు వణికిపోతావుండాయి. ఒళ్ళంతా సెమటబట్టిపోయింది. నోట్లో తేమలేదు. ఆ తరవాతాక అరగంటసేపటిదాకా అక్కడేమేం జరిగిందో నేనయితే సరిగా జెప్ప లేను. పసల చిననాగిరెడ్డి, పచ్చిపులుసు చెంగయ్య, కదిరి నరసప్ప, ముతిరేపుల నాంచారు, యింకా ఒక నలుగురైదుగురుదాకా 'నంబర్లు'గా కురిచీల్లో కొచ్చిరి. ఆఫీసరు సూపించినచోట కాగితాలపైన చేవ్రాలు పెడితిమి. ప్రమానకం జెయ్యం డని నేర్చిన మాటలన్నీ సదివితే ఆయన పాటకు వంతపాట పాడితిమి. 'అయి పోయిందయిపోయింది. నువు పంచాయితీ సరపంచి వైపోయినా'వని అందరూ గొంతెత్తి సెప్పిరి. ఏమైనానో, ఎందుకైనానో నాకేం తెల్దు. ఆ బగుమంతుడికే తెలియాల,

నాకు తెలిసిందేమంటే - నేను తిరిగెల్లేటప్పటికి నా గుడిసెలో మట్టిగోడలు మారలేదు. పైన సొప్పదంటు కప్పు మారలేదు. ఎదురు తడికతో బెట్టుకున్న తలుపు మారలేదు. ఇంట్లో నా సత్తుగిన్నె మారలేదు. అందులో సంగటి మారలేదు. నా పెళ్ళాం కట్టుకునే చింకి పాతలూ మారలేదు. నా బిడ్డలు తొడుక్కునే మాసికల గుడ్డలూ మారలేదు. మరైతే నేను మాత్తరం మారిపోయినానని అంటా వుండారు....

ఆ రోజు రాత్రి తిండిదిని పడుకున్నాక రంగి అడిగింది. "ఏందే మామా! నువు సరపంచి వైనావు గదా! దీనికేమైనా జీతమిత్తారా?" అని.

"యిచ్చేటట్టయితే ఎవురైనా జెప్పరా? ఇచ్చేమాట అనుమానమే!" అనినాను.

"పోనీలే. జీత మిచ్చిరి, ఇయ్యక పోయిరి సరపంచి వైనాక నువు కూలికెక్కడ పోతావులే మామా! ఇంటిదగ్గర్నే వుండు. నేను కూలికి బోతే రెండు ముద్దలు తెస్తాను గదా! నీకొకటి, నాకొకటి.

నాకు ఏడుపొచ్చింది. ఆడది సంపాదించుకొస్తే, అందులో భాగం పెట్టుకోని నే నింట్లో ఈగలు దోలుకుంటానా? ఛీ ఛీ అది గూడా బతుకేనా?

తెల్లారింది. పల్లెలో జనమంతా పన్లకు బోయినారు. సెట్టుకింద నులక మంచంలో నేనొక్కణ్ణి మాత్తరం మిగులున్నాను. అదేమంటే, నేను సరపంచిని! పన్జేయగూడదు.

కోరుకోని వరమిచ్చి, కాళ్ళూ సేతులూ కట్టి పారేసినందుకు ఆ దేవుణ్ణి తిట్టుకోవాల. మనుషుల్ని ఏం లాబం?

ఒకటి గాదు, రెండు గాదు-ఈ మానాన నెల రోజులు దొర్లిపోయ. ఇట్లా గాదని ఒక దినం తెంపు దెచ్చుకోని గ్రామ సావిడి దగ్గరకు పోతి. ముగ్గురు మారాజులు అక్కడ్నే కనిపించిరి. "ఏంరా గంగా! బాగుండావా?" అని కరణం మల్లయ్య పలకరించె.

"ఏం బాగు సామీ! గ్రామంలో నన్నెవురూ పనికి పిలవడంలేదు. ఆడదాని రెక్కల కష్టంతో సంసారం జరగడం లేదు. సదుకూటానికెళ్ళే పిల్లోడికి నోటు పొస్తకాలు కొనిద్దామంటే పదిరూపాయలు సేతిలో లేవు. నాకయితే పిచ్చి బట్టిపోయి నట్టుండాది. ఇట్లా కాలం గడపడం నా వల్లగాదు. ఒక మాట సెప్పిపోదామని వచ్చినాను. తమరు సెలవిప్పిస్తే ఏ రాయవరమో, రచ్చలదొడ్డో సేరి, ఏదో ఒక పన్జేసుకొని నాలుగు రూకలు సంపాదించుకుంటాను...."

"ఒరేయ్, ఒరేయ్! అంత పనెక్కడైనా చేసేవ్!" పినపెద్ద రాయప్పనాయుడు కచ్చితంగా సెప్పేసినాడు. "పొరకల బయలు సర్పంచి మా వూళ్ళో

కూలిపని చేసుకుంటా వుండాడని పొరుగూరివాళ్లు చెప్పుకుంటే మేం తలెక్కడ పెట్టుకోవాల? అంతగా నీకు జరుగుబాటు లేకపోతే చిత్తూరి కెళ్ళిపో. అదయితే టవును. అక్కడ నీ అతీ గతీ ఎవురూ పట్టించుకోరు. ఏమయ్యా కరణం! నువ్వే మంటావు?"

"అవునవు న్నిజమేరా గంగా!" కరణం మల్లయ్య బలపరిచినాడు. "లేదంటే ఏ రెణ్ణెల్లకో, మూణ్ణెల్లకో ఒకసారి నువు సమితి మీటింగుకు హాజరు గావల్సి వుంటుందేమో! పరవాలేదులే. ఒక పని చెయ్. టౌనులో ఒక పెద్ద మనిషితో మాటాడి ఆయన పేరు మాకురాయించు. జవిళంగడి సుబ్బరామయ్యతో చెప్పి పెట్టినావనుకో? 'ఆసాది గంగడు' కేరాపు జవిళంగడి సుబ్బరామయ్య' అని మీకు జాబు రాయిస్తాము. ఆ జాబు చూచుకొని నువు మీటింగుకు రావచ్చు. మీటింగయిపోగానే తిరిగెళ్ళిపోవచ్చు ఏంరా, గంగా! అర్థమైందా?"

అర్థమైనట్టుగా తల వూపినాను.

అంతే సామీ! ఆ మర్నాడు బయల్దేరి రావడమే రావడం! ఇక్కడ టవున్లో పెద్దమనుషులకేం కొదవ? కాదంటే నా మాట సెవిలో ఏసుకునేవాళ్లు మాత్రరం కనిపించలా. ఇప్పుడు నువు కనిపిస్తివి. ఆ మాటకొస్తే నీకంటే మాకు పెద్ద దిక్కెవరు? బతికినంతకాలం మా బాగుకోసరమే పాటుపడినావంట! మాకు అరిజనులని పేరు బెట్టింది గూడా నువ్వేనంట! మూడు దినాల పొడుగునా కాళ్ళరగిపోయేటట్టుగా తిరిగినందుకు నా అదురుష్టం బాగుండి నువ్వు దొరికినావు. "ఆసాది గంగడు, కేరాపు గాంధీమహాత్ముడు, నాలుగు రోడ్లు కలిసే సోటు, చిత్తూరు" అని మా వూరోళ్లు జాబు యిస్తే నాకు చేరిపోతుంది గదూ?

ఏం సామీ, జవాబు సెప్పవు?

* [ఆంధ్రజ్యోతి వారపత్రిక, 1981] *

# ముత్తడు గొప్పోడు

పులికంటి
కృష్ణారెడ్డి

ఎడం కాల్ని పైకెత్తి ఎగిరొక్క తన్ను తన్నాడు పర్దేసిరెడ్డి!

మూడు పొల్టికలు పొల్లి మూడు బార్లకవతల పడి ముక్కుతా మూలగతా పైకి లేసి, లేవలేక తల పైకి లేపి, తిప్పలేక సూపును పక్కకు తిప్పి సూశ్శేక సూసినాడు ముత్తడు – పర్దేసిరెడ్డి పక్కన దర్జాగా నిలబడుకోనుండే పిలగాణ్ణి!

ఆ పిలగాడు పిలగాడు గాదు – పిడుగు!

ఆ పిడుగు దొరమాదిరుండాడు. దొరమాదిరుండే పిలగాడి పక్కన్నిలబడుకోని పర్దేసిరెడ్డి నిప్పులు కక్కుతా వుండాడు.

నిప్పుల కుప్పల్లో నుంచి అగ్గిశాక రైలింజన్లో మాదిరి గుప్పు గుప్పుమని పైకి లేస్తా వుండాది. తట్టుకోలేకుండా ముత్తడు తలొంచినాడు. వంచిన తల్లో యాడుణ్ణాయో? ఏంవో? వాన సినుకుల మాదిరి కురస్తా వుండాయి కన్నీళ్ళు.

కన్నీళ్ళు కార్తానే వుండాయి!

అగ్గి కుప్పలు పొగలు కక్కుతానే వుండాయి!!

పర్దేసిరెడ్డికి వల వలా గారే నీళ్ళు కనిపించ లేదు.

పొద్దు నడిమిట్ట నుండాది. ఆ మండేవోడు గూడా గబ గబా మండతా వుండాడు. ఇంకొక సోటింకొక సోటయితే ముత్తడు సేతులు మోడ్చి,

తల పైకెత్తి అంతా ఆ మందే వోడే సూసుకుంటాడనే వోడు. ఇప్పడనేదానికి గుండెల్లేవు. యాడుంటాయి? ఎట్లుంటాయి? ఎడం కాలి తన్ను కెప్పుడో ఎగిరి పోతే?_

ఆ యింటి వసారాలో అబ్బ పర్దేసిరెడ్డి, కొడుకు గాందీరెడ్డి, సేద్దిగాడు ముత్తడు ముగ్గురూ మూడు దిక్కుల్లో నిలబడుకున్నారు. ఇంటిల్లాలు పద్మవతమ్మ హాల్లో దారబందాని కానుకోని కొర కొర సూస్తా వుండాది. వాకిలి ముందర కొట్టంలో గాట్లో కసువు తింటావుండే గొడ్లు .... ముత్తడి సేతుల్లో ముదిగారంగా పెరిగిన గొడ్లు – మేపు తినడం ఆపి, మోర ముందుకు సాస్తా గుంజులాడ్తా వుండాయి. ఎందుకో? ఏఁవో?

పాపం! అవ్వి నోర్లేని గొడ్లు!

"ఇంకా నిలబడుకోనుండావు గదరా కొడకా! .... సాల్లేదా? సెప్పు. సాలకుంటే సెప్పరా!"

ఎకసక్కెం ఎగిరెగిరి పడ్తావుంది పర్దేసిరెడ్డి మాటల్లో.

పేదోడి కోపం పెదాలకు సేటని తెల్సు ముత్తడికి. అయినా ముత్తడు మణిసి. మణిసంటే అంతో యింతో సీఁవూ నెత్తురుంటుంది. సీఁవూ నెత్తురుంటే సీవంత అభిమానఁవూ వుంటుంది. వాడుగాదు తల పైకెత్తింది. వా దభిమానం!

"ఏందిరాట్ట సూస్తా వుండావే?.... సూస్తే యేంజేస్తావ్ ...? పో!....పోరా! తిరిగి సూడకుండా పో! యాడ్దాకా పోతావో పొయ్యి, శాతయింది సేసుకోబోరా!"

పర్దేసిరెడ్డి వంచన కట్టేసుండే కుక్క 'కుయ్యో! కుయ్యో!' అని అరస్తా ఈ మాటల కది ముక్తాయింపు పలికింది.

"ఛీ! నోర్ముయ్యే నీ యమ్మను గొట్టా!"

పర్దేసిరెడ్డి కసిర్నాడు.

కుక్క యిశ్వాసం కలిగిన జంతువు.

తోకాడిస్తా నోరు మూసుకుణ్ణింది.

ముత్తడు నోరెత్తుంటే ఒట్టు!

ఊరి ముందర సెరువులో దినఁవూ ఈతాడించి ఆ కుక్కను సబ్బేసి కడిగే వోడు ముత్తడు. ఇంటిల్దల్బ శాతబట్టి ఒక గోరింకెనో, బెళ్ళ గువ్వెనో గురిబెట్టి పడగొట్టి, బొచ్చు పెరికి కాల్చి పక్కంజేసి దాన్నోటి కందించేవోడు. వాడంటే పంచపాణాల్దానికి. అది పెయకులాడ్తా వుండాది. బెరుకు బెరుగ్గా సూస్తా వుండాది. సూస్తా అరవలేక, అరవకుండా వుండలేక అల్లాడిపోతా

వుండాది. దానవస్తను సూసినాడు ముత్తడు. సూశ్లేక తలొంచుకున్నాడు. ఎద్దు గొడ్డుకల్లా సూసినాడు.

గాట్లో గొడ్లు, తానేళకు తిన్నాడో లేదోగానీ, వాట్ని మాత్రం యేవాళ్లేదు. శరువు రానీ కాటకం రానీ బిడ్డల్ని సాకినట్టు సాకినాడు. గాట్నింటికీ మేపుంచే కూడా అవ్వి జోసట్టా కొరక్కుండా గుంజులాడ్తా వుండాయి. సూశ్శేక మరీ తలకాయ వాలేసినాడు ముత్తడు.

తలకాయ వాలేస్తే యేఁ వుండాది? – కాళ్ళ కింద బూఁవమ్మ.

బూఁవమ్మను తాన్నమ్ముకున్నాడు. పర్దేసిరెడ్డి తన్ను నమ్ముకున్నాడు. రేత్రనక పొగులనక వంచిన్నడు వెత్తకుండా పోరకలాణ్ణాడు. ఆ యింటి నాలుగ్గోడల మద్దె తప్పిస్తే తన సెఁవట సిందని సోటే లేదు. ఈ మాట మణుసులో మెదిలేకుందికి ముత్తడి మణుసు ఎట్టెట్నో పొయ్యింది.

గబక్కని నేలమింది కొంగినాడు ముత్తడు. వంగి మూడుసార్లు బూఁవమ్మను కండ్ల కద్దుకుణ్ణాడు. అద్దుకోని పైకి లేసినాడు. లేసి గిరక్కని ఎనక్కి తిరిగినాడు. అడుగు మిందడు గేసుకుంటా ముందుకు నడ్సినాడు.

ఆ యింటి కడప దాడ్తావుండాడు ముత్తడు. కడప కవతలొక్కాలు, ఇవత లొక్కాలు, అట్లానే నిలబడ్డాడు. నిలబడి ఒక్కసారి ఎనక్కి తిరిగి సూసినాడు. సూస్తా రొండు సేతులు పైకెత్తి జోడించి ఒక్కదండం పెట్నాడు- అక్కడి కాయింటితో ఋణం తీరిపొయ్‌నట్లుగా!

అంతే! అణ్నుంచి ఎల బార్నాడు. ఎనక్కి తిరిగి సూడకుండా పోతా వుండాడు. ఏందో జరగరానన్నాయం జరిగిపోయ్‌నట్టు కట్టు గూటాన నోర్లేని గొడ్లు గూడా 'అంబా! అంబా!!' అని అరస్తా వుండాయి.

అబ్బా కొడుకు నవ్వే నవ్వులకు అలప సొలప్మయిన యిల్లయితే పై కప్పెగిరిపొయ్యేదే!

నలగని కద్దరు పై పంచె మడతల్ని నాజూగ్గా సర్దుకుంటా వుంటాడు పర్దేసిరెడ్డి.

నేలమింద రాసి రాసి బూటు కొన అరిగిపొయ్యిందేఁవో తడిఁవి సూస్తా వాట్ని ప్పేదానికి వాలు కుర్చీమింద కుచ్చున్నాడు గాందీరెడ్డి.

పంచమింద కుక్క యాడవలేక, యాడవకుండా వుండలేక ఏడుపు నదొకరకం మూలుగ్గా మార్సి – కట్టేసిన గొలుసును కొరకతా వుండాది.

నోర్లేని గొడ్లకు కండ్లుండాయి. ఆ కండ్లల్లో నీళ్ళు గార్తా వుండాది.

నేఁవిలి కంట్లో నీళ్ళు గార్తే యాటగాడి కేఁవయినా ముద్దా?

* * *

ఊరి కుత్తరంగా నాగల మిట్టబాయి. ఆ బాయికా దొక కానగసెట్టు. ఆ సెట్టు కింద కుప్పగ కూలబడ్డాడు ముత్తడు.

ఆ కానగ సెట్టు కింద కూలబడి కల మాదిర జరిగిపొయ్‌న బతుకును గురించి నెవురేసుకుంటా వుంటాడు ముత్తడు!....

వాడికే గాదు ఆ పాయికట్లో ఎవుడికయినా సరే – పర్దేసిరెడ్డిమింద ఆవగింజంత అనుమానముంటే యిందూరం ఆలోసించాల్సిన పనేలేదు!

పర్దేసిరెడ్డి!

ఆ పాయికట్టు తల్లో నాలిక! .... మొల్లో రూక!

కనుచూపు దూరాన కంటపడే వాడెట్టా టోడైనా సరే – సేతులు జోడిం చాల్సిందే! కుచ్చోనుంటే గబక్కని లేసి కొంచింగా ముందుకొంగి సేతుల్నాపు కుంటా నిలబడాల్సిందే!–

బయంతో గాదు – బగిత్తో!

ఈ బయం బగుతులు తేరకు రాలేదు పర్దేసిరెడ్డికి.

పర్దేసిరెడ్డి తాత ముత్తాతల కంతో యింతో కయ్యాగాల వుణ్ణింది. అంతో యింతో వుణ్ణిందాన్ని ఎంతో కొంత పెంచి వాళ్లు పర్దేసిరెడ్డి పరం జేసినారు. ఆ కయ్యాగాలవతో పాటు పర్దేసిరెడ్డి కాసింత – తెలివి తేటల్ని కూడేసుకున్నాడు.

పర్దేసిరెడ్డి పెద్దగా సదువుకోకపొయ్‌నా పెద్దబాలసిచ్చ యీకాణ్ణుండా కడదాకా సదివేసినాడు. పెదబాలసిచ్చినే తిప్పించి మల్లించి సదివేసేకుందికి పెద్ద పెద్ద పుస్తకాల్నే తడుఁవుకోకుండా సదివేడానికి తయారైనాడు!

అట్లా తయారై ఆయిన తెల్సుకుణ్ణిందేవిటంటే – నోకం తెలియకపోతే ఈ లోకంలో బతకలేఁవని! ఈ లోకంలో ఆ నోకం శానా ఎత్తులో వుండాది. దాన్ని సేరుకోవాలంటే శానా మెట్లెక్కాల్లి!–

కద్దరు గుడ్డలు గట్టి పర్దేసిరెడ్డి మొదటి మెట్టెక్కేసినాడు.

గాందీ సచ్చిపొయ్‌నపుడు ఆ వూరి బజనగుళ్లో రాఁవుడి పటం పక్కన గాందీ పటాన్ని పెట్టించి వర్సగా వారం దినాలు ఆయిన జీవిత సెర్త్ర సదివి వినిపించి – యిన్నోళ్ళు యేడస్తావుంటే వాళ్ళతో కల్సి తానూ యేడ్సినాడు.

ఆ తరవాత శానా దినాలకు తన కొక కొడుకు పుట్టే వాడికి గాందీరెడ్డని పేరు పెట్టుకున్నాడు.

నెర్హూ సచ్చిపొయ్‌నపుడయితే నెల్నాళ్ళు నోర్దెరిసుంటే ఒట్టు!

అప్పుడు దేశింలో ఏ నోటిన్నా ఒగిరే మాట. యాడ మీటింగు జ్జరిపినా అదే మాట. 'మాలోళ్ళను గూడా మణుసులుగా సూడమని!'

ఈ దెబ్బతో శానా మెట్లు పైకెక్కేయచ్చనుకున్నాడు పర్దేసిరెడ్డి.

ఆ ఊరి మాలాడమింద పడ్డాడు. కాలికి బలపం కట్టుకున్నట్టుగా యిల్లిల్లు తిరిగినాడు. ఇంటికొక్క మణిసిని మాలాడ ముందర గెవిన్లో మాఁవిడి సెట్టు కింద సేర్సినాడు.

కాకితో కబుర్జేస్తే యింటి కొక్క మణిసి గాదు – యిల్లిల్లు కదిల్తిందని పర్దేసిరెడ్డికి తెల్సు. అయితే ఆ మాత్రం నోకం తెల్నోడేంగాదు పర్దేసిరెడ్డి. సెట్టు కింద సేర్నోళ్ళందర్నీ పేర పేర్నా పలకరించినాడు. ఆ పలకరింపుతో ఆ ఎర్రి జనం తాగినోళ్ళ మాదిరి ఎనక్కూ ముందు కూగులాడ్తా తబ్బిబ్బులై పోతావుంటే రెడ్డందుకున్నాడు.

"ఒరే నాయన్లారా! తినేదానికి కడుపుక్కూడు లేకపోతే ఆకులలుఁవులు పెరక్క తిని నాలుగు దినాలు పాణం నిలబెట్టుకోవచ్చు. కట్టుకునే దానికి గుడ్డపేలిక లేకపోతే గోస్సేతపెట్టుకొని తిరగచ్చు. అదే గొంతులోకి గుక్కెడు నీళ్ళు లేకపోతే!.... అహఁ! మీ ఆడది సంకన కడవలేసుకుని కాలిక్కాలు కొట్టుకుంటా మోటబావల్దగ్గిరి కెంత దూరం నడుస్తా వుండాలో ఎవ్వరైనా ఆలోసించినారా మీరు? సెప్పండ్రా!.... సెప్పండి!"

సెప్పలేకుండా సేతులు పిసుక్కుంటా సేతులెత్తి దణ్ణం బెట్టిందా గుంపు.

"అడిగితే అంతే! రాతికూసాల మాదిర్నిలబడ్తారు. గదఁవాయిస్తే సేతులు పిసుక్కుంటారు. అందుకే పెనుఁవూరు పిచ్చయ్య శాస్త్రిల్దగ్గిర లగ్గణం పెట్టించినా. వారం, తిదీ, నచ్చత్రం అన్నీ బెమ్మాండంగా వుండాయంట. మీరింటికొక మణిసి పారా గెడ్డపార సేతబట్టండి. మిగిల్ని పని నా కొదిలి పెట్టండి."

"పర్దేసిరెడ్డికి జై!" అనిందాడ జేరిన మాలగుంపు.

"సెబాస్!" అన్నాడు పర్దేసిరెడ్డి.

దినఁవూ ఒక రాయిని తీస్తావుంటే కొండయినా కరిగిపోతుంది. తలా ఒక సెయ్యేస్తే సేదబాయేంది? - మాలాడ మొగ దల దిగుడు బాయే దివ్వెంగా ఎలిస్తింది. అయితే అడ సేదబాయే ఎలిసింది. లగ్గణం పెట్టిన యేళా యిసేసవేఁవో నాలుగున్నర మట్లకే నీళ్ళు పడ్డాయి. అవ్వి నీళ్ళుగాదు, గోయిం దొడ్డుకాడ రెడ్డోరి టెంకాయి తోపులో పక్కాని కొచ్చిన టెంకాయి నీళ్ళు!

పర్దేసిరెడ్డి మాలాళ్ళోనే శాందారం, బొక్కెన తెప్పించినాడు. సేతులారా తానే నీళ్ళు సేదినాడు. మొట్టమొదటి సారిగా దోసిడు నీళ్ళెత్తి గొంతులో పోసుకున్నాడు.

"పర్దేసిరెడ్డికీ జై" అనిందా గుంపు.

ఇట్లా శానా శానా మంచి పస్లుజేసి పర్దేసిరెడ్డా పాయికట్లో శాన ఎత్తు కెదిగిపోయ్‌నాడు.

తిత్తిలో రూక, దుత్తలో అయిందెం సెలవుగాకుండా తొట్టిబిడ్డను పెంచడంలో పర్దేసిరెడ్డికి పర్దేసిరెడ్డే సాటి.

అందుకే పర్దేసిరెడ్డి ఆ పాయకట్టుకు తలకట్టు.

ముత్తడయ్య ముకుందుడు, పోతా పోతా అదే అనేసి పొయ్‌నాడు.

"ఒరే అబ్బోడా! నా సీటెట్టా సెల్లుబడింది. సెల్లుబడ్డే సీటి సింపేయాల్సిందే! సింపేసినారు, నేను పోతావుండా. పోతా పోతా ఒక్క మాట్జెప్పి పోతా. మర్చిపోవద్దు. మా తాత ఈ పంచన్నే బతికినాడు. మీ తాతకూడా అంతే. తాత ముత్తాతల కాలం నుంచీ ఈ పంచనే నమ్ముకుణ్ణాం. పెట్టింది తిన్నాం. పోసింది తాగినాం. ముక్కు నొచ్చిందనీ, మూతి నొచ్చిందనీ మూల కుచ్చోకుండా వొళ్ళొంచి పన్జేసినాం. అట్టాంటి జలమాలు మనవి. రెక్కాడ్తేనేగదా డొక్కాడ్తుంది. అట్టాంటప్పుడు యాడయితే మనకేం?- యాడికి పోయ్‌నా రూపాయికి పదారణాలేగదా? అందుకే సెప్తావుండా, నీ తాత ముత్తాతల పేర్నిలబెట్టు.

ముత్తడు పేర్నిలబెట్టడఁవేగాదు పేర్దెచ్చుకుణ్ణాడు.

"ఓ యబ్బా వాడా ఆ యింటి కెప్పుడో ఋణపడుణ్ణాడు. పెండ్లీలే, పెటాకులూ లే ర్యేత్రీలే, పొగులూ లే! ఇల్లిడ్సి పెత్తేకయ్య. కయ్యోదిత్తే యిల్లు. వాడెమ్మను గొట్టా!- వాడి కేడుండాదో ఆ సెగితి. రాళ్ళతో పోరికలాడ్తా వుండాడబ్బా!"

ఆ ఊళ్ళో యేనూట విన్నా యీ మాటే!

ఊళ్లోవాళ్ళు ఉత్తుత్త మాటల్తో ఉబ్బిస్తే పర్దేసిరెడ్డి పాణంలో పాణంగానే సూసుకున్నాడు.

ముందు మడకపట్టి అడుసు మడిలో పొద్దు నడిమిట్టకెక్కే దాకా ముత్తడు మడక దున్తాడు. కూడేళ దాటిపోతా వుందని ఎనక మడకలోళ్ళు యేడస్తావుంటే— అప్పుడు మడకలిడ్సి పెడ్తాడు. ఎద్దల్ని కడగతాడు. వాటిని సుతారించి, గాట గట్టి మేతంతేసి— మల్లా పార సేతికెత్తుకుణ్ణాడంటే వంచిన్నడు వెత్తకుండా అడుసు మడిలో అంద గొడ్తా వుంటాడు. పొద్దునడ మిట్టన యిర్సక పడ్తా వుంటింది. పర్దేసిరెడ్డి పంచె పైకెత్తిపట్టి గెనిఁవిలమింద గవునూరు మాదిర వస్తా వస్తా వుండి ముత్తణ్ణి జూసి నిలబణ్ణెట్టు నిలబడతాడు.

"ఒరె నీ యమ్మను గొట్టా! నీకు సెప్పి సెప్పి నోరు బోవాల్సిందేరా?

ఇప్పుడే వేఁని కొంపలంటక పోతా వుండాయని? - ఇయ్యేరవదాకా మడక దున్ని నావు గదా? ఒళ్ళట్టా కడుక్కోని, కడుపుకంత కొట్టుకోని, ఒకొక్క కొరికినంత సేపట్లా వాలబడి మల్లా గావాలంటే అంద గొట్టేదే గాదు— అడివి మిదంబడి ఆకంతా దెచ్చి అడుసు మడికేసి తొక్కితే మాత్రం నేనొద్దంటానా?....దేనికైనా వొక అద్దూ అపూ వుండాల్రా!"

దున్నిన అడుసుకంటే మెత్తంగా వుంటాయి మాటలు!

అప్పుడడుసు మడిలో వుణ్ణెట్టనుకోడు ముత్తడు. వన్నీటి మడుగులో మునిగి తేల్తున్నట్టు మురిసిపోతాడు.

ముత్తడు దినవూ తొలికోడి కూతకు ముందే నిద్దర లేస్తాడు. కొట్టంలో ఎద్దల్ని యీపుదట్టి లేపుతాడు. కుడితి నూపతాడు. ఎద్దల పగ్గాల్నొక సేతపట్టి, బావా మోకు బుజానబెట్టి కానబాయిలో కబిల కట్టే దానికి బయల్దేర్తా వుంటాడు. ఒక్కంట యిదంతా గెవనిస్తానే వుంటాడు పర్దేసిరెడ్డి. అయినా కడపదాటే టప్పుడు "ఒరే ముత్తా!" అని మెత్తంగా పిలస్తాడు.

ముత్తడొక్క సెణం నిలబడతాడు.

"అది గాదురా నీయమ్మా బడవా! నీకు నిద్దర పట్లేదని అందరికీ నిద్దర పట్లేదనుకుంటే ఎట్లారా? ఇయ్యేరవకాడ గంగా బవాని నిద్దరపోతా వుంటిందిరా! నిద్దరపొయ్యే సల్లని తల్లిని లేపితే కోపగించు కుంటుందిరా."

పాసి నోటితోనే పక్కంగా పలకతాడు పర్దేసిరెడ్డి.

"ఇన్ని దినాలు కోపగించుకోని గంగమ్మతల్లి యిప్పుడు మాత్రం కోవ గించుకుంటిందా? ఈయన్నంతా యిచ్చిత్రం పచ్చిపుల్సు! యీ గిలు తాళింపు" అని గొణుక్కుంటూ ముత్తడెలబారతాడు.

"సరే పోరా పో!....సెప్తే యినిపించుకునే జలమ్మయితే గదా నీది!" అని నిట్టూర్పులు నిగిడిస్తాడు పర్దేసిరెడ్డి.

అట్టాంటి పర్దేసిరెడ్డి ఎడం కాల్తో ఎదరొమ్ము మిందెగిరి తన్నాడు.

ముత్తడి కిప్పుడు యాభై యేండ్లకు పైబడింది. గోసిసేత పెట్నాక్కాదు గానీ పెట్టక ముందునుంచీ వాళ్ళమ్మ కొంగు పట్టుకోని ఆ యింటావరణలోనే తిరిగినాడు.

వాళ్ళమ్మ పొయ్యింది. పసుపూ కుంకంతోనే పొయ్యింది. పుణ్యాత్తురా లన్నారు. ఆ తరవాత అయ్య సెయ్యి పట్టుకోని తిరగలేదు కానీ, సేతికి సెయ్యందించినాడు. సేతికి సెయ్యిడిసిపెట్టి అయ్యా పొయ్నాడు. కానీ, తాను మాత్రం పర్దేసిరెడ్డి సెయ్యొదిలి పెట్లేదు.

దీనికిదా ఆ పెద్దమణిసి సేసినుపకారం?

ఇదంతా అట్టాపోనీ! ఆ పొద్దు. గాంధీ పుట్టిన్నాడంట. తాను కల్లోకూడా అనుకోలా. ఇంటి ముందర ఊరంత పందిలేసె. పాయికట్టు పాయికట్నంతా ఆ పందిలి కింద కుచ్చోబెట్టె, అయిద్రాబాద్ నుంచి ఎవురో మంత్రంట. ఆయన్ని పిలిపించె. పెనువూర్నుంచి పిచ్చయ్యశాత్రుల్ని, పిల్లయ్యోర్ని యిద్దర్నీ పిలిపించె. ఇదంతా ఎందుకో? ఏఁవో? అనుకుంటావుంటే – పెళ్ళో సలసలా కాగే నీళ్ళు సూపించి తలంటుకోని తలకడుక్కోరా అనె. మల్లిపూవు మాదిరుండె పంచ తెచ్చిచ్చి కట్టుకోరా అనె. అయిన్జెప్తా వుంటె తాను గంగిరెద్దు మాదిర సెప్పిందంతా సేసె. ఆమింద ఏటాయె? నేరుగా అంతమంది ముందరికి తీసకపొయ్యి మంతిరి ప్రక్కన కుర్చీలో "కూర్చోరా!" అనె. లోబిరికి ఎలిబిరిగ్గా ఎనక ముందాడ్తావుంటే గదఁవాయించె, మింగలేక కక్కలేక మినకతానే కుర్చుండె. తన ప్రక్కనే దొరబిడ్డ మాదిర తయార్జేసి గాంధీరెడ్డిని కుచ్చోబెట్టె. పాయికట్లో జనఁవంత ఊపిరి బిగబట్టి సూస్తావుండ్రి. అప్పుడు పర్దేసిరెడ్డి పైకి లేసె!

"మహాజన్లారా! ఈ పొద్దు మనకొక పండగ దినఁవు. ఎందుకంటే– యాణ్నో ఒక మూలగాని మూల్లోవుండె పల్లె మన్ది. బస్సు రావల్లంటే కష్టం. బండి పోవల్లంటే యిబ్బంది. ఈటన్నిట్నీ తట్టుకొని ఎన్నో పన్లుంటే ప్రక్కన పెట్టుకోని మంత్రిగారు మనూరి కొచ్చినాడంటే అది మన బాగ్గెం!"

అట్లంటా మంతిరి మెళ్ళో పూలదండేస్తా పర్దేసిరెడ్డి చేతులు తట్నాడు. పొలోమని పందిలికింద జనఁవంతా సేతులు తట్నారు. పందిలి పైకి లేసీ పోతుందేఁవో? అనిపించింది.

పర్దేసిరెడ్డి మల్లా అందుకున్నాడు :

"మహాజన్లారా! మీ కందరికి తెల్సు ఈ పర్దేసిరెడ్డేం పన్జేసినా పది మందీ సెబాసనేటట్టుగా సేస్తాడని. నాకు తెల్సు యిప్పుడు మీరంతా శానా ఆశ్చర్యపడ్తా వుండారని. ఇంకొక పక్క శానా యిశారపడి పోతుండారని! ఎందుకంటే ముత్తడు నా యింట్లో సేద్దిగాడు. మీ కండ్లకి పాయికట్టులో ఈ దొక మాలోడు అంతే! అంతకు మించేఁపీఁలేదు. అట్లాంటోణ్ని యీ పొద్దీ యేదిక మింద మంత్రిగారి పక్కన కుచోబెడ్తే అప్పటికీ పాయికట్లో నాయం బతికినట్టా? సచ్చినట్టా? ఇంక మేఁవంతా ఎట్లా మొకాలెత్తుకుని తిరుగులాడల్ల అని మీరంతా ఆలోసిస్తా వుండచ్చు. కానీ మహా జన్లారా! నేను మనవి జేసే దేఁవిటంటే – గాంధీ మహాత్ముడేం జెప్పినాడు? మాలోళ్ళు కూడా మనుసులేరా! వాళ్ళల్లో కూడ మన్లో వుణ్నట్టే రగత మాంసాలుంటాయిరా! అన్జెప్పలేదా? మీరే సెప్పండి. ఈ

పొద్దు యిందిరమ్మ యేఁవంటా వుండాది? వాళ్ళున్నంత కాలఁవే మకకాలఁవంటా వుండాది. పెద్దోళ్ళాక మాటజెప్తే జెప్పిందానికంటే ఒకాకు ఎక్కువగా మనం నడ్చుకున్నప్పుడే మనం గొప్పోళ్ళఁవుతాఁవు. ఇంతకు నేన్జెప్పొచ్చే దేఁవిటంటే– ముత్తడి తాత.... వాళ్ళ తాత – వాళ్ళ తాత ముత్తాతల కాలం నుంచి నా పంచన్నమ్ముకొని బతికినారు. ముత్తడు నా యింటి బిడ్డ. 'మంచి గుడ్డ కట్టుకోరా!' అంటే– మట్లో పొల్లాడే వోడికి నాకెందుకంటాడు? యాళకింత కడుపునిండా కూడు తిన్రా! అంటే– యిదింకా యిచ్చిత్రంగా వుండాదే? తినకుంటే బతికేదెట్టా? పన్జేసేదెట్టా? అంటాడు. 'పోసి పెండ్లి చేసుకోరా' అంటే – నేసుకున్నోళ్ళంతా అనబవించే సుకం కండ్లకు కనిపిస్తానే వుండ్లా!' అని దీర్గాలు తీస్తాడు. ఇప్పుడు వాడికి యాభై యేండ్లకు పైబడింది. సెప్పిన మాటిని పెండ్లి పెటాకులు నేసుకోని, వాడూ వొకింటివాడనిపించుకోనుంటే వాడు కద్దు. వాడి సంసారం కద్దు. ఇప్పుడు దీనికంతా అవసరం వుండేదే గాదు. వాడు పుట్టి బుద్దెరిగిన నాట్నుండి ప్రెతి సెమట బొట్టూ ఈ యింటికి దత్తం చేసినాడు. ఇంట్టాటోళ్ళు యే నూటికో, కోటికోగాని ఒక్కరుందరు. వాడికి కడుపులో పుండ్లు లేవు. పాలుమాలిక వొంటిమింద లేదు. నేనా?.... ఈ పొద్దో రేపో? ఎవుర్జూసినారు. నా తదనంతరం యీడు బాధపడగుద్దు. కాలూ సెయ్యి వుడిగిన కాలాన నూసే దిక్కు లేక వాడు యాతన పడగుద్దు. అందుకే వాడికి ఋణం తీర్చుకునే దానికి నాకు ఒక్కటె ఒక్క మార్గం తోసింది!"

గుండెల్నిండా గాలి పీల్చుకుంటా ఒక నిమిశం మౌనంగా వుణ్ణాడు పర్దేసిరెడ్డి. పందిలి కింద జనం కంటి మింద రెప్ప పడకుంఠా నూస్తావుండారు.

"నా పెద్ద కొడుకు గాందీరెడ్డిని ముత్తడికి దత్తత చేస్తున్నాను."

పర్దేసిరెడ్డి నోట్లో మాట నోట్లో వుండంగానే మంత్రిగారే నేతుల్దట్టే కుందికి గొత్తిదాటు సప్పట్లతో మిన్నిరిగి మింద పణ్ణట్టయింది.

పెనుఁవూరు పిచ్చయ్య శాస్త్రులు, పిల్లయ్యోరు యిద్దరూ గుక్కతిప్పకోకుండా సదివిన మంత్రాల్నే తిప్పించి మల్లించి తెగ సదివేసినారు. అంతమంది మహాజను లక్కడుండగా అకాశవేణి సాచ్చిగా, బూఁవమ్మ సాచ్చిగా, ఏడుగురు అక్క దేవతలు సాచ్చిగా 'గాందీరెడ్డి ముత్తడి దత్తత కొడుకు' అంటా గాందీరెడ్డి నేతుల్ని ముత్తడి నేతుల్లో పెట్నాడు.

మల్లా ఒకసారి మంత్రిగారు నేతుల్దట్టే కుందికి పాయకట్టు పరవశించి తట్టింది.

గాందీరెడ్డి వొంగి ముత్తడికి దండం పెట్టా వుండాడు.

ఆ మద్దేణం పర్దేసిరెడ్డి గారింట్లో మస్తుగా తాగి, సుష్టుగా తిని మంత్రి గారు తన దోవన తాను పొయ్నాడు.

"మణిసంటే పర్దేసిరెడ్డిరా మణిసి! .... సెయ్యించుకున్నంత శాకిరీ సెయ్యించుకున్నాడు. ఆ శాకిరీకి తగినట్లుగా కొడుకునే దత్తు కిచ్చేసినాడు. మణిసంటే అట్టుండాల. మణిసికట్టా మణుసుండాల అయ్నా ఆయన్జేసిన పన్లకు ఏలెత్తి సూపించే దాని కెవురివల్ల అవుతుందిలే?"

"ఒరే అబ్బోడా! పెద్దోళ్ళుజేస్తే పెర(వాళ్లు జేసినట్టు. అదే నువ్వూ నేన్జె సుండేనా ఎంత మందెంత దుమ్మెత్తిపోసేవోళ్ళో నెత్తిమింద!"

ఒక ముసులోడి నసుగు.

"ఎంత దుమ్మెత్తిపోసినా ఆ బట్టతల మీంద నిలబడ్డులేరా ముసిలోడా! నువ్వెందుకు దున్నపోతు దున్నిసస్తే పిడుదుమాది రొగిస్తావ్?"

ముసిలోడి మింద కుర్రోడి యిసురు!

పర్దేసిరెడ్డే(వీ పసిపిలగాడు గాదు. అయినేం జేసినా దానెనకెంతో కతుం టాది. మన(విట్లా మాట్లాడుకునేది కుక్కల కాట్లాటే!"

ఆ ఊళ్లో తలకొక్క తీరుగా యిట్లా అనుకుంటానే వుండారు. ముత్తడు గాందీరెడ్డికి తానే అయ్యనని తిరగతా వుంటాడు. నెల తిరక్కముందే గాందీ రెడ్డి ఢిల్లీలో పై సదువులకని పయాణం కట్నాడు.

ఊరి ముందర కానబాయి గెడ్డమింద కానగ సెట్టొకసారి అకురాల్చి పూత పూసింది. పంట ఒబ్బిడయింది. ఒకనాడు పర్దేసిరెడ్డి వసారాలో వాలు కుర్చీమింద కుచ్చోనుంటే — ముత్తడు తల గీరుకుంటా ముందు నిలబడ్డాడు.

"ఏ(విరా ముత్తా?"

"ఏ(వీ లేదయ్యా!.... మాకు బూ(వులిస్తా వుండారిని ఒకయిదెకరాలు నామింద పట్టాజేసి పెత్తిరి గదా?...."

"అవును!"

"ఎవురి బతుకులేం శాశ్వితం?....ఉణ్ణిట్టుంది పోతే లేనిపోని బెడదెందుకు? ఆ అయిదెకరాలు అబ్బయ్య పేర రాసి పెట్టేయండి. నా సొత్తు నా తరవా తయినా ఆయనకే గదా సెందుతుంది!"

ఇల్లెగిరిపొయ్యేటట్టు యిరగబడి నవ్వినాడు పర్దేసిరెడ్డి. నవ్వతావుంటే పొర పొయ్యింది. పొరబొయ్యేకుందికి దగ్గొచ్చేసింది. అన్నిటినీ తమాయించు కొని—

"ఇప్పుడి దే(వి అరకపోతా వుండాదని ఆ పన్జెయ్యల్ల. కయ్య పక్కన

కయ్య. ఆ కయ్య సేస్తావుండేదీ నువ్వే! తెచ్చి యింట్లో పోస్తావుండేదీ నువ్వే!– ఎవరి పేర్తో వుంటే యేఁవిప్పుడు? .... అయినా సెప్తే యినే జలమ్మయితే పరవాలే! .... అట్నే బో! నీ యిష్టం కాదనేదెందుకు;"

అయిదెకరాల కయ్య అబ్బయ్య గాందీరెడ్డి పేర రిజిస్టరై పొయ్యింది.

ఊరి ముందర కానబాయి గెడ్డమింద కానగసెట్టు మూడుసార్లేఁ వో ఆకురాల్చి పూత పూసింది.

గాందీరెడ్డి కలేకట్రయి ఆ ఊళ్లో అడుగుపెట్టేకుందికి అందరి మొకాల్లో పువ్వులు పూసినాయి.

ముత్తడు ముత్తన్నయినాడా ఊరోళ్ళకు!

"ముత్తన్నా! ఇంక నీకేవన్నా? నీ కొడుకు కలేకటరు కదన్నా! ఎప్పుడన్నా యేదన్నా పనీ పాటుండొస్తే అట్టా పలకరించన్నా!"

కయ్యాగాలవ దగ్గిర ఎదురు పడ్తేసాలు ఊళ్లో సిన్నోళ్లు పెద్దోళ్ళు యిదే మాట!–

ముత్తడు మెలికలు తిరిగి పోతావుండాడు.

ఆ పొద్దు – పొద్దట్లా పొయ్యి మొలిస్తే గాందీరెడ్డి ఎల బారిపోతాడు– ఎల బారి పోకముందు ఒక్కసారైనా తన బిడ్డకు మణుసారా కావిలించుకుందా వఁని ముత్తడి మునాస. ఊళ్లో వాళ్ళంతా వొచ్చి పూలదండ్లేస్తావుంటే చూస్తా పులకరించి పోయ్నాడు. కావిలించుకుంటావుంటే కంట తడి బెట్నాడు. తానూ కావిలించుకోవాలనుకున్నాడు. ఎందుకో జంకినాడు. అందుకే సఁవయంకోసరం ఎదురు సూస్తా వుండాడు.

పొద్దు నడిమిట్ట నుండాది. అబ్బా కొడుకు ఎదురెదురుగా కూచ్చోని ఏందో మాట్లాడుకుంటా వుండారు. అదే అదుననుకున్నాడు ముత్తడు.

ఉఁహూ! ఎంత సతపోర్నా తెంపు రాలా.

నేతిలో సెయ్యిబెట్టి 'నీ కొడుకును!' అనింది గ్యాపకం చేసుకున్నాడు. పాయికట్టు పాయికట్టంతా నేరుంటే అందరి ముందర వొంగి దండం బెట్టింది తల్చుకున్నాడు. యాదలేని గుండె నిబ్బరం దొరికింది.

ఒక్క మోపన యింట్లో దూరి గాందీరెడ్డిని కావిలించుకున్నాడు.

పర్దేసిరెడ్డి తోక తొక్కిన తాసు మాదిర పైకి లేసి ఎడం కాలతో ఎగి రొక్క తన్ను తన్నాడు.

ఎవుర్తో సెప్పుకోవాల్ల ఏఁవని సెప్పుకోవాల్ల? ఎట్లా మొక నెత్తుకోని తిరగల్ల? ఇంకి బతుకెందుకు బతకల్ల?

కానగసెట్టు బోదె నానుకొని కన్నీకటి పడేదాకా ముత్తడిట్టా సతమత మవతానే వున్నాడు. వాడి కొక్క దారీ తెన్నూ కనిపించలేదు. ఇంకా కడపలో కాలు పెట్లేదు. ఆ పాయికట్లో యింకెక్కడైనా పన్జెస్తా తలకాయెత్తుకోని తిరగ లేదు. సేతిలో వుణ్ణె అయిదెకరాల కయ్య — బంగారట్టా కయ్యీ సెయ్యి జారిపాయ.

ఇంకేం జెయ్యల్ల?

అట్టా యిట్టా జూసినాడు. బారడు దూరాన్నొక తీటపొద. సివుక్కున లేసి రొండు తీగిలు గుంజుకున్నాడు. ఆకు దుసేసినాడు. అట్టా యిట్టా జూసి నాడు. ఆ కన్నీకటి పడే యాళకాడ పురుగు మెదల్లేదు. గబిక్కని గుంత కుచ్చోని వొంక తీగిలో రొండు కాళ్ల పేర్చి కట్టేసుకున్నాడు. ఇంకొక తీగి కొన్నొక సేత్తో, యింకొక్కొన్ను నోట్లో పట్టుకోని తీగిను గిర గిరా తిప్పతా రొండు సేతులు ముడేసుకుణ్ణాడు. ఆ గెడ్డ మిందనుంచి అట్లానే బాయిలోకి దొల్లేసినాడు.

కలేక్టరు గాందీరెడ్డి ఆ మరసట్నాటి పొద్దున్నే ఎకాఎకిని ఎలబారి పొయ్‌నాడు.

గంగాబవాని ముత్తణ్ణి మూన్నాళ్ళు కడుపులో దాసుకునింది. ఆ మిందట దాసునేదానికి యిష్టంవేలేక పొయ్యిందో లేకపోతే ముత్తడు శానా గొప్పోడని లోకానికి సాటాలనుకుణ్ణిందో — పైకి నెట్టేసింది.

కానబాయిలో ముత్తడి శవం తేలాడ్తా వుండాది.

ఎవురి కంట పడిందో, యేంవో? ముత్తడు బాయిలోపడి సచ్చిపొయ్‌నాడు; ముత్తడు బాయిలో పడి సచ్చిపొయ్‌నాడు; 'అన్న సంగతి ముక్కాలు గెడిలో మూడూళ్ళకు ఆ తరవాత మూడు మూడారూళ్ళకు కడకు ఆ నాయికట్టుకంతా పాకిపొయ్యింది.

మంచోడి సావును మరణవప్పుడు సూడమన్నారు పెద్దోళ్ళు!

పాయికట్లో జనం పాయలు పాయలుగా వస్తా వుండారు. బాయిసుట్టు తిరగతా పర్దేసిరెడ్డి 'బొరో!' మని యేడస్తా వుండాడు. సేర్నోళ్ళందరూ యేడిక జూసేవోళ్ళు కొందరయితే ఎగజీదేవోళ్ళు కొందురుగా వుండారు, ఎవురూ ముందు పళ్ళా!—

పది మందిలో వణ్ణె పాంవయినా తప్పించుకుంటందేంవో గానీ, పదిమంది కంటబడిన శవాని కాగెతి పట్ట దీదేశంలో!

బండి కట్టె! — దబ్బా కిర్సనాలు!!.

ముత్తడి కాయం మూడు నిమిశాల్లో బూడిదయిపొయ్యింది!

* * *

నెల్నాళ్ళ తరవాత కలేకట్రు గాందీరెడ్డి నేరుగా కార్లోనే వొచ్చి వూళ్లోనే దిగినాడు.

బస్సు రావడానికి కష్టం బండి పోవడానికి కిబ్బందిగా వుండిన వూరిప్పుడు కలేకట్రుగారూరు, కారు రావడానికి తార్రోడ్డే పడింది.

గాందీరెడ్డి వచ్చీ రావడంతోనే పర్దేసిరెడ్డి యింటిముందర మల్లా ఊరంత పందిరేయించినాడు. పందిలి కింద సాపలు దుప్పట్లు పరిపించినాడు. ఒక మేజా ఎయ్యించినాడు. మేజా మింద మూడడుగులెత్తు ముత్తడి ఫోటో పెట్టించినాడు. ఆ ఫోటోకు సందిళ్లావు పూలదండేసినాడు. పక్కన దీపం స్తంబం పెట్టి ఒక్కసారిగా నాలుగొత్తు లెలిగించినాడు. సాంబ్రాణొత్తుల పొగ పందిరి కింద కుచ్చున్నోళ్ళతో సరసమాడతా వుండాది.

మేజాకు ఒక పక్క గాందీరెడ్డి యింకొక పక్క పర్దేసిరెడ్డి కుచ్చుణ్ణారు.

కలేకట్రే నేలమింద కుచ్చునే కుందికి ఊళ్ళోవాళ్ళు నోట్లో కీగలుపొయేది కూడా తెలియకుండా సూస్తా వుండారేం జరిగిందో అని!

గాందీరెడ్డి పైకి లేసినాడు. ఒకసారి ఊళ్లో వాళ్ళందర్నీ సూసినాడు. మల్లా మేజా వయిపు తిరిగి రొండు సేతులెత్తి ముత్తడి పటానికి మొక్కినాడు.

ఊళ్ళో వాళ్ళందరూ గాందీరెడ్డికి మొక్కినారు.

"నే నిప్పుడు కలెక్టరు కావచ్చు. ఇంకేవయినా కావచ్చు. కానీ నేను యిక్కడే మీ కండ్ల ముందర పుట్టినవాణ్ణి. ఈ నేల మీదనే ఆడుకున్నవాణ్ణి. ఇక్కడే పెరిగినవాణ్ణి. ఢిల్లీకి పాదుషా అయినా తల్లికి పిల్ల డే గదా?—మీ కండ్ల ముందరే నన్ను మా నాన్న ముత్తయ్యకు దత్తత చేసినాడు. ఆయన త్యాగ మూర్తి అనిపించుకున్నాడే కానీ, నా మాట ఆయనే గాదు మీరు కూడా మరిచి పోయినారు. దత్తు కొడుగ్గా నా కర్తవ్యాన్ని నేను నెకవేర్చలేకపోయాను. ఊరి పెద్దలుగా వుండి మీరు నాకా అవకాశాన్నివ్వలేకపోయారు. మా తండ్రి!— ఆయన బాధ ఆయనిది. అతని కుడి భుజ వే విరిగిపొయ్యింది. మీ కందరికీ తెల్సు పుట్టి బుద్దెరిగిన నాటి నుండి ముత్తయ్య మా యింటికి చేసిన సేవ, ప్రతి చెమట బొట్టూ మా పరం చేసినాడు. అటువంటి త్యాగమూర్తి పోయినపుడు ఏది మంచో? ఏది చెడో? నిర్ణయించే మన స్తిమితాన్ని కోల్పోయి వుంటాడు. మీరంతా ఏమైనట్లు? మీరైనా తగు నిర్ణయం తీసుకొని కాకితో కబురంపివుంటే రెక్కలు గట్టుకొని వచ్చి వాలేవాడిని. నా దత్తు తండ్రికి దహన సంస్కారాలు,

కర్మ క్రియలు ఈ చేతులారా జరిపి వుంటే ఆయన ఆత్మ ఎంతో శాంతించేది. ఇప్పుడు మీరే చెప్పండి? – ఆయన ఆత్మ శాంతిస్తుందా? ఈ కృతఘ్నుణ్ని క్షమిస్తుందా?"

ఆ పైన మాటలు రాక వల వల యేడ్చినాడు కలేకట్రు దొర!

"ఎంత పొరపాటు జరిగిపోయింది? ఎంత పొరపాటు జరిగిపొయ్యింద"ని నిట్టూరుస్తా వుండారు పందిలి కింద జనం.

ఏడస్తా వున్న కొడుకును చూసి ఏడస్తా పైకి లేసినాడు పర్దేసిరెడ్డి.

"ఒరె నాయినా! ముత్తడు శానా గొప్పోడు, ముత్తడు శానా గొప్పోడు. వాడి గుండికాయి గాదె గుండంత. నువ్వు పడే కాకిసోకం వాడి సెవిని పడ్తానే వుంటందిరా! నువ్వు పడుతున్న పశ్చాత్తాపం జూసి ముత్తడాత్మ శాంతిస్తుందిరా! తప్పక శాంతిస్తుందిరా! ముత్తడు గొప్పోడురా! గొప్పోడు!!"

అబ్బా, కొడుకులు ఒకర్ని నూసి యింకొకరు యేడస్తా వుంటే, ముత్తడున్నట్టుండి బాయిలో పడి ఎందుకు సావాల్నో ఆలోసించలేని ఎర్రి గుంపు. అబ్బా, కొడుకుల్ని నూసి 'అయ్యో పాపం' అని కంట తడిపెట్టింది.

అవును గదా మరి? సెల్లని కాసు గాందీరెడ్డి 'రిజర్వేషన్ పాస్‌పోర్ట్'తో కలేకట్రుని సేసిన ముత్తడు గొప్పోడు కాక యింకేంవవుతాడు?

* [ఆంధ్రజ్యోతి వారపత్రిక, 11-3-1983] *

# బంచరాయి

## బోయ జంగయ్య

ఆరేడొందల వరకు గడపలు వున్న ఆ వూళ్ళో ఎక్కువ మంది కూలి నాలి మీద ఆధార పడి బ్రతుకుతున్న వారే. నిజాముల పాలన ఎన్నో ఏండ్ల క్రితం అంతమైనా వాళ్ళ ప్రతినిధులు రామిరెడ్డి పటేలు రంగారావు దొర ఇంకా బ్రతికే వున్నారు.

ఎంతో పెద్ద గుడిని కట్టించగలిగిన ఆ పెద్దమనుషులు బడిని గురించి పట్టించుకోకపోవడం వల్ల ఆ వూరికి హైస్కూలు కూడ రాలేక పోయింది. అందుకనే ఆ వూరి బాలురు ఏడవ తరగతి కంటే ఎక్కువ చదవలేకపోతున్నారు. రావుగారి పిల్లలు, పటేలు పిల్లలు మాత్రమే పట్టణంలో చదువుతున్నారు.

రహదారి నుండి వూళ్ళోకి రోడ్డు లేదు. బస్సు రాదు. ఉన్న బండ్ల బాట కూడ సరిగలేని కారణాన ప్రభుత్వ అధికారు లెవ్వరు ఆ వూరికి రానే రారు.

ప్రభుత్వం మిగులు భూములను పంచాలంటుంది. ఆ వూళ్ళో ముప్పది ఎకరాల బంచరాయి రోడ్డు ప్రక్కమ్మటే వుంది. దాని మరో ప్రక్కన పడావు పడ్డ దేవాలయము, చుట్టూర తాటిచెట్లు. "ఆ భూమి దున్నుకుంటాము" అంటున్నారు ఆ

గ్రామ హరిజనులు. "అబ్బె వీలులేదు" అంటున్నారు దొర, పటేలు, ఇతర భూస్వాములు.

"ఏదో ఓట్లకోసం కాని, లేకపోతే వాళ్ళ కెందుకివ్వాలంట?" పటేలు.

"భూమినిస్తే ఓట్లు వేస్తారా! నీ పిచ్చి గాని, ఆ రోజు ఎవరు కల్లు సార కిస్తే వానికే!" దొర.

"అయినా బంగారం లాంటి ఈ భూమిని వాళ్ళకు ఇవ్వటం ఏమిటి, ఏ సవుళ్ళో చూపిస్తే పోలే!" పటేలు.

సాళ్ళ లేవు వల్ల కాదు లేదు. అసలు వాళ్ళకు భూ మెందుకంటా? గొడ్డూ గోదా లేని సన్నాసులు, వాళ్ళేమి పండించి చస్తారు. ఒకవేళ ప్రభుత్వం ఇచ్చినా ఎన్నాళ్లు! మళ్ళీ ఏ నొప్పికో, రోగానికో లేదా పెళ్ళికో కాకుంటే తాగుడుకో కుదువబెట్టరూ? ఆ తర్వాత తీసుకున్న డబ్బు కట్టలేక మనకు అంటకట్టక మానరు."

బంచరాయి చెలకలో హరిజనులు చెట్లు కొడుతున్నారని తెలిసి ఆపడానికి వెళ్ళుతున్నారా మహానుభావులు. వారి వెనక ఊళ్ళో జనాన్ని కులాల వారిగా లేపు కొస్తున్నాడు మస్కూరి మాదన్న.

"భూమి లేని పేదవాళ్ళకు మిగులు భూమిని పంచాలి! అనే కదా ప్రభుత్వం ప్రకటించింది! పేదవాళ్ళు అన్ని కులాలలోనూ వున్నారు. మరివాళ్ళ మాటేమిటి? వీళ్ళకు భూమి కావాలి—" రామిరెడ్డి చెపుతూ పోతున్నాడు. కరణం హఠాత్తుగ ఆగి, రామిరెడ్డిని రెక్కపట్టి దగ్గర లాక్కొని "ఈ మాట అక్కడ వాళ్ళ ముందు అనేవు గట్ట. వాళ్ళూ మాకు కావాలని కూర్చొంటారు."

"అందర్కి కొస్త కొస్త యిప్పిస్తే రేపు పంచాయితీ ఎన్నికల్లో నాకు తప్పక ఓటు వేస్తారూ అని—" రామిరెడ్డి.

"నీ ఓటు పాడుగాను! నీకు ఎన్ని ఓట్లు కావాలో నా మీద వదలిపెట్టు, నేను చూసుకుంటా. ముందు ఈ భూమిని ఎవ్వరిపాలు కాకుండా చూడు. రోడ్డు ప్రక్కల భూమి. ముందు ముందు ధర పలుకుద్ది. రేపు మన పిల్లలకు ఏ ఉద్యోగము దొరక్కపోతే, ఏదైనా ఇండస్ట్రీ, అఖరికి ఓ కోళ్ళ ఫారమైనా పెట్టొచ్చు లేదా కొన్నాళ్లాగి ప్లాట్స్ చేసి అమ్మితే పైసలే పైసలు కర్ణం తన ప్లాను బయటపెట్టక తప్పలేదు.

"ఇదిగో రామిరెడ్డి! ఎన్నికల్లో నిన్ను గెలిపించే భారం నాది. ఈ విష యంలో మాత్రం నా మాట వినను! నేను అన్నీ చూసుకుంటా" "సరే పదా" అంటూ ఇద్దరూ బంచరాయి చెలక వైపు నడిచారు.

అప్పటివరకే ఇంటికో మనిషి చొప్పున దాదాపు అరవై మందిదాక హరి జనులు చెట్టు కొడుతున్నారు. వాళ్ళ పిల్లలు, ముసలివాండ్లు ఆ చెత్తనంతా ఒక్కచోటికి చేరుస్తున్నారు. వాళ్ళ ఆడవాళ్ళు సద్ది గంపలతో వచ్చి, వాటిని గెట్ల మీద పెట్టి చెత్త కుప్పలకు నిప్పంటిస్తున్నారు.

కరణం, రామిరెడ్డి ఇద్దరు గెట్టు చేరే సరికి మస్కూరి వూరందరిని లేపు కొచ్చాడు. అందరు గెట్టు మీద నిలుచున్నారు. అంతవరకు చెత్తను కూడేస్తున్న ముసలివాళ్ళు కరణానికి, రామిరెడ్డికి నెత్తి రుమాళ్ళు తీసి దోసిలి పట్టుకొని వంగి దండం పెట్టారు.

"ఏం పాపిగా! ఎవరిని అడిగి ఈ భూమిలో చెట్టు గొడుతున్రు[ద]రా!"

"అదేంది దొరా! అందరి కెరుక నాయె, రామిరెడ్డి పటేలు గూడ దున్ను కొమ్మనే!"

"మా గోపాల్ — అదే రాజిగాని కొడుకు పట్నంలో హాస్టల్లో చదువు కుంటుండు. ఆడు తహశీలు దొరను అడిగి వచ్చిండట!" అందరిలోకెల్ల పెద్ద వాడు మల్లయ్య నసిగాడు.

"పటేలు దున్నుకొమ్మనడం, మీరు దున్నటం, మరి తహశీలుదారేమన్న పట్ట యిచ్చిండ? ముందు అందర్ని పని అపి ఇక్కడకు రమ్మను."

"మంచిది దొర! అరే ఓరి లింగయ్య, రంగయ్య, లచ్చయ్య - అళ్ళని దాని పని అపు[ర]రి. అందరు యిటు రా[ర]రి, దొర ఏదో చెపుతాడట" అని అందరిని పిలిచాడు మల్లయ్య.

అందరు వచ్చాక "ఏడి ఆ రాజిగాని కొడుకెక్కడ?" కరణం.

"ఆడు సమితి ప్రెసిడెంటెను కలిస్తానని పోయిండు, యింకా రాలేదు" మల్లయ్య.

"ఆ ప్రెసిడెంటు మిమ్మల్నీ ఈ వూర్నీ అమ్మే బాపతు. అయన మీకేమి ఒరగ పెడతా[ర]రా సన్నాసుల్లార. రేపు ఎలక్షన్స్ వస్తున్నాయని ఓ ఎత్తు వేశా డంతే" దొర.

"అయినా తర తరాల నుండి ఈ గూడెంలో ఎప్పుడు సాలు పెట్టలేదు. కొంద్రడ ఎయ్యను లేదు. ఇయ్యాల్ల మీరు గోసి పెట్టినా[ర]ర దీన్ని దున్నడానికి!"

కుడి చేత్తో దోతికొంగు పట్టుకుని ఎడమ చేతితో వాళ్ళను, భూమిని చూపిస్తూ, వెటకారం నిండిన గొంతుతో అంటున్నాడు దొర.

"మంత్రులొచ్చినప్పుడు ఏదో మాట్లాడుతుంటారు. మనవాళ్ళు వాళ్ళ తోక పట్టుకుని గోదావరి ఈదుతాం అంటారు" రాంరెడ్డి.

"చెప్పరేమిరా – మీ వూరందరికి యిష్టమేనా వీళ్ళు దీనిని దున్నుకోవడానికి?" కరణం అందరిని గద్దిస్తూ ప్రశ్నించారు. నెత్తిన వున్న గొంగళిని సంకలోకి కూర్చుకొని, పొడగాటి కర్రను ఆసరాగ పెట్టుకొని "గొర్లు జీవాలు, అటు ఇటు తిరిగొచ్చి కాస్త నిలబడకుండ ఊరి ప్రక్కన వున్న ఈ కాసింత భూమిని మీరు దున్నుకుంటే ఎట్లెద్ది....మరి మేమెటు పోవాలె" అంటు అడిగాడు వూరి పెద్ద గొల్ల వీరప్ప.

"అవును, అవును. ఈ మాట నిజం. పొలం తిరిగొచ్చి పశువులు పొద్దు గూకంగ కాసింత సేపు నిలబడడానికి జాగ లేకపోతే ఎట్లా?" అన్నారు రైతులు.

చాకలి చౌడుకోసం, కుమ్మరి మన్నుకోసం, ఊరన్నప్పుడు కొంత భూమన్న కాలిగా ఉండాలన్నారు.

అప్పుడే వచ్చిన ఆ వూరి పూజారి.

"ఇక దేవాలయం ఎన్నాళ్ళు అలా పాడుపడి వుంటుంది. దానికి మోక్షం లేదా? ఎదో ఆ దేవుడి పేర ఈ భూమిని పట్టా చేయిస్తే ఎవరన్న మహానుభావులు సేద్యం చేసిపెడితే, గ్రామ ప్రజలు తరుపున ఇంత దీపారాధన చెయ్యొచ్చు ఈ విషయం గూడ కాస్త ఆలోచించండి" అని ఓ దమ్ము నశ్యం పీల్చి నశ్యం అంటిన వేళ్ళ నుత్తరీయానికి తుడుచుకొన్నాడు.

అన్నీ విన్న కరణం, పటేలు గుస గుస మాట్లాడుకొని "ఏద్తి ఏమైనా పూజారి చెప్పినది వినదగ్గది. మన మందరం తగు ఏర్పాట్లు చెయ్యవల్సింది గూడ, ఏమంటారు?" అందరి వైపు చూస్తూ.

"మేము మాత్రం ఎలా కాదంటాము? దేవుడికి దీపారాధన వద్దంటామా?" అన్నారు అందరు.

హరిజనులు తప్ప మిగతా కులాలవాళ్ళు అందరూ సరేనని, ఆ భూమిని దున్నవద్దని హరిజనులకు మరీ మరీ చెప్పి వెళ్ళిపోయారు.

ఏం చేయాలో తట్టక కాలుతున్న కుప్పలను, వాటిని ఎగేస్తున్న పిల్లలను చూస్తూ నిలుచున్నారు.

* * *

హరిజనులు భూమిని దున్నారు.

హరిజనులు దున్నిన నాగలి చాలులో ఓ దేవుడి విగ్రహం బయటపడింది. ఆ విగ్రహం దగ్గర పూనకం వచ్చిన స్త్రీ కొల్పు చెప్పుతోంది. ఆమె చుట్టూరా జనం.

"ఈ భూమి దేవుడిది, అందుకని తర తరాల నుండి దీన్ని ఎవ్వరు

అతిక్రమించలేక పోయారు. ఒకవేళ ఎవ్వరైనా అలాంటి ప్రయత్నం చేస్తే దాని ఫలితం తీవ్రంగా వుంటుంది" అని పూనకం వచ్చిన అమ్మవారు చెప్పింది. ఆ మాటలనే దొరగారు పూరంత చాటింపు చేయించాడు.

రక రకాల మాటల మధ్యా, అంతుపట్టని అనుమానాల మధ్య ఆ దినం గడిచింది.

అర్ధరాత్రి దాటినాక హరిజనవాడ తగలబడుతున్న మంటలు. తట్ట, బుట్ట, చంటిపిల్లల్ని చంకనెత్తుకొని, ముదుసలివాళ్ళ రెక్క పట్టుకుని గుడిసెల్లో నుండి బయటపడి, తమ సర్వస్వం మంటల పాలై పోతుంటే చూస్తూ ఏడుస్తున్నారు.

అన్నీ పూరి గుడిసెలే. అందరూ నిద్ర నుండి లేచి, తాడు, బొక్కెన అనే లోపలినే మంటలు అంటుకున్నవి.

ఎన్ని ప్రయత్నాలు చేసినా మంటలేమి అదుపులోకి రావటం లేదు.

కోడిపిల్లలు, మేకపిల్లలు మొదలగు వాళ్ళ ఆస్తి అంతా క్షణంలో బూడిద అయింది. వూళ్ళో వాళ్ళందరూ మంటల్ని ఆపే ప్రయత్నం ఎంతో చేశారు. కాని ఆపలేకపోయారు.

హరిజనవాడ పూర్తిగా తగలబడి పోయింది.

దొర, పటేలు కర్మ సిద్ధాంతాన్ని విప్పి చెప్తున్నారు. దేవుడి భూమిని, దేవతా విగ్రహాన్ని కదుల దున్నినందుకే హరిజనవాడ తగలబడ్డదని పూజారి అన్నప్పుడు "ఔను" అన్నాడు దొర.

"నిన్న కొలుపులో చెప్పినది నిజమైనది!" అన్నాడు పటేలు.

"కాదు — అంతా అబద్ధం" అని గోపాలం అరిచినప్పుడు జనం అంతా అతని చూపుల వైపు, చూపుడు వేలు వైపు చూస్తున్నారు.

* [ 1984] *

# తొందరపడి ఒక కోడి ముందే కూసింది

ఆరవేటి
శ్రీనివాసులు

పొద్దు గూట్లో పడినాది.

యాడాడి పసులను తోలుకోని పిల్లకాయలు పల్లె మొగం పట్టినారు. రొంత ఎడంగా అప్పాయ పల్లె బస్సు నిండుమడిసి మాదిరి కదల్లాక కద ల్లాక వచ్చినాది. దా నెనకాలనే కొంపలు కాలితే పొగ వచ్చినట్లు తెల్లంగ దుమ్ము లేసినాది.

రొంత అట్ట నిలబడి మల్లా గసబెడతా పాయ అప్పాయపల్లె బస్సు. లేసిన దుమ్ము వలన బారతానే దిగినోల్లు కనబడినారు. అంతా ఎంచు కుంటే నలుగురుండారు. పసల పిల్లోల్లు వాల్లను జూసినారు.

"ఓబిగా! టౌనోల్లున్నట్లుంది రోవ్" అన్నాడు డింగిరి.

"అవు" అని తలూపినాడు ఓబి.

అడ్డ బాటెమ్మడి వచ్చి పిల్లోల్ల దగ్గరికి వచ్చి నారు వచ్చిన నలుగురు. సంకలో సిన్న డోలు మాదిరుండే వాయిద్యం, బొమ్మలాటోల్ల నారదుని మెడలో యాలాడే ఈనె మాదిరుండే వాయిద్యం. పసల పిల్లోల్లను కనికట్టు చేసినట్టు నిలబెట్టినాయి. వాయిద్గాలు ముగ్గురు మోచ్చాండారు. జుబ్బా ఏసుకోని సంకలో ఏలాడే ఎఱ్రసంచీ ఆ యప్ప రొంత బాగుండాడు.

"అబ్బీ! మేం కతలు జెప్పేటోల్లం. మీ వూరి వాడలో కత జెప్పాలని వచ్చినాం" అన్నాడు నలుగురిలో ఒకడు.

ఎర్రసంచీ ఆయప్ప ఏం మాట్లాడల్యా.

పిల్లకాయలు ఒకరి మొగాలు ఒకరు సూసుకున్నారు.

"హరిజనవాడకు దావ యిదేనా?" ఎర్రసంచీ ఆయప్ప అడిగినాడు.

"ఆఁ....! సక్కంగ కాలి బాటెమ్మడి పొర్రి" అన్నాడు ఓబి.

ముందు పసులు పోతాంటే ఎనకమ్మడీత పిల్లోలు, వాల్లెమ్మడీత వచ్చిన నలుగురు నడిసినారు. ఎర్రబల్లెకు రోంత ఎడంగా యిసిరేసినట్లుండాది హరిజన వాడ. అసలుర్లో అయిదునూర్ల గడపలయితే యిసిరేసిన హరిజన వాడలో వెయ్యి గడపలకు పైనే వుండాయి గుడిసెలు.

వాడలో అందరికీ తెలిసినోడు, రోంత టౌనుకు పొయ్యేవాడు గంజి వొక్కడే. వాడ్ని కలుసుకున్నార్యు కతలు జెప్పేటోల్లు.

"ఏం కతలు జెప్తారు?" అడిగినాడు గంజి.

"మీ కతలే" అన్నాడు ఎర్రసంచీ ఆయప్ప.

"మా కతలు ఏం బాగుంటాయి? బాలనాగమ్మో, కాంబోజరాజు కతో అయితే బాగుంటాది." గారపల్లతో యిగిలిచ్చినాడు గంజి.

ఎవరూ పలకల్యా.

"మంది యా వూరు? కతలు జెప్పే బతుకుతాంటారా?"

"అవు. మాది ఈ జిల్లానే. నా పేరు వెంకటేసు. నేను మాటలు జెప్తా. ఈ ముగ్గురూ కతలు జెప్తారు. ఈ పెద్దాయప్ప పెద్దిరాజు. ఈయప్ప వడిపిరాజు. ఈయప్ప సినరాజు" అన్నాడు ఎర్రసంచీ ఆయప్ప.

"అందరూ రాజులే!" గంజి మల్లా యిగిలిచ్చినాడు.

"కిరీటాలే లేంది!" అన్నార్యుడు పెద్దిరాజు.

అంతా నగుకున్నారు.

"కత జెప్తే మీకు లెక్కలు (డబ్బు) ఎట్ల?"

"మాకేం లెక్కలూ వద్దు. రెండు లాంతర్లు పెట్టియ్యండి. మీ జనాన్ని రమ్మనండి" అన్నార్యుడు వెంకటేసు.

"లాంతర్లు యాడుండాయబ్బా! సుబ్బారెడ్డి యింట్లో ఎన్నెల్లాంతర (పెట్రోమాక్స్ లైట్) వుండాది. ఇచ్చాడో, ఈడో...." నసిగాడు గంజి.

"అది యాలగానీ, బుడ్డీలుంటే సూడు. గబ్బు నూనెకు లెక్క మేమే యిచ్చాం" అన్నాడు పెద్దిరాజు.

రోంచేపట్లో వాడలో వుండే పిల్లా: పీసూ, ముసలీ, ముతకా అంతా దిగుడుబాయి కాడి బయలుకు జేరుకున్నారు.

కత మొదలయింది. పెద్దిరాజు శారద మీటతావుంటే యిద్దరు రాజులు గుమ్మెత్తల మింద అదరగొడతా వాయిచ్చాంటే అంతా వూగినారు.

కతలోకి దిగినాడు పెద్దిరాజు. నెహ్రూ అన్నాడు. గాంధీ అన్నాడు. యింగా యింగా శానామంది పేర్లు జెప్పినాడు. తెల్లోలు ఎట్టా రాజ్జెం చేసినారో, ఎంత మందిని జైల్లల్లో బెట్టినారో జెప్పినాడు. బగతు సింగనే ఆయప్ప శానా పెద్ద మొగోడన్నాడు. ఆయప్ప కత బాగా జెప్పినాడు. బగతుసింగు తెల్లోల్ల సేతల్లో అన్యాలంగా సచ్చినాడని పెద్దిరాజు రాగంతీసి ఏడ్చినాడు. గొంతు పొరపోయింది. నీల్లు అడిగినాడు.

జనం అంతా దిగులు పడినారు. 'బగతుసింగు అనే ఆయప్పది యింత కత వుండాదా? ఎప్పుడూ యినకపోతిమే' అని అనుకున్నారు.

పెద్దిరాజు నీళ్లు తాగి మల్లా కత ఎత్తుకున్నాడు.

సాతంత్రం వచ్చి ఏండ్లు గడిసినాయి. బీదోడు బీదోడుగానే వుండాడు. సావుకారు యింగా సావుకారయితాండాడని పెద్దిరాజు పాటెత్తుకున్నాడు.

పాటలో బూర్జువా .... దోపిడీ .... కరువు .... బూ పోరాటం .... అని వరసలు గట్టి పదాలు పాడినాడు, జనానికి అర్థమయినా గాకపోయినా తాలానికి వూగుతా యింటాండారు.

కానీ అర్థం జేసుకొన్నోడు ఒక్కడే ఒక్కడు. వాడు గంజి. వాడు వణికినాడు.

"యమ్మా ఈల్లు మామూలు కతలు జెప్పేటోల్లనుకుంటినే! ఎంత పనాయ! పొద్దన సుబ్బారెడ్డికి తెలుచ్చే సావుజంపులేనే" అనుకున్నాడు గంజి లోపల్లోపల.

గంజి ఆలోచనలోంచి బయటపడాలకల్ల జనం సప్పట్లు కొడతాండారు. గంజి అందర్నీ చూసి గొణుక్కున్నాడు — "ఎర్రినా కొడుకులు .... ఏం తెలిసిందనో సప్పట్లు కొడతాండారు" అని.

కత అయిపోయినాది. ఇంగ వెంకటేసు ముందుకు వచ్చినాడు. జుబ్బా రెట్టలు పైకి మడుసుకున్నాడు.

"పెజలారా! కట్టను — బట్టల్యాక తిన్ను తిండిల్యాక పెద్దోల్ల యినప కాల్ల కింద నలిగిపోయే ఎర్రి తమ్ముల్లారా! మీరంతా మేలుకోవాల. మీరంతా ఒకటి గావాల. ఈ భూమి మంది. ఈ నీల్లు మనయి. ఈ గాలి మంది.

నూర్లనూర్ల ఎకరాలు యీ పొద్దాల్లకు ఎట్లొచ్చినాయి? మనయే దండుకున్నారు. మనం దీన్ని ఎదిరిచ్చాల. దున్నేవాడిదే భూమి అని జెప్పాల. అట్ట జెప్పాలంటే ....ఒకరుగా జెప్పలేం .... అందరం కలసి అరసాల!" అన్న్యాడు వెంకటేసు.

జనం ఆనందంగా అరిసినారు. సప్పట్లు కొట్టినారు. గంజి అందరిని తేరపార జూసినాడు.

వెంకటేసు గొంతు సరిజేసుకొని మల్లా ఎత్తుకున్యాడు. "ఇప్పుడు మీ వూరే జూసుకోండ్రి. మీ బతుకుల్నే జూసుకోండ్రి. కడుపునిండా సాలినంత తింటాండారా? ఒల్లు దాసుకోను బట్ట సాలినంత వుండాదా? కంటినిండా యా పొద్దయినా కునుకు దీసినారా? తీయలా! మిమ్మల్నందరిని సుబ్బారెడ్డి కూలోల్లను జేసినాడు. సుబ్బారెడ్డి యినప పాదం కింద మీ బతుకులు నలనక పోతాండాయి. నూర్ల ఎకరాలు ఆయప్పకు యాడియి? ఎట్లొచ్చినాయి? టౌనులో సినేమాటెంటు, లాడ్జింగ్, ఓటలు – ఇయన్ని యాడియి? ఆయన్ని మీ సెమటే, మీ సెమట నంతా లెక్కజేసుకొని ఆయప్ప కులుకుతుండాడు. సుబ్బారెడ్డి బూటకాసురుడు, బూర్జువా, దోపిడిదారుడు. పెట్టుబడిదారీవాల్ల తొత్తు. కాదంటే మిమ్మల్ని సంపుతాన. సంపినా ఆయప్పను పోలీసోల్లు ఏం జేసుకోలేరు. ఎందుకంటే ఆయప్ప దగ్గర సందాలు తీసుకొన్నోల్లే అయిదరాబాదులో వుండారు. ఢిల్లీలో వుండేవాల్లు అయిదరాబాదోల్ల మాటగాదని యాడికీ బోరు. అందుకని ముందు-మనం సుబ్బారెడ్డి అట్టాటోల్ల దోపిడీదార్లను ఎదిరిచ్చాల. ఈల్ల యినప పాదం కింద బడకుండా మన బతుకుల్ని మనం కాసుకోవాల. అంటే దానికి మనం ఏం జేయాల."

వెంకటేసు పూనకం వచ్చినోడి మాదిరి వూగి వూగి మాట్లాడతా వుండాడు. ఉపన్యాసకం యింగా పోతానే వుండాది.

సుబ్బారెడ్డి మాట ఎత్తాలకల్లా జనం గుండెల్లో రాయి బడింది. మెల్లంగ ఒకడొకడే లేసి ఎల్ల బారబట్టినారు.

వెంకటేసు సెప్పాల్సిందంతా సెప్పి ఉపన్యాసకం ముగిచ్చినాడు. అందరూ పోంగా గంజి మిగిలినాడు. ఎండిపోయిన మునగ సెట్టు మీద గుడ్ల గూబ కూసింది.

"ఛూ!" అన్నాడు గంజి.

"ఏం వెంకటేసు, గుమ్మెత్తలు, శారద కట్టిపెట్టాం" అన్న్యాడు పెద్దిరాజు.

"కట్టెయ్!"

గంజి లేసినాడు. బుడ్డి దీపంతో బీడీ ముట్టిచ్చుకోని బుడ్డిని ఆర్పినాడు నోటితో వూది.

"అయ్యోవ్! మీరేందో బుర్ర కతలు జెప్పేవాల్లనుకున్నాప్య. బుర్రలేతీసే వల్లనుకోల్యా. బెరీన యీడ్నుండి ఎల్లబారండి. సుబ్బారెడ్డికి తెలిచ్చే మిమ్మల్ని సింత సెట్లకు కట్టేసి సోలకాలతో కొట్టిచ్చాడు!" అని ఆడ్నుంచి బుడ్డితో గబ గబ పోయినాడు గంజి.

వెంకటేసు నగినాడు, పెద్దిరాజు కూ్కడా నగొచ్చింది.

అది సూసి సిన్నరాజు అన్నాడు. "మల్ల నగుదురు లేబ్బోవ్. పొట్టలో పేగులు అరుచ్చాండాయ్! ఇంత సంకటేమన్నా"

"సంకటా? సుబ్బారెడ్డిని తిట్టినాంక యింగ సంకటి మనకు పెట్టి ఈడ సంసారం చేసేవాడుండాడా?" నడిపిరాజు అన్నాడు.

"అంతేలే పార్రి. పక్క పల్లెకు బోయి ఆడ ఎవర్నన్నా అడుగుదాం" అన్నాడు పెద్దిరాజు.

డబ్బా- దవాలు ఎత్తుకున్నారు నడిపిరాజు, చిన్నరాజు.

మునగసెట్ల మిందనుండి గుడ్లగూబ ఎగిరింది.

నల్లని ఆకాసం తెల్లని సుక్కలతో బియ్యపిండి ఎగజల్లి నట్లుండాది. నలుగురూ నాలుగడుగులు ఏసినారో లేదో అయిదుగురు మడుసు లొచ్చినారు. సేతల్లో వాల్ల ఎత్తును మించి కట్టె లుండాయి. ఒకని సేతిలో బాటరీ లై టుండాది.

"కతలు జెప్పేటోల్లు మీరేనా?" అడిగినాడు బాటరీ లైటోడు.

"అవు."

"సుబ్బారెడ్డి పిలుచ్చాండాడు. రార్రి" అన్నాడు బాటరీ లైటోడు.

నలుగురూ ఒకర్నొకరు బిత్తరకపోయి సూసుకున్నారు.

"సుబ్బారెడ్డి ఎందుకు రమ్మన్నాడబ్బా?" మెల్లంగ గొణిగినాడు పెద్దిరాజు.

"ఇంగెందుకు సింతసెట్టుకు కట్టేసి సోనకాలతో...." ఇనపడీ యినపడనట్లు గొణిగినాడు నడిపిరాజు.

వెంకటేసు — "పోదాం పార్రి" అన్నాడు. అందరూ నడిసినారు. నడుచ్చాంటే గుడిసెల్లోంచి, తడిక వాకిలి బొక్కల్లోంచి, మట్బుల్లోంచి జనం చూసినారు. "యమ్మా! కతలు జెప్పేవాల్ల కత అయిపాయనే" అని అనుకున్నారు.

ఇసిరేసిన వాడ దాటి అసలూర్లోకి అడుగు పెట్నారు. నల్లదుమ్ము ఎగ రేసినట్లు సీకటి. ఆ సీకట్లో సుబ్బారెడ్డి యిల్లు పెద్ద దెయ్యం మాదిరుండాది మూడంతచుల మాడీ సుట్టుపక్కల పదారు పల్లెల్లో యాడా లేదు.

అరుగుమింద పరిసిన పరుపు మింద పండుకోండాడు సుబ్బారెడ్డి. వచ్చి నోళ్ళని జూసి తలెత్తినాడు. సగం పండుకోని మోర ఎత్తి జూసినాడు.

రెండు మూడు గొర్రెలను, నాల్గయిదు పొట్టేండ్లను పట్టి కొట్టి సంపి దాన్ల పచ్చి రకతం ఎగబీల్చి తాగి, గట్టి గట్టి కండలను పీల్చి దిగమింగి, నీల్ల కుంటలో కైపెక్కి సల్లంగ పండుకున్న పెద్ద పులి మాదిరుండాడు సుబ్బారెడ్డి.

దూరంగా వరండాలో గాలికి అట్ల యిట్ల ఆడతావుంది యాలాడదీసిన బుడ్డిదీపం. ఆ గుడ్డి ఎల్తురలో సుబ్బారెడ్డి కల్లు నిప్పుల మాదిరుండాయి. మెలిబెట్టిన మీసాలు పిడిబాకుల మాది రుండాయి. ఇకారంగా పెరిగిన ఎంటికలు తెల్లంగ ....నల్లగ .... సింగం జూలు మాది రుండాది.

"కతలు జెప్పేటోల్లు మీరేనా?" అన్న్యాడు సుబ్బారెడ్డి.

"మేమే!" వెంకటేసు పలికినాడు.

"యా వూరు మంది?"

"ఈరన్నగట్టు పల్లె."

"ఈరన్నగట్టు పల్లా? ఎవరి యిలాకా?"

"మబ్బుగారి వెంకటరెడ్డి కొడుకును."

"ఎంకట్రెడ్డి కొడుకువా? నీ పేరేంది?"

"వెంకటేసు."

"అదేం దిబ్బి! ఎంకటేస్సరరెడ్డిగాదా?"

"పేరులో కులం సెప్పుకోడం యిష్టంల్యా. అందుకే రెడ్డి తీసేసుకున్న్యా" అన్న్యాడు వెంకటేసు.

"కులం జెప్పుకోడానికి బిగినయితే ఎట్లబ్బి?"

వెంకటేసు బదులు ఈల్యా.

"సరే .... పొద్దు బోయింది. ఏమన్నా తిన్న్యారా?"

ముగ్గురు రాజులు బిత్తరపోయినారు.

"తినల్యా" ఆకలిమిందున్న చిన్నరాజు అన్న్యాడు.

"బువ్వ తినిపోర్రి. రేయ్! యీల్లకు యిచ్చరాకు లేసి వడ్డింది." గట్టిగ అరిసినాడు సుబ్బారెడ్డి.

కాల్లు కడుగుకుంటా "సింతసెట్టు .... సోలకాల...." అని గొణిగినాడు నడిపిరాజు.

"సణిగాకురా. బువ్వ పెట్టి మల్ల కొడతాడేమో!" అన్న్యాడు పెద్దిరాజు.

"ఏమన్నా గొట్టనీ. ముందు కడుపు నిండా తిందాం" అన్నాడు చిన్న రాజు.

శెనిక్కాయల ఊరుబిండి, ఎన్నవూస, చెన్నంగి, బియ్యం కూడు చిర్నాలికలు తగిలేట్లు తిని మజ్జిగన్నంతో లేసినారు.

"పండుకోర్రి .... పొద్దన మాట్లాడదాం" అన్న్యాడు సుబ్బారెడ్డి.

అందరి గుండెల్లో గుబులు. సుబ్బారెడ్డి కతేందో అర్థంగాలా.

"సీకట్లోనే బోవాల." మెల్లంగ అన్న్యాడు వెంకటేసు.

"అట్లనే." లేసి బోయినాడు సుబ్బారెడ్డి.

"ఏందోబ్బా! సుబ్బారెడ్డి కత? తిట్టినోల్లను కొట్టకుండా తిండి బెట్టినాడు. పొద్దనేమన్నా జనాన్ని పిలిసి పంచాయితీ బెట్టిచ్చి, సింతసెట్టుకు కట్టేసి...." అన్న్యాడు పెద్దిరాజు.

"పులి నోట్లో తల బెట్టినాము. పండుకోండి ఎట్లయితే అట్లయితాది" అన్న్యాడు నడిపిరాజు.

"జనం కోసం బతకాలనుకున్నోల్లు యిటాటిదాన్లకల్లా భయపడతె ఎట్ల?" అన్న్యాడు వెంకటేసు నగుతా.

అందరూ నిద్రపోయినారు.

మసక సీకట్లో లేసి కాలువకుబోయి అన్నీ ముగిచ్చుకోని, యాపపుల్లతో పండ్లు తోముకోని, వచ్చాలకల్లా, వుప్పపిండి పొగలు గక్కేది పెట్న్యారు తిన్న్యారు.

సుబ్బారెడ్డి నగుతా వచ్చినాడు.

"రార్రి, కూకోండి" అన్న్యాడు.

"ఇంగ ముగ్గులోకి దింపుతాండాడు సింతసెట్టు, సోలకాల దెబ్బలు తప్పవు" అని గొణిగినాడు చిన్నరాజు.

"ఆ ఇప్పుడు జెప్పు గదా" అబ్బిగా! రేత్రి నన్ను బాగా తిట్టినావంట! అడిగినాడు సుబ్బారెడ్డి వెంకటేసును.

"నిన్నే గాదు, శానామందిని తిట్టాం. అది మా సిద్ధాంతం" అన్న్యాడు వెంకటేసు.

"ఏం జేసినామని?"

"బీదోల్లను అణగదొక్కుతాండారు!"

"మేం తొక్కే దేందిబ్బి!

"వాల్ల శ్రమ పిడీ అయితాంది."

"అదెట్లా కూలీ యిచ్చాండాం గదా!"

"అది సాలదు."

"ఇచ్చేవాడికి తెలుచ్చాది. అదట్ల పోసీ! నువ్వు తిట్టిన తిట్లు కొత్త రకమంట. అర్థంగాలా. రోంత జెప్పు!"

"నాకు గుర్తు లేదు."

"నేను రాసుకున్యాలే. మావాల్లు జెపినారు. ఇది జెప్పు. దోపిడీ రాచ్చసు దంటే?"

"దోపిడి అంటే....బలమున్నోడు బలం లేనోడ్ని దోసుకోడం. వుండే దాంతో ఊరుకోకుండా ఇంగా, కావాలని ఎంపర్లాడడం దోపిడి!"

"బూ బకాసురుడంటే?" సుబ్బారెడ్డి అడిగినాడు.

"యాడాడి బూముల్ని పొరంబోకుల్ని అడవుల్ని మశానాల్ని కట్టకడాకు దేవుని గుడి మాన్యాల్ని దండుకోని నాది అనేవాడు."

సుబ్బారెడ్డి ఉరుము ఉరిమినట్టు నగినాడు. దూరంగా తలుగుకు కట్టేసిన దూడ బిత్తరకపోయి సూసింది. రాజులకు పైపానాలు పైన్నే వుండాయి. నగి నగి పొరబోయి, దగ్గి నిమ్మల పడినాడు సుబ్బారెడ్డి. ముగ్గురు రాజులకు సింత సెట్టు సోలకాల లీలగా కనబడతాంది.

"బాగా జెప్పినావు సంటోడా, అబ్బీ! యాడికి బోయినా మనవాల్ల గురించి యిట్లనే జెప్తాండు. రాచ్చసులని, బకాసురులని, సంపకతింటారని, కాలుకింద ఏసి నలుపుచ్చారని జెప్పు. లేకపోతే ఈ నాకొడుకులు మన మాటింటారా?" అన్న్యాడు సుబ్బారెడ్డి.

వెంకటేసు తల తిరిగిపోయింది. రాజులు ఒకరి మొగాలు ఒకరు సూసు కున్నారు.

"ఇద్దో అర్ధనూట పదార్లు లెక్క సందా తీసోక్క" అన్న్యాడు సుబ్బారెడ్డి.

మంత్రిచ్చినట్లు తీసుకున్న్యాడు వెంకటేసు.

"రేయ్! ఒంటెద్దు బండి కట్టి పిల్లోల్లను టౌనులో యిడిసి రార్రి" అరిసి నాడు సుబ్బారెడ్డి.

ఇంగా తెల్లపొద్దు గాలా. రోంత సీకటిగానే వుండాది. సల్లగాలి సంకలోకి జొరపడతాంటే సక్కిలిగిలి పెట్టినట్లుండాది. బండి బాటలో ఒంటెద్దు ఎగిరెగిరి పడతా పోతావుంది.

బండ్లో పోయే కతలు జెప్పేటోల్లను యిసిత్రంగా సూసినారు ఇనిరేసిన వాడలోని జనం. ఇసిత్రంగా సూసే గోచిగాల్లను జూసినాడు వెంకటేసు.

బర్లెంకలు బర్లెంకలు బయడపడి నల్లంగా కమిలిన శర్మం, అయితే వాల్ల మొగం సుబ్బారెడ్డి మాదిరే వుండాది.

వెంకటేసుకూ మనసుండాది. ఆ మనసుకు కన్నుండాది. ఆ కంటికి కనపడతాంది యిసిత్రంగా. ఏందది? సుబ్బారెడ్డి అరుచ్చాండాడు. ఏమని?

"ఇప్లవం వర్దిల్లాలి" అని.

ఒక సుబ్బారెడ్డి కాదు, నూర్ల సుబ్బారెడ్లు.... కోట్ల సుబ్బారెడ్లు.... అరుచ్చానే వుండారు.

దూరంగా బోదపీచు లేని కొట్టం కొనకొప్పు మీద కోడి కూసింది. వెంకటేసు లోకంలోకి వచ్చినాడు. ఇంగా తెల్లారలా!

వెంకటేసు మొగంలోకి సూసి పెద్దిరాజు సిన్నగ నగినాడు.

నగి అన్న్యాడు "ఇంగా టయము రాలా అబ్బీ!" అని.

* [ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 1990] *

# తల్లిమట్టి

స్వామి

నాది ఉపాధ్యాయ వృత్తి. కొత్తగా విడుదలైన ఒక జీవో వలన నాకు ఈమధ్యే బదిలీ వచ్చింది కదిరి మండలానికి.

బాడుగ ఇల్లు వెదుక్కోవడం. ఆ ఇంటికి లెట్రిన్ ఉందా? బాత్‌రూం ఉందా? నీళ్ళకు ఇబ్బంది ఉండదా? కొట్లాటలూ, గలాటలూ లేకుండా ప్రశాంతంగా ఉండే ప్రాంతమేనా? బాడుగెంత?....వగైరా వివరాలు కనుక్కోవడం, పిల్లల్ని కొత్త స్కూళ్ళలో చేర్పించడం, వాళ్ళకు కొత్త ప్రైవేటులు వెదుక్కోవడం, కొత్త ఇంటిని సర్దుకోవడంలో ఆపసోపాలు పడిపోయే మాఇంటి ఇల్లాలి నీరసాన్ని, చీదరని కొన్నాళ్ళపాటైనా భరించగలగటం. ఇవన్నీ ఇప్పట్లో నా జాతకానికి తప్పనిసరిగా ఎదురవబోయే గండాలు.

ఈ సమస్యలన్నిటికంటే నన్ను బాగా బాధ పెట్టే విషయం ఒక్కటే, అది ఏమంటే నేను పుట్టి పెరిగిన నా చిన్నప్పటి పరిసరాన్ని వదులుకుని తట్టా బుట్టా చంకలో పెట్టుకుని పరాయి ఊరు పోవలసి రావడం?

పొద్దున్నే లేచి స్నానంచేసి కడుపులో చల్లగా ఉండేటట్లు నాలుగు ముద్దలు మజ్జిగన్నం తిని మధ్యాహ్నానికి క్యారియరు కట్టుకుని స్కూలుకు బయలుదేరి పోతుంటే సున్నం తొట్టి చేత్తో

పట్టుకుని ఇళ్ళను పూసే కూలికి పోతూ, కడిగిన ముఖాలమీద రూపాయి కాసంత కుంకుమ బొట్టుతో ఆకూవక్కా నముల్తూ రామస్వామి గుడిదగ్గర నవ్వుతూ పలకరించే నా సిన్నమ్మలూ, అక్కయ్యలూ, అత్తలూ, పెద్ద బజారులో ఎరువుల షాపు దగ్గర దొరికే కూలి కోసం పొద్దున్నే ఒంటెద్దు బండి కట్టుకు పోతూ, సిమెంటు గోడల్ని ప్లాస్టింగ్ చేసే తాపీని, టేపును చేత్తో పట్టుకుని వెనుక కూలోళ్ళు, ఇనుప గంపలు పట్టుకుని వస్తుంటే, ఇళ్ళను కట్టే వనికి పోతూ ఏమి అయ్యవారా? అని తమాషాగా పరామర్శించే నా మామలూ, అన్నలూ, చిన్నాయనా, పెదనాయనలూ, బీరప్పగుడి కట్టకముందు గోనెసంచి పరుచుకుని ఇప్పటికీ కావల్సినవీ ఉడకేసినవీ చెనిక్కాయలు అమ్ముతూ నేను పుట్టినప్పుడు తొలిగా నా మొగానికి నీళ్ళు సల్లినది తానే అనే గొప్పతో నావైపు గర్వంగా చూసే ముద్దక్క అవ్వా, చిన్నప్పుడు చెల్లని అణా ఇచ్చి మోసంచేస్తే కోపం పట్టలేక తాను పట్టుకుని తన్నింది ఈ అయ్యవారినే కదా అని నావైపు మురిపెంగా చూసే అంగడి వెన్నయ్యా, వీరి అందరి ఆత్మీయతల్నీ, జాతి శక్తుల్నీ తనలో ఐక్యం చేసుకున్నట్లు ఏదో చెప్పరాని కాంతిలో మిలమిలా మెరుస్తూ గాలికి ఊగుతూ కనిపించే అంగడి ముందర రావిచెట్టూ....వీళ్ళందర్నీ వదిలిపెట్టి పోవడం అనే ఆలోచన వస్తేనే నా గుండెను ఎవరో నలిపినట్లుగా ఉంటుంది.

మా వంశంలో నేను ఒక్కడినే తప్పు పుట్టానుగాని, మా తాతలూ, తండ్రులు అందరూ తమ రెక్కల కష్టాన్ని ఈ సమాజానికి సమర్పించుకున్న వాళ్ళే!

మా తాత కట్టెలు చీల్చేవాడు.

మా ముత్తాత గొర్రెలు కాసేవాడు.

మా నాయన రైల్వే గాంగిలో కూలి.

మా అత్త కాపోళ్ళ ఇండ్లలో వడ్లు దంచేది. మా అమ్మ బాపనోల్ల ఇండ్లల్లో గిన్నెలు కడిగేది. మా అవ్వ సున్నం తొట్టి చేత్తో పట్టుకుని ఇళ్ళను పూసే కూలికి పొయ్యేది.

మా పెద్దాయన ఇళ్ళుకట్టే మేస్త్రి. మా చిన్ననాయన మడకతోలే రైతు కూలి. చెట్టులేని చోట ఆముదపు చెట్టే మహావృక్షం అన్నట్లు నేను నాలుగక్షరాలు నేర్చి బడి పంతులు కావడమే మా వాళ్ళకు గొప్ప. కానీ ఆ కష్ట జీవులు ఇచ్చే గొప్ప గౌరవానికి ఈ అయ్యవారు తగడని నాకు బాగా తెలుసు.

దేశంలో ఎక్కడకు పోయినా కనిపించేది ఈ కష్టజీవులే అని నాకు నేను సర్ది చెప్పుకుని, నాకు నేను కొత్త జ్ఞానం బోధించుకుని, త్వరలో ఇల్లు

చూస్తానని, ప్రతి ఆదివారం వచ్చి మిమ్మల్ని చూసిపోతూ ఉంటానని, మా ఇంటి ఇల్లాలికి ముక్కు చీరుళ్ళ మధ్య వాగ్దానం చేసి, కొత్తచోట కొత్త బడిలో ఉద్యోగంలోకి చేరిపోయినాను ఏకోపాధ్యాయుడిగా.

అది ఒక చిన్న పల్లెటూరు. కదిరి నుంచి మట్టిరోడ్డు మీదుగా బస్సులో పోతే పదిమైళ్ళ దూరం, ఊరికి రెండు ఫర్లాంగుల దూరంలో విసిరేసినట్లుగా పడివున్న పాత గుడిలోనే బడి. అక్కడ పెద్దవాళ్ళు పిల్లల్ని "ఏరా, గుడికి పోలేదా?" అని అడుగుతుంటారు. ఆ మాటకు అర్థం ఏమిటంటే "ఏరా బడికి పోలేదా?" అని.

అక్కడ బడి, గుడి రెండూ ఒక్కటే. గుడిలోకి హరిజనుల ప్రవేశం ఉండదు కాబట్టి బడిలోకి కూడా వాళ్ళకు అక్కడి ప్రవేశం లేదని వేరే చెప్పాల్సిన అవసరం వుండదేమో.

మూడవరోజు అటెండెన్సు రిజిష్టరును పారాయణం చేస్తుండగా గుడి బయట నుంచి ప్రెజెంట్ సార్ అని వినిపించి తలెత్తి చూస్తే ఎత్తైన రాతిగడప పక్కన పలకా పుస్తకాలు పట్టుకుని సూర్యుని ఎండ వేడిలో కూర్చుని కన్పించిన అయిదవ తరగతి చదివే పాప— అంజినమ్మ లోపలికి రమ్మంటే రాలేదు. రాకూడదు సార్ అంది నా అజ్ఞానాన్ని చింతిస్తున్నట్లు నవ్వుతూ. మిగతా పిల్లలు కూడా ఉత్సాహంగా అరిచినారు మాదిగోలు గుడిలోనికి రారు సార్ అంటూ.

ఊరికి కొంచెం ఎడంగా ఇళ్ళు కట్టుకుని ఉంటే గొల్లల దొడ్డి పిల్లలు ఒకరిద్దరు పైకిలేచి వీరత్వంతో చెప్పినారు అసలు మా గొల్లోల దొడ్డిలోకి మాదిగోల్ల పిల్లోలు వస్తే రాళ్ళతో కొడతాం సార్ వాళ్ళు పొయ్యేవరకు అంటూ. మీరు బడికి వచ్చేటప్పుడు హరిజన వాడలోంచే నడిచివస్తారు కదరా మరి అని అడిగితే ఏమోసార్ మా పెద్దోలు, వాళ్ళని రాళ్ళతో కొట్టి తిప్పలాడమంటారు అన్నారు నవ్వుతూ.

"పరవాలేదు బడి అందరిదీ" లోపలికి రమ్మని రెండుమూడు సార్లు పిలిచినా రాలేదు పాప. నేనే కట్టదిగిపోయి పదమ్మా లోపలికి అని రెక్క పట్టుకుని లాగి గుడి వసారాలో కూర్చోబెడితే భయంతో ఏడుస్తూ కూర్చుంది ఒక మూల.

"మాదిగోల్ల పాపని ముట్టుకున్నాడు లేయ్. ఈ పొద్దు సాయంత్రం అయ్యవారిని తేలో పామో కుడుతుంది" అంటూ నవ్వుతూ ఆ పాపకు దూరంగా జరిగి కూర్చుంటున్న పిల్లలు! మెల్ల మెల్లగా పెద్దవాళ్ళ అజ్ఞానంలోకి మారిపోతూ ఉన్న పసిపిల్లల అమాయకత్వం!

ఆ ఊరిలో ఉండటానికి వసతిలేక నా మకాం కదిరికే మార్చాను. అక్కడ ఉంటూ స్కూలుకు రోజూ రాకపోకలు జరపచ్చని.

శ్రీనివాసులు అని రూమ్మేటు నాకంటే పదిహేను ఏళ్ళు చిన్న. పాతికేండ్లు దాటనివాడు. బ్రహ్మచారి. ఇండియన్ బాంకులో క్లర్కు. నేను పనిచేసే ఊరికి పక్కనే మరో పల్లెలో కొత్తగా వెలసిన బ్రాంచిలో పనిచేస్తున్నాడు. ఒక శనివారం బడినుంచి కదిరికి వచ్చేటప్పుడు బస్సులో జరిగింది అతనితో పరిచయం.

మీకు అభ్యంతరం లేకపోతే నా రూంలో ఉండొచ్చు అన్నాడు. నేను సంతోషంతో ఒప్పుకున్నాను. నేను ఒప్పుకున్న తరువాత కూడా మీకు అభ్యంతరం లేకపోతేనే సార్.... అని రెండు మూడుసార్లు అతడు ఎందుకు గొణిగాడో నాకు అప్పుడు అర్థం కాలేదు.

నేను రూంలో చేరగానే హఠాత్తుగా పనిమనిషి రావడం మానేసింది. ఆ రెండు రోజులూ నేనూ, అతడు పక్కింట్లో ఒక బక్కెట్టు నీళ్ళు అడిగి తీసుకుని ముఖాలు మాత్రం కడిగి పరుగెత్తాము పూ ఉద్యోగాలకు. మూడో రోజు పోయి కనుక్కుంటే ఒక మనిషికి యాభై రూపాయలు ఇచ్చేవాళ్ళు జీతం. ఇప్పుడు మీరు ఇద్దరు అయ్యారు కాబట్టి నూరు రూపాయలు ఇవ్వాలి. మీకు ఇష్టం లేకపోతే వేరే పని మనిషిని చూసుకోండి అంది. 'ఈ మాటను నేను వచ్చిన దినమే చెప్పి ఉండొచ్చుకదా' అనిపించి నాకు చిర్రెత్తుకొచ్చింది.

"రాకపోతే రాకపోయావు పో ఇంకొక పని మనిషిని కుదుర్చుకుంటాము" అనబోయాను నా భావం గ్రహించినట్లు చటుక్కున నా చేతిని నొక్కి వారించాడు.

"సరే ఇస్తాములే వచ్చి తొందరగా నీళ్ళు పొయ్యి. రెండు రోజులనుంచి స్నానం లేదు" అన్నాడు.

నాకు ఆశ్చర్యమయింది. ఆమె ఎంత అడిగితే అంత ఇస్తామని బేరం కూడా చెయ్యకుండా వప్పుకున్నందుకు. అదే మాట అడిగితే– "భార్యను వదిలేసి మరో భార్యను కట్టుకోవచ్చునండీ కానీ పనిమనిషినే తెచ్చుకోలేం" అన్నాడు నవ్వుతూ.

"అరవై రూపాయలు ఇస్తేచాలు మనకు మంచి పనిమనిషి దొరుకుతుంది. కొత్త పనిమనిషిని కుదిర్చే బాధ్యత నాది" అన్నాను స్థిరంగా.

"పనిమనుషులు మీలాంటి వారికైతే కుదురుతారుకానీ మాబోటి వాళ్ళకు కుదరరండి అందరూ ఇచ్చే మొత్తాలకి" అన్నాడు.

"ఎందుకు?" అని అడిగాను ఆశ్చర్యంగా.

అతడు నవ్వాడు. ఆ నవ్వులో సెల్ఫ్ పిటీ తాలూకు తడి అతని కళ్ళ లోంచి కదులాడింది. నేను పనిమనిషిని కుదురుస్తాను అంటున్నా కుదిరించలేరు అని అతడు అంత ఖండితంగా ఎందుకు అంటున్నాడో అప్పుడు నాకు అర్థం కాలేదు.

రూములో మేము ఇద్దరమే అన్నమాటేగాని శ్రీనివాసులు మిత్రుల్తో ఎంతో సందడిగా ఉండేది రూము. ఆరోజు వరలక్ష్మీ వ్రతమో లేక మొగుళ్ళ కోసం ఆడవాళ్ళు నోములు నోచుకునే దినమో గుర్తులేదుగాని ఆ దినం మా స్కూళ్ళు అన్నిటికీ సెలవు దినం. సెలవుదినం వస్తే చాలు పక్క ఊర్లలో స్పెషల్ టీచర్‌గా పనిచేసే గురుమూర్తి, టైపిస్ట్‌గా పనిచేసే ఖాదర్‌బాషా ఇద్దరూ కూడబలుక్కున్నట్లుగా హాజరవుతారు రూములో. ఆరోజు వాళ్ళ తిండీ తిప్పలు అన్నీ శ్రీనివాసులు రూములోనే. వాళ్ళ సినిమా ఖర్చుని కూడా శ్రీనివాసులే భరిస్తుంటాడు. ముఖ్యంగా గురుమూర్తి శ్రీనివాసులి బట్టలూ, చెప్పులూ, బూట్లూ మొదలైన వస్తువుల్ని ధారాళంగా వాడేస్తుంటాడు. అతనిని ఇబ్బందిపాలు చేస్తున్నానేమో అని కూడా ఆలోచించకుండా. పైగా తాను ఆ రూముకు రావడమే శ్రీనివాసులు యొక్క మహద్భాగ్యమైనట్లు ప్రవర్తిస్తుంటాడు. ఇదంతా శ్రీనివాసులు ఎట్లా భరిస్తున్నాడా అని ఆశ్చర్యపడేవాణ్ణి. కానీ, శ్రీనివాసులు కూడా చాలా సంతోషపడుతుండేవాడు. వాళ్ళు తన రూముకు వస్తుంటే తనకు పెరిగిన పలుకుబడినీ. సంఘంలో గౌరవాన్నీ చూసుకుని మురిసిపోయే రాజకీయ నాయకుడి మాదిరి అతని ముఖం కళకళలాడేది.

గురుమూర్తి బ్యాంకు పరీక్షలు రాసి రాసి అవేవీ ఫలితాన్ని ఇవ్వకపోయే సరికి చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు చివరికి స్పెషల్ టీచర్‌గా ఇరుక్కున్నాడు ప్రభుత్వ ఉద్యోగంలో. బ్రాహ్మణుల్లో పుట్టడమే సార్ నా పొరపాటు అనేవాడు. ముందు ఈ రిజర్వేషన్లని తీసేస్తే తప్ప దేశం బాగుపడదు అంటూ వాదించేవాడు. నోరు తెరిస్తే ఒక ఇంగ్లీషు ముక్క రాని వాళ్ళంతా ఇప్పుడు బ్యాంకు ఉద్యోగస్తులు 'ఖర్మ' అనేవాడు నా చెవిలో శ్రీనివాసులును ఉద్దేశించి. తనకు రావలసిన బ్యాంకు ఉద్యోగాన్ని శ్రీనివాసులు గద్దలా తన్నుకుపోయి నట్లు అతని మాటల్లో ఈర్ష్య తొంగి చూసింది. కానీ శ్రీనివాసులు రూముకు రావడం మాత్రం మానేవాడు కాదు. తన దారిద్ర్యపు చీకటిని తాత్కాలికంగా అయినాసరే వదుల్చుకోడానికి శ్రీనివాసులు ఒక వెలుగురేఖగా కనపడి ఉంటాడు. అతనికి స్పెషల్ టీచర్ ఉద్యోగం కాబట్టి నెలకు నాలుగు వందలు కూడా రాదు పాపం. అవసరం అలాంటిది.

ఆ రోజు గురుమూర్తి, ఖాదర్ భాష ఇద్దరూ రూములోకి రావడమే దెబ్బలాడుకుంటూ వచ్చారు. రిలయన్స్ క్రికెట్ కప్‌ను ఇండియా గెలుస్తుందని ఖాదర్ భాష, లేదు లేదు పాకిస్తానే గెలుస్తుంది అంటూ గురుమూర్తి మునుగు వీరుల్లా పోట్లాడుకుంటూ పందెం కూడా కట్టుకున్నారు.

ఆ సాయంత్రం అందరము ముఖాలు కడిగి ఊరి బైటకు షికారు పోయినాము. శ్రీనివాసులు ఏకధాటిగా మాట్లాడేస్తున్నాడు. హైదరాబాద్‌లో మా ఆంటీ ఉంది. మద్రాసులో మా అంకుల్ ఉన్నాడు. మొన్న బెంగుళూరు వెళ్ళినప్పుడు మా ఫ్రెండ్‌ని కలిశాను అంటూ కృష్ణా జిల్లాల వారి యాసలో మాట్లాడడం బాగా అలవాటు చేసుకున్నాడు. అట్లా మాట్లాడటం నాగరికతకు లక్షణంగా భావించి ఉంటాడు చాలా మంది చదువుకున్న వాళ్ళమాదిరి.

అతని అంకులూ, ఆంటీ, ఫ్రెండూ .... అందరూ ఆయా సిటీల్లో ఉన్నారో లేరో తెలియదు కానీ వాళ్ళంతా ఆ పెద్ద పెద్ద సిటీల్లో ఉంటున్నారని చెప్పకోవడంలో మాత్రం తన ఉనికికి ఏదో గొప్పతనం వచ్చినట్లుగా భావించుకుంటాడు. తన సాంఘిక స్థాయినుంచి ఉన్నత వర్గాల వారి స్థాయికి ఎదిగిపోవాలనే ఆరాటం అతని మాటల్లో స్పష్టంగా కనిపిస్తుంది. అందుకేనేమో అతనికి ప్రస్తుతం వస్తున్న నవలల మీద కూడా మోజు ఎక్కువ. వాటిని తెగ చదువుతూ తనకు ఓనమాలు కూడా తెలియని, తన జీవితానికి ఏ మాత్రం సంబంధం లేని మోడలింగ్ గురించీ, హార్స్ రేసులగురించి, ఫైవ్‌స్టార్ హోటళ్ళ వాతావరణం గురించి తన్మయత్వంతో మాట్లాడుతూ తన నాగరికతనీ, స్థాయినీ నిరూపించుకుంటూ ఉంటాడు.

'జీవిత స్పర్శ కోల్పోయిన కుష్ఠు రచయితల పుస్తకాలు అవన్నీ' అని నేను కొట్టిపారేస్తే 'మీరు చాలా వెనుకబడిపోయారండి' అంటూ నవ్వుతాడు.

మరి కాసేపు వెస్పా గురించి, బుల్లెట్ గురించి, ధరల గురించి వాటిని నడపడంలో తన అనుభవాల గురించి మైమరిచి మాట్లాడినాడు. అక్కడ ఉన్నా లేకపోయినా ఈ ఖరీదైన పరిజ్ఞానాన్నంతా మాటల్లో వెళ్ళబోసుకోవడమే ఇప్పటి నాగరికతేమో! నేను మధ్యలో అడ్డుకోకపోతే విమానాల గురించి, వాటి నమూనాల గురించి కూడా మాట్లాడేవాడేమో బహుశ!

రాత్రి మెస్సుకు పోయి భోంచేసి వచ్చి అంతా సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాము రూములో. గురుమూర్తి, ఖాదర్ బాష ఇద్దరూ కలిసి శ్రీనివాసులుపై దాడి ప్రారంభించారు.

'మాకు గనక నీ మాదిరి ఉద్యోగం పర్మినెంట్ అయివుంటే ఈపాటికి

ఎప్పుడో పెళ్ళి చేసుకుని జల్సాగా ఉండేవాళ్ళం. అంతే గాని నీ మాదిరి జీతం డబ్బుల్తో స్టీలు వంటసామాను కూడబెడతా, మిక్సీ, గ్రైండర్లు కొనుకుంటా, టీవీలకు టివ్వు కడతా, డబుల్ కాట్ ఫోమ్ బెడ్ గురించి ఆలోచిస్తా, యవ్వనాన్ని అడివి గాచిన వెన్నెల చేసుకునే వాళ్ళం కాము' అంటూ.

'నా బాధలు నాకు తెలుస్తాయి గాని మీకేం తెలుస్తాయి' అంటూ నవ్వినాడు శ్రీనివాసులు. అ నవ్వులో మళ్ళీ సెల్ఫ్ పిటీనే కన్పించింది నాకు. 'ఏం? పెళ్ళికి ఎదిగిన చెల్లెళ్ళు ఉన్నారా మీకు? లేక ఏమైనా అప్పులు ఉన్నాయా మీ కుటుంబానికి?' అంటూ అడిగినాను సానుభూతిగా.

'అయ్యో! మీరు ఉత్త అమాయకులు సార్, ఆ బాధలు ఏమీ లేవు వీనికి. వీనిదంతా పెద్ద మాస్టర్ ప్లాన్. ముందే బ్యాంకు ఎంప్లాయి కదా? దానికి తగినట్లు మరి కొంత దర్జాగా కనిపిస్తే కట్నం రేటు పెరుగుతుంది కదా అని వీని ఆశ' అన్నాడు గురుమూర్తి.

'ఓసారి శ్రీనివాసులు ఏదో సంబంధం చూసేదానికి పోతూ నన్నుకూడా వెంట రమ్మంటే పోయినాను. 'కాబోయే మీ మామగారి ఇల్లు అదిగో అని వెంట వచ్చిన మనిషి వాళ్ళ ఇల్లుని కొంచెం దూరం నుంచి చూపించినాడో లేదో వెంటనే ఠక్కుమని ఆగిపోయి 'వెనక్కు పోదాం పద గురూ' అంటున్నాడు. నేను విషయం అర్థం కాక 'ఎందుకు శ్రీనివాసులూ?' అని అడిగితే వాళ్ళ ఇల్లు నచ్చలేదు అంటాడు. చేసుకునేది పిల్లను కదా అని అడిగితే 'చూసి చూసి ఇలాంటి ఇరుకు ఇంట్లో చేసుకోమంటావా? ఛ ఛ, మన ప్రిస్టేజి ఏం కావాలి బాస్' అంటాడు. వీనికి పెళ్ళి గురించి చాలా ఊహలు ఉన్నాయి సార్' అన్నాడు ఖాదర్.

ఆ మరురోజు నేను స్కూలునుంచి వచ్చి బజారుకు పోవడానికి తయారవుతుంటే 'మీకు తెలిసిన సంబంధాలు ఏమైనా ఉంటే చూడండిసార్' అన్నాడు శ్రీనివాసులు. 'మీ క్యాస్ట్....?' అని అడగబోయి ఎవరినీ కులం గురించి ప్రశ్నించే అలవాటు లేకపోవడంవల్ల 'ఏ కులంలో చూడమంటారు పిల్లని' అని అడిగాను కొంచెం డొంక తిరుగుడుగా.

అతడు క్షణం పాటు నిశ్శబ్దంగా ఉండిపోయినాడు 'యస్ సి' అన్నాడు మెల్లగా నవ్వుతూ కొంచెం విచారం కలిసినట్లుగా ఉంది. ఆ నవ్వు అతని ముఖంలో అదే సెల్ఫ్ పిటీ! అతని కన్నుల్లో అదే జాలి తడి నేను అతని వైపు ప్రశ్నార్థకంగా చూస్తుంటే ఇక చెప్పక తప్పదన్నట్లు 'హరిజనులం సార్' అన్నాడు తల గోక్కుని సిగ్గుపడుతూ. ఆ కులంలో పొరబాటుగా పుట్టాను. క్షమించండి అన్నట్లుంది అతని ధోరణి.

హరిజనుణ్ణి అనే ఆ ఒక్క మాటతో నాకు తెలిసిన శ్రీనివాసులు గురించీ, అతని జీవితం గురించి మరొక కొత్త వ్యాఖ్యానం తెలిసినట్లు అనిపించింది. తన సాంఘిక స్థాయిని ప్రదర్శించుకోవడంలో భాగంగా వంటింట్లో స్టీలు సామానులు కూడబెట్టడం, పని మనిషికి అడిగినంత డబ్బును ఇవ్వడానికి కిక్కురుమనకుండా ఒప్పుకోవలసిన పరిస్థితి. గురుమూర్తి వాళ్ళతో స్నేహం చెయ్యగలగడమే ఒక అదృష్టంగా గొప్పగా భావించుకోవడమూ, హైదరాబాద్ అనీ, మద్రాస్ అనీ, బుల్లెట్ అనీ, మారుతీకారు అనీ గొప్ప గొప్ప విలువైన మాటలు మాట్లాడటమూ .... ఇంకా అతని ఊహలూ, ఆలోచన్లూ, మాటలూ, చేతలూ.... వెనుకా ఒకే ఒక నేపథ్యమై, దాగి దాగి పొంచి పొంచి చూస్తూ ఉంది .... హరిజనుణ్ణి అనే అతని న్యూనతా భావం. ఆ న్యూనతా భావాన్ని కప్పిపుచ్చుకోవడం కంటె అతని జీవితానికి మరో ధ్యేయం ఉన్నట్టు కనిపించదు.

మనిషి ప్రవర్తనలోని ప్రతి కదలికా ఏదో ఒక జీవిత నేపథ్యంతో శాసించబడే శృంఖలాల గల గలేనేమో?

మా హరిజనుల్లో చదువుకున్నవాళ్ళు చాలా తక్కువ సార్. చదువు వుంటే అందం ఉండదు. అందం వుంటే చదువు ఉండదు. అందం, చదువు, నాగరికతా అన్నీ ఉన్న సంబంధం దొరకాలంటే కష్టం అన్నాడు.

'పోనీ మీకు నచ్చిన పిల్లను చూసి ప్రేమించి పెళ్ళి చేసుకోండి' అన్నాను సలహా ఇస్తూ.

'ప్రేమించాను సార్ ఆమె రెడ్డీస్ అమ్మాయి. ఇంటర్ చదివింది. మంచి పర్సనాలిటీ. చాలా అందంగా ఉంటుంది. ఆమె నేను పనిచేస్తూన్న ఊర్లో సర్పంచ్ కూతురు! లవ్ లెటర్స్ రాస్తుంది. ఎప్పుడైనా రూముకు వస్తుంది. ముద్దులిస్తుంది. అన్నీ సరే గాని పెళ్ళి చేసుకుందాం అంటే ఏడుస్తుంది మా ఫాదర్‌కు పది మందిలో అపకీర్తి తీసుకురాలేను అంటూ. ఆమెకు మ్యారేజి కూడా ఫిక్స్ అయింది ఈ మధ్య అన్నాడు.

బజారుకు పోయివచ్చిన గంటన్నర సేపటివరకూ ఆ పిల్ల గురించి కలవరిస్తూనే ఉన్నాడు శ్రీనివాసులు. ఆమెను ఆమె పేరుతో స్మరించడు. రెడ్డీస్ అమ్మాయి....అనే ప్రస్తావిస్తాడు ప్రతిసారీ. ఆ అమ్మాయిని పేరుతో కాకుండా రెడ్డీస్ అమ్మాయి అని భావించడంలోనే అతడు ఎక్కువగా సంతోషపడుతున్నట్లు కనిపించాడు.

నాకు బాడుగ ఇల్లు దొరికేటప్పటికి రెండు నెలలు పట్టింది. తరువాత పది రోజులకు మా ఇంటికి భోజనానికి పిలిచాను శ్రీనివాసులును. ఈ రోజు

తృప్తిగా భోంచేశాను సార్ అని శ్రీనివాసులు పాన్ వేసుకుని నములుతూ గంట సేపు కూర్చుని వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత మా ఇల్లాలు శ్రీనివాసులు గురించి వివరాలు అడుగుతూంటే అతడు మాదిగ అన్నాను తక్కున. శ్రీనివాసులు కళ్ళలోని అందమైన ఆకర్షణ మీద అసూయతో అన్నానేమో ఆ మాటని బహుశ.

రెండు నెలలు గడిచిపోయాయి. ఈలోగా మూడు సంబంధాలు చూసి వచ్చాడు శ్రీనివాసులు. ఒక్కటీ నచ్చలేదన్నాడు. ఒక రోజు సాయంత్రం ఇంటికి వచ్చి 'సార్ రేపు మందు పార్టీ ఇస్తున్నాను. మరచిపోకుండా రండి' అన్నాడు. 'ఏం విశేషం ఏదైనా పెళ్ళి సంబంధం కుదిరిందా?' అని అడిగితే 'అదేం లేదు సార్ డిపార్ట్ మెంటల్ టెస్ట్ పాసయ్యాను. గురుమూర్తి ఒకటేగోల పార్టీ ఇవ్వమని. పోనీలే అని ఒప్పేసుకున్నాను అన్నాడు. 'నేను మందు తీసుకోను కదా శ్రీనివాసులూ అంటే 'వచ్చి ఫుడ్ తినండి సార్, కానీ మీరు మాత్రం తప్పక రావాలి' అని మరీ మరీ చెప్పాడు పోబోయే ముందు 'రాత్రి తొమ్మిదింటికి సార్ పార్టీ ' అన్నాడు. 'అంత ఆలస్యంగానా? ఏడుగంటలకో ఎనిమిది గంటలకో కొంచెం తొందరగా మొదలు పెట్టకూడదా?' అని అంటే 'అమ్మో! ఎప్పుడైనా వస్తే మా మమ్మీ డాడీ అదే టైమింగ్స్‌లో వస్తారు సార్ ఊరినుంచి' అంటూ నవ్వాడు.

నేను వెళ్ళేటప్పటికి అంతా సిద్ధం చేసుకుని కూర్చున్నారు. నన్ను మరో సారి అడిగి 'మందు నా ఆరోగ్యానికి పడదు' అని చెప్పేసరికి అంతా చీర్లుకొట్టి మెల్లగా తాగడం ప్రారంభించినారు. అరగంట గడిచేటప్పటికి మాటల్లో జోరు పెరిగింది. 'గోదావరి వైపు పోతే ఇప్పటికీ అ పూర్వకాలంనాటి గొప్ప బ్రాహ్మణులూ, ఆచార పరాయణులూ కనిపిస్తారంట సార్' అంటూ ఆమ్లెట్‌ను తుంచుకుని తింటున్న గురుమూర్తిని.

'మేము ఇక్కడి సాయిబులం కాదు సార్, హైదరాబాదు నుంచి వచ్చిన వాళ్ళం కుతుబ్‌షాహి వంశం మాది. మా రేస్‌వేరే' అంటున్న ఖాదర్ బాష! శ్రీనివాసులు దిక్కులు చూస్తున్నాడు తన జాతి గురించీ, వంశం గురించీ ఏం గొప్ప చెప్పుకోవాలో అర్థం కాక.

'మా తాత హయాం వరకూ నెయ్యి తప్ప నూనె ముఖం చూసి ఎరగరు సార్ మా వాళ్ళు! అంత గొప్పగా బతికినారు అప్పట్లో' అన్నాడు గురుమూర్తి.

'ఔను ఆ రోజుల్లో పాలూ పెరుగూ నెయ్యీ అమ్మితే పాపం చుట్టుకుంటుంది అనేవాళ్ళు. ఏదో శాస్త్రాన్ని విప్పి చదివి, అప్పట్లో మా తాతలే పుట్టగోచీ

పెట్టుకుని మీ తాత ఇంటికి పాలూ పెరుగూ వెన్న నెయ్యి అన్నిటినీ చేరవేసి ఉంటారు. మా అవ్వ ఇప్పటికీ అంటూంటుంది. పాలూ, పెరుగు గానీ కూర గాయలు గానీ బాపనోళ్లకు పెడితే పున్నె మొస్తుందిరా అని' అన్నాను నవ్వుతూ.

'మా తాత పదిమంది శిష్యులకి మా ఇంట్లోనే తిండీ తిప్పలూ వసతీ అన్నీ ఉచితంగా ఏర్పాటు చేసి వాళ్ళకు వేదం చెప్పేవాడంట. ఆ మనుషులూ ఆ కాలమూ, ఆ పద్ధతులే వేరు' అన్నాడు గురుమూర్తి.

'పూర్వుల్లో చాలా గొప్ప మనుషులున్నారు. నిజమే ఒకసారి ఎద్దులు లేకపోతే మడకను ఆ వైపు ఒకరూ ఈ వైపు ఒకరూ భుజాల మీద మోపుకుని ఎకరన్నర చేనుని దున్ని పారేసినారంట మా చిన్న తాతా పెద్ద తాత ఇద్దరూ కలిసి. ఆ రోజులే వేరు' అన్నాను నేను కూడా పూర్వుల మీద భక్తితో.

శ్రీనివాసులు మాట పడిపోయినట్లు గుడ్లు మిటకరించి చూస్తున్నాడు మా వైపు. తన పూర్వుల గురించి చెప్పుకోడానికి కించపడుతున్నట్లు కన్పించాడు.

తమ జాతి గురించి, వంశ గౌరవాల గురించి, గొప్పచేసి మాట్లాడక పోవడం నిజంగా మంచి లక్షణమే కాని తను పుట్టి పెరిగిన పరిసరాల గురించి జీవన పరిస్థితుల గురించి మాట్లాడడానికి సిగ్గు పడటమంటే తన ఉనికిలోని ఒక భాగాన్ని హత్య చేసుకోవడమే అన్న విషయాన్ని అతడు గమనించలేదు.

ఒక విద్యా సంవత్సరం గడిచేసరికి మళ్ళీ అనంతపురం వైపే మ్యూచువల్ ట్రాన్స్‌ఫర్ దొరికింది నాకు. అనంతపురం అనగానే ఆ పాత ఊరూ, ఎల్లమ్మ కట్టా, బాపన గేరిలో చదివిన గిరిస్కూలు, మడికట్లూ, పెద్దబజారులో కలిపే ఇరుకు సందులూ, సైడు కాలువలూ, నా చిన్ననాటి స్నేహితులు మునిలి గాడూ, డబ్బా రేకులోడూ, ఇంకా ఏవేవో గుర్తుకొచ్చి నన్ను నా చిన్ననాటి వాతావరణంలోకి తీసుకుపోతాయి. చెట్లు శాఖోపశాఖలై ఎంతగా విస్తరించినా దాని వేర్లు మాత్రం అది పుట్టి పెరిగిన మన్నులోనే ఉంటాయి.

నేను చదువుకుని పెరిగి పెద్దయిన తరువాత నాకు నా తల్లి నేర్పిన భాష మారింది. కొంచెం నాగరికత బలిసింది. ఎప్పుడైనా హైదరాబాద్‌కు పోతే నా చిన్ననాటి స్నేహితుడు నరసింహంని కలుస్తుంటాను. మేం ఇద్దరం ఒకరి కొకరు చూసుకోవడంతోనే మా నాగరిక భాషకు తెర పడిపోతుంది. సంగటి తిందా లేయలే అంటాడు. వాని భార్య ఆ యాసకు నవ్వుతుండగా.

'అమ్మయ్యా! రావంత మిరియాల చారు ఉంటే పొయ్యి మనమనికి' అని మా అవ్వ గిన్నె పట్టుకుని పోయేది బాపనోళ్ల ఇండ్లకి. మా అవ్వ వెనుక

నరసింహం అవ్వ కూడా పోటీగా పరుగెత్తేది. ఆ మిరియాల రసం కోసం ఆ మిరియాల చారు తాగినందువల్లే మా ఇద్దరికీ తెలివి పెరిగి చదువు అబ్బిందని ఇప్పటికీ మా ముసిలి వాళ్ళ విశ్వాసం.

ఇక దీపావళి పండుగ వస్తే సాయంత్రంనుంచీ రాత్రి ఎనిమిది తొమ్మిది గంటల దాకా వాళ్ళ ఇండ్ల దగ్గరే పడివుండే వాళ్ళం. వాళ్ళు వెలిగించిన దీపాల వరసల్నీ, కాల్చే టపాసుల్నీ చూస్తూ మన తలకాయలకు సంవత్సరం సమురు అనేది ఆ దీపాల వరుసలు చూసిన మా అవ్వ. పెద్దవాళ్ళ దారిద్ర్యం పెద్దవాళ్ళ కున్నట్లు చిన్నపిల్లలు దారిద్ర్యం చిన్నవాళ్ళకు వుంటుంది అనిపిస్తుంది.

వాళ్ళు అంటించిన భూచక్రాల మీద అటూ ఇటూ ఎగిరే వాళ్ళం. బుస్సు మని పైకి ఎగిరిపోయే రాకెట్లని నోర్లు వెళ్ళబెట్టి చూసేవాళ్ళం. చూసి చూసి చివరికి రంగంలో దిగేవాళ్ళం. ఆ నాజూకు పిల్లలు భయపడుతూ భయపడుతూ టపాకులు అంటిస్తే వాటికి అట్లా నిప్పు అంటుకుంటుందో లేదో, మేము మా పిడికిల్లో సిద్ధంగా పట్టుకున్న ఇసుకతో పఠామని కొట్టి ఆర్పేసి ఆ పటాకుల్ని జేబులో వేసుకుని పరుగెత్తేవాళ్ళం, ఆ పిల్లల అక్కయ్యలూ, తల్లులూ, మమ్మల్ని శాపనార్థాలు పెడుతూ తిడుతుంటే.

ఒకసారి ఇసుకతో కొట్టి పటాకును జేబులో వేసుకుని పరుగెత్తుతుంటే అది మధ్యలో ఢాం అని పేలి నరసింహంగాని ఛాతీ మీద పెద్ద గాయం కూడా అయింది. ఆ గాయపు మచ్చని ఇప్పటికీ వాడు ఎంతో నెర్లుగా చూసుకుంటూ ఉంటాడు.

ఉద్యోగం వచ్చిన తరువాత నా సాంఘిక స్థాయి అట్టడుగు నుంచీ మధ్య తరగతి స్థాయికి మారిపోయి వుండొచ్చు. అంతమాత్రంచేత నా బాల్యం నాటి దారిద్ర్యపు రోజులు గుర్తుకు వచ్చినప్పుడల్లా నాలో అదో విధమైన సంతోషం, ఆత్మీయతా భావమూ కలగకుండా పోలేదు.

తమ చిన్ననాటి దారిద్ర్యాన్ని, అల్లరి చిల్లరి అనుభవాల్ని వెళ్ళబోసు కోవడం తమ ప్రస్తుతపు మర్యాదకూ, ఉద్యోగ గౌరవానికీ భంగకరమనిభావించే వాళ్ళని చూస్తేనే నాకు విచారం కలుగుతుంది.

రోజులు గడుస్తున్నా శ్రీనివాసులు నన్ను మరిచిపోలేదు. అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. ఒకసారి నా ఎరుకలోకి ఒక మంచి సంబంధం వచ్చింది. అమ్మాయి చక్కగా వుంటుంది. స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్‌లో ఉద్యోగం. ఆ విషయాన్ని శ్రీనివాసులుకు ఉత్తరంలో తెలియజేసినాను. తరువాత కొన్నాళ్ళకు ధర్మవరం పోయి రావలసిన పనితగిలింది. ధర్మవరానికి శ్రీనివాసులు ఊరు చాలా దగ్గరే. నాలుగైదు కిలో మీటర్లు.

ఒక మధ్యాహ్నం వాళ్ళ ఊరికి పోయినాను. అది చిన్న పల్లె. ఊరి బయట ప్రభుత్వంవారు హరిజనుల కోసమని కట్టించిన చిన్న ఇళ్ళల్లో వాళ్ళదీ ఒకటి. శ్రీనివాసులు డాడీ గోడకు చేరగిలబడి బీడీ తాగుతూ నారపాసల్తో తాడు పేనుతున్నాడు అడ్డ పంచె ఎగ గట్టిన తొడ మీద. శ్రీనివాసులు మమ్మీ నూకలు చేటలో పోసుకుని చెరుగుతూ, మట్టిగడ్డలు ఏరుతూ కూర్చుంది. కొంచెం దూరంలో తప్పిడి కొట్టినట్లు తట్టల్నీ, గిన్నెల్నీ పుల్లల్తో కొట్టుకుంటూ ఆడుకుంటున్నారు పిల్లలు. ఇంటి ముందు నలుగురు పిల్లలు మాసిపోయిన గుడ్డల్తో మట్టిలో ఆడుకుంటున్నారు. వాళ్ళలో శ్రీనివాసులు సిస్టరు పింకీ, యంగర్ బ్రదర్ టింకూ కూడా ఉన్నారు.

శ్రీనివాసులు స్నేహితుణ్ణి అని తెలిసి వాళ్ళు చాలా సంబరపడినారు. అప్పటికప్పుడు పిల్లల్ని అంగడి వైపు పరుగెత్తించి పావలా కాఫీ పొడి, అర్ధ రూపాయి చక్కెర తెప్పించి కాఫీ చేసి ఇచ్చినారు, మీరు టౌనోళ్లు, మా కాఫీ తాగుతారో లేదో అని జంకుతూ.

ఇంట్లో అన్నీ నొక్కులు పడిపోయిన సత్తుగ్లాసులూ, చెంబులూ, మంచం మీద ఒక రంగువెలిసిన దుప్పటీ, ఒక కంబలీ, నాలుగైదు ఖాళీ గోనె సంచులు!

శ్రీనివాసులు తన వంటింట్లో కూడబెట్టిన స్టీలు పాత్ర సామాన్లూ, మిక్సీ, గ్రైండరు, గ్యాస్ స్టౌ వంటివి ఒక్కసారిగా జిగేల్ మన్నాయి నా జ్ఞాపకంలో.

సంబంధం గురించి విని వాడు పెండ్లిచేసుకుని లచ్చనంగా బతుక్కుంటె సాలయ్యా, అంతకంటే మాకు ఏం కావాల? వాడు ఎక్కడుండినా ఎంత పైనికి వచ్చినా మా కొడుకేగాని పరాయివాడు కాదుగదా, అన్నాడు. అతని గొంతులో ఏదో నిరాశ ధ్వనించింది.

శ్రీనివాసులుకు తన తల్లిదండ్రుల మీద అసహ్యం గాని, ద్వేషం గాని లేవు. ఆ విషయం నాకు బాగా తెలుసు. కానీ అతనికి వచ్చే జీతం నెల నెలా టివి కోసం టిప్పు కట్టడానికి, స్టీలు సామాన్లు కొనడానికి చాలడం లేదు పాపం అతడేం చేస్తాడు.

'ఇంక పోయొస్తాను' అని లేచి నిలబడినాను. 'అయ్యో, ఇప్పుడు బస్సు కూడా లేదు కదా సామీ' అంటూ నొచ్చుకున్నాడు శ్రీనివాసులు తండ్రి. 'ఉండయ్యా బండి కడతాను' అంటూ గబగబా వెళ్ళిపోయినాడు నేను 'వద్దులే' అంటున్నా వినిపించుకోకుండా.

అరగంట గడిచేసరికి ఎవరినో అడిగి బండి, మరెవరినో అడిగి ఎద్దులూ పట్టుకొచ్చి బండి కట్టి, బండి మీద జల్లలో కంబళిని మడతలు పెట్టి పరిచి కూర్చోమన్నాడు.

దారి పొడుగునా ఎంతో ఉత్సాహంగా మాట్లాడుతూనే ఉన్నాడు. మా తాతా ఒక్కడే అడివి పందిని చంపినాడని, మా నాయనా ఉలవల మూటను మోకాళ్ళమీదికి ఎత్తుకుని, మోకాళ్ళమీది నుంచి భుజాల కెత్తుకుని వెనక్కి జారేసేవాడని, అతడు ఎత్తి పడేసిన రాతి గుండు ఇప్పటికి ఇంకా ఆ పీర్లసావిడి ప్రక్క పడివుందనీ దాన్ని ఎత్తగలిగే మొనగాడు తమ ఊర్లో ఎవరూ పుట్ట లేదని ...., ఇంకా ఏవేవో చెప్పాడు.

'గుండం కోపులోనూ, యాపరాల్ల కోపులోను దరువేసి తప్పిడి కొట్టె దాంట్లో మా అన్నను మించిన మొగోడు లేడు ఈ చుట్టుపక్కల పల్లెల్లో' అన్నాడు.

'మా అయ్య బయలు నాటకంలో ఇరాన్యకసిపుని వేషం కడితే చుట్టు పక్కల పది ఊళ్ళ నుంచి ఎగబడి వస్తాండిరి జనం — సూసేదానికి' అన్నాడు. శ్రీనివాసులు ఇవేవీ ధైర్యంగా చెప్పుకోలేదు. 'ఇదంతా అనాగరికత. చదువు తున్న స్నేహితుల దగ్గర ఈ విషయాలన్నీ చెప్పుకోవడం పరువు తక్కువ' అని అతని ఉద్దేశం. అతని రూంలో మాత్రం దొమ్మరి వాళ్ళను మించి ఏ గొప్ప ఫీట్లూ వెయ్యలేని సినిమా హీరోలా స్టంట్ పోజుల బొమ్మలూ, హీరో యిన్‌ల కాలెండర్లూ గోడలకు ఫాషన్‌గా కళాత్మకంగా వేలాడుతుంటాయి.

మేము ధర్మవరం చేరేటప్పటికి బస్సు నా కోసమే ఎదురు చూస్తున్నట్లుగా ఉంది స్టాండులో. ఒక సీటును నా చేతిగుడ్డతో రిజర్వ్ చేసుకుని దిగివచ్చి అతనితోపాటు క్యాంటీన్‌లో టీ తాగుతూ మాట్లాడుతున్నాను. శ్రీనివాసులు పెండ్లి ప్రసక్తి వచ్చింది మళ్ళీ మా మధ్యకు. 'మీ హరిజనుల్లో కట్నాలు తక్కువే కదా', అని ఇంకా మాట్లాడబోతుంటే అతని ముఖం గంభీరంగా మారి పోయింది.

'నేను ఒక మాట అడుగుతాను ఏమీ అనుకోరు కదా', అన్నాడు. ఏమి అన్నాను. 'మాదిగోళ్ళు అనే మాటకు ఏమైనా బూతు అర్థం ఉందా?' అని అడిగినాడు.

'అట్లాంటిది ఏమీ ఉండదు' అన్నాను.

'మల్ల మమ్మల్ని హరిజనులు అని ఎందుకంటారు. బాయెల్లు, బలిజోల్లు అన్నట్లు మమ్మల్ని మా కులం పేరుతో మాదిగోల్లు అని పిలవకుండా? నేను నిన్నే కాదు అడిగేది, మా కులంలో వాళ్ళు కూడా అట్టే సెప్పకుంటార్లే' అన్నాడు.

'మాదిగోల్లు అనే మాట అందరి దృష్టిలోనూ లోకువ అయిపోయిందని

గాంధీ మహాత్ముడు హరిజనులు అని పేరు పెట్టినాడు గౌరవంగా ఉంటుందని' అన్నాను.

'మేము మాదిగోల్లము అని సెప్పుకుంటే ఇండ్లలోకి రానియ్యరు. హరిజనులము అని సెప్పుకుంటే రానిస్తారా? ఏందో, అంతా తిక్కలోకం, కానీ గాంధీనూ, అంబేద్కరూ మాకు ఎంతో మేలు చేయాల్ల అని చూసిరి, పావం' అన్నాడు.

'మిమ్మల్ని ఆదివాసీలు, ఆది ఆంధ్రులూ అని కూడా అంటారుకదా, అందులో ఎంతటి చారిత్రక గౌరవం ఉందో ఎవరికి తెలుసు. నన్నిడిగితే అసలు ఆ పేరే మీకు తగినది' అన్నాను.

అతడు నవ్వాడు.

'ఏమోనయ్యా? ఆ సరిత్రలూ, రికార్డులూ నాకు తెలీవు. మాదిగోల్లు అని సెప్పుకుంటే దానికి సిగ్గుపడేవోల్లే హరిజనులమని సెప్పుకుంటారు. కులంపేరును మార్చి సెప్పుకోవల్సిన తప్పును మేము ఏం చేసినాము? మా కులం మాదిరే అన్ని కులాలకూ పేర్లు మార్చినారా? లేదే, ఎవరి కులం వాళ్ళకి గొప్ప. అందరికీ వున్నట్లే మాకు మా కులం ఉంది. రేడియోలో సెప్పినట్లు ఏ కులాలూ మతాలూ లేవు. అంటే మాకు కూడా లేవు అని అనుకుంటాను' అన్నాడు.

నాకు ఇంకా ఏదో మాట్లాడాలనిపించింది. కానీ మరేమీ మాట్లాడలేక పోయినాను. మా ఇద్దరి మధ్యా నిమిషం పాటు పరుచుకున్న నిశ్శబ్దాన్ని బస్సు హారన్ భంగపరిచింది.

నేను వాళ్ళ ఇంటి పరిస్థితి చూసి వచ్చానని తెలిస్తే శ్రీనివాసులు నాతో తలెత్తి మాట్లాడటానికే సిగ్గు పడవచ్చు.

శ్రీనివాసులు బతుకు వేర్లు అతడు పుట్టి పెరిగిన భాషలోనూ, మనుష ల్లోనూ, మట్టిలోనూ లేవు.

మరొక క్రొత్త వాతావరణంలో ఉన్నాయి. తల్లి మట్టిలోనికే సరిగ్గా పాతుకోలేని వేర్లు ఇతర వాతావరణంలో నాటుకుంటాయా? ఆత్మవిశ్వాసంలోనికి పాతుకోలేని వేర్లు, చెట్టుకు నిజమైన పెంపునూ, అభివృద్ధినీ కలిగించగలవా?

* [ఉదయం నవతరం వారపత్రిక, 26-1-1990] *

# జీవనాడులు

శాంతినారాయణ

చీకటి వొడిలో రెడ్డిపల్లి ఆదమరిచి నిద్రపోతూ ఉంది. రాబోయే కొత్త వెలుతురుకు చాలా ముందుగా తొలి కోళ్ళు కూతలేస్తూ స్వాగతం పలుకుతున్నాయి. గంగనికి సరిగ్గా నిద్ర రావడం లేదు. ఉదయం జరగబోయే బిడ్డ పెళ్ళిని గురించీ, దాని యేర్పాట్లను గురించీ ఆలోచిస్తున్నాడు.

అన్నీ తన హోదాకు తగినట్లే ఉండాల. తాను మాదిగ్గేరికంతా పెద్దమనిషిననీ ప్రెసిడెంట్ కొండా రెడ్డికి పెద్ద పాలికాడనీ అంతా తనను గవుర విస్తారు. తనింట్లో యిదే మొదటి పెండ్లి. అదీ గాక కాబొయ్యే అల్లుడు వొక పెద్ద వుద్యో గస్తుడు. అనంతపురం జెడ్జి కోరట్లో గుమాస్తాగా పని జేస్తా వుండాడు. అతగానికి టవున్లో పెద్ద పెద్దోల్లంతా బాగా తెలుసు. వాళ్ళంతా పెండ్లి కి రావొచ్చు మల్ల వాళ్ళందరికీ బాగా మర్యాద సెయ్యాల గదా. వాళ్ళు తమ ఇంట్లో భోంచేత్తారో లేదో. కాబట్టే హోటల్ రంగమ్మను వాల్లందరికీ మంచి భోజనాలు చెయ్యమని బంగపేయి బతి మాలేసరికి తల పానం తోక్కొచ్చింది.

నిన్న సాయంత్రమే పెండ్లి పందిరి సుట్టూ రంగు కాగితాలన్నీ లెస్సగాకట్టాడు నన్నకొడుకు మారెన్న యిస్కూలు పోకుండా. వాడయితే

అక్క పెండ్లి బబ్బరీగా జరగల్లని బ్యాండు మేలం తెప్పించల్లని పట్టుబట్నాడు. కానీ మాదిగోల్ల పెండ్లికి బ్యాండు మేలం పట్టమని మంగ్రలామన్న కచ్చితంగా చెప్పినాడు. కొండారెడ్డి కూడా 'అవున్రా గంగా యానాడూ లేంది యిప్పుడు మొదలు బెడితే యెట్లరా! ఇంతవరకూ బ్యాండు మేళం గానీ బండి మీద మెరివెన గానీ మనూర్లో జనానికి లేదు. ఈ పొద్దు నువ్వు నా క్కావలసినోనివనీ పోన్లె అనీ నీకు సందిస్తే రేప్పొద్దున అంతా అదే పని చేస్తారు .... వొద్దురా వొద్దు' అని అన్నప్పుడు తన మనసు బాధ పడింది. కొండారెడ్డి తన మీదుండే అభిమానంతో ఆ మ్మాట మెత్తగా జెప్పినాడు. ఆయన మాట గూడా యినల్ల గదా అనుకొని బ్యాండు మేలం కంటే సందడిగా వుంటుందని పది తప్పెట్లను యేర్పాటు జేసినాడు తాను. ఇంగ మెరివెనే ఉండేది. అదెట్ల జెయ్యల్లో యేకంతో ఎట్లనో అల్లుని వొప్పించల్ల.

పల్లెల్లో పెండ్లి జేసుకుంటే కులాచారాలూ అవీ యివీ వుంటాయనీ ఆ పద్ధతులన్నీ తనకు నచ్చవనీ అల్లుడు చెప్పినాడు. అతగానికేం తెలుసు యిక్కడుండే ఇబ్బందులన్నీ? కులాచారాలూ పద్ధతులూ వొదులుకంటే కులుస్తులూరికే వుంటారా? పల్లె వూకరమే వుంటుందా? అయినా తానుండి అల్లునికెట్ల యిబ్బంది కలిగిస్తడు? ఆయప్ప కేదన్న అవమానమయితే అది తనకూ అవమానమైగిదా.'

ఆలోచిస్తూనే కునుకుదీశాడు గంగడు.

పెళ్ళి పందిరి కింద చాలా హడావుడిగా వుంది గంగని యింటి ముందు. రెడ్డికీ కరణానికీ తన అయ్య కొండారెడ్డికీ మిగతా పెద్దోళ్ళందరికీ 'బియ్యం బేడలు' ఇచ్చిరావాలని కొంతమంది తప్పెట్ల సందడితో బయలుదేరారు. పట్నం నుంచి వచ్చిన వాళ్ళకిది వింతగా కనిపించింది. ఒకరిద్దరుండలేక అడగనే అడిగారిదేమిటని.

'పెద్ద కులాలవాళ్ళు తమ ఇండ్లలో భోంచేయరనీ తామిచ్చే బియ్యం బ్యాళ్ళు తీసుకుంటే వాళ్ళు తమ ఇండ్లల్లో భోంచేసినట్లేననీ వూర్లో కొంతమంది పెద్దవాళ్ళ కిట్లా బియ్యం బ్యాళ్ళివ్వడం తర తరాలుగా వొస్తున్న ఆచారమనీ పెళ్ళి పెద్దలు చెప్పారు. పట్నంవాళ్ళు నవ్వుకున్నారు.

గంగని కింతవరకూ తన కులమంటే ఇంత తక్కువయిందని తెలీదు. పట్నం నుంచీ అల్లుని స్నేహితులు చాలామంది వొస్తున్నారని తెలిసీ వాళ్ళంతా కూర్చోడానికని స్కూల్లో వున్న కుర్చీలూ బెంచీలూ ఇవ్వమని హెడ్‌మాష్టర్ని అడిగాడు. మొన్ననే ఈడిగ రంగప్ప తన బిడ్డ పెళ్ళికని స్కూల్ బెంచీలూ కుర్చీలూ అన్నీ తీసుకుపోవడం గంగడు చూశాడు. ఒక రంగప్పే కాదు.

పూళ్ళో తెల్లబట్ట లేసుకొని తిరిగే ప్రతివాడూ తమ కార్యక్రమాలకు స్కూల్ బెంచీలూ, కుర్చీలూ వాడుకోవడం గంగనికి బాగా తెలుసు. అందుకే తానూ అడిగాడు. హెడ్మాష్టర్ కుల ప్రసక్తి తెచ్చి నిరాకరించాడు. గంగనికి వొళ్ళు మండింది. గట్టిగా నోరు చేశాడు. అతని వాలకం చూసి హెడ్మాష్టర్ తనకేమీ తెలీదని స్కూల్ కమిటీ ప్రెసిడెంట్ చెప్పితే ఇవ్వడానికి తన కభ్యంతరంలేదనీ తప్పుకున్నాడు. గంగడు నేరుగా స్కూల్ కమిటీ ప్రెసిడెంట్ రామప్పచౌదరి దగ్గరి కెళ్లాడు. చౌదరి గొణిగాడు. గంగనికి అహం దెబ్బతింది. తానూ గ్రామ పంచాయతీకి వొక వార్డు మెంబర్నన్న విషయం అతన్ని రెచ్చగొట్టింది. అతని వాలకం చూసి రామప్ప చౌదరి మెత్తబడ్డాడు. 'అది కాదురా గంగా, మిగతా పెద్ద వాళ్ళందర్నీ అడిగి చూడు. మీ ఇండ్లవాళ్ళ కెప్పుడూ స్కూల్ బెంచీలూ, కుర్చీలూ ఇవ్వలేదు .... ఇది ఆఫీసర్లకు తెలిస్తే బాగుండదేమో' అని దాటుకున్నాడు.

'అవున్లెండయ్యా. మేం మనుషులమైతే గదా! మీరేంజేసినా ఆఫీసర్లకు నచ్చుతుంది. మా దగ్గిర కొచ్చేసరికి యిబ్బందులన్నీ ...." అంటూ బాధగా వెళ్ళి పోయాడు గంగడు.

ఇట్లా జరుగుతుందని గంగ డూహించలేదు. స్కూల్లో బెంచీలున్నాయి కదా. మళ్ళీ పట్నం నుంచీ బాడుగ కుర్చీలు తెప్పించడం అనవసరంగా డబ్బులు ఖర్చు పెట్టడం ఎందుకనుకున్నాడు. తీరా చూస్తే పరిస్థితి ఎదురు తిరిగింది. ఇపుడే ఆలోచించినా ప్రయోజనం లేదనుకొని తమ హరిజనవాడ స్కూల్లో ఉన్న పొడుగాటి చెక్క పిలకల్ని తెప్పించి పందిట్లో వేయించాడు. చుట్టు ప్రక్కలున్న వాళ్ళ మంచాలు పదికి పైగా తెప్పించి వాటి మీద పెద్ద కంబళ్ళు పరిపించాడు. అల్లుని పక్కకు పిలిచి ఉన్న విషయం తెలిపి సర్దుకొని పొమ్మని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు. అల్లుడు కుళ్ళాయప్ప పరిస్థితినర్థం చేసుకున్నాడు.

పెళ్ళి ఆయిపోయింది. కుళ్ళాయప్ప మిత్రులూ, తోటి ఉద్యోగులందరూ గంగడు చూపిన గౌరవానికి సంతోషపడి తమ కోసం ప్రత్యేకంగా చక్కని భోజనం ఏర్పాటు చేసినందుకు అతన్ని అభినందించారు. జడ్జి, తాసీల్దార్, ఇన్స్పెక్టర్ మొదలైన వాళ్ళంతా పంపిన పెళ్ళి కానుకల్ని చూసి మురిసి పోయాడు గంగడు. తన అల్లుడు చాలా పలుకుబడి కలవాడని గర్వంగా బంధువు లందరికీ తెలిపి పొంగిపోయాడు.

సాయంకాలం నాలుగు గంటలు కావొస్తూ ఉంది. పందిరి పక్కన మళ్ళీ

తప్పేట్లు మోగుతూ ఉంటే కారణమడిగాడు కుళ్ళాయప్ప. 'కొత్తగా పెండ్లయిన దంపతు లిద్దరూ రెడ్డి, కరణం, ప్రెసిడెంటిండ్లకు పొయ్యి వాళ్ళ కాళ్ళకు నమస్కారం చెయ్యడం, వాళ్ళేదన్నా యినామిత్తే తీసుకోడం మన ఇండ్లలో ఆచారమప్పా అని గంగడు చెప్పాడు.

కుళ్ళాయప్పకు ఆ పద్ధతేం నచ్చలేదు. పైగా యెవరెవరి కాళ్ళో పట్టుకోవడం తనకేం ఖర్మ అనుకొని "ఇవన్నీ పాత పద్ధతులు మామా, మనం వీటిని గౌరవించినన్నాళ్ళూ అవి ఇట్లే ఉంటాయి. ఇలా మనం ఉన్నంతకాలమూ వాళ్ళు మనల్ని తక్కువగా చూస్తూనే వుంటారు. మనవల్ల అంత గౌరవం పొందేవాళ్ళు మరి కనీసం మన మీద కొంచెమైనా సానుభూతి చూపినారా? శుభ కార్యంకోసం స్కూల్లో వుండే బెంచీలూ, కుర్చీలూ అడిగితే ఇవ్వడాని కసహ్యించుకున్నవాళ్ళు మనల్ని ఎంత నీచంగా చూస్తున్నారో తెలుసా మామా? అట్లాంటివాళ్ళ కాళ్ళెందుకు పట్టుకోవల్ల? పైగా వాళ్ళిచ్చే ఇనాములు ప్రేమతో కాదు, వాళ్ళ పెద్దరికాన్ని చాటుకోడానికే ఇదెంత అసహ్యం మామా! దయచేసి నన్ను బలవంతం చెయ్యకండి. నేను రాలేను" అంటూ ఖచ్చితంగా చెప్పాడు కుళ్ళాయప్ప.

గంగనికి అల్లుడు చెప్పినదంతా నిజమే అనిపించింది. మరేం మాట్లాడకుండా 'సరే నీ ఇష్టమప్పా' అన్నాడు. పక్కనే వున్న తలారి దురగన్నా, ఎట్టి వీరన్నా వాళ్ళూ వీళ్ళూ "అదేందిరా గంగా, నీకేమన్నా బుద్ధుందా లేదా? ఆ పిల్లోడేందో తెలిసో తెలీకో మాట్లాడితే దానికి నువ్వూ కొట్టడమేనా? పల్లెలోని యెవారాలు ఆ పిల్లోనికేం దెలుసు? పెండ్లయితానే మొగుడూ పెండ్లామూ పాయ్ పెద్దోలందరికీ కాల్లకు మొక్కి రావడం మన మామూలు పద్ధతి. ఇది మా పిల్లప్పట్నుండీ సూత్రాండామప్పా. ఈ పొద్దు మానుకుంటే వాల్ల కింద బతికే వాల్లం. రొంతాలోసించుకో" అని వొక్కసారిగా హెచ్చరించారు.

గంగనికి యేం చేయాలో దిక్కు తోచలేదు. వాళ్ళు చెప్పిందీ నిజమే అనిపించింది. కానీ యెవరి మాట వినడం? అల్లుడేమో రానంటాడు. వీళ్ళేమో ఇది మంచిది కాదంటారు. నిజానికి జరగాల్సిన మామూలు జరక్కపోతే కష్టమే మరి. ప్రతి రోజూ ప్రొద్దున లేవగానే వాళ్ళ ఇండ్లకు పోక తప్పదు. అట్లాంటి వాళ్ళతో ఎదురు పెట్టుకుంటే మంచిది కాదు. ఈ జీవితం వొకనాటిదా రెన్నాళ్ళదా' ఆలోచించాడు గంగడు. అల్లుని చేయి పట్టుకొని "అది గాదప్పా ....పల్లెటూర్లో వుండే ఇబ్బందులు నీకు తెలీవు. వాల్ల పంచన బతికేవాల్లం మేము. ఈ పొద్దు జరగాల్సిన మామూలు తప్పిస్తే ఏం బాగుంటుంది. యెట్లనో రొంతోర్చుకోవల్లప్పా" అని బ్రతిమాలాడు. కుళ్ళాయప్ప వాళ్ళ ఇబ్బందుల్ని

అర్థం చేసుకున్నాడు. పైగా తాను చాలా కష్టపడి ఆ పెళ్ళి చేసుకుంటున్నాడు. తన జీవితంలోకి ప్రవేశించిన తన అర్ధాంగి మల్లమ్మ తన కులంలో మరెక్కడా కనిపించనంతటి చదువూ సంస్కారం అందం చందం కలిగిన అపురూపవతి. అలాంటిది తనను పక్కకు పిల్చి కులం పెద్దల మనసు నొప్పించకండని చెప్పేసరికి కుళ్ళాయప్ప సరే నన్నాడు.

తప్పెట్లు మోగాయి. పెళ్ళికొడుకు సూట్ వేసుకున్నాడు. అతనికి తగినట్లే అందా లొలుకుతూ పెళ్ళికూతురు మల్లమ్మ, వూరేగింపుగా బయలు దేరారు మొదటగా కొండారెడ్డి యింటికి.

కొండారెడ్డి యిల్లు వూరి చివరగా వున్న మేడ. బజారుగుండా వెళితే దగ్గరే. కానీ తప్పెట్లు హరిజనవాడ నుంచీ వూరి వెనకున్న కక్కసు దొడ్డిదారి వైపు నడిచాయి. వియ్యంకుల ఆడవాళ్ళు "ఇట్లా యెక్కడికి" అని అడిగారు. "నడి బజార్లో మనం వూరేగింపుగా పోగూడదమ్మా" అని పెళ్ళికూతురు తల్లి చెప్పింది. అది విన్న కుళ్ళాయప్ప మనసు చివుక్కుమంది. తానూ వొక పల్లెటూరివాడే కానీ తన కులం వాళ్ళమీద ఇంత దౌర్జన్యం తానెక్కడా వినలేదు. కారంచేడూ, పదిరికుప్పం సంఘటనలు కూడా ఇంత నీచంగా వుండవేమో. కులం పేరుతో పెద్దవాళ్ళయిన వారికి నమస్కారం చెయ్యడానికి దొడ్డిదారెంట పోవడం, పైగా అది పెద్ద కులాలవాళ్ళ ఆడవాళ్ళ కక్కసు దొడ్డి దారికావడం. అతనికి అసహ్యమేసింది. ససేమిరా ఆ దారి వెంట రానన్నాడు. పక్క నున్న మల్లమ్మ కూడా అతన్ని సమర్థించింది. కుళ్ళాయప్ప తన పక్కనున్న పెద్దలు చేస్తున్న పనిలోని నీచత్వాన్ని ఎత్తి చూపి వాళ్ళ నోళ్లు మూయించాడు. అందరికీ అతని మాటలవల్ల రక్తం కాస్త వేడెక్కింది. "అవున్నా, పెద్దోల్లకు నమస్కారం చెయ్యడానిక్కూడా కక్కసు దొడ్డి దారెంటనే యెందుకు పోవల్ల?" అని ప్రశ్నలు వేసుకున్నారు. బజారు గుండానే పోదామన్నారు. తప్పెట్లు కొత్త శబ్దంతో బజారు మార్గం పట్టాయి.

బజార్లో ఎల్లమ్మ కట్టమీద వేపచెట్టు కింద ప్రెసిడెంటు తమ్ముడూ, ఇంకా ముగ్గురు నలుగురు కూర్చొని లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు. తప్పెట్ల శబ్దమూ బజార్లో ఊరేగింపుగా వొస్తున్న గంగని ఆర్భాటమూ చూసి ప్రెసిడెంటు తమ్ముడు వెంకటరెడ్డి సహించలేకపోయాడు. తటాలున ఎల్లమ్మ కట్ట దిగి గట్టిగా గద్దించాడు. తప్పెట్ల శబ్దం నిలిచిపోయింది.

"యేరా గంగా, యానాడూ లేని మామూలు ఈ పొద్దు నువ్వు కొత్తగ్గా పెడతాండావే. యానాడన్నా చూసినావేంరా మాదిగ నాయాళ్ళు ఈ వూర్లో

బజారుగుండా వూరేగడం? మేం వూరికే వుండేకొద్దీ కండ్లు నెత్తి కెక్కుతుండాయిరా మీకూ! సన్నజాతి సన్నరకంగానే వుండాల్ల గానీ మరీ ఇంత మిడిసిపాటు పనికిరాదురా" అని తీవ్రంగా మందలించాడు వెంకటరెడ్డి.

కుళ్ళాయప్ప నరనరమూ ఆవేశంతో పొంగిపోయింది. అతన్ని ముందుకు లాగి తందామా అనిపించింది. అతని ఆవేశాన్ని చూసి గంగడు ముందుకొచ్చి అల్లుని చేయి పట్టుకొని వెంకట్రెడ్డి వైపు ప్రశాంతంగా చూస్తూ "పెద్దరెడ్డిగారికి నమస్కారం చెయ్యడానికని పోతాండామయ్యా. మా దోవంతా శానా గాలీ గాబరాగా వుంటే పట్నమానవల్లుడు బాధ పడతాడని ఇట్లా పోతాండామయ్యా అంతే" అని వొంగి వినయంగా చెప్పాడు.

"యేం నీ పట్నమానవల్లునికి కొమ్ములొచ్చినాయా? ఈ పొద్దు నమస్కారానికంటారు. రేప్పొద్దున మెరిపినే చేసుకుంటార్రా .... వూరికే యెనక్కిపోండోయ్! యాట్నుండి రావల్లో అట్నుండే రావడం నేర్చుకోండి. ఇనాముల కోసం యేమేమి యేవకాలేత్తారో బడపరాయాళ్ళు" అంటూ వెంకట్రెడ్డి చాలా కటువుగా అన్నాడు. ఆ మాటల్తో అందరి అహమూ దెబ్బతినింది.

"ఏమిటండి. నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నారే, ఏం, ముష్టివాళ్ళమనుకున్నారా? మీ వెధవ ఇనాములు బోడిగాని క్కావల్లా? మర్యాదగా మాట్లాడి మర్యాద పెంచుకోవడం నేర్చుకోండి" అని కుళ్ళాయప్ప యెదిరించాడు.

"యేందోయ్, బొలే మాట్లాడుతుండావ్? కండ్లు కానస్తాండాయా లేదా? యెవుడనుకుండావ్ జాగర్త, నీ బర్రెమకలిరిపిత్తాను .... యెధవ నాయలా" అంటూ వెంకట్రెడ్డి గుడ్లిరిమాడు. దాంతో యెదురుగా ఉన్న గంగని గుంపులో చీమూ రక్తమూ 'మీలో యేమన్నా' ఉన్నాయేమో, గంగడు ముందుకొచ్చాడు. అతని వెనక తలారి దురగడూ మరో పది మంది ముందుకొచ్చారు. అందరూ వొక్కసారిగా 'యేం దయ్యావ్, శానా మాట్లాండతావే, నీ యినాముల బోనడాగానికి కావల్లనుకుండావా? యేందో పెద్దోల్లని యెంత తగ్గి మాట్లాడినా మీది శానా జంపయిందే. యేంది కత? .... ఈ బజారు నీ సొత్తనుకుండావా? అడ్డమురా, సూతువు .... పదండ్రా పదండి. ఈ ఈయన్‌తో నేమి మూడు గానులోల్తో" అంటూ ముందుకు నడిచారు. తప్పెట్లు విజయగర్వంతో మోగుతూ ముందుకు సాగిపోయాయి.

వెంకట్రెడ్డి పరువం దెబ్బతినింది. రెపరెపా ముందుకు నడిచాడు.

పక్కనున్నవాళ్ళు 'అంతా కలికాల మప్పా. ల్యాకుంటే ఆ దరిగ్గాడు కూడా అంత యిదిగా మాట్లాడుతాడా?' అని పరస్పరం మాట్లాడుకున్నారు.

తమ్ముడు చెప్పినదంతా విని రెచ్చిపోయాడు కొండారెడ్డి. వీళ్ళనిలాగే వొదిలేస్తే తమ పరువు మాసిపోతుందనుకున్నాడు. వరండాలో 'జగితి మీద' మవునంగా కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

నమస్కారం చేయడానికని గంగని వెనకాలే వొచ్చిన కుళ్ళాయప్ప దంపతుల్ని చూస్తూ "మాకేం నమస్కారం చెయ్యాల్సిన పనిలేదు. వూరికే వెనక్కి తిరిగిపోండి .... ఏమేవ్, వాళ్ళకో పది రూపాయలిచ్చి పంపు. అట్లే నీదేదయినా పాత చీరుంటే ఆ పిల్ల కివ్వు" అని యెగతాళిగా భార్యకు చెప్పాడు కొండారెడ్డి. ఆ మాటల్లోని దర్పాన్ని చూసి కుళ్ళాయప్ప సహించలేకపోయాడు. "మేం పగటి వేషగాళ్ళం కాదండీ, మీరిచ్చే ఇనాములూ, పాత బట్టలూ తీసుకోడానికీ ... ఏదో మా వాళ్ళ దృష్టిలో మీరు పెద్దవాళ్ళనీ, వాళ్ళ తృప్తికోసం మీకు నమస్కారం చేద్దామనీ వచ్చాం. దీవించడానికి బదులు మీరింత నీచంగా ప్రవర్తిస్తారని అనుకోలేదు ... వెళ్ళొస్తాం" అని మరో మాటకు అవకాశంకూడా ఇవ్వకుండా తన భార్య మల్లమ్మతోపాటు బిర బిరా బయటికి వెళ్ళిపోయాడు.

ఇలా జరుగుతుందని గంగ డూహించలేదు. మామూలుగా అయితే కొండారెడ్డి భార్య ఇట్లా వచ్చిన పెళ్ళికూతురుకు పసుపు కుంకుమతోపాటు క్రొత్త రవికబట్ట ఇచ్చి పంపేది. ఈ రోజు కథ తారుమారైంది.

గంగని మనస్సు ఆందోళన చెందసాగింది. ఒక వైపు తన యజమాని, మరో వైపు తన అల్లుడు. తనను ప్రేమగా చూసే రెడ్డి ఈ రోజిలా చేస్తాడని తానూహించలేదు. అయినా వాళ్ళేం చేసినా చెల్లుతుంది. కానీ అల్లునికిది అవమానమే. తన మూలాన తన బిడ్డ జీవిత మేమవుతుందో .... అనుకుంటూ అందరితోపాటు తానూ వెనుదిరిగి పోయాడు గంగడు, అపుడు రెడ్డికి క్షమాపణ చెప్పుకోవాలనిపించినా ఆ వాతావరణం చెప్పనివ్వలేదు.

అల్లుని మవునాన్ని చూసి కాలు కాలిన పిల్లిలా అయిపోయాడు గంగడు. హరిజనవాడలో ఉన్న పెద్దలంతా అడ కూడారు. "ఎంత పెద్దోల్లయితే మాత్తరం ఇంటి ముందుకొచ్చిన, అదీ పసుబ్బట్టలతో వచ్చిన వాళ్ళను ఇట్లా అవమానిత్తారా? ఏం తప్పు పని చేసినామనీ" అని అందరూ కొండారెడ్డిని అసహ్యించుకున్నారు.

మరుసటి రోజు మధ్యాహ్నం కావొచ్చింది. ఎండ చాలా తీవ్రంగా వుంది. ఊరి బయటున్న మంచినీళ్ళ బావి దగ్గరికి కడవలు తీసుకెళ్ళిన మారెక్క,

దురుగమ్మా, గంగమ్మా అందరూ వెనుదిరిగి వచ్చారు. విషయం తెలిసిన గంగడు బాధ పడ్డాడు.

"అరిజనుల మంచిసీల్ల బాయికని గవుర్మెంటోల్లిచ్చిన దుడ్లతో ఆ ముద నట్టపు నా కొడుకులు వాల్లిండ్ల దెగ్గిర బాయి తొక్కని మీకు కూలాయి లేయిత్తామని అంతదంకా మా తోట్లో వుండే బాయిలో సీల్లు తెచ్చుకోండని సెప్పి ఈ పొద్దు సీల్లెత్తక పోద్దంటే ఈల్ల వుచ్చలుగినా తాగల్లా? మెత్త మెత్తగుంటే ఈల్లది శానా జోరయింది" అంటూ దురగడు నోరు చేశాడు.

వీధిలో ఉండే పెద్దలందరూ గంగని పెళ్ళి పందిట్లో గుమిగూడారు. రక రకాలుగా మాట్లాడారు. గంగని మాట ప్రకారం అందరూ ఇళ్ళకెళ్ళి భోజనాలు ముగించుకొని చీకటి పడగానే మళ్ళీ సమావేశమయ్యారు.

రెండేండ్ల కిందట చిన్నెడ్డి కొడుకు తన బిడ్డకు చేసిన అన్యాయం గురించి ఈరన్న ప్రస్తావించాడు. దాంతో వాతావరణం వేడెక్కింది. సంభాషణ పోను పోను తీవ్రమైంది.

రెడ్డిపల్లె చీకటి వొడిలో ఆదమరిసి నిద్రపోతూందేమో కానీ హరిజన వాడలో ఇంకా దీపాలు వెలుగుతూనే ఉన్నాయి. పెళ్ళి పందిట్లోని కంబడి మీద ఆ వీధివాళ్ళ భవిష్యత్తు కొత్త బట్టలు తొడుక్కుంటూ వుంది.

గంగడు బీడీ నోట్లో పెట్టుకొని అగ్గిపుల్ల గీశాడు. ఆ అగ్గిపుల్ల వెలుతురు శబ్దంలో తొలి కోడి కూతలు కలిసిపోయాయి అతని ఆలోచనలు మెలకువగా కోడి కూతలతో పాటు హరిజనవాడ చుట్టూ అలుముకొంటున్నాయి.

కొన్నేళ్ళుగా ఆ పల్లెలో తమ బతుకు లెలా తొక్కివేయబడ్డాయో కళ్ళ ముందగుపించింది. తమను తాము ఎంత తగ్గించుకొంటూ వచ్చినా వాళ్లు తమనెలా తొక్కి పెడుతూ వచ్చారో, పరిస్థితి ఎలా అదుపు తప్పుతూ వచ్చిందో కళ్ళ ముందు పదే పదే కనిపించసాగింది. అల్లునికి గల అభిమానం. అతనికి జరిగిన అవమానం గుర్తు కొచ్చేసరికి హృదయం వేడెక్కిపోయింది. బిడ్డా అల్లుడూ టవున్నుంచీ వచ్చిన బంధువులందరూ ఉదయమే పట్నానికి వెళ్ళి పోవడం మంచిదే అయింది. లేకుంటే ఎంత అవమానం జరిగేది?

గంగడు ఆలోచనల్లోనుంచి పందిరికింద కొచ్చాడు. అతని పెదవులు కదిలాయి. అందరూ వొక నిర్ణయాని కొచ్చారు.

గంగడు ఆరిపోయిన బీడీని మళ్ళీ అంటించాడు. ఆ వెలుగులో అతని పాత ముఖాన్ని పోల్చుకోవడం కష్టమే.

* [ఉదయం వారపత్రిక, 2-6-1991] *

# అగ్నిగుండం

కాలువ మల్లయ్య

ఉదయం పది గంటల సమయం .... జీవన సమరంలో పాల్గొనడానికి పల్లె జనాలు ఇండ్లొదిలి పొలాల కెళ్ళడానికి తయారవుతున్న వేళ....దప్పు చేతిలో పట్టుకొని కాళ్ళీడ్చుకుంటూ ఇంట్లో కొచ్చాడు అంజయ్య .... పొయ్యార్పబోతున్న బాగమ్మను వద్దని పొయ్యి దగ్గరకెళ్ళి ముంగాళ్ళపై కూర్చున్నాడు. దప్పు రెండు చేతుల్తో తింపుతూ సెగపై కాపుతున్నాడు. కొంతసేపు కాపి చేతితో దప్పుపై కొట్టి చూసాడు. 'టప్.... టప్....' మన్న శబ్ద మొచ్చింది.... "సలికాలం.... సంకల్లేవట్టకుంట సలివేసుతుంది .... అట్టిగనే మెత్తవడుతుంది దప్పు." తనలో తాననుకొని మళ్ళీ సెగపై కాపుతున్నాడు.

"గిప్పుడు గా పొయ్యికాడేం జేత్తన్నవు....?" అంపుల కాన్నుంచి వస్తూ అంది బాగమ్మ.

"సలికి మెత్తపడ్డది .... దప్పు కాపుతున్న."

"ఊరు సాటిచ్చచ్చినంక గిప్పుడు గా దప్పు తేనేం పని? తీసి సిలుక్కొయ్యకు తలిగెయ్యి. కొద్దిగైతే ముందంత సేండ్లల్లకు పోతరని పొద్దు గాల్నే పొయ్యి సాటిచ్చిత్తివి. మల్లకాపుదెందుకు?"

"మెత్త గుందన్నట్లు కాపుతున్న."

"నీ కేమన్న పనున్నదా కని ఊరెందుకు సాటిచ్చినట్టు?"

"నువ్వు కట్టం జేసి పెడితెనేం దినవదితి" నిష్ఠూరంగ అని "గిరుదవరి సాట త్తండట. రేపు తాసీలు గట్టన్నట" అన్నాడు అంజన్న.

"అయి తె మాయెగని బువ్వ తిందువురా. నేను కయికిలి పోవాలె" అంటూ అన్నం గంజు దగ్గరి కెళ్ళింది బాగమ్మ.

నీళ్ళు చల్లి పొయ్యి నార్పేసి లేచాడు అంజయ్య. దప్పును కొట్టిచూసాడు 'టన్ - టన్' మని మ్రోగింది. 'దప్పు కాగింది' తనలో తాననుకొని దాన్ని చిలుక్కొయ్యకు తగిలేసాడు. ఇంటి వెనుక కెళ్ళి కుండల్లో వున్న నీళ్ళతో కాళ్లు కడుక్కున్నాడు. గుడిసెలో కొచ్చి గొంగడి ముద్దగా వేసుకొని దానిపై కూర్చు న్నాడు. ఎర్రగా వున్న అసినికార్తి బియ్యపన్నం తెల్ల గిన్నెలో వేసుకొని తెచ్చి అంజయ్య ముందుంచింది బాగమ్మ. పచ్చిపులుసు గంజి తెచ్చి ప్రక్కన పెట్టింది.

"అట్టి పులిసేనాయె? ఏం కూర జెయ్యలే!"

"ఇంట్లేమున్నయని సెయ్యాలె? కాల్లెకు పొయ్యో ఈడుకచ్చినా రెక్కా డంది డొక్కాడింది లేపాయె. ఎట్లనో కడుపు నింపుకోలేవు."

"నాల్గు బుక్క లెట్లనో మాతింట తియ్యి" అని పులుసుతో కలుపు తున్నాడు.

"సేతికచ్చిన కొడుకు అందకుంట పాయె. ఎవ్వలననేం లాబం? మన రాత. ఆ నారాయణమూర్తికి మన మీద కనికరం లేదాయె." బాగామ్మ కళ్ళ నిండా నీళ్ళు.

భార్య కళ్ళలో నీళ్ళు చూసిన అంజయ్య నోట్లోకి బుక్క పెట్టుకోబోయి ఆగాడు. పాతికేళ్ళ కొడుకాతని కళ్ళ ముందు కదిలాడు. అతని హృదయం భారమయింది. ముఖంలో విషాదం.

"ఏంది? తినెటోని వాగుతివేంది? జెప్ప జెప్ప నాల్గు బుక్కల్దినేదన్న పనికి పో. ఆడి పోతగాండ్లత్తగారింటికి పెయిరి. ఎదిగిన కొడుకును పోలిసొల్లు తన్నుక పెయిరి. కొడుకు దూరమయినప్పటికల్ల పురాగెందు కత్తన్నవు. మన నసీవెట్లుంటె గట్లయితది. ఇగ పుట్టినంక సచ్చెదా కెట్లనో బతుకాలె. అద్దిని గంజులున్న దింకింతేసుకొని తిను. నేను ఏ పొలం నాటేసుడో పటేలవ్వ నడి గత్త." కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ బయట కెళ్ళింది బాగమ్మ.

అంజయ్య అన్నం కెలుకుతున్నాడు. కాని ఒక్క బుక్క కూడా నోట్లో పెట్టుకోవడంలేదు. పెట్టుకుంటానికి మనసొప్పడం లేదు. కళ్ళవెంట కారుతున్న నీళ్ళు పళ్ళెంలో పడుతున్నాయి. అతని కళ్ళముందెన్నో దృశ్యాలు. తాను దప్పు

కొడుతూ జీవిస్తున్న బ్రతుకు .... తిట్లు .. అవమానాలు....దెబ్బలు....ఎన్నెన్నో తిరుగుతున్నాయి....

*　　　*　　　*

'దొడ్డాంక దొం-దొడ్డాంక దోం ఇన్నోల్లెవరో! ఇననోల్లెవరో రేప్పొద్దుగాల ఊల్లెకు తాసీల్దార త్తండట - తాసీలు గట్టకుంటున్నోల్లంత గట్టన్నట. లేకుంటె ఏది దొరుకుతె అది కొంచవోతరటావో."

"ఇన్నోల్లెవలో? ఇననోల్లెవలో, ఊళ్లెకు గొడ్ల డాకుటర త్తడట. గొడ్డు గోదకు సూదు లేత్తరట. రేపొద్దుగాల బడికాడున్న మైదానంలకు గొడ్లన్నిట్ని కొట్టుక రావాన్నటాహో."

ఊళ్లో ఏ అవసరమున్నా నలభై ఏళ్ళుగా తానే ఊరు చాటింపు చేస్తున్నాడు. 'మల్ల తాసీలచ్చె. పంట పండకున్నా తాసీలయితె తప్పక పాయె. బిందెలో సెంబులో సుంకరోడెత్తుక పోతందుని తన చాటింపును విని మందనుకునే మాట లెన్నోసార్లు విన్నాడు. ఊరంతా తిరిగి చాటింపు చేస్తే మొదట్లో తనకు పావలా ఇచ్చేవారు. అటు తర్వాత అర్ధరూపాయి, రూపాయి, రెండు, ప్రస్తుతం ఐదు రూపాయ లిస్తున్నారు. ఈ వృత్తి కడుపు నింపకున్నా అలాగే బ్రతుకుతున్నాడు. దప్పు కొట్టడంలేని సమయాల్లో కూలి పని చేసుకుంటున్నాడు.

"డొం....డొం .... డొం....డొం .... డొం...." పోచమ్మ దప్పు కొట్టాడు తాను. తాము ఎగురుతూ డప్పు కొడుతుంటే తన వెనుక శివం తూలుతూ చేతుల్లో వేప మండలతో స్త్రీ లొస్తారు. వాళ్ళ వెనుక బోనా లెత్తుకున్న వాళ్ళు. ఊరవతలున్న-పోచమ్మ గుడిదాకా దప్పు కొడుతూ ఎగురుతూనే పోవాలి. దప్పు చప్పుడుతో శివం తుచేవాళ్ళకు త్తేజం తేవాలి ఎగురుతూనే తిరిగి రావాలి. కాలాగుతే తిట్లు .... చివాట్లు.

"డొడ్డోం డొం .... దోం డొం డొం డొండ్డోండొం .... డోండొండొం.... పెళ్ళి దప్పు కొచ్చాడు తాను .... దొరల కొడుకుల, బిడ్డల పెళ్ళిళ్ళకు బ్యాండు మేళంతో పాటు తమ దప్పుంటుంది .... పేదవాళ్ళ పెళ్ళిళ్ళకు మాత్రం తమ డప్పే అన్నిరకాల వాద్యం....తన దప్పు చప్పుడుతో పెళ్ళి చేసుకున్నవాళ్ళెంతో మంది పెద్దవాళ్ళయ్యారు....ఒక్కొక్కప్పుడు తమ దప్పు మేళం వాళ్ళంతా సవారెడ్ల బండితో సమానంగా పరుగెత్తాలి .... చలిలో, ఎండలో ఏ నిముషంలోనైనా పల్లకి, బండ్లతోపాటు తామురకాలి .... తాము వెనుకైతే తిట్లు . . చీవాట్లు .... ఒక్కొక్కప్పుడు దెబ్బలు.... అలసిసొలసి పెళ్ళివారూరు చేరితే అక్కడ తాము వాకిళ్ళలో మాత్రమే వుండాలి. ఇంట్లోకి ప్రవేశం లేదు. వాకిట్లో కూర్చోబెట్టి

భోజనం పెడ్తారు. అదీ అందరు తిన్న తర్వాతే! పెళ్ళి ఊరేగింపు ముందు తాము గజ్జెలు కట్టుకొని ఎగరాలి. కాళ్ళు నొప్పులు పెట్టినా డప్పు కొడుతూ ఎగరాలి. దప్పాగితే బూతులు .... తమకు కూలిగా ముట్టింది చాలా స్వల్పమే.

ఇంకా తాను కాళ్ళ గోళ్ళ (శోభనం) డప్పు కొట్టాడు. తన డప్పు చప్పుడుతో ఎన్నో జంట లేకమయ్యాయి.

ఊళ్లో ఏ కార్యమయినా తన డప్పే. ఇదే వృత్తిగా ఇన్నేళ్ళుగా బ్రతుకు తున్నోడు. కాని, తానెన్ని అవమానాలు పొందాడు? ఎన్ని తిట్లు తిన్నాడు? ఎంత ఘర్షణ ననుభవించాడు? ఊరు వాళ్ళంతా తనను రారా పోరా అనే పిలి చారు. అంజిగా అనే పిలిచారు. మాదిగోడా అనే పిలిచారు. పేరుపెట్టి పిల్చిన వాళ్ళు తక్కువ. ఈ వృత్తి తనకు అవమానాలనే మిగిల్చింది. అవమానాల ననుభవించడానికే తాను పుట్టాడా? ....

అంజయ్యలో రకరకాల ఘర్షణ. కళ్ళవెంట నీళ్ళు బయట్నుంచి ఇంట్లో కొచ్చిన భాగమ్మ భర్త అన్నంలో చేతులుపెట్టుకొని అలాగే ఉండడం, కళ్ళ వెంట నీళ్ళు కార్చడం చూసింది. దగ్గరి కొచ్చింది.

"ఏందియ్యల్ల నీకేమయింది? ఎందుకోసరం గిట్లున్నావు? కొడుకు యాది కచ్చిండా? ఏం జేత్తాం? మన కరుమం గిట్లుంది. ఒక్క బుక్కన్న తిన్లేదేంది? తిను తిను" అని బతిమలాడి అన్నం తినిపించింది. తాను కూడా తిని వన్లో కెళ్ళింది. అన్నం తిని మంచులో పడుకున్నాడు అంజయ్య. లేచి పనికి పోదామను కున్నాడు. చేతకావడంలేదని అలాగే పడుకున్నాడు. ఎంతకూ నిద్ర రావడం లేదు. వేదనా భరితమై భారమైయున్న అతని మనసు మళ్ళీ గతంలో కెళ్ళింది.

*           *           *

ఆ రోజు .... ఆ రోజు.... రెక్కల కష్టంతో, బండెడు చాకిరీతో బ్రతుకు తున్న తనపై దొంగతనం నేరం మోపాడు పటేలు. చేయని నేరానికి పోలీసుల తోని చావుదెబ్బలు తిన్నాడు తాను. బూట్ల తన్నులు తిన్నాడు. తాను జీవితంలో ఎన్ని పరాభవాలను చూసాడు? ఎంత నీచంగా చూడబడ్డాడు? అంటరానివాడిగా మాదిగోడుగా ఎన్నో అవమానాల పాలయ్యాడు. తానన్ని పనులు చేయాలి. కాని ఇంట్లో కడుగు పెట్టకూడదు. తాను ముట్టిన వస్తువుపై నీళ్ల చల్లికాని తీసుకోరు. తనకు క్షవరం చేసే మంగలి గొంగలి కట్టుకుంటాడు. పటేలుతో దెబ్బ తిన్న రోజున తానో నిర్ణయానికొచ్చాడు. తన బ్రతుకెలాగో గడిచిపోతుంది. తన బ్రతుకు తన కొడుక్కు రాకూడదు. తన కొడుకు చదువుకోవాలి. తానెంత కష్టపడైనా సరే తన కొడుకును చదివిస్తాడు. తన కొడుకు చదువుకుంటే

వాడన్నా సుఖపడతాడు. తనలాంటి కష్టమయ బ్రతుక్కు దూరంగా వుంటాడు. అని నిర్ణయించుకొని కొడుకును బడికి పంపించడం మొదలుపెట్టాడు. పలకా బలపం పట్టుకొని కొడుకు బడికెళుతుంటే తామెంతో ఉప్పొంగిపోయారు. ఒక్కో తరగతి పాసవుతూ పై తరగతి కొస్తుంటే తన కష్టాలు గట్టెక్కుతున్నట్టే తల చాడు. హైస్కూల్ సదువుకొచ్చిన కొడుకును జూసి ఎగిరి గంతేశాడు. తాను కన్న కలలకు ప్రతి రూపంగా తన కొడుకు పోకిరీ వేషాలెయ్యకుండా చదువు కున్నందుకు అపరిమితంగా సంతోషించాడు. తానెన్నోసార్లు కొడుకును దగ్గరకు తీసుకొని "బుద్ధిగ సదువుకో బిడ్డ .... ఎవ్వాల జోలికి పోకు. కాయకష్టం సేసి నిన్ను సద్దివిత్తన్న. నువ్వు సదివినంత సదివిత్తా నా రెక్కల కట్టంతోని. నువ్వయితే మంచిగ సదువుకో...." అన్నాడు.

"నాయినా! నువ్వు నా కోసమెంత కష్టపడుతున్నావో నాకు తెలువదానె! మీరు కోరుకున్నట్టే నేను మంచిగానే సదువుకుంట. నా చదువయిపోతే మీకే కష్టాలుండవు." అన్నాడు కొడుకు.

కొడుకు చదువుకోసం తాను, బాగమ్మ రక్తాన్ని నీళ్లగా మార్చుకున్నారు. కడవల కొద్దీ ఘర్మజలాన్ని ధారబోశారు. రాత్రింబవళ్ళు విరామం లేకుండా పని చేశారు. కొడుకు హైస్కూలు చదువు పూర్తి చేసిన రోజున తమ సంతోషాని కంతు లేదు. కాలేజీ చదువు తమకు శక్తికి మించిందే అయినా చదివించడానికే నిర్ణయించుకున్నారు. ఒక్క క్లాసులో కూడా తప్పకుండా బుద్ధిగా చదువు కుంటున్న కొడుకును చదువు మాన్పించాలన్న ఆలోచనే తమకు రాలేదు.

అప్పుడప్పుడే ఊళ్ళలో అలజడి ప్రారంభమయింది. ఎవరెవరో కొత్త వాళ్ళు ఊళ్ళ కొస్తున్నారు. ఏవేవో రాజకీయాలు చెబుతున్నారు. ఆ మాటకు చాలా మంది ఆకర్షితులవుతున్నారు. కూలిరేట్ల పెంపు గూర్చి, పాలేరు జీతాల పెంపు గూర్చి సమ్మెలు, ఆందోళనలు జరుపుతున్నారు .... ఊళ్ళలో పోరాటాలు మొదలయ్యాయి. పోలీసులు కొంతమంది యువకులను తీసుకెళ్తున్నారు. తాను ఇవేవీ పట్టించుకోలేదు. తన ఏకైక ధ్యేయం తన కొడుకును బాగా చదివించి మంచి ఉద్యోగిగా చూడటమే .... కానీ కొడుకు కాలేజీ కెళితే అతని కిలాంటి రాజకీయాలతో సంబంధం ఏర్పడుతుందేమోనన్న భయం తనకొచ్చింది. అందుకే కాలేజీకెళ్తున్నప్పుడు కొడుకుతో చెప్పాడు తాను: "బిడ్డా! నిన్ను మేము ఒళ్ళె వెట్టి సాదుకున్నం. నీ మీదనే ఆశలన్ని పెట్టుకొని బతుకుతాన్నం. మంచిగ సదువుకో బిడ్డ! ఎవ్వల్తోని తిరుగకు. ఎవ్వలేం జెప్పినా ఇనకు. మమ్ముల గంగల కలుపకు...."

"నాయన్నా! నాకు నువ్వ గిన్ని మాటలు చెప్పన్నా యె! నాకు చదువే ముఖ్యం. నా గురించి మీకేం ఫికరద్దు," అన్నాడు కొడుకు.

ఒక్కొక్క సంవత్సరం చదువు పూర్తి చేస్తుంటే తాను కొండెక్కినంత సంబరపడ్డాడు. మరోదిక్కు ఊళ్ళలో పోరాటాలు ఉద్ధృతమవుతున్నాయి. కాలేజీ పిల్లలను కూడా పోలీసులరెస్టు చేస్తున్నారని విని తాను భయపడ్డాడు. కాని-తన కొడుకెందులోనూ తిరుగడని, అలాంటప్పుడు తన కొడుక్కేం ప్రమాదం లేదని తనను తాను సమాధాన పర్చుకున్నాడు. హాస్టలు విద్యార్థులనూ పోలీసులు తీసుకెళ్తున్నారని విని వణికిపోయాడు. తాను చదువు మాన్పించి ఇంట్లోనే వుండుమందామంటే పట్టణాల్లో కంటె పల్లెల్లోనే పోలీసు నిర్బంధ మెక్కువగా వుంది. విద్యార్థులు కొందరు రాజకీయాల్లో తిరుగుతున్నా తన కొడుకు తిరుగడని తన ప్రగాఢ నమ్మకం. చదువుకునే ధ్యేయంగా కల్గి ఉంటాడని తన విశ్వాసం. అలాంటి వాడి జోలికి పోలీసులు మాత్రం ఎందుకు పోతారని అనుకున్నాడు తాను. తన కొడుక్కేం జరగదు .... తన కొడుక్కేం జరగదు — తనను తానే సమాధాన పరచుకున్నాడు. సెలవుల్లో ఇంటికొచ్చిన కొడుకుతో అన్నాడు తాను: "బిడ్డా! బట్టగాల్చి మీదేసే కాలమిది. అల్ల అంటు సొంటుకు పోకు నీకేమన్నయితే మేం బతుకం."

"నాయన్నా! నే నెట్టి పరిస్థితుల్లోనూ అందులోకి పోను. నాకు చదువే ముఖ్యం. కాని, వాళ్ల చెప్పే విషయాలూ ఆలోచించ దగ్గవిగానే వున్నాయి. అందరికి తిండి, గుడ్డ, గూడు కావాలనడంలో తప్పు లేదు. కాని వాళ్ళ హింసాయుత మార్గమే నాకు నచ్చడం లేదు." అన్నాడు కొడుకు.

ఆ మాటలు విని తాను వణికిపోయాడు.

"అంటే నీ కూ్కడా వాళ్ళ దిక్కు మనసు పోతుందన్న మాట."

"నాయన్నా మీకా భయమక్కర్లేదు. ఎట్టి పరిస్థితిలోనూ నేను నా ధ్యేయాన్ని మరచిపోను. కాని మనమెంత తెలుసుకోవద్దనుకున్నా ఆ విషయాలు తెలియకుండా వుండవు నాన్నా! యూనివర్సిటీ గోడలన్నిండా అవే రాతలు. రోజుకో కరపత్రం. హాస్టల్ గదుల్లో పుస్తకాల్లో ఎంత వద్దనుకున్నా వాటిదిక్కు చూసేలా చేస్తాయి. అయినా నేను వాటి జోలికి పోవడంలేదు." అన్నాడు కొడుకు.

మరోసారన్నాడు కొడుకు తనతో: "నాయన్నా! మన తెలంగాణా ఏరియంతా ఓ అగ్నిగుండమోలె వుంది. ఎక్కడడుగేస్తే ఏమవుతుందోనన్న భయం. ఎప్పటికేదో అలజడి. రక రకాల విద్యార్థి యూనియన్లు. ఒకర్నొకరు చంపుకోవడం, యూనివర్శిటీలన్నిండా, కాలేజీలన్నిండా, హాస్టల్ గదుల చుట్టూ

ఎక్కడ చూసినా పోలీసులే. చదువులు చక్కగా సాగడం లేదు. ఎంత వద్దనుకుంటున్నా - విషయాలు తెలుసుకోకుండా వుండలేకపోతున్నాను."

"ఊళ్లు గూడ గట్లనే ఉన్నయి బిడ్డ. రోజు కొగన్ని పోలీసోల్లు పట్టుకపోతనే వున్నరు. ఎవ్వలది నిజమో, ఎవ్వలది అవద్దమో కాని మనుషుల సంపుడయితె బాగలేదు." అన్నాడు తాను.

ఏదో విధంగా చదువు పూర్తి చేస్తే చాలనుకున్నాడు తను.

కొడుకు ఎమ్మే ఆఖరు సంవత్సరం చదువుతున్నాడు. ఇంకో ఆరు నెలల్లో చదువు పూర్తవుతుంది. కొడుకు చదువు పూర్తయితే తన కష్టాలు గట్టెక్కుతాయని ఆనందించాడు తాను. కొడుకింటికొచ్చినప్పుడేవేవో విషయాలు తనకు చెబుతూనే వున్నాడు. చదువే ముఖ్యోద్దేశ్యంగా సాగిపోతున్నానని చెబుతున్నాడు. బుద్ధిమంతుడైన తన కొడుకును గూర్చి సంబరపడుతున్న సమయంలో హాస్టల్ గదిలో అతన్నరెస్టు చేశారని విని లబ లబ మొత్తుకున్నాడు తాను. కంటికో కడివెడుగా ఏడ్చాడు. కొడుకున్న హాస్టల్ గదిలో ఏవో పుస్తకాలు దొరికితే అరెస్టు చేశారని విని ఏడ్చాడు. రెండ్రోజుల తర్వాత విడుదలై వచ్చిన కొడుకును దగ్గరకు తీసుకొని కన్నీరు కార్చాడు.

"నాయన్నా! ఆ పుస్తకాలు నేను తెచ్చినవి కావు. అయినా పుస్తకాలు చదివినంత మాత్రాన ఏం ప్రమాదముందో నాకర్థంగాదు నాయన్నా! ఒక విధంగా పోలీసులే నాలాంటి ఏం తెలియని వాళ్ళను కూడా అరెస్టు చేసి రాజకీయాలు నేర్చుకోవడానికి దోహదం చేస్తున్నారు. ఏ సంబంధం లేనివాన్ని ఇలా రెండు మూడు సార్లరెస్టుచేసి కొడితే వాడు మొండిగా తయారవుతాడు. అందులో కలిసిపోయినా కలిసిపోతాడు. చాలామంది విషయంలో ఇలా జరుగుతుంది. ఆ పుస్తకాలు మా పక్క రూమతనివి. చదివి మా రూంలో వేశాడు." అరెస్టు కారణాన్ని చెప్పాడు కొడుకు.

"ఏ దెట్లయినా బిడ్డా! ఇంక నాలుగైదు నెలలల్ల నీ సదువయిపోతది. ఇక్కడ బతుకచ్చేటట్టు లేదు. ఏడికన్న పొయ్యి బతుకుదాం. నువ్వు నా కండ్ల ముంగలుంటె సాలు బిడ్డ" అన్నాడు తాను.

"నేనేం పట్టించుకోవడం లేదు నాన్నా! కాని ఎవరో చేసిందానికి మరెవరో బలవుతున్నరు. నేను ఏ గొడవ లేకుండా చదువు ముగించుకొస్తా" అని వెళ్ళిపోయాడు కొడుకు.

రెన్నెల్లలో పరీక్షలయిపోగానే ఇక కాలేజీకి పోయే అవసరం లేకుండా తిరిగి వస్తున్న కొడుకును గూర్చి, కొడుకు భవిష్యత్తును గూర్చి ఎన్నో కలలు గన్నాడు తాను. కాని తన కలలు కల్లలయ్యాయి. ఆశలు అడియాసలయ్యాయి.

యూనివర్సిటీలో జరిగిన విద్యార్థి హత్య కేసుతో సంబంధముందని తన కొడుకును అరెస్టు చేశారని విన్న తనపై పిడుగు పడ్డట్టయింది. తాను, బాగమ్మ గొడ గొడా ఏడ్చారు. వల వల వలపోశారు. తన కొడుకును విడిపించమని ఎందరి కాళ్ళో పట్టుకున్నారు. కాని ఫలితం శూన్యం. పోగా పోలీసులు తన ఇంటిపై కూడా దాడిచేసి అల్లకల్లోలం సృష్టించారు. తామెంత మొత్తుకున్నా విన్లేదు. చితక బాదారు. కాళ్ళు పట్టుకున్నా విన్లేదు. "మీ మాదిగ మన్నెపోల్లకు అల్లతోని సంబంధముంటది. లేదంటే ఎవ్వాల్నమ్ముతార్రా? హత్య నేసినోల్లండ్ల నీ కొడుకున్నడు" అని ఇష్టమున్నట్టు కొట్టారు తమను. తనకా సంబంధం లేకున్నా హత్యా నేరంపై ఏడాదిపైగా పోలీసు నిర్బంధంలో వున్నాడు కొడుకు. కొడుకు రాకకోసం ఎదురు చూస్తూ జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్నారు తాము.

* * *

గతమంతా సినిమారీళ్ళలా కళ్ళ ముందు కదలగా అంజయ్య హృదయం భారమయింది. మంచంలో లేచి కూర్చున్నాడు.

'కొడుకెక్కడున్నాడో తెలియదు. అసలు బ్రతికున్నాడో లేదోతెలియదు. కొడుకునేం చేశారో తెలియదు. బ్రతికుంటే ఎప్పుడొస్తాడో తెలియదు. ఏం తెలియని కొడుక్కు ఎందుకింత శిక్ష భగవంతుడా?' తనలో తానే భగవంతుని జ్ఞాపకం చేసుకున్నాడు అంజయ్య.

'అసలిదంతా ఎందుకు జరుగుతుంది? కొడుకు చెప్పినట్టుగా తమ ప్రాంత మంతా అగ్ని గుండంలా ఎందుకు మారింది? ఈ అగ్ని గుండంలో ఎంతమంది మసైపోవాలి? అసలెవరిది తప్పు? మింగమంటే కప్పకోపం, విడువమంటే పాముకోపం. సామాన్యుడి బ్రతుకు అడకత్తెర మధ్య పోకలా వుంది. అటు పోలీసుల్నుంచి బాధ. ఇటు ఉద్యమకారుల్నుంచి. తనలాంటివాడికంతా అయోమయంగా వుంది. తనకు తన కొడుక్కావాలి. కాని కొడుకెలా రావాలి?' అంజయ్యలో అంతులేని ఆలోచనా పరంపర.

మంచంలోంచి లేచాడు. డప్పు, కట్టె చేతిలోకి తీసుకున్నాడు. 'డం డాం డం....డం....డాం....డం' డప్పుపై విషాద నాదాన్ని పలికిస్తున్నాడు. అతని కళ్ళు వర్షిస్తున్నాయి. హృదయం కొడుకోసం ఘోషిస్తూంది. తన బాధను మరచిపోవడానికి నిస్సహాయంగా డప్పు వాయిస్తున్నాడు. ఈ అగ్ని గుండంలో ఎలా బ్రతకాలో తెలియక వాయిస్తున్నాడు. చేతి కెదిగిన కొడుకు నెలా తెచ్చుకోవాలో తెలియక నిర్విరామంగా వాయిస్తున్నాడు చేతులు నొప్పి పెడుతున్నా. కళ్ళవెంట కారుతున్న నీళ్ళు డప్పుపైబడి అది మెత్తబడి టప్ టప్ మన్న ధ్వని వస్తున్నా చేతిలో కట్టె విరిగే వరకు డప్పు వాయిస్తూనే ఉన్నాడు అంజయ్య.

* [అభ్యుదయ, మార్చి - ఏప్రిల్ - 1991] *

# వెలి

చిత్తూరి కోటేశ్వరరావు

పశ్చిమ గోదావరి జిల్లాలోని విప్పర్రు గ్రామం అంటే తెలియని వారెవరు వుండరు.

ఆ గ్రామంలో క్షత్రియులు పెద్ద సంఖ్యలోను, హరిజనులు తక్కువ సంఖ్యలోను వున్నారు.

ముప్పయి ఏళ్ళ క్రిందట వెంకటరాజుగారు వారి చెల్లెలు సుభద్రను మార్కాపురం వాస్తవ్యుడు చిరంజీవి రాజుకు యిచ్చి పెళ్ళి జరిపించాడు.

దురదృష్టవశాత్తు సుభద్ర కొడుకును కన్న నెల రోజులలోనే చిరంజీవి రాజు యాక్సిడెంటులో చనిపోయాడు.

అభిమానపడి సుభద్ర ఇటు అత్త మామల నీడన ఇమడలేక, అటు పుట్టింటిలో వైవిధ్యాన్ని అనుభవిస్తూ ఉండలేక, తన కాళ్ళమీద తను నిలబడడానికే నిశ్చయించుకుంది.

తనకు పసుపు కుంకుమ క్రింద వచ్చిన రెండు ఎకరాల మాగాణి పొలాన్ని కౌలుకిచ్చి ఆ వచ్చిన ఆదాయంతోనే కొడుకు రామరాజును పెంచుకుంటూ వస్తూవుంది. కొడుకు తను ఆశించినంత ప్రయోజకుడు కాలేకపోయాడు. అలా అని ఆమె ఏనాడు చింతించలేదు. తన పసుపు కుంకుమ పోయిన రోజే విధి వ్రాతను నిందించలేదు.

కొడుకు రామరాజు ఉదయం నుండి సాయంత్రం వరకు జులాయిగా తిరుగుతూ, గ్రామ చావిడిలో పేకాట ఆడుతూ అప్పుడప్పుడు దగ్గరలో వున్న తాడేపల్లి గూడెం వెళ్ళడానికి డబ్బులుకోసం తల్లిని రకరకాలుగా విసిగించడం అలవాటయిపోయింది.

సుభద్ర ఊరకనే ఇంట్లోవుంటూ సోమరిగా జీవితం గడుపుకోడానికి సనేమిరా ఒప్పుకోక, ఆ వూరిలోని పది ఇళ్ళలో పండుగలకు, పెళ్ళిళ్ళకు అడపా దడపా సహాయం చేస్తూ, ఎవరికి తోచింది వారు ఇస్తే పుచ్చుకుని జీవితాన్ని వెళ్ళమారుస్తున్నది.

*　　　　*　　　　*

సత్యం మాష్టారు చిన్నప్పుడే భార్యను పోగొట్టుకుని ఒక్కగాని ఒక్క కూతురు శ్యామలను అల్లారుముద్దుగా, కంటికి రెప్పలా కాపాడుకుంటూ వస్తున్నాడు.

సత్యం మాష్టారు పుట్టి పెరిగింది నరసాపురంలో హరిజనవాడలో.

క్రైస్తవ మతాధికారుల ఆర్థిక సహాయంతో అతను తన చదువు పూర్తి చేసి విప్పర్రు గ్రామంలోని పాఠశాలలో ఉపాధ్యాయుడిగా జీవితాన్ని ప్రారంభించాడు.

అంటరానితనం అనే వ్యాధితో జీవితం గడుపుతూ, ఎలాగైనా ఆ వ్యాధిని నిరోధించాలనే ఉద్దేశంతో తను కష్టాలు పడుతూ, ఏదో ఒక ఆశయం కోసమే తన జీవితాన్ని గడుపుతున్నాడు.

ఆ గ్రామంలో అతని మంచితనానికి ఆదరణ, ఆప్యాయతలు లభించాయి. అగ్రవర్ణాలవారు కూడా సత్యం మాష్టారి జీవన విధానాన్ని మెచ్చుకునేవారు.

సత్యం మాష్టారు భార్య చనిపోయిన తరువాత మళ్ళీ పెళ్ళిచేసుకోకుండా తన కూతురు శ్యామల భవిష్యత్తే, ప్రధానాంశంగా ఎన్నుకుని ఉన్నతాదర్శాలతో పెంచుతున్నాడు.

అయినా అతనిలో ఏవో తెలియని అసంతృప్తి. మానసికంగా తనలో తానే కుమిలిపోతున్నాడు

తనకు జరిగిన అవమానాలను తన కూతురు శ్యామలకు జరగకూడదని, ఆ చిన్నమనసు గాయపడకూడదని అతని ఆరాటం.

అగ్రవర్ణాలవారు మామూలుగా తమ ఇళ్ళలో జరిగే శుభ కార్యాలకు పిలిచినా తాను వెళ్ళకుండా, శ్యామలను వెళ్ళనివ్వకుండా చేశాడు.

పోతే, తన బంధువుల ఇళ్ళకు కూడా శ్యామలను వెళ్ళనిచ్చేవాడు కాదు!

ఎవరైనా బంధువులు తన ఇంటికి వస్తే, వారిని దూరంగానేవుంచి, బయటనుంచి బయటే నాలుగు మాటలు మాట్లాడి పంపించేవాడు.

తండ్రి ప్రవర్తన శ్యామలకు మొదటిలో అర్థమయ్యేదికాదు. తను చదువు కుంటున్నది, చుట్టూవున్న ప్రపంచాన్ని అర్థం చేసుకొంటున్నది. కానీ, తండ్రి పడే ఆవేదనను అర్థం చేసుకోలేకపోతున్నది!

తండ్రి ఎందుకు తనను ఇంత నిర్బంధంలో పెంచుతున్నాడో ఆ పసి హృదయానికి అర్థం కావటంలేదు.

తండ్రిని చూస్తే జాలి కలుగుతోంది! తన తండ్రి అంటరానితనాన్ని భరిస్తూ, తనను ఆ బాధనుంచి తప్పించాలనే ప్రయత్నమే ఈ నిర్బంధమా? ఇది ఎంతకాలం?

కేవలం తనచుట్టూ కంచెను ఏర్పరచుకొని సమాజానికి దూరంగావుంటూ జీవితం గడపడం వలన అంటరానితనమనే ముద్ర చెరిగిపోతుందా? తాత్కాలి కంగా ఆ బాధనుంచి ఉపశమనం లభించినా, అదే శాశ్వతం మాత్రం కాదు. అదే దృఢ అభిప్రాయానికి వచ్చింది శ్యామల.

ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం ఏమిటి? ఆమె ఆలోచనా పరిధిలో ఒక మెరుపులాంటి యోచన కలిగింది.

*　　*　　*

రామరాజు రోజంతా పేకాట ఆడి అలసిపోయి, ఉన్న డబ్బులు పోగొట్టు కుని, తీసుకున్న అప్పును తీర్చలేక నీరసపడిపోయి, ఎట్టకేలకు అర్ధరాత్రివేళ ఇంటికి చేరాడు.

కడుపులో ఆకలి పేగులను మెలితిప్పుతుంటే నేలమీద చతికిలపడ్డాడు!

ఇంకా అన్నం వడ్డించలేదని తల్లిమీద రుసరుసలాడాడు. ఆకులో రక రకాల పిండివంటలు, కూరలు చూసి రామరాజుకు కళ్ళు చెదిరాయి.

"ఇన్ని రకాల వంటలా? ఏమిటి విశేషం?" తల్లివైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

సుభద్ర క్షణం ఖిన్నురాలయింది. తను ఏం చేస్తుందో కూడా తెలుసు కోలేని పరిస్థితిలో తన కొడుకు వున్నాడు.

ఆకులో వున్న రక రకాల పిండివంటల గురించి సుభద్రమ్మ విశదీక రించింది.

ఫలహారం మాత్రం సత్యం మాష్టారి కూతురు శ్యామల పంపిందని నిదానంగా తెలియజెప్పింది. అంతే, రామరాజు తన ముందున్న ఆకును మధభి ఛిభాలున ఛేచాథు.

"ఏం వంటకాలు బాగా లేవా?" కంగారుగా అంటున్న తల్లి మాటలకు అడ్డువస్తూ "తిండిలేక పస్తులుండొచ్చు. అంతేకానీ అంటరానివాళ్ళు పెట్టే కూడు తిని కులాన్ని భ్రష్టు పట్టించడం నాకు చేతకాదు...." అని ఆవేశంగా ఇంటిలోంచి బయటకు వెళ్ళిపోతున్న కొడుకుని ఆపి, తన చెంగున కట్టుకున్న ఐదు రూపాయల నోటును ఇచ్చింది.

*　　　　*　　　　*

రావిచెట్టు.... పేకాట జోరుగా సాగుతున్నది....

ఆటగాళ్ళలో ఎవరు గెలుస్తారా అన్న ఉత్కంఠంతో వాళ్ళచుట్టూ చేరిన ప్రేక్షకులు చేతులతో సైగలు చేసుకుంటున్నారు. ముఖాలలో నిమిష నిమిషానికి మార్పు గోచరిస్తుంది.

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చారు! పేకాటరాయుళ్ళంతా క్షణం తలెత్తి చూశారు.

వారిలో ఒకడు ముందుగా తేరుకున్నాడు. "అబ్బా! ఇదెవతరో? పట్నం గుంట లాగుంది? ఈ వూరికి కొత్తగా వచ్చిన బొమ్మేంటిరా?" అంటూ పైకి అననే అన్నాడు!

ఆట మంచి రంజుగా వున్న సమయంలో అందరూ ఆ సైకిల్ మీద పోయే అమ్మాయిమీద రకరకాల మాటలు అనడం రామరాజుకు చికాకు కలిగించాయి.

ప్రక్కన ఎవడో చెప్పాడు. "ఈ గుంట ఎవరో కాదు, మన సత్యం మాష్టారి కూతురు! పట్నంలో చదువుతుంది" అని.

"ఎవరైతే మనకేంటి-ముక్క ఎయ్యెండేహే" కసురుకున్నాడు రామరాజు.

"పిల్ల అందం చూడనివ్వహే! పేకాట తర్వాత ఆడుకోవచ్చు."

రామరాజు ముఖంలో రంగులు మారాయి.

"ఓరి! ఇదంట్రా సత్యం మాష్టారి కూతురు? దీని వళ్ళు బలిసిందిరా. పది మందిలో పెద్ద చిన్న లేకుండా సైకిలెక్కి తిరగడమా? కూడు దొరికితే కులం మరచిపోతారు!" అంటూ ఎగతాళి చేశాడు మరొకడు.

"అంటే! ఆ పిల్ల నీకు అణిగిమణిగి దండాలెట్టాలంటావా? ముందు పేకాట ఆడు!" అంటూ రామరాజు గదమాయించాడు.

అలా పెరిగి పెరిగి, చిలికి చిలికి గాలివానలా అయింది వాళ్ళ వాదన-ప్రతివాదన!

పేకాటలో ఓడిపోనున్న ఇంకొకడు ఇదే అదననుకుని ముక్కలన్నీ విసిరికొట్టాడు.

గెలుస్తానన్న ఊపులోనున్న రామరాజు తన ప్రత్యర్థి ముక్కలు విసిరి వేయడంతో కోపం తట్టుకోలేక అతని చొక్కా పట్టుకొని నాలుగు వాయించాడు.

డబ్బులు లేని రామరాజు డబ్బులున్నవాడి మీద చేయి చేసుకోవడంతో మిగిలిన వారందరికీ కోపం వచ్చింది. అందరూ కలసి రామరాజుకి దేహశుద్ధి చేశారు. "సిగ్గులేని నా కొడక! నీవేమో అప్పులాట. మీ అమ్మేమో సత్యం మాష్టారి ఇంటిలో వంటపని చేయడం. నామీద చేయి చేసుకుంటావురా? చంపేస్తాను...." అంటూ బెదిరించాడు ఆ వ్యక్తి.

జరుగుతున్న బాగోతాన్ని ప్రత్యక్షంగా చూసిన శ్యామల ఖిన్నురాలయింది.

ఆమె మనసులో పదేపదే రామరాజు అన్నమాటలు గుర్తుకు వస్తున్నాయి. రామరాజు అంటే ఎక్కడో తనకు తెలియకుండానే అభిమానం ఏర్పడింది. తాననుకున్న పథకాన్ని అమలులో పెట్టాలంటే రామరాజును తను సమర్థించాలి. అన్ని విషయాలలోను అతనిని ప్రోత్సహించాలి అని స్థిరనిర్ణయం తీసుకుంది. ఇంటికి వస్తున్న సుభద్రమ్మకు రామరాజు గురించిన వివరాలు అడుగుతున్న శ్యామల వైఖరి అర్థం కాలేదు....

* * *

ఏవిధంగా అయినా తన చెల్లెలు సుభద్ర అనుభవిస్తున్న పొలాన్ని కాజేయాలని వెంకటరాజు ఎక్కడలేని ప్రేమ వలకపోస్తూ "కౌలుదారిచ్చే కౌలు ఏ విధంగాను చాలదు. రామరాజు పొద్దస్తమానం పేకాట ఆడడం అసలు క్షేమంకాదు. కనుక కౌలుదారు నుంచి పొలాన్ని తీసుకుని. వరి పైరుకు బదులుగా రామరాజుచేత చావల చెరువులు పెట్టిస్తే రామరాజు బాగుపడతాడు. ఆర్థికంగా కూడా బాగుంటుంది" అంటూ సుభద్రమ్మను మెల్లిగా నమ్మించాడు. పొలం తాలూకు కాగితాలు పట్టుకుని మెల్లిగా జారుకున్నాడు. ఆ తరువాత ఆ పొలం తనదేనంటూ ఇచ్చే కౌలు డబ్బు కూడా తానే తీసుకుంటూ సుభద్రను మోసం చేశాడు....!

విషయం తెలిసిన రామరాజు ఉగ్రుడై మేనమామను చంపడానికి కత్తి తీసుకుని వెంటపడ్డాడు.

ఎక్కడ ఆలస్యంచేస్తే ఎక్కడ రామరాజు ముద్దాయి అవుతాడోనని అది అర్ధరాత్రి అని కూడా చూడకుండా ఊరిబయట కాపుచేసిన రామరాజును వెతికి పట్టుకోగలిగింది శ్యామల. ఆమెలో పొంచిచూస్తున్న ఆవేదన అతనిని కరిగించి వేసింది.

తనకు తెలియకుండానే ఆమె అంటే రామరాజుకు అమితమైన గౌరవ భావం ఏర్పడింది.

ఎక్కడో, ఎప్పుడో ఏదో తప్పు చేశానన్న భావన రామరాజును ఎత్తి పొడుస్తూనే వుంది, హరిజనులలో కూడా ఇంత మంచివారు వుంటారా? కులం తక్కువంటే అన్నింటిలోను తక్కువగానే వుంటారన్న రామరాజు ఆలోచన శ్యామలను చూస్తేనే పూర్తిగా తారుమారయింది.

రామరాజు తనంటే ఇష్టపడుతున్నాడని తెలుసుకున్న శ్యామల తన నిర్ణయాన్ని తండ్రికి తెలియజేసి అతని ఇష్ట ప్రకారమే విప్పర్రు గుడిలోనే దండలు మార్చుకొని ఒకటయ్యారు.

ఏ విధంగా అయినా ఒక అగ్రకులస్తుని పెండ్లి చేసుకుని, అగ్రకులాలకి, హరిజనులకు తేడా లేదని, సమసమాజ స్థాపనే ధ్యేయంగా పెట్టుకున్న శ్యామల మొదటి మెట్టు ఎక్కగలిగింది!

మేనమామ వెంకటరాజు నిప్పుతొక్కిన కోతిలా విజృంభించి కుల పంచాయితీ ద్వారా రామరాజును వెలివేయించాడు. సుభద్రమ్మను, రామరాజును సత్యం మాష్టారు ఇంటికి తరిమేవరకు అతను నిదుర పోలేదు.

ఇప్పుడు వెంకటరాజుకు ప్రత్యర్థిగా శ్యామల నిలచింది. సుభద్రమ్మగారి పొలాన్ని దక్కించుకోవడమే కాకుండా అంటరానితనాన్ని నిరసించినందుకు వెంకటరాజుకు ఆరునెలలు జైలుశిక్ష పడేటట్టు చేసింది!

గ్రామంలో ఏనోట విన్నా శ్యామల ధైర్య సాహసాల గురించి చెప్పు కుంటున్నారు.

సత్యం మాష్టారు వృద్ధాప్యంలో తన కుమార్తె శ్యామల అన్ని మెట్లూ ఎక్కగలదా, తొలిమెట్టు నుంచే జారిపడిపోతుందా అన్న దిగులుతో ఆరోగ్యం పూర్తిగా క్షీణించి మరణించాడు.

శ్యామల సంవత్సరం తిరిగేలోపలే ఆడపిల్లను కన్నది.

కాలం మార్పును తీసుకురావడం సహజం. తను సంఘం నిర్మించిన ఇనుప కట్టడాలను కూలదోయ గలిగానన్న భ్రమతో కూతురి బారసాలకు అత్తింటివారి బంధువులను, తన బంధువులను మనస్ఫూర్తిగా ఆహ్వానించింది శ్యామల.

ఆ ఆహ్వానంలో ఎన్నెన్నో అపస్వరాలు వినిపించాయి. అయినా ధైర్యంతో వాళ్ళంతా వస్తారని వేచి చూసింది. చివరకు మిగిలింది తను, తన భర్త, అత్తగారు మాత్రమే....!

క్షణం ఆవేశం, మరుక్షణం ఆవేదన! ఆ పై ఆలోచనలు ఆమె మనసును కకావికలం చేశాయి.

పెద్దింటివారు తమను ఇంకా అంటరానివారిగానే చూస్తే చూసి వుండవచ్చు కాని తనవారు....?

ఆపై ఆలోచించలేక పోయింది శ్యామల. పెద్దింటి వారి ముందు తన బంధువులు చిన్నతనానికి గురవుతారనే భయంతో రాలేదని తెలుసుకున్న శ్యామల మనసు చివుక్కుమంది.

కాలం మారినా మనుషులు, వాళ్ళ మనస్తత్వాలు ఇంకా మారలేదు....

* * *

తనకు కావలసింది గుర్తింపు. అది ఎలా వస్తుంది? అధికారం వుంటేనేనా? సత్యం మాష్టారు నడిపిన పాఠశాలను ఇంకా అభివృద్ధిలోకి తెచ్చి అధికారాన్ని పొందాలని నిర్ణయించుకుంది శ్యామల.

అంతే! పాఠశాల దినదినాభివృద్ధి చెందింది. ఆ వూరినుంచి దూర ప్రాంతాలకు చదువు కోసం పంపలేని పెద్దలందరు తమ పిల్లలను శ్యామల నడిపే పాఠశాలకు పంపడం మొదలు పెట్టారు.

రోజురోజుకు పాఠశాలలో విద్యార్థుల సంఖ్య పెరిగింది. ఆర్థికంగా శ్యామల పరిస్థితి మెరుగయింది.

రామరాజును మాత్రం కులం నుంచి తనను వెలివేశారన్న బాధ పీడిస్తూనే వుంది. ఆ గ్రామంలో పనిచేస్తున్న ప్రభుత్వ అధికారులు మాత్రమే శ్యామల ఇంటిలోకి వస్తుంటారు....

తన పొలం పని, మిగిలిన సమయంలో అంతా కూతురు శారదతో కాలం వెళ్ళబుచ్చడం తప్ప తనచుట్టూ సమాజం గురించి అసలు పట్టించుకోవడం మానివేశాడు రామరాజు.

అగ్ర కులస్తులతో కలసి మెలసి, అన్ని సంప్రదాయకమైన కార్య కలాపాలలోను పాలుపంచుకోవాలనుకున్న శ్యామల ఇంకా తొలి మెట్టు మీదనే వున్నది... !

అత్తగారిని, భర్తను వారి బంధువుల ఇళ్ళకు వెళ్ళి వారితో తెగిన సంబంధాన్ని పునరుద్ధరించుకోమని చెపుతున్న శ్యామలను ఇంకోసారి ఆ విషయం ఎత్తవద్దని మందలించారు తల్లీ కొడుకులు.

శారదకు పదహారు ఏండ్లు వచ్చాయి. రామరాజులో వున్న క్షత్రియ ధర్మం అతనికి కర్తవ్యాన్ని గుర్తుచేసింది.

కుమార్తెకు వెంటనే పెండ్లి చేయాలి. అది కుల ధర్మం! ఎవరితో ఎలా? ఇవి అతనిని వేధిస్తున్న ప్రశ్నలు.

భర్త అనుభవిస్తున్న మానసిక సంఘర్షణను శ్యామల ఇట్టే గ్రహించింది. భర్త సంతోషం కోసం తను అతని నిర్ణయం ఏదైనా మనస్ఫూర్తిగా సమర్థిస్తుంది.

తన కులం వారికి ఇచ్చి చేయాలన్న రామరాజు ప్రయత్నానికి ఆదిలోనే గండి పడింది.

తన మేనమామ వెంకటరాజు అప్పుడు రామరాజునే కాదు, ఇప్పుడు శారదను కూడా కులం నుంచి వెలి వేయించాడు!

ఇక తన కులస్తులెవ్వరూ శారదను చేసుకోవడానికి ముందుకు రారన్న నగ్న సత్యాన్ని తెలుసుకున్న రామరాజు లోలోన కుమిలిపోతున్నాడు.

శ్యామల తన భర్త ఆవేదనను అర్థం చేసుకున్నది. జీవితంలో పెళ్ళి ఒక్కటే పరమార్థం కాదు. కాని పెళ్ళి జీవితంలో ఒక భాగం!

ఏది ఎలా జరగాలో, విధి ఎవరికి ఏమి రాసిపెట్టిందో ఎవరికీ తెలియదు. అలా అని మన ప్రయత్నం విరమించుకోకూడదు....

కుమిలి కుమిలి ఏడుస్తూ కూర్చోవడం సమస్యకు పరిష్కారం కాదని భర్తకు నచ్చచెప్ప ప్రయత్నించింది శ్యామల.

రామరాజు వాస్తవాన్ని అంగీకరించినా ఒక హరిజనుడి కాళ్ళు కడిగి కన్యాదానం చేయడానికి అతని మనసు అంగీకరించడంలేదు!

ఆలోచించి ఆలోచించి రామరాజు ఒక స్థిర నిర్ణయానికి వచ్చి అర్ధరాత్రివేళ ఇల్లు వదిలాడు....

నిశిరాత్రి....

ఒంటరిగా పరవళ్ళు తొక్కుతున్న గోదావరిని చూశాడు.

క్షణం ఆగాడు....

* * *

తన నిర్ణయం సరియైనదా కాదా, అని పునరాలోచించాడు రామరాజు. తను శ్యామలను కావాలనే పెళ్ళి చేసుకోలేదా? అప్పుడు కులం తనకు అడ్డు రాలేదు.

ఇంత కాలం తన సాటి కులస్తులు తనను, తల్లిని, శ్యామలను, శారదలను వెలివేసినా తన జీవితాన్ని ముందుకు నడిపించుకు పోలేదా?

అయినా, కులానికి ఎందుకింత ప్రాముఖ్యత నివ్వాలి?

రామరాజులో ఒక్కసారిగా తన విప్పర్రు గ్రామం కళ్ళలో మెదిలింది.

శ్యామలతో తనకు పెళ్ళికాక ముందే తన జీవితాన్ని, తరువాతి జీవితాన్ని ఒక్కసారి సింహావలోకనం చేసుకున్నాడు.

ఎంత మార్పు!

తనను జైలులో నిర్బంధించినట్టుగా తన కులస్తులు కులాన్ని ప్రధానంగా పెట్టుకుని తన స్వాతంత్ర్యాన్ని హరించారు!

తను ఆత్మహత్య చేసుకుంటే సమస్య పరిష్కారం అవుతుందా? లేదు!

తన నిర్ణయాన్ని మార్చుకుని వెనుదిరిగాడు రామరాజు.

శ్యామలలో తను ఎప్పుడూ చూడని నిరాశ నిస్పృహలను ఈ రోజున చూస్తున్నాడు రామరాజు.

ఎందుకో పెళ్ళిపనులు అన్నీ ఎక్కడివక్కడ ఆగిపోయాయి....విషయం అతనికి అర్థం కాలేదు.

ధైర్యంచేసి శ్యామలను అడగనే అడిగాడు.

"శారదకు పెళ్ళి జరగదు. మా బంధువులు, కులస్తులు నన్ను, శారదను వెలివేశారు ఎందుకో తెలుసా? నేను కాని, శారదకాని, మీరు కాని ఎప్పుడూ వారిని మనింటికి రానివ్వలేదని మనం వారిళ్ళకు వెళ్ళలేదని! మనం వాళ్ళ దృష్టిలో అగ్రకులాల వాళ్ళం...."

"వెలి....వెలి....!

"ఒకరినొకరు వెలివేసుకుంటున్న ఈ సమాజాన్ని మనమే వెలివేద్దాం. బాధపడకు శ్యామలా!

పెళ్ళి ఆగిపోయిందని ఆపసోపాలెత్త వలసిన పనిలేదు.

ఈ కుల వ్యవస్థలో బూజు పట్టిన ఈ సంప్రదాయాలలో మార్పు రావాలి. ఆ మార్పుకోసం మనం అహరహం కృషిచేద్దాం...." దృఢంగా అన్నాడు రామరాజు.

శ్యామల కనులలో మెరపు.

శారద కనులలో మెరపు.

రామరాజు కనులలో మెరపు.

ముగ్గురి మూగ గుండెలలో చప్పుళ్ళు!

* [ 1994] *

# కొత్త దారి

పినాకపాణి

అప్పటికి ఇంటి ముందరి బాయి కట్టమీన కూర్చొని శానా సేపయింది. నోట్లోపుల్ల నోట్లోనే ఉంది. కానేపుదనక నిద్ర బరువుపోక మబ్బుగ కూర్చొని, ఆ తర్వాత ఏదో గుర్తుకు వస్తే ఎదారు చేస్తుండు. బైట బరగొడ్లకాద పేదకళ్ళు ఎత్తేసుకుంట "మొగం పుల్లకాదనే ఎందోడు కూర్సుంటవ్‌రా! పొద్దు శరశరామంటు పై కొస్తుంది. నీ యవారం అయ్యేతట్లలేదు.... నీల్లకు పోయేతట్లలేదు...." అని నాగమ్మ కొడుకును కేక లేసింది. రాములుకు సిర్రెత్తుకొచ్చింది. "యహా.... నీ... నిదర్లేచినాల్నుండి వొకటే సొదబెత్తవ్" అని విసుక్కుండు. పాలెంలోని గొడ్లు జంగిలికి గుండై ఇంటి ముందల్నుండి పోతా ఉంటే "ఒరే రాములా! ఆ పెయ్యదాన్ని పట్టుకపోరా! తల్లెంట బడి బీడుకు పోతది" అంది నాగమ్మ. రాములు కదల్లేదు.

"ఆరీ! అన్నా వలకదమ్మా! ఏం పోయేకాల మొచ్చిందో" అని గట్టిగ అనుకుంటూ తల్లెంటబడి పోతున్న దూడను గొడ్లలోంచి లాక్కురా బోయింది. దానికి తల్లిని వొదలడం ఇష్టంలేక కాళ్ళు ఈడిగలేస్తుంది. కొడుకు మీది కోపం కొద్దీ బలంగా దూడను లాక్కొస్తూ, "మణుసులకే లేని ప్రేమలు నీకెందుకే ఎదవ జల్మానికి...." అంది

కొడుక్కు వినబడాలనే. రాములు అయిష్టంగా ఒక మూలుగు మూలిగి ఊరు కున్నాడు.

ఊరికి అరమైలు దూరంలో ఉండే పెద్దగంపోళ్ళ బాయినుండి మంచినీళ్ల కడవ బుజానేసుకుని వచ్చిన పెద్దన్నకు అడికొచ్చేతలకి అడుగెయ్యను చేత కాలేదు. కడవ దించి, ఎండిపోయిన బాయిగట్టుమీన మోపి పైగుడ్డతో మొకం తుడుచుకుండు. బాయి గోడనానుకొని కూర్చున్న రాముల్ను జూసి "ఎంది రోయ్! తీరుబడిగ కూర్సున్నవ్!...." అని మళ్ళీ తనే "అవున్లే.... పైనుంచి నీనుకు బొట్టు రాలకపాయె. మంచినీళ్లకే కటకటమంట ఆమడదూరం బొయ్యొస్తుంటిమి ....ఇంకేడి నుండి పనులొస్తయ్" అన్నాడు.

"చల్! మీ ముసలోల్లకు ఇంకా ఎవసాయం బ్రెమ పొయ్‌సావలేదు. బూమమ్మ, ఆకాశం ఎన్నిసార్లు చెప్పుతోని కొడ్తున్నా కాత్రైవచ్చాలకు పెద్ద మొగోల్ల మాదిరి ఎగిరెగిరి పడ్తుంటరు. పోయిన కారు పంటల్ పెట్టుబడికి హీనంగా ఐదుపైసాలు, వదిపైసాలన్న నష్టపోనోడు ఎవలున్నరో ఈ మాదిగ పాలెంలో సూపించు. ఒక్క దానయ్య మామకు పెట్టిందానికి బొటాబొటిగ వచ్చిందంట...." కోపంగా అన్నాడు రాములు. "ఓర్నీ పాపం మండ! ఏలు ఏలు లాబం రాలేదని ఎవసాయమే మానేస్తమేందిరా ఎర్రినాయాల! పదిపైసలు నష్టమొచ్చినా తప్పదు. పావలా వచ్చినా తప్పదు. పావలే చేతికొచ్చిందని ఎదారైరి ఎట్ల....ఐనా ఈ కాలమోల్లకు పెద్దరెడ్ల మాదిరి బతకాలనుందిగాని యింకేమన్నానా! అందుకే నీనుకు పడ్డంలా...." పెద్దన్న యింకా చెప్పకపోయే టోడేగాని మధ్యలోనే నాగమ్మ జొరబడి "వాడికి గంపెడు గడ్డి పెట్టన్నా! సిగ్గుసెరంలేని బతుకైపోయింది. లేకపోతే సొంతింట్లో దీపమెలిగించుకోలేనమ్మ ఊరోలింద్లలో దీపం పెట్టనీక బొయిందంట అట్లున్నది ఎవారం. వున్న బెత్తెడు బూఁవిని సేసుకొనేది పోనిచ్చి రాజ్జాన్నంత తనొక్కడే సరింగజేస్తనని ఊర్లు బట్టుకొని తిరిగితే ఏమైతది? పల్లెకుగాను నీల్లు లేవుగదా! ఉన్న బోరింగు కూడ సెడిపాయె. తెల్లారినాల్నుంచి జనం మైలు దూరంపోయి తెచ్చుకుంటున్నారు. ఈడికేమన్నా సలనముందా? యింత పనయినాక నీల్లకుకూడ నేనే సావాల.... ఈదు యింక ఎవసాయంగాని సెయ్యడు" అంది కోపంగా.

నిజం జెప్పాలంటే నీల్లపని, గడ్డిపని రాములే చూసుకొంటాడు. ఆ చెయ్యటానికి లేటయితేనో, ఎప్పుడన్న చెయ్యబుద్ధిగాక కదలకుంటేనో నాగమ్మ అది సందుజూసుకొని తనకు గిట్టని కొడుకు తిరుగుళ్ళను దిగకడుగుతుంటది. రాములు అది అస్సలు పట్టించుకొనేటోడు గాదు. మొదట్లో తన తిరుగుళ్ళలోని

నిజం తల్లికి చెప్పజూసేవాడు. ఆమెకి అవేం బోధపడక నోటికొచ్చినట్లు తిట్లు లంకించుకొనేది. యాసిరికొచ్చి "ధూ.... యింత పెద్ద పెద్ద యిషయాలు దున్న పోతుల నాగమ్మకు యాడర్థమైతయి? పేడకసువు ఎత్తేసుకునే మనిషికి చెప్పద ముంది జూడు.... నేనూ...." అని మండిపడేటోడు.

"........నువు జేద్దువుపా ఎవసాయం! మా నాయిన యింతప్పట్నుంచి కండ్లసూపు పోయేదాక ఎవసాయం చేసిచేసి ఏం సంపాయించిండు. క్షణం కూర్సోకుండ పనిసేస్తనే ఉండిండు ఏం లాబం....కదిపితేసాలు, గోయిందరెడ్డి దయతోని బతికి మిమ్మల్ని సాకినానని మీటింగు జెప్తడు. ఏడేడు కష్టపడి సేసిన ఎవసాయమేందో! అదేడికిబోయిందో.... మల్ల ఈ గోయిందరెడ్డి దయేందో?" ఎక్కసక్కెంగ అన్నాడు రాములు తన పదేళ్ళ వాయసప్పట్నుండి నాయినెంట పొలం పోబట్టిండు. బూమంటే, పసులంటే ప్రాణం. తండ్రి పోయి, ఎవసాయంమీద పడ్డ ఆరేల్లనుండి జూస్తుండు. వచ్చిరాని వానలు, పండిన కాసింతకూ ధర ఉండదు. రైతులమ్మేసుకున్నాక రేట్లు పెరుగుతయి. రైతుకు అప్పలుకూడ పెరుగుతయి. దాంతోటి 'పెద్దోల్ల' దయాధర్మాలు - కాకుంటే ఆకళ్ళు, అవమానాలు. రాములుకు లోకంమీన వెగటు, జాలి, కష్టాల్లో నలిగే జనమంటే ప్రేమ. "ఒరే రాములా! నేసెప్పేదియినను" అని బనీసు జేబులోంచి పొగాకు తమ్మె, ఆకు నోట్లేసుకొని సున్నంకాయలోంచి యింత సున్నందీసి నాలిక్క రాసుకొని.... "ఎవసాయం మన ధర్మం. అది జేస్తనే ఉండాల. యింక లాబాల సంగతి, మన బతుకుల సంగతంటావా....అయంతే. ఎవలు యాడ బతకాలో, ఎట్ల బతకాలో అట్లనే బతుకుతరు. మేంగాదు, మా పెద్దోలంతకంటే అన్యాయమనుకో. అసలు మనబోటోల్ల బతుకులకి మొదటాల్నుంచి ఎవల్దో ఒకర్ది ఆదరువుండనే ఉండాల. లేకపోతే ఇంతమాత్రం ఉండం....అఁ....మదిల బెట్టుకో...." అంటూ కడవ బుజానేసుకొని "మీయత్త యింగోకడవ తెమ్మంట దేమో. ఎంత ముదురుతుంది...." అనుకుంటూ బయల్దేరాడు.

నిమిషమైందో లేదో పడమటి బజార్నుండి గోలగోలగ కేకలు మొదలైనయి. గోడనానుకొని కూర్చున్న రాములు చపక్కున లేచిండు. పొయ్యి అంటిద్దామని లోనికిబోయిన నాగమ్మ 'యాందిరా! ఉన్నట్లుండి అంతగోల....' అంటూ బైటికొచ్చింది. యింటికి పక్కనుండే చింతమాన్ల ఎనికినుంచి పొగలు గుప్పలు గుప్పలుగా రేగుతుంది. 'వామ్మో! కొంపలంటుకున్నయ్. పల్లెంత నాసినమై పొద్ది....' కేకలు వినిపిస్తున్నయ్. నోట్లపుల్లయిసిరేసి ఒక్క ఉదుటున రాములు పడమటి బజారుకు పరుగెత్తిండు.

'సిన్నోడా! ఒరే రాములో! జాగర్తా....' అని కేకేసి యింటికి నీలుకేసి తనూ పరుగెత్తింది నాగమ్మ.

కడవెత్తుకొని పెద్దన్న పదడుగులు వేయలేదు. మాటలు సరింగ వినపడక పోవడంతో, తిరిగి జూసి.... 'యాందిరా గోలా' అన్నాడు. దారెంట పోతున్నో లెవరో ఆడోల్లు 'గుడిసెలంటుకున్నయంట'.... అనుకుంటపోయినరు. అ(.... అని ముందుకు అడుగేసిండోలేదో, ఎనకనుండెవరో ఉఱికెత్తుకుంటపోతూ 'మునిలోనివి నువ్వేడ మంటలార్పతవ్! కడవ నాకియ్యే పెద్దయ్యా!' అని లాక్కున్నాడు. "ఉరికిపోరా దొంగనాయాల! వయసులో ఉన్నవ్" అని తనూ పరుగెత్తిండు.

"....ఎవులకేమొచ్చింపో పోయేకాలం.... ఇప్పుడెట్లా పల్లెంతా అలమక పోతది."

"నీది మరీ సిత్రంలే.... ఏసచ్చినోడి దుర్మార్గమైనాగాని ఇంత పొద్దటాలె ఎట్ల జేస్తడ్లే! జనమంత మందమంద మాదిరి తిరుగుతుంటే. యాతల్లన్నా పొయ్యంటించుంటదిగాని...."

"అంతేమరి....తూరుపునుండి గాలిగొడ్తుంది. తొందరరార్పతే బాగుండు ఈ మొగోల్లకు కాల్లూ సేతులు ఆడట్లేదమ్మా!"

దూరదూరంగా ఇండ్లున్నోలు తమ యిండ్లకేడ అంటుకుంటదోనని బెదిరి పోతూ మాట్లాడుకుంటున్నారు.

ఉదయం పదిగంటలు కూడా కాలేదు. గాలి పరపరా వీస్తుంది. అప్పుడే మూడు గుడిసెలు అంటకపోయినయ్ . ఆ యిండ్లల్లోంచి కొందరు సామాన్లు తెచ్చి బైటేస్తున్నారు. పిల్లలు ఆడోల్లు బయంకరంగా ఏడుస్తున్నారు. ఒక వసుల కొట్టంలో జంగిలికిపోని ఎద్దుల తలుగులు విప్పేసినరు. అవి బెదిరి జనంమీద పడి పరుగులు దీసినయి. "నీల్లు జల్లండి.... కడవలు బిందెలు తీసుకొని బాయికి పాండి...." గుంపులోంచి కొన్ని గొంతులు వినిపిస్తున్నాయి.

బగబగ మండుతున్న గుడెసెలమీద పెద్దన్న బుజంమీది నుండొచ్చిన నీల్లే ముందు చల్లింది. చుట్టుపక్కల యిండ్లల్లోని మంచినీల్లు, బానల్లో నీల్లు తీసుకొని కొందరొచ్చినరు. తర్వాత....బాయికి పాండ్రని అరుస్తున్నరే గాని ఏ బాయిల నీల్లున్నయ్?

"అయితే బోరింగుకు పోదాం...." ఎవరో గట్టిగ కేకేసినరు. "కొంపల మాదిరి నీ తెలివి కూడా తగలబడ్డట్లుంది. బోరింగు సెడిపోయి పదిరోజులు దాటుతుంది"

ఒకరిద్దరు సదుకున్నోల్లు ఫైరింజనుకు చెప్పొస్తే బాగుండు అన్నారు గాని

ఎవరూ కదల్లేదు. మండలాఫీసుకు పోవాలంటే ఇరవై మైళ్ళు పోవాల. వాళ్లొచ్చే తలికి బూడిదగూడ సల్లారిపోతది.

ఊరికి మంచిరోజులు లేనట్లుంది. చేతికి అందుబాటులో నీళ్లు లేవు. గుడిసెలు ఒకదానెంటొకటి అంటుకపోతున్నయి. రెండు....మూడు....నాలుగు.... అంటుకొని ఆకాశమెత్తు మంటలు మండుతున్నాయి. యింట్లకేసిన గడ్డి గాలికి ఎగిరిపడ్తుంది. బొంగులు పటపటమంటున్నయి.

"యాందర్రా! ఏడుపు మొగాలేసుకొని సూస్తుంటరా. పొండి ...శివాలయం బాయికిపోయి నీల్లందుకుందాం. లేకుంటే కొంపలు కాదు పిల్లాజెల్లా మసై పోతరు...." జనాన్ని తీసుకుంట వచ్చిన పెద్దన్న అందర్నీ కేకలేస్తుండు. పెద్దన్నకారి మొగొల్లు "శివాలయం బాయికా?" అని నసుగుతున్నారు.

"ఏంరా! కొంపల్దగలబడ్తుంటే ఈడ నీల్లు లేకపోతే తలల్దీసి యాలేస్తరేంది బెదురుముండాకొడుకుల్లారా!"

"పెదమామా! నువు సరీంగ చెప్పినవు! పోదాం పొండి. అంతగయితే ఎవలడ్డం వస్తరో ఆ తర్వాత జూసుకుందాం" అంటూ రాములు బిందెలు పట్టుకొని పదిమంది కుర్రోల్లను ఎంటేసుకొని కదిలిండు. 'ఏందిరా! యింగా మానాల కదలవ్ ...' అని పెద్దన్న ఇంకా ఒకరిద్దర్ని కదిలించి తనూ బయల్దేరిండు.

ఊరికి మాదిగపాలానికి మధ్య దూరమేంలేదు. ఊరు పెరిగి ఊరికొన మాదిగపాలానికి మొదలైంది. ఊరికి ఒకవైపు శివాలయం, బాయి ఉన్నయి. ఆ దిగుడుబాయి పూర్తిగా ఎండిపోంగ మూడు తరాలనుంచి యింతదనక ఎవ్వరూ చూచుండరు. అట్లే మాదిగ పాలెమోళ్ళు ఆ గుడికాడికిగాని, బాయి నీళ్ళకుగాని రావడం కూడా ఎవరూ చూసుండరు. పాలెం నుండి దగ్గరిదార్లొవస్తే బాయి మరీ దగ్గర. ఆ దారెంట మాదిగ జనం పొలోమని బిందెల్తోటి, కడవల్తోటి వచ్చిపడ్డరు. మెట్లెంబడి, దారెంబడి వారది గట్టినరు. క్షణాల్లో బిందె గట్టుకు చేరుతుంది. ఆడోల్లు, ముసలోల్లు కూడ ఏకమైనరు. గాలి వీయడం తక్కువైంది. అంటుకున్న గుడిసెలకు నాలుగు దిక్కుల నీల్ల కడవల్తో చుట్టుకున్నారు.

మాదిగపాలెంలో మంటలు చల్లార్తుండటం, శివాలయం కాడమంటలు రేగడం జరిగింది. ఊరికి మధ్యన పంచాయితీ కట్టకాడున్న తెల్ల పంచలు, ఇస్త్రీ ప్యాంట్ల కుర్రోల్లు మాదిగపాలెంలో గుడిసెలంటుకున్నయ్.... మాదిగోల్లు శివాలయం బాయిలోకి నీల్లకు దిగిండ్రని తెల్సి విసురున గుడికాడికి చేరుకున్నారు.

రాములు నడవలోకి దిగి బిందెలు ముంచి మెట్లుమీదుండేటోనికి

అందిస్తున్నాడు. పది హేను ఇరవై మంది మాదిగోల్లుంటె ఊర్లోని జనమంతా బాయి చుట్టు మూగినరు. సర్పంచి కొడుకు బాబులరెడ్డి అందరికంటె ముందుకొచ్చి "ఒరేయ్! మాదిగ నా కొడుకుల్లారా! మీకు కండ్లల్ల కొవ్వు పట్టిందిరా? లేకపోతే ఊళ్ళో బాయికి, అందునా గుడి బాయిలోకి, దిగుతరా. ముందు పైకిరాండ్రా. మీ తల్లుల...."

అతను పేలిపోతున్నాడు.

బాబులరెడ్డి తమ్ములు ఉరికురికి మీదికొస్తున్నరు. గట్టుమీనున్న పెద్దన్న వాల్ల దగ్గరగా వస్తూ "సిన్నరెడ్డి! కొంపలంటుకపోయినయి. మా పాలెంలో బాయిలెండిపోయిన సంగతి తమ కెరికేగదా! ముంద టేడుగూడ యిట్లనే అయితే నాయినగారితో సెప్పుకుంటే, ఆరే పెబుత్వానికి చెప్పి బోరింగేయించిండ్రు కర్మగాలి పది రోజులైంది అదిగూడ సెడిపోయింది. కొంపా వాము మొత్తం నాశినమైపోతయని యింగేదారి లేక వచ్చినంగాని తమర్ని సిన్నబుచ్చనీక గాదు.... పెద్దోల్లు తమరి బాయికి, అదీ దేవుని నీల్లకొస్తమా!" అన్నాడు.

బాబులరెడ్డి రావడంతో నీల్లందుకునేటోల్లంతా యాడోల్లాడనే నిలబడి పోయినరు. రాములు పైకి రాకుండా బిందెలు ముంచి "అందుకోండ్రా! ఈల్ల సంగతి తర్వాత సూసుకుందాంగాని ..." అంటుంటే "రేయ్! మాదిగనాయాలా, నీకు సావు దలకొచ్చే మాట్లాడుతున్నవ్, ముందు మెట్లెక్కి పైకిరారా! లేకపోతే...."

"రెడ్డి! తమరు కోప్పడొద్దు. మేం తప్పేజేసినం. అంతకంటే యింగో దారి లేకనే. నేసెప్పేది...."

"ఏందిరా ముసల్నాకొడకా! నువుచెప్పేది నే నినాలా!" అని బాబులరెడ్డి మెడబట్టి దోసిండు. పెద్దన్న ఇసరకపోయి అంతదూరం పడ్డాడు. నుదురు పగిలి బొటబొట నెత్తురు కారింది. ఆడునోల్లంతా నోల్లు తెరిచి బొమ్మలయి పోయినరు. ముందల ఎవరో ఆడామెపోయి ముసలోన్ని లేవనెత్తింది.

నడవలో రాములు ఉడికిపోయిండు.

"ఒరేయ్! రెడ్డోడా! మేం నీల్లకొచ్చినం. నువ్వు గమ్మునుండకుంటె నీ రక్తం నింపకపోతం. కాలిపోతున్న కొంపల్లేసి మసికేసిపారేస్తం...." అతని మొగం రౌద్రమయింది. ఆ మాటకు రెడ్డిగారి పిల్లలకు, ఊరోల్లకు అహం దెబ్బ తింది. అంతా గడబిడైంది. ఒకర్నొకరు నోటికొచ్చినట్లు తిట్టుకుంటున్నారు. మధ్యలో పెద్దన్న తన కులమోల్లకు సర్దిజెప్పబోయిండు. పరిస్థితి ముసలోని మాట వినేతట్లలేదు. బాబులరెడ్డి అంతమందిలో చెలరేగిపోతుండు. పాతికమంది దాకా రెడ్డి కులమోల్లు సుట్టుపక్కలుండే యిండ్లల్లోంచి కట్రలు దీసుకొని గుంపు

మీద పడ్డారు. ఒకరిద్దరి చేతుల్లో కత్తులుగూడ ఉన్నట్లుంది. అంతమంది ఊరి జనం ముందు పాలెం జనం పల్చగైనరు. వాల్లు కఱ్ఱల్తో కమ్ముకునేతలికి వీల్ల చేతుల్లో ఏం లేకపోవడంతో కొందరు బయపడిపోయినరు. కొందరు అందిన వాళ్ళను యిసిరేస్తుంన్రు. ఎవరొచ్చి పొడిసిపోతరో అని ఆడోల్లు తమ కొడుకుల్ని, మొగుళ్ళను లాక్కపోతున్నారు. ఇంకొంతమంది ఇండ్లల్ల దూరినరు. రాములు, ఇంగో ఇద్దరు ముగ్గురు యువకులు 'కత్తులు తీసుకోని రాంన్రా' అని తమ జనాల్ను హెచ్చరిస్తూ కేకలేస్తున్నారు. రెడ్డోల్లు రెచ్చిపోతా మాదిగోల్లని పాలెంలోకి కొట్టుకుంట తరమకపోతున్నారు. సంగమ్మ గుడిసెకాడికొచ్చేతలికి రాములకి గుడిసెకేసిన బొంగుకఱ్ఱ కనబడింది. ఒక్క ఊపున ఎగిరి దాన్ని గుంజుకొని తిరగబడిండు. రెండు నిమిషాలయిందో లేదో చావుకేకేసి రాములు కింద పడిపోయిండు.

నెత్తిమీంచి పొలపొల నెత్తురు మొగం మీదికి కారింది....ఎనకల్నుంచెవరో కఱ్ఱతోని బలంగ మోదినట్లుంది. అది జూసి బాబులరెడ్డి ఏమనుకున్నడోగాని తనోల్లను తగ్గమనిజెప్పి ఎనక్కి తిరిగిండు. నెత్తురు చూసేతలికి ఊర్లోవాళ్ళకు కొందరిలో బెదురుపుట్టింది. సమయానికి యింట్లో తానంజేస్తున్న గోవిందరెడ్డి బట్టలేసుకొని వచ్చేతలికి మాదిగోల్లు బాయికాన్నుంచి పారిపోవడం జరిగింది. "చేసిందిసాలుగాని యిండ్లకుపాండి" అని గంబీరంగా కేకలేస్తూ కొడుకుల్ని మిగతావాళ్ళను ఊర్లోకి తోలకబోయిండు.

పాలెం జనమంతా నెత్తురుమడుగులో పడున్న రాములు చుట్టూ మూగినరు. "ఆ నాకొడుకుల్ని ముక్కలకింద నరికిపారెయ్యాల" ఇద్దరు కుర్రోల్లు ఆవేశంగా అంటున్నారు.

"సాల్లేరా! పెతాపం.... మణిసి సావుబతుకులమధ్య ఉన్నా ...." ముసల్ది గొణుక్కుంటూ అంది.

"నోరుమూసుకోందెహే.... ముసలోన్ని ఉత్తి పున్యానికి మొగం వగల గొట్టిరి. పీన్నిట్లచేసిరి...."

యాడుందోగాని నాగమ్మ సుడిగాలి మాదిరి వచ్చిపడింది. "నా కడుపుల నిచ్చు పెట్టనీక ఈడు ఒకచోట ఉండడుగదా! అన్నిట్ల తలకాయ పెట్టి గండం తెచ్చిపెడ్తడు. పాలెంల ఎవల కొంపలో తగలబడిపోవడమేంది, నా కొంపమీనికి ఈ సావొచ్చి పడ్డమేంది...." శోకాలు పెట్టి ఏడుస్తుంది.

దెబ్బకు మతిదప్పిపోయిన రాముల్ను నలుగురు చేతులమీద తీసకపోయి నాగమ్మ యింటిముందు మంచంలో పండేసినరు.

'గుంపులుంటే ఎట్లుండ్రా! దూరం జరగండి....' అంటూ పెద్దన్న మంచం కాడికొచ్చిండు. ఆయన నుదుటినుండి యింకా నెత్తురు కార్తనే ఉంది. చెయ్యడ్డం బెట్టుకొని వొంగి రామున్ని చూసి, నెత్తురు రాకుండా కట్టుకట్టమని చెప్పిండు.

"దీన్నిట్ల వదిలేస్తే లాబంలేదు, పోలీసుకేసు బెట్టాలి.... టేషనకు పోదాం...." సంగమ్మ కొడుకు నాగులు అంటున్నాడు. 'అవును పోవాల్సిందే....' యింకెవరో! "యహే....ముందీన్ని ప్రాణం పోసుకోనివ్వండి....ఆ కత తర్వాతాలోచిద్దాంగాని" పెద్దన్న సర్దిండు.

ఊర్లో గోయిందరెడ్డి యింటికాడ జనం గుంపైనరు. "మాదిగోల్లకు మరీ పోయేకాలం గాకపోతే....చక్కగ శివాలయం బాయిలోకి దిగడమేంది? కొంపల్దగలబడ్తున్నాయని సెప్తే మనోల్లెంతమంది దిగి సీల్లందియ్యరు?" గోయిందరెడ్డి సెప్పకపోతుండు.

'అయినా పాడుకాలానికి మంచి బుద్ధులెట్లొస్తయ్....' కిందినుండెవరో సపోర్టిగ అన్నారు. అప్పటికి జరిగిందేమిటో ఆయనకు పూర్తిగా బోధపడ్లేదు. తన కొడుకుల దిక్కునుంచి ఏదైన పొరపాటు జరిగిందేమోనని పెద్దరికంగ ఉండాలని చల్లంగ మాట్లాడ్తుండు. పక్కనున్న బాబులరెడ్డికి ఈమాటలు పుండుమీద కారంజల్లినట్లున్నయ్. పాతకాలంమాదిరి మాదిగోల్లు మంచి మర్యాదగున్నారనుకొంటుండీన. ఆ నాకొడుకులు తలకు మదంబట్టి మాటకు మాట నోటికొచ్చినట్లు మాట్లాడ్తున్న సంగతి తెలీనట్లుంది. ఆ నాయాళ్ళ కొంపలకాడికి పోయి వాల్లతో మాట్లాడేది ఓట్లప్పుడేనాయె. అప్పుడు తలలూపినంత మాత్రన మంచోల్లయి పోతరా? ఆ తర్వాత పాలిటిక్సని యింటికాడ లేకుండ యాడేడనో తిరుగుతడు. ఈనకేం తెలుస్తది, ఊర్లో ఉండి రోజు రోజు మాదిగనాకొడుకుల యవారం జూస్తుంది తనమేగదూ!

గోయిందరెడ్డి చిన్న కొడుకులుగూడ యిట్లనే అనుకుంటుండ్రు.

సాయంత్రమయ్యేతలికి రాములు లేసి కూర్చొని మాట్లాడగల్గుతుండు. 'ఇప్పుడు మనమేంజెయాల?' అనే ప్రశ్న అందరి మనసుల్లో ఉంది. నాగమ్మ దోటోల్లయితే, యింగేమయిద్దో అనుకుంటున్నారు.

పైటాలకు ముందు తలకాయ పగలగొడ్తే, పొద్దుగూడినా ఈ పెద్ద మణుసులు యింకా కేసు, గీసు పెట్టనీకుండ అలోసిస్తనే ఉన్నారు. వీల్లతోని అయ్యేపనిగాదు గాని, మనమే టేసన్కు పోదాం.... ఉబికొస్తున్న జలబుగ్గకు చెయ్యి అడ్డంబెట్టినట్లుంది యువకుల పరిస్థితి. మాదిగపాలెంలో పెద్దమణుసుల

మాదిరి తిరిగే అయిదారుమంది నాగమ్మ యింటికి ఎదురుంగ ఉండే పలకరాళ్ళ తెట్టెమీన కూర్చొని గంటన్నర నుండి మాట్లాడ్తనే ఉన్నారు. కేసుపెడ్తే పరిస్థితి ఎట్లుంటదా? అని. 'ఇప్పటికి అయిందిగాదు, యింక ముందెంత ఉందో, మొద టొాల్నుండి వాల్లమీన ఆధారపడి బతికినోల్లం. సివరకు కొంపలంటుకుంటే ఆర్పుకోనీకగూడ వాల్ల ఆదరు వుండాల్సిందేనని రుజువాయె. కేసు పెడ్తే రేపొద్దున రెడ్డి ...! అంటూ మొగంజూపనీకుంటదా? ఆలోచించండి' అన్నట్లు ఇద్దరన్నారు. "అట్లని జరిగిన అన్యాయాన్ని సెప్పకోనీకగూడ నోరు లేకుంటె ఎట్లా! అదిగూడ నేరమైతదా? మనమేం తప్పు జేసినమని బయపడాల? చట్టం ప్రెకారం పోదాం అంతే....' అని యింకొందరు భుజంమీని తుండుగుడ్డల్ని యిదిలించి మాట్లాడినరు.

జనమంతా కలిసి తలా ఒకమాట ఆనేతలికి యిన్నిరకాల అభిప్రాయాలు బైటపడ్డా 'కేసు పెట్టాల'నే మాట గట్టిపడింది.

"....సాయంత్రం పనులనుండొచ్చి ఉప్పుకారం కొనుక్కోనీక అంగళ్ళకు బోతే ఆ మొగోల్లు ఎట్ల జూస్తురో మీకేం తెలుస్తది. అలిసిపొయ్యొచ్చి మంచాలకు అడ్డంపండుకోవడం తెలుస్తదిగాని. వాల్ల ఆడోల్లను మీరట్లనే సూడనికపొండి, కండ్లు పొడిపించిగాని వదలరు ..."

సంగమ్మ కోడలుకు ఎన్ని రోజులనుండి రెడ్డోళ్ళమీన పగ, కోపం ఉందోగాని టయమొచ్చేతలికి కక్కేసింది. అందరు గడిబిడిగ మాట్లాడు కొంటుంటే రాములు చిన్నగ ఏదో చెప్పనీక నోరు తెరిచిండు. మాట్లాడేటోల్లు ఆపి చెవులు రిక్కరించిండ్రు.

"....కేసుబెట్టాల, పెట్టాల అని మీకు వొట్టి ఆత్రమేగాని ఆలోచనున్నట్టులా! కేసు పెడ్తరు, ఏమైతది? ఆడుండేది ఏల్లకన్న దుర్మార్గపునాయాళ్ళు.... మనకు న్యాయం జరుగుతదనేది కల్లోమాట. అంతగయితే ఎవల్నో ఇద్దర్ని ముగ్గుర్ని తీసకబోయి రెండ్రోజులుంచుకోని వదిలేస్తరు. మన చుట్టుపక్కల పల్లలో, దేశమంతట ఇట్లే జరుగుతున్నది, మాలోల్లను మాదిగోల్లను కొడ్తే జెయిల్లో ఏస్తమని ప్రెబుత్వం రాసుకుంది గాని అది జరిగే పని కాదు. మనల్ని మోసం జెయ్యనీకనే ఇవన్నీ, అసలు ఈ దారే మంచిదికాదు. పోలీసులని, చట్టాలని పులి నోట్లోంచి సింహం నోట్లో పడ్డట్లే. మనమే అందరం గుంపై రెడ్లను ఎదిరించాల గాని........"

రాములు మాటలు ఆడునోల్లకెవలకు అర్థంగాలేదు.

నాగులు కూడా తలగోక్కొని మొగం తిప్పకుండు. రాములుకు ఆయోమయమైంది. వానికి ఎన్ని ముచ్చట్లు తను చెప్పింది! అప్పుడు బాగనే

వినేటోడు. సమస్య వచ్చేతలికి అన్ని మర్చిపోయి అందరి మాదిరి, ఏం తెలినోని మాదిరి ఎర్రి మొగమేస్తుండు. ఊళ్లకు ఎట్ల నచ్చజెప్పాల? ఆపదొచ్చినప్పుడు దాని మీదనే జనాన్ని కూడగట్టాలని, ఆలోచింపజేయాలని తనకు తెలుసు.

రాములు ఆలోసిస్తుండు. ఎన్నో చెప్పాలనుకుంటున్నాడు. కానీ దెబ్బవల్ల వొళ్ళు అలిసిపోతుంది. మొదట కేసు వొద్దన్న కొందరు పెద్ద మనుషులకు ఈ మాటలు భయంగా తోచినాయి అప్పటికి సూరీడు పడమటి కొండలో పడ్డాడు.

"సర్లేంర్రా! ఎట్లయితే అట్లయితది. కేసు పెడ్దాం...." అని, చుట్టూ చూసి "చీకటి పడింది. ఇర్రైమైళ్ళు ఈ గబ్బు చీకట్లో పోవాలంటే అయ్యేది కాదు గాని రేప్పొద్దున్నే బయల్దేరుదాం...." అన్నాడు పెద్దన్న.

కుర్రోళ్ళు ఆవేశాన్నణచుకొని అప్పటికి ఊరుకున్నారు.

* * *

మాదిగోల్లు తెల్లవారినాక కేసు పెట్టనీక పోతుంర్రని ఎట్ల తెలిసిందోగాని గోయిందరెడ్డి యింట్లో తెలిసింది.

* * *

తెల్లంగ తెల్లారింది. అప్పటికే పెద్దన్నా, యింకొందరు ఈరాపురం పోనీక సిద్ధమైనరు. రాముల్ను బండిమీన తోలకపోతే బాగుంటదేమో అని ఆలోచిస్తుంర్రు. యింతలో ఊర్లోంచి మాదిగపాలెం మునుపులోకి పోలీసు జీపొచ్చి ఆగింది. రాంగనే పోలీసులు 'రాములు యాడుంటడు?' అని అడిగినరు.

'మనం పోదామనుకుంటుంటే అల్లే వచ్చినట్లయింది ...' అనుకుంట మాట్లాడనీక పెద్దన్న దగ్గరికి బోయిండు. కండ్ల జోడేసుకున్న పోలీసు ఆయనకేసి గుర్రు జూసి 'రాములెవర్రా! నిన్న బాయికాడ గొడవయిందంట .... వాడు గోవిందరెడ్డిగారి కొడుకును కొట్టిండని మాకు రిపోర్ట్ వచ్చింది....' పెద్దన్నకు మతి పోయినంత పనయింది. నోరు పెగల్లేదు. "అదిగాద్సార్! సిన్నరెడ్డి అల్ల మణుసులే కర్రతోని మామీని కొచ్చింర్రు .... రాముల్ను అల్లే కర్రతోని తల కేసి మోదింర్రు...."

"షట్ నోర్మయ్...."

"దయచేసి నా మాట నమ్మండి సార్! సిన్నరెడ్డి నన్ను గూడ మెడబట్టి తోసి, ఇదుగో ఈ దెబ్బ తగిలించిండు...."

"ఆఁ ... పెద్దన్నంటే నువ్వేనన్న మాట...." అని ముసలోన్ని ఎడంచేత తోసకబోయి జీపులో పడేసిండు.

'ఏయ్! వాడు రాములుగాడు యాడున్నడో యిండ్లన్నీ సర్చ్‌చేసి, అరెస్ట్

చెయ్యండి...." అని పోలీసులకు ఆర్డరేసిండు. వాళ్ళు పరుగులుమీద గుడిసెలపై పడ్డారు. వాల్లెనకే ఎస్సై బయల్దేరిండు.

పోలీసులకంటే ముందు నాగులు ఎట్ల పోయిండోగాని నాగమ్మ గుడిసె చేరుకున్నాడు .... రాముడు మంచంమీంద లేచి అంగ తగిలించుకుంటుంటే. ఒక్క ముక్కలో సంగతి చెవినేసిండు. నాగమ్మ విని రాయి మాదిరి నిలబడి పోయింది. రాములుకు అంతా అర్థమైపోయింది– 'ఇప్పుడెట్లన్నా?' అని నాగులు బెదురు చూపులు చూసిండు.

"నే చెప్పలా? ఈ ఎవారం ఎట్లుండేది. మనం బతకాలంటే ఈ చట్టాల్తోని, పోలీసుల్తోని గాదు. మన శత్రువైన మదించిన దోపిడీ దొంగ నాయాళ్ళను, అల్ల కాపలాదార్లు పోలీసుల్ను ఎదిరించి పోరాడాల్సిందే...."

రెడ్డోల్లు తనమీన ఏ ఎత్తుతోని కేసు పెట్టింది రాములు ఊహించుకుండు. ఏం జరిగేది తెలుస్తనే ఉంది....

....గుడిసె పక్క నుండి క్షణంలో 'కొత్త దారి'న పడి రేపొద్దున తేలాల్సిన యుద్ధభూమిని చేరకోనీక తప్పించుకుండు.

* [అరుణతార, జూలై-ఆగష్టు, 1994] *

# బందీ

బి. ఎస్. రాములు

ఇది నేను ఆర్డీవో కాక ముందటి మాట. సమయం వచ్చింది కాబట్టి చెప్తున్నాను. ప్రతి మనిషి జీవితంలో ప్రేమించే సమయం ఒకటి వస్తుందను కుంటాను. నాకూ అలాగే జరిగింది.

నేను ఎమ్మెస్సీ, బి. ఇడి. చేశాక అప్పర్ ప్రైమరి స్కూల్లో టీచర్‌గా ఉద్యోగం వచ్చింది. సొంత జిల్లాలో మొదటి ఉద్యోగం అది. అప్పటికి గ్రూప్ వన్ మేయిన్ పరీక్షలు పూర్తి చేశాను. ఆర్డీవో ఉద్యోగం రావాలంటే ఎన్ని మెలికలో, వచ్చేదాకా నాకా విశ్వాసం లేకుండింది. పల్లెటూళ్ళో ఉద్యోగం భలే పసందు అన్పించి మనస్సు ఉరకలు వేసింది.

నేను పుట్టింది పల్లెటూళ్ళోనే అయినా ఎనిమిదో తరగతి నుండి ఊరు వదిలి హాస్టల్లో చేరాను. అప్పటినించి పట్నం, పల్లె జీవితాలు రెండూ నాలో పెనవేసుకున్నాయి. నేను పల్లెలకు మరీ దూరం కాలేదు. మరీ దగ్గర కాలేకపోయాను. పెరుగుతున్న నా విద్యావసరాలు నన్ను పల్లెల గురించి పట్టించుకోనీయలేదు. డబ్బులు వెసులుబాటులేక పట్న జీవితాన్ని అనుభవించలేదు. రెంటికీ ప్రేక్షకుడిలా పైసా ఖర్చు లేకుండా అనుభవం మాత్రం సంపాదించాను,

పల్లెటూళ్ళో బడిపంతులు ఉద్యోగం నాకుఎంతో థ్రిల్లింగ్‌గా ఉంది. అది మా ఊరికి 50 కిలోమీటర్లలోనే ఉండడం కూడా ఒక కారణమేమో. నేనూ ఒక ప్రయోజకుడినయ్యానని నా కొచ్చిన ఉద్యోగం నన్ను సర్టిఫై చేసినట్లుగా సంతోషం. అంతకుముందు పనులు చేయలేదని కాదు. పైసలు సంపాదించడానికి ఎన్ని పనులో చేశాను. కాని మధ్యతరగతి తాలూకు వృత్తి చేపట్టడం అదే తొలిసారి. నాలో ఆనందం పొంగులువారడానికి అది కూడా ఒక ప్రధాన కారణమే.

అంతకుముందు చిన్నప్పుడు మా అన్నతో వెళ్ళి పటేండ్ల యిండ్లల్లో పశువుల పేడ తీసేవాన్ని. మా వూరి రెడ్డి నన్ను పాలేరుగా జీతం ఉంచుకోవాలనే చూశాడు. మా అవ్వ (అమ్మ) మనస్సు గట్టిది. మా నాయిన (నాన్న) హృదయం గొప్పది. చేసేది యిటుక బట్టీల కూలి పనైనా చదువుతో ఒనగూడే ప్రయోజనాల గురించి గొప్ప అవగాహన గలవాడు. నన్ను కనీసం బడిపంతులునైనా చేయాలని మా నాయన తపన.

చిన్నప్పుడు ఆటకాయిలతనం. నాకు చదువంటే గిట్టేది కాదు. అవ్వ, నాయినలతో పనికి పోవాలంటేనే సంతోషం. ఎందుకో నాకు చిన్నప్పట్నించీ పనిలోనే ఆనందం. ఏదో ఒక పని చేయాలనిపించేది. ఊరికే కూర్చోబెట్టి యిది రాయి అది రాయి అనే చదువంటే ఎంతో విసుగ్గా వుండేది. స్కూల్లో ఆడించే ఆటలు ఎంతో పసందుగా ఉండేవి. అన్నిట్లో ఏదో ఒక ప్రైజు సంపాదించేవాన్ని. నాకు ప్రయిజు వచ్చిన స్టీలు గ్లాసు తొర్రిబోయినా యిప్పటికీ అదంటే నాకెంతో ప్రేమ.

హాస్టల్లో చేరడానికి ఎన్ని తిప్పలు పడ్డానో, హాస్టల్లో చేరాక చిల్లర పైసలు లేక అపుడపుడు రైసు మిల్లుకు రాత్రిళ్ళు పనికి పోయేవాన్ని. ఆపైసల్తో నోటుబుక్కులో, సిన్మా టికట్లో కొనుక్కునేవాన్ని.

కాలేజీలో చదువుతున్నప్పుడు సకాలంలో స్కాలర్‌షిప్పు లందేవి కావు. నాయిన పైసలు పంపలేకపోయేవాడు. డేలీ పేపరువేసి, పాలప్యాకట్లువేసి, సెంట్రింగ్ పనికిపోయి, గోడపని నేర్చుకుని - యిట్లా ఎన్ని పనులు చేశానో. ఓ సిన్మాటాకీసుకాడ గల పాన్ షాపు కోసం తమలపాకుల తొడిమలు తోకలు, ఖాలియాలు కత్తిరించడానికి కొద్దికాలం పార్ట్‌టైం జాబ్ వంటిది చేశాను. తర్వాత్రర్వాత పిల్లలకు ట్యూషన్లు చెప్పడం ప్రారంభించాను.

నిజం చెప్పాలంటే నేను నిజంగా ప్రేమంటే ఏమిటో తెలుసుకున్నది ట్యూషన్లు చెప్తున్నప్పుడే. ప్రేమను గెలుచుకోవడం మొదలైంది కూడా అపుడేననుకుంటాను. లిల్లీ నన్ను యిప్పటికీ ఎంతగా ప్రేమిస్తుందో చెప్పలేను. అపుడు

నేను ఏడో తరగతి ట్యూషన్ చెప్తున్నాననుకుంటాను. ఇపుడది పి. జి. చేస్తోంది. అది యిపుడు బాబాయి అంటూ వరస కూడా కలిపేసింది.

లిల్లీ నన్ను అమాయకంగా ప్రేమించేది. దాని అల్లరి యింతా అంతా కాదు. నాకు పెద్దవాళ్ళ యిళ్ళల్లో సంకోచం మరీ ఎక్కువ. బాగా చెప్పి మంచి వాన్ననిపించుకోవాలని తపన. లిల్లీ మెల్ల మెల్లగా మారుతుంటే వాళ్ళమ్మ కళ్ళల్లో ఎంత వెలుగో.

లిల్లీ వాళ్ళమ్మే మొదటిసారిగా బయటి ప్రపంచానికి సంబంధించిన ప్రేమంటే ఏమిటో తెలిపింది. జానకి ఆమె పేరయినా, లిల్లీ వాళ్ళ అమ్మ అనే నాకు పిలవాలనిపిస్తుంది.

జానకి క్రమ క్రమంగా నన్నూ వాళ్ళ కుటుంబ సభ్యునిలా ఆదరించడం మొదలెట్టింది. కుటుంబంలో ఉండే మధ్యతరగతి మర్యాదలు నేను వారింటినించే నేర్చుకున్నాను. అవి నాకెంతగానో ఉపయోగపడ్డాయి.

జానకి చూపే ప్రేమ చూస్తుంటే ఎంతగానో ప్రేమించబుద్ధయ్యేది. ఆమె నాకన్నా ఎంతో పెద్ద. మంచి ఉద్యోగస్థురాలి యిల్లాలు. నిర్మలమైన మనసు, ఇద్దరు పిల్లలు.

అయినప్పటికీ నేను జానకిని ప్రేమించడానికి యివేవీ అడ్డంకి కాలేదు. నా ప్రేమ నా హృదయంలోనే ఉన్నంతకాలం ఏ ప్రమాదమూ లేదని నాకు తెలుసు. నా ప్రేమలో సెక్సుకోణం ఉందా అని ఆలోచిస్తే ఒకసారి ఉందని పించేది. ఒకోసారి లేదనిపించేది. అలాంటి తర్కం ప్రవేశించినపుడు మనసు గజిబిజి అయ్యేది. ఏదో తప్పు చేస్తున్నానా అని మనస్సనుకునేది. అందువల్ల ప్రేమించే హృదయాల్నే పెంచుకున్నాను గానీ తర్కాన్ని దూరం తరిమాను.

లిల్లీ వాళ్ళమ్మ నాకు ఆరాధ్య దేవత. భక్త మీరాబాయి కృష్ణున్ని కొలి చింది. అందులో వున్నది ఆరాధనేనా - సెక్సు భావన అంతర్లీనంగా ఉందా అని ప్రశ్నిస్తే జవాబు ఎవరి సంస్కారాన్నిబట్టి వారి కందుతుంది. మీరాబాయి కృష్ణున్ని కొలిచినట్టు నేను లిల్లీ వాళ్ళమ్మను కొలిచాను. అదొక మధుర భావన.

కొన్ని ప్రేమలు మధురంగా ఉంటాయి. వ్యక్తం చేయనవసరంలేని ప్రేమ మరీ మధురంగా ఉంటుంది. లిల్లీ వాళ్ళమ్మపట్ల నాకున్న ప్రేమ వ్యక్తం చేయనవసరంలేని ప్రేమ. ప్రేమను వ్యక్తం చేయడంవల్ల ప్రేమ అనే శక్తి కొంత ఖర్చయిపోతుందనుకొంటాను.

జానకి నాలో ప్రేమ ఉదయించడానికి ప్రేరణ యిచ్చిన మాతృమూర్తి. ఇపుడు లిల్లీ వరుస కలపడంతో జానకి నాకు వదినయి పోయింది. జానకి నిజంగా నాకు వదినే. శరత్ పాత్రల్లోని వదినలా, తల్లిలా ఎన్ని నేర్చుకోవ డానికి ప్రేరణ అయ్యిందో, జానకి నన్నొక సొంత తమ్ముడిలా ఆదరించేది.

అప్పుడు సంకోచించాను గానీ నాకిపుడా సంకోచం లేదు. మొన్నామధ్య లిల్లీతో అనేశాను కూడా. నేను మొదట నిజంగా ప్రేమించింది మీ అమ్మనే అని. లిల్లీ గలగలా నవ్వేసింది. ఆ రోజు జానకీ, వాళ్ళాయన కూడా యింట్లో భోజనాలకాడ యిదే మాట గుర్తు చేసుకుంటూ పదే పదే నవ్వులు.

నా భావాన్ని అర్థం చేసుకోలేకపోతే జానకిని నేను ప్రేమించాను అనే మాట ఎన్ని అనర్థాలు సృష్టిస్తుందో. అందుకే నే నెపుడూ నేను నేనుగా ఎదిగే దాకా నా ప్రేమను వ్యక్తం చేయలేదు.

కాలేజీ రోజుల్లో క్లాసుమేటు అమ్మాయిల్ని నేను ప్రేమించలేదని కాదు. అందంగా, హాయలుపోయే అమ్మాయిలందర్నీ ప్రేమిస్తున్నాననుకునే వాన్ని. ఎవరో ఎపుడో ఒకప్పుడు కలలో కొచ్చేవాళ్ళు. అయినప్పటికీ దాన్ని ప్రేమగా నేను ఆనాడూ సీరియస్‌గా ఫీల్ కాలేదు. ఈనాడూ ఫీల్ కావడంలేదు. అదొక ఆట. అదొక టైం పాస్ సోషల్ రిలేషన్స్‌లాగే అనిపించేది. ఎన్ని ప్రేమ కబుర్లు చెప్పుకున్నా అందులో ఉందని అనుకోను. ఆ వయసు అలాంటిది. అవన్నీ పై పై ప్రేమలు. అలా నేను ఫీల్ కావడానికి వాళ్లు నాకు అందని ద్రాక్ష పుల్లన అనే భావం లోలోపలే ఎక్కడో ఉండడం కారణం కావొచ్చు.

లిల్లీ వాళ్ళమ్మను ప్రేమించినవంటి ప్రేమలో పడింది నేను బడిపంతులు ఉద్యోగంలో చేరాకే. జానకిని ప్రేమించడం నాలోని ప్రేమను, హృదయాన్ని నన్ను నేను తెలుసుకోవడానికి ఎదగడానికి సంబంధించింది. కానీ బడిలో పరిచయమైన రేణుకను మాత్రం నిజంగానే ప్రేమించాను. నన్ను నేను తెలుసుకోవడానికి కాకుండా, నన్ను నేను గెలుచుకోవడానికే రేణుకను ప్రేమించాను.

రేణుతో నా ప్రేమ సాదాగానే మొదలైంది. నేనా ఊరికి కొత్త. నాకన్నా కొద్ది నెలల ముందే రేణు ఆ స్కూల్లో టీచరుగా చేరింది. రేణుక ఆ వూరి ఆడపడుచే. రెడ్లమ్మాయి. బియస్సీ బిఇడి చేసింది. పాఠశాల విద్యా కమిటీ ఆమెను నెలకో అయిదు వందల గౌరవ వేతనం మీద అపాయింటు చేసింది. అప్పర్ ప్రయిమరీ స్కూల్‌ను హైస్కూలు చేయాలని వారి ఆశ. అందుకే అనుమతి రాకున్నా, ఎనిమిదో తరగతి ప్రారంభించారు. విరాళాలతో యిద్దరు టీచర్లకు గౌరవ వేతనం యిస్తూ క్లాసులు నడుపుతున్నారు.

రేణు అందంగానే ఉంటుంది, రెడ్లమ్మాయి కావడంవల్లో ఏమో, లేక సొంత ఊరు కావడంవల్లో గానీ ఆమె నడకలో, మాటలో, సంస్కారంలో ఎంతో ఆత్మ విశ్వాసం తొణికిసలాడుతుంది. ఇప్పటి మాటల్లో చెప్పాలంటే ఉద్యోగ భద్రత తాలూకు ఆత్మ విశ్వాసాన్ని ఆమె కనపరుస్తూ ఉండేది. అదే ఆమె అందంగా లవబుల్‌గా కన్పడ్డానికి కారణమేమో. ఎక్కువ కులం అమ్మాయిని గెలుచుకోవాలనే తపన అంతరంతరాల్లో ఉండేదేమో. దాని కారణంగానే ప్రేమలో పడ్డానో అంత స్పష్టంగా చెప్పలేను.

ఏమైతేనేమి నేను మొదటిసారిగా జీవితంలో ప్రేమించింది రేణునే. ఆమె స్కూల్లో చదువు ఎంతో శ్రద్ధగా చెప్పేది. వాళ్ళంతా తన తమ్ముళ్ళన్నంత చనువుగా ఆప్యాయంగా మెదిలేది. పిల్లల్ని ప్రేమించే హృదయం ప్రేమాస్పదంగా ఉంటుందేమో. అదే ఆమెలో సౌకుమార్యంగా కన్పడిందేమో.

రేణును స్కూల్లో నిండారా రెండు కన్నుల్తో చూసేవాన్ని. హృదయం తెరిచి హాయిగా నవ్వేవాన్ని. రేణు కూడా అచ్చం అలాగే చూసేది. అలాగే నవ్వేది. వాళ్ళ చేన్లు చెలకలు చూసే నెపంమీద పచ్చని చెట్ల నీడల్లో, గట్ల మీదా సోయగాలు పోయేవాళ్ళం.

నాకు ఆ వూళ్లో యిల్లు దొరకడం కష్టం అయింది. కొన్నాళ్ళు పొరుగూరి టీచరు యింట్లో ఒంటరి కాపురం పెట్టాను. ఊళ్ళో నాకు అద్దెకు యివ్వడం అనేది పెద్ద సమస్య అయిపోయింది. అందరూ సంస్కారవంతంగానే కనపడుతారు. ఒక్క గది కిరాయకిమ్మన్నా లేదంటారు. నా కులం కారణంగానే నాకు యిల్లు కిరాయకివ్వడంలేదని స్పష్టంగా తెల్సిపోతూనే ఉంది.

నాకు పట్టుదల పెరిగింది. మాకులం వాళ్ళ యిళ్లు కొన్ని ఆ వూళ్లోనూ లేకపోలేదు. నేను ఆ యిళ్ళల్లో మాత్రమే ఎందుకుండాలి. బళ్లో చదువుకుంటున్నది వాళ్ళ పిల్లలు మాత్రమే కాదు గదా!

వారి పిల్లలకు నేను చదువు నేర్పాలి. బాగా చెప్పానని ప్రశంసిస్తారు. వారికి నేనంటే ఎంతో గౌరవం. కాదనను. ఆ గౌరవం దేనికి పనికొచ్చింది - నాకొక యిల్లు కిరాయికివ్వలేకపోయాక!

నేను ఊళ్లో ఉండను — వేరే ఊరికి బదిలీ చేయిమని మా బి.డి.వో. గారికి దరఖాస్తు చేసికొన్నాను. ఆయన జీపులో వచ్చి సర్పంచు, తదితరులందరితో మాట్లాడి చివరకు కళ్లు తేలవేసి నాకో ఉచిత సలహా పారేశాడు. మీ కులంవాళ్ళ యిళ్ళున్నాయిగా అక్కడే ఉండొచ్చుగదా అని. నిజం చెప్పొద్దూ. నా కోపం నసాళానికంటింది.

ఇక్కడ అసలు సమస్య యిల్లు కానేకాదు. మనిషిగా గౌరవించడం. నన్ను తమతో సమానంగా గౌరవించేవారైతే వారెందుకు కిరాయకుంచుకోరు. నన్ను గౌరవించనివారికి నా విద్యను నేనెందుకు దానం చేయాలి అనేది నా అహం లేదా ఆత్మవిశ్వాసానికి సంబంధించిన సమస్య. అవూరు నక్సలైటు సానుభూతిపరులకు పెట్టింది పేరు. వాళ్ళ నంస్కృతే యీ విధంగా ఉంది. ఇంకా వేరే ఊళ్ళ సంగతి ఏం చెప్పను?

నాకు యిల్లయినా యిప్పించండి, బదిలీ అయినా చేయించండి అని నా డిమాండు. స్కూలు విద్యా కమిటీ మెంబర్లు ఒక్కడూ ముందుకు రాలేదు.

రేణు తమ యింట్లో ఉండమని కోరుతుందని ఆశించాను. ఆమెలో ఏం ఆలోచనలున్నాయో నాకు తెలియదు. ఏమైనా లోకాన్ని కాదని పెళ్ళికాని పిల్ల

అంత ధైర్యం చేయాలని కోరుకోవడం యిపుడు చూస్తే అత్యాశే అన్పిస్తోంది. కాని ఆ రోజుల్లో యువ ఉత్సాహం కదా! గొప్ప ఆదర్శాల్లో తేలిపోతున్నవాడిని. ఆమె నన్ను వారింటికి ఆహ్వానిస్తుందనే అనుకున్నాను.

నిజానికి నాకు ఏం తక్కువ. ఉన్నత విద్యావంతుడిని. నా మటుకు నేను అందంగానే ఉంటాను. మాట తీరుకూడా ఎంతో హుందాగా మార్చుకున్నాను. లిల్లీ వాళ్ళమ్మ చలవవల్ల నేను ఎంతో మారిపోయాను. నాకు నేనుగా నా కులం పేరు చెప్పకపోతే నన్నెవరూ తక్కువ అంచనా వేయరని నాకు తెలుసు.

అయినా అవసరం వచ్చినపుడు నా కులం పేరు చెప్పడానికి నేనెందుకు సిగ్గుపడాలి. వారికి వాళ్ళ కులం ఎంత గర్వకారణమో, నాకూ నా కులం అంతే గర్వకారణం.

నేను యిల్లు కిరాయకు అడిగినప్పుడు వేరే కులం పేరు చెప్పి ఉండాల్సింది అని రేణు అనుకొని ఉంటుంది. అడిగినపుడు కులం పేరు దాచేసుకోవడం పరిష్కారమా? పలాయనవాదమా? పైగా అది నా జాతి ఆత్మగౌరవానికి సంబంధించిన సమస్య.

నాకు యిల్లు కిరాయకు యిప్పించలేక బి.డి.వో నాకు కోరుకున్నచోటికి బదిలీ చేశాడు. రేణు కోసం యింకా కొన్నాళ్ళు ఆ వూళ్ళో వుంటే బావుండుననిపించింది. ఆరు నెలలైనా కాకముందే ప్రేమ పుష్పించడం ఎలా సాధ్యం? నాలోని ప్రేమ మొగ్గగా నాలోనే ఉండిపోయింది.

బదిలీ అయి వెళ్ళేటప్పుడు గానీ తెలియలేదు. నన్ను రేణును ఎంతగా ప్రేమిస్తున్నదీ, రేణును వదిలిపోవాలంటే ఏదో బాధ. అప్పటికీ కొన్ని ఊహలు నేనొక లెక్చరరుగా, ఆమె టీచరుగా యిద్దరం భార్యాభర్తలుగా హాయిగా గడపొచ్చునని.

రేణు స్థితీ నాలాగే ఉందని అర్థం కావడానికి ఎంతో సేపు పట్టలేదు. రేణు కూడా నన్ను ప్రేమించింది. గాఢంగానే ప్రేమించింది.

ఆ వూరినించి బదిలీ అయినా ఏదో వంకతో రెండు మూడుసార్లు ఆ స్కూలుకు వెళ్ళాను. రేణును కలిశాను. ఆమె తల్లిదండ్రుల చేతులమీదుగా మా పెళ్ళి జరగాలని నా కోరిక.

నాలాంటి విద్యావంతుడు కాబోయే లెక్చరరో, ఆర్డీవోనో రేణుకు వాళ్ళు వెతకాలంటే కనీసం అయిదు లక్షలైనా ఖర్చవుతాయి. నాకు కట్నం అవసరం లేదు. వారి సంప్రదాయానుసారం కుటుంబంలో బాగంగా మా పెళ్ళి చేస్తేచాలు. ఇదేమైనా పెద్ద కోరికా?

రేణుక, రేణుక ఫ్రెండ్సూ, నా ఫ్రెండ్సూ అది సాధ్యం కాదన్నారు. కొండగట్టుకో, వేములవాడకో లేదా తిరుపతికో వెళ్ళి దేవుడి సమక్షంలో పెళ్ళి

అయిందనిపించుకుంటే ఆ తర్వాత తల్లిదండ్రులు వారే అంగీకరిస్తారు - అన్నది వారి సారాంశం.

చదివేడిస్తే ఉన్న మతి పోతున్నట్టుంది వారికి. సమస్య పరిష్కారం వాళ్ళ తల్లిదండ్రుల చేతుల్లో ఉండగా, ఏదో కాని పని చేసినట్టు, ఎవడో దిక్కుమాలినవాడు లేపుకు పోయినట్టు పెళ్ళి చేసుకోవడానికి నాకేం ఖర్మ. నాకన్నా ఎక్కువ చదివి ఉద్యోగం చేస్తున్న అమ్మాయిల్ని యిద్దామని నాకు క్యూకట్టారు. వాళ్ళందర్నీ కాదని ఈ దిక్కుమాలిన రీతిలో పెళ్ళి చేసుకోవాలా — ఛీ — వారి సలహాలు వింటే అసహ్యమేసింది.

చివరకు ఎమ్మెల్యే, ఆర్డీవోలు ముఖ్య అతిథులుగా స్టేజీ మ్యారేజి లేదా రిజిష్టరు మ్యారేజి ఏర్పాటు చేస్తానన్నారు. అక్కడికి అదేదో ఘనకార్యం అయినట్టు. అసలు మనుషుల్ని మార్చలేక యీ పలాయనవాదా లెందుకో - నాకసలు గిట్టవు. సమాజం మారినా కుటుంబం మారడానికి సిద్ధం కావడం లేదేమి? మారుతున్న యీ సమాజాన్ని మారకుండా కుటుంబం అనేది తన బందీగా మార్చేస్తోందా?

నేను రేణును ప్రేమించడం నా అర్హతకు మించిందా? రేణు నాకన్నా మంచి వరుణ్ణి పొందడం సాధ్యమేనా? అని ప్రశ్నిస్తే వారి బంధుమిత్రులు మౌనం దాల్చారు. వారికి తెలుసు. రేణు జీవితం గొప్పగా ఉండబోతుందని. అయినా రేణు యింట్లోనే సంప్రదాయికంగా పెళ్ళి చేయడానికి ఎందుకు అంగీకరించరూ? ఏమిటి వారి గొప్ప? ఎందులో?

నన్ను సముదాయించడానికి చేసే వాదనలు నన్ను శూలాల్లా గుచ్చాయి. స్పష్టంగా కనపడే కులాన్ని పక్కనపెట్టి ఎన్ని సిద్ధాంతాలు దంచుతారో వీళ్ళు. చూస్తుంటే రోత పుట్టింది. కులాల మధ్య సమన్వయం సాధించాలంటే కనీసం నాలాంటి ప్రేమ పెళ్ళిళ్ళయినా తల్లిదండ్రుల చేతుల మీదుగా జరగాలి గదా!

రేణు నాతో లేచి రావడానికి సిద్ధపడింది. నేను వద్దన్నాను. వారి కులానికంతటికీ నేను శత్రువు నెందుకవ్వాలి. వాళ్ళు నన్ను అల్లుడుగా స్వీకరించనపుడు జరిగే పర్యవసానాలు మా కాపురాన్ని విచ్ఛిన్నం చేయవని గ్యారంటీ ఏమిటి? రంగనాయకమ్మ "బలిపీఠం" నవలతో ఏనాడో హెచ్చరించింది కూడా.

రేణు కోసం నేను రెండేళ్ళు ఆగాను. ఈలోపు ఆర్డీవోగా ఎన్నికయ్యాను. రేణుక తరపు బంధువులంతా ఎంతో సంతోషించారు. ఆర్డీవో నయ్యాను గనుక యికనైనా తల్లిదండ్రుల చేతుల మీదగా పెళ్ళి చేస్తారని ఆశించాను. అదీ అడియాసే అయ్యింది.

మా నాయినా, అవ్వా, అక్కా కలిసి రేణుక యింటికి పెళ్ళి చూపులకు వెళ్లారు. రేణును తమలో కలుపుకోవడానికి అంగీకరించారు. నాకు చాలా సంతోషం వేసింది.

రేణూ, వాళ్ళ అమ్మా నాన్నా నేను ఉద్యోగం చేస్తున్న చోటికి మరో నలుగురితో కలిసి రాయబారానికి వచ్చారు. స్టేజీ మ్యారేజీ చేసికొమ్మని. పెళ్ళయ్యాక అన్నీ సజావుగా జరిగేట్టు చూసుకుంటామని.

రేణు తల్లిదండ్రులు ఈ కాస్త దిగివచ్చినందుకు లోలోపల సంతోషం వేసింది. వాళ్లు నన్ను నన్నుగా నిజంగా అంగీకరిస్తే వాళ్ళింట్లోనే పెళ్ళి చేసి పంపవచ్చు గదా! అదే మాట మర్యాద పద్ధతిలో అడిగాను. వారినించి అవే పేలవమైన జవాబులు.

రేణుకను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్న మాట నిజం. అయితే నాది టీనేజ్ ప్రేమ కాదు. ప్రపంచాన్ని చూస్తున్నాను. నాకు విద్య మీద గల ఆసక్తి కారణంగా తొమ్మిదో తరగతిలో నా పెళ్ళిచేసిన తల్లిదండ్రులు కోడలు పెద్దమనిషైందని తొందర పెడుతుంటే విడాకులకు అంగీకరించారు. ఆమె యిపుడు రెండో సంబంధంతో సుఖంగా బతుకుతోంది.

ఏ వయస్సుకు ఆ ముచ్చట తీరడంలోనే ఆనందం ఉంటుందనుకుంటాను. అర్డివ్వో కివ్వడానికి అమ్మాయిలు కరువా? యూనివర్శిటీ లెక్చరర్‌గా పని చేస్తున్న మల్లిక నాకు బాగా నచ్చిన సంబంధం. మా అవ్వా నాయిన్నలకు దూరపు బంధువుల పిల్ల కావడంతో వాళ్లు మరీ సంతోషించారు.

మా పెళ్ళికి రేణుకను కూడా ఆహ్వానించాను. రేణు వస్తుందని తెలుసు. వచ్చింది. ఏమీ జరగనట్టుగానే అందర్తో హాయిగానే గడిపి వెళ్ళింది. వెళ్ళే ముందు ఆ కళ్ళల్లోని జీవం యిక్కడే వదిలేసుకొని వెళ్ళినట్టుంది. నాహృదయం కలుక్కుమంది. నేనేమైనా పొరపాటు చేశానా అని మొదటిసారిగా విల విల లాడాను.

రేణు యిపుడు జె. పి. స్కూల్ అసిస్టెంటుగా జాబ్ చేస్తోంది. రెండు మూడు సంబంధాలు వస్తే తిరగ్గొట్టిందని విన్నాను. నా మనస్సులో ఏదో బాధ తొలిచివేయడం ప్రారంభించింది.

మల్లికకు నా ప్రేమ వృత్తాంతం చెప్పాను. బాగా అనునయించింది. మల్లిక నాకు ప్రేమను పంచిన ప్రేమ స్వరూపిణి. నా కోసమే దాచినట్టుగా యిన్నాళ్ళ ప్రేమ భాండాన్ని నాకందించింది. మాకు యిద్దరు పిల్లలు.

రేణు అపుడపుడు వచ్చిపోతూ వుంది. మల్లిక రేణుకపై అనుమానపడినట్టేమీలేదు. ఇద్దరూ హాయిగా అక్కా చెల్లెళ్ళుగా కల్సిపోయారు.

రేణు లోకాన్ని పట్టించుకోవడం తగ్గించింది. నేను ఆమెను ఉంచుకున్నాను అనే పుకార్లు నా చెవికి కూడా సోకాయి. ఉంచుకోవడం ఏం ఖర్మ ఏకంగా ధర్మపత్నే అయ్యేది గదా అని అరవాలనిపించేది. కానీ ఎవరితో అరవను!

మల్లిక నోటి నుండి యీ ప్రతిపాదన వస్తుందని నేనూహించలేదు. రేణుకను రెండో భార్యగా స్వీకరించాలని వేడికోలు. స్త్రీల్లో మల్లిక లాంటివారు కూడా ఉంటారా! ఊహించలేకపోయాను.

కానీ యీ ప్రతిపాదన ఎందుకో నాకు నచ్చలేదు. రేణుని నేను యిప్పటికీ ప్రేమిస్తున్నాను. రేణు హృదయం నిండా నేనే ఉన్నానని కూడా నాకు తెలుసు. మేం యిద్దరం అంగీకరించాక నీకేమిటి అభ్యంతరం అని మల్లిక వేసిన ప్రశ్న నాకు ఎక్కడో తగిలింది. నేను ఏమైనా వస్తువునా కల్సి పంచుకోవడానికి.

బ్రోకరు పని చేసి మందికి తార్చి కూతురి సంపాదనకు ఎగబడ్డాడనే సూటి పోటి మాటలు భరించలేక రేణు నాన్న ఆత్మహత్య చేసికొన్నట్లు తెల్సింది. విల విల లాడిపోయాను. ఏం చేస్తూలో తోచలేదు. ఇంటికి వెళ్ళి ఓదార్చితే సమస్య జటిలమవుతుందనిపించింది.

లిల్లీ వాళ్ళమ్మను పంపాలనిపించింది. మొదటిసారిగా జానకికి విషయ మంతా చెప్పేశాను. నీలో పట్టుదలే ఉందనుకున్నాను గానీ నీవు మరీ యింత మొండి మూర్ఖుడివి అనుకోలేదు అంటూ జాడించింది. నా అహమే యింత జరగ డానికి కారణం అని తిట్టింది. చేతులారా రెండు జీవితాల్ని నాశనం చేశానంది. ఇప్పటికైనా రేణుకు జరిగిన అన్యాయం సరిదిద్దు అంటూ నీవే రేణు దగ్గరికి వెళ్ళిరా అంది. జానకి నన్నొక్కన్నే తప్పు పట్టడం బాధ కలిగించింది.

నా లిల్లీకి ఈ విషయం చెప్పుకొని ఊరట పొందాలనిపించింది. లిల్లీ మల్లెపూవులా నవ్వి దీనికింత వర్రీ అవుతున్నావేంది బాబాయ్ – అమ్మ చెప్పిం దాన్లో తప్పేముంది అంది.

జానకి, లిల్లీ యిద్దరూ నన్నే తప్పు పడ్తున్నారు. అదే నన్ను కలిచి వేస్తోంది. నిజంగా నేను తప్పు చేశానా? నేను క్రూరంగా ప్రవర్తించానా? వాళ్ళే నావట్ల నీచంగా ప్రవర్తించారా? నా అహం కోసం నేను రేణును దూరం చేసి కొన్నానా? జరిగిందానికి రేణు తల్లిదండ్రుల బంధుమిత్రుల బాధ్యతేమీ లేదా?

ఈ రోజు ఆర్డీవో నయ్యాను గనక అనునయిస్తున్నారు. అదే టీచరుగా వుంటే యిలాగే స్పందిస్తారా? ఏమో! నాకా విశ్వాసం లేదు.

ఒకటి నిజం – నేను రేణును ప్రేమించింది నిజం. నా జీవితంలో ప్రేమంటే తెల్సుకుని హృదయం విప్పారిన క్షణాలు రేణు సన్నిధిలోనే.

* [ఆంధ్రజ్యోతి వారపత్రిక, 28-4-1995] *

# మకర ముఖం

**సింగమనేని నారాయణ**

బస్సు దిగి చేతిలో ఉన్న చిన్న సూట్ కేస్‌ను కింద పెట్టి, జేబురుమాలుతో ముఖం తుడుచుకుంటూ అటూ ఇటూ చూశాను. నన్ను దింపిన బస్సు అల్లంత దూరంలో వెళ్తుండటం తప్ప మరెవ్వరూ కనిపించలేదు. రోడ్డుకు ఎడంగా రెండు కర్రగుంజలకు బిగించిన ఇనుపరేకు మీద "వెంకటాపురం 2 కి.మీ." అన్న అక్షరాలు చూస్తూ కొద్ది సేపు నిలబడి, చేతి వాచీ చూసుకున్నాను. పది గంటలు కావస్తోంది. దళితుల మీద దాడి చేస్తున్న భూస్వామి అహంకారంలా ఎండ తీవ్రంగా, క్రూరంగా ఉంది.

నేను నిల్చున్న చోటు నుంచి చూస్తే ఎర్రటి మట్టిరోడ్డు ఆ ఎండలో మరింత ఎర్రగా మెరుస్తూ కనిపిస్తూ ఉంది. రోడ్డుకు ఏ వైపునా ఒక చిన్న పాటి చెట్టు కూడా కనిపించటం లేదు. కానీ, రోడ్డు అంతమయ్యే చోటునుంచి నాలుగైదు గుబురు చెట్లూ, ఆ చెట్ల సందుల్లోంచి రెండు మూడు తెల్లటి మిద్దెలూ కనిపిస్తూ 'అక్కడో ఊరు ఉంది' అన్న నిశ్చయానికొచ్చి సూట్ కేస్ చేతబట్టుకొని మెల్లగా నడక ప్రారంభించాను.

రోడ్డుకు రెండు వైపులా ఎర్రటి పొలాలు, ఒక్క పిచ్చిమొక్క కూడా లేకుండా దైన్యంగా కనిపిస్తున్నాయి. దాహం కోసం నోరు తెరచి

ఆకాశం వేపు ఆబగా, జాలిగా చూస్తున్న ఆ పొలాల బీటల్లో నా జీవిత రేఖల్ని దర్శిస్తూ అడుగులు వేస్తున్నాను.

వెంకటాపురం ఎలిమెంటరీ స్కూల్లో 'సెకండరీ గ్రేడ్ అసిస్టెంట్'గా నన్ను నియమిస్తూ 'పోస్టింగ్ ఆర్డర్' మూడు రోజుల క్రితం వచ్చింది. బి.ఇడి పూర్తి చేసిన తర్వాత రెండేళ్ళకు వచ్చిన ఉద్యోగం ఇది. అనంతపురం జిల్లా పరిషత్తువాళ్ళు నిర్వహించిన రాతమూలక, మౌఖిక పరీక్షల్లో సెలెక్ట్ అయినందు వల్ల నాకీ ఉద్యోగం వచ్చింది.

"రిజర్వేషన్ కోటాలో ఉద్యోగం కొట్టేశావోయ్! అదృష్టం అంటే మీ 'ఎస్సీ' గాళ్ళదే అంటూ మా ఊళ్ళో ఒక అగ్రవర్ణ మిత్రుడు ఎద్దేవా చేస్తే కలవరం పుట్టింది నాకు.

"అంటే, నా ప్రతిభ వల్ల నాకీ ఉద్యోగం రాలేదంటావా" అని నిలదీశాను ఆ అగ్రవర్ణ మిత్రుడిని.

"ప్రతిభ నీది కాదోయ్! నీ కులానిది" అంటూ అసూయ విషంలా కక్కేశాడతను.

"మా కులంలో పుట్టినవాళ్ళకు ప్రతిభ లేదంటావ్! అయితే, అగ్రవర్ణంలో పుట్టిన నీ ప్రతిభకు ఇంతకాలంగా ఎందుకు ఉద్యోగం రాలేదంటావ్" అని సీరియస్‌గా అడిగాను నేను.

"ఎందుకేమిటి? మీ రిజర్వేషన్ కోటాగాళ్ళ వల్లనే...." అని అతనంటూంటే లాగి చెంపకాయ కొట్టాలనిపించింది నాకు.

ఎస్.సి కులంలో నేను పుట్టడమే ఇంతకూ కారణమని అతనంటూంటే మనసు కుతకుతా ఉడికిపోయింది.

"నిన్ను చూసి జాలిపడటం తప్ప నేనేమీ చేయలేను. నీ అసమర్థతను కప్పిపుచ్చుకోటానికి నెపం ఎదుటివాడి కులం మీద మోపుతున్నావ్ — అంతే" అని దులిపేసి దూరంగా వచ్చేశాను.

ఆ రోజంతా నాకు బాధగానే ఉంది. ఆ మిత్రుడన్న మాటలు నేను కొత్తగా వింటున్నవేమీ కావు.

"స్వతంత్రం వచ్చి ఇన్నేళ్ళయింది. ఇంకా రిజర్వేషన్లు కొనసాగిస్తే ప్రతిభగల వాళ్ళంతా మట్టిగొట్టుకుపోతారు" అన్న మాటల్ని నేను కాలేజి చదివే రోజుల్నుంచీ వింటూనే ఉన్నాను.

"ఎస్.సి, ఎస్.టి లాంటి కులాలకు ప్రభుత్వం ఎన్నో విద్యావకాశాలు కల్పిస్తోంది. ఉచిత చదువు, ఉచిత భోజనం, పుస్తకాలూ, బట్టలూ - ఇదంతా చాలదా వాళ్ళ అభివృద్ధికి? ఈ అవకాశాలను ఉపయోగించుకొని వాళ్ళు పోటీ

వడాలి. అంతేగాని, కులం పేరుతో ఏ ప్రతిభా లేకుండా ఉద్యోగాలు ఇంకా కొట్టేయాలనుకోటం సాంఘిక ద్రోహం" అని మా లెక్చెరరే ఒకాయన ఉపన్యాసం దంచేస్తూంటే మండుకొచ్చేది నాకు.

ఇలాంటి మకిలి మనుషుల్ని నా విద్యార్థి జీవితంలో నేను ఎందర్నో చూశాను. ఎన్నో సందర్భాల్లో ఇలాంటివాళ్ళ అవహేళనతో కూడిన వ్యంగ్యపు విసురుల్ని ఎన్నిట్నో ఎదుర్కొన్నాను.

ఊరికి ఎడంగా ముప్ఫయ్ గుడిసెలున్న హరిజనవాడలో ఒక పాత గుడిసెలో ఇరవై మూడేళ్ళ కిందటే నేను పుట్టాను. నా బాల్యమంతా కష్టాలతోనూ, అవమానాలతోనూ గడచిపోయింది. ఈ మాట చెప్పుకోటానికి నేనీనాడు దిగులు పడటం లేదు. రైతుల ఇళ్ళలో పేడా, కసవూ ఊడ్చి గంజు ఎత్తిపోసి, బంద చాకిరీ చేసే జీతగాళ్ళ కుటుంబాల్లో పుట్టిన ఎవరేనా కష్టాలతోనే జన్మ ఎత్తుతారు. మా నాన్న ఒక పెద్ద రైతు ఇంట్లో ఒక చిన్న జీతగాడు. మా తాత కూడా ఒక జీతగాడేనట. విచారించగా మా పూర్వీకులంతా జీతగాళ్ళుగాక మరేమవుతారు? నాకు ఆరేళ్ళ వయసున్నప్పుడు మా ఊరి ఎలిమెంటరీ స్కూల్లో ఒకటో తరగతి చదువుతున్నప్పుడు మానాన్న చనిపోయాడు. ఆ చనిపోవటమూ మామూలుగా అందరూ చనిపోయినట్టు కాదు. కపిల తోలుతూ, మోకు చిల్లి ఊడి, మోకుతో పాటు బావిలోకి ఎగిరిపడి, తల పగిలి, శరీరం ముక్కలై చాలా దారుణంగా చనిపోయాడు. ఇది గుర్తుకొస్తే ఇప్పటికీ నా శరీరం గజగజా వణికి పోతుంది.

మా నాన్న చనిపోయేటప్పటికి మా తాత ఇంకా ఉన్నాడు. మా అమ్మ, నేనూ, నా తమ్ముడూ, చెల్లెలూ - ఇదీ మా కుటుంబం. ఈ చిన్ని కుటుంబం బతకటమే ఎంతో కష్టమయ్యేది. మా అమ్మ అన్ని పనులూ చేసేది. కూలీనాలీ చేసేది. పాచిపనులు రైతుల ఇళ్ళలో నడుం ఎత్తకుండా చేసేది. చెప్పులు కుట్టేది. గొడ్డలి భుజంమీద పెట్టుకొని వెళ్ళి కంపలు చీల్చేది. తానొక్కతే కుటుంబాన్నంతా వెళ్ళదీసేది. నా చిన్న చదువును మానిపించి, ఏ రైతు ఇంట్లోనో గొడ్ల వెంబడి పంపిద్దామని మా తాత అంటే, మా అమ్మ బోరున ఏడ్వటం ఇప్పటికీ నాకు గుర్తు. మా స్కూల్ టీచర్ దయానందంగారని ఒకాయన ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం. ఆయన క్రైస్తవుడు. పేరుకు తగ్గ మనిషి. "మీవాణ్ణి చదువు మాన్పించకమ్మా ఏ రోజులెట్లుండాయో ఏమో! వీడి తెలివికి చదువు అబ్బుతుంది. నేను చూసుకుంటాను" అని ఆయన మా అమ్మతో అన్నప్పుడు ఆమె ఆయన పాదాలను తన చేతుల్తో తాకటం ఇప్పటికీ నా కళ్ళ

ముందున్నట్లే ఉంది. నేను నాలుగో తరగతిలో ఉన్నప్పుడు దయానందం టీచర్ అంబేద్కర్ పాఠం బోధిస్తూ "నాయనా! ఈ దేశంలో మతాలు మాసి పోవచ్చునేమో గాని, కులాలు మాత్రం ఎప్పటికీ నిలిచే ఉంటాయి. అంబేద్కర్ అంతటివాడు ఈ కుల వ్యవస్థకు రోసి బౌద్ధమతంలో చేరిపోయాడు" అన్న మాటలు నన్ను ఈనాటికీ వెంటాడుతున్నట్లే ఉన్నాయి.

మా ఊళ్ళో హైస్కూల్ లేదు. నాలుగు మైళ్ళ దూరంలో ఉన్న హైస్కూల్లో ఎస్.సి హాస్టల్లో చేరి - చదువుకున్నాను నేను. ఈ పుణ్యమంతా దయానందం టీచర్‌దే. మా హాస్టల్ కుర్రాళ్ళంటే మా హైస్కూల్ టీచర్లందరికీ ఎంత అలుసో! మాలో చాలామందికి చదువు సరిగ్గా రాకపోవటానికీ, మా తర తరాల సాంస్కృతిక నేపథ్యానికీ సంబంధం ఉందని గ్రహించకుండా తిండి కోసమే మేము వచ్చినట్లు ఎన్నెన్ని మాటలు అనేవాళ్ళో! నేను చదివిన ఆ స్కూల్లో ఒక్క సైన్స్ మాస్టారు మాత్రమే మేమంటే ఎంతో ఇష్టమూ, దయా చూ పేవారు. "రాజకీయాలకు నిధులుగా మాత్రమే మిమ్మల్ని ఉపయోగించుకొనే ఈ దేశంలో సాంస్కృతిక సమానత్వం ఎప్పటికి సాధ్యమవుతుంది" అని ఆయన నిట్టూర్చేవారు. "కేవలం అరుపులు అరచి ఎంతకాలం మభ్యపెట్టగలరు" అన్న ఆయన ప్రశ్న నన్ను ఉద్విగ్నుణ్ణి చేస్తూండేది.

"మీకేమిరా! భవిష్యత్తంతా మీదే. ఈ దేశ జీవన స్రవంతిలో మీకూ సమాన ప్రాతినిధ్యం లభించింది" అని నేను చదివిన కాలేజీలో హిస్టరీ లెక్చెరర్ పదే పదే జోక్స్‌లా మాటలు పేల్చేస్తూంటే, "పీశ్లెక్కడుండి మాట్లాడుతున్నారు" అనిపించేది నాకు.

ఆలోచనలతో తల నేలకేసి అడుగులు వేస్తూన్న నా ఎదుట ఎవరో నిల్చున్నట్టయి తలెత్తి చూశాను. ఎదురుగా అరవై ఏళ్ళ మనిషి భుజం మీద పాత దుప్పటి, చేతిలో కర్ర. వంగొని ఉన్నాడు, నిటారుగా నిల్చోలేక.

"యావూర్నాయనా" అనడిగాడు నా ఆకారం కేసి చూస్తూ.

"చాలా దూరంలే తాతా! వెంకటాపురమేనా మీది" అనడిగాను.

అవునన్నట్టు తలాడించి, "ఎవురింటికి" అనడిగాడు.

"ఎవరింటికీ కాదు తాతా! మీ ఊరి ఎలిమెంటరీ స్కూల్‌కు అయ్యవార్ని" అన్నాను.

"అట్లానా! అయితే, ఎల్లెల్లు" అంటూ నన్ను అనుమానంగా చూస్తూ ముందుకు నడచిపోయాడతను.

అయ్యవార్ని అనగానే నాతో మాట్లాడటానికి ఇంకేముందిలే అనుకున్నా డేమో!

డొంక లాంటి దారి గుండా పది నిమిషాలు నడిచి గ్రామం మొదట్లోకి చేరుకున్నాను. ఎండ మరింత తీవ్రంగా కాలుస్తోంది.

నాలుగు అడుగులు వేసేసరికి అటూ ఇటూ నడుస్తూన్న జనం – ఇంటి ముంగిళ్ళలో కూచున్న ఆడవాళ్ళు – దారికి అడ్డంగా పడుకున్న రెండు ఎనుములూ – దారి మధ్య నిల్చొని నన్ను ఆసక్తిగా చూస్తున్న కుక్కలూ - ఇళ్ళ లోంచి వినిపిస్తున్న రేడియో సంగీతం – ఒక బీడీ బంకు ముందు నిల్చొన్న మనుషుల మాటల రొద – ఊరి సందడిని గుర్తింప జేస్తున్నాయి.

బీడీ బంకు పక్కన ఒక చిన్న పాక. బహుశా హోటల్ లాంటిది కావచ్చు. పాక కానుకొనే ఒక వేపచెట్టు. పాక ముందు చెట్టు నీడలో రెండు పొడవాటి బెంచీలు. బెంచీల మీద కూచుని కాఫీ తాగుతున్న ఒకరిద్దరూ.

ఊరికి కొత్త మనిషిని కాబట్టి అక్కడున్నవాళ్ళు నన్ను జాగ్రత్తగా, మౌనంగా చూస్తున్నట్టుండిపోయారు.

నేను పాకదాకా నడిచి, ఖాళీగా ఉన్న బెంచీ మీద సూట్ కేస్ పెట్టి కూచున్నాను. అప్పుడు పలకరించాడు ఎదురుగా కూచున్న మనిషి నన్ను "ఏ ఊరండీ" అంటూ తెల్లటి బట్టలతో, బాగా చదువుకున్నవాడిలా కనిపించా డతను. నాకంటే అయిదారేళ్ళు ఎక్కువ వయసుండొచ్చు.

నన్ను పరిచయం చేసుకున్నాను నాలుగు మాటలతో.

"ఓహూ! మీరేనా. మా మండలం ఆఫీసులో మొన్ననే చెప్పినారు లెండి, మీ ఊరికి ఒక టీచర్ని వేసినామని. చాలా దూరం నుండి వచ్చినట్లుండారే" అన్నాడతను.

నేను చిన్నగా నవ్వాను.

"మీ కిదే ఫస్ట్ అపాయింట్ మెంట్ అనుకుంటాను. చిన్న వయసులోనే ఉద్యోగం సంపాదించుకున్నారు" అన్నాడు అభినందిస్తున్నట్లు.

ఆ తర్వాత అతనే హోటల్ లోంచి ఒక చెంబుడు నీళ్ళు తెప్పించాడు. ఆ నీళ్ళతో ముఖం కడుక్కున్నాను.

"టిఫిన్ ఏమైనా తీసుకుంటారా" అనడిగాడు.

"ఉదయం టౌన్ లో తీసుకునే బయల్దేరాను కాఫీ చాలు" అన్నాను.

కాఫీ తాగుతూ "మీరేం చేస్తుంటారు" అనడిగాను.

"ఏముంది? వ్యవసాయమే. ఇంటర్ ఫేలయి ఊళ్ళోనే ఉండిపోయాను" అన్నాడు నవ్వుతూ.

ఇంతలో అక్కడికి ఓ వ్యక్తి గబ గబా వచ్చి తలకు చుట్టుకున్న తువ్వాల్లునుతీసి విదిలించి భుజం మీద వేసుకుని, పాకకు ఓ పక్కగా మునికాళ్ళ మీద

కూచున్నాడు. ఆ మనిషికి యాభై ఏళ్ళుండవచ్చు. సన్నగా, నల్లగా, పండుబారిన నేరేడుపండులా ఉన్నాడు. మాసిన బనియనూ, మోకాళ్ళదాకా చాలీచాలని పంచెతో, కట్టెకు ఒక పాత పేపరు చుట్టినట్టున్నాడు. అతడు కూచునే తన పుల్లలాంటి చేతిని చాచి, పాక గుంజకు బోర్లించిన ఒక సత్తు గ్లాసును తీసి పట్టుకుని పాకలోకి చూస్తూ 'సామీ' అని పిలిచాడు. రెండు నిమిషాల తర్వాత పాక యజమాని వచ్చి ఆ గ్లాసులోకి ఇన్ని నీళ్ళు పోసి వెళ్ళాడు. ఆ నీళ్ళు గుటగుట తాగేసి అలానే పట్టుకొని కూచున్నాడతను. మరో రెండు నిమిషాల్లో ఆ గ్లాసులోకి కాఫీ పోస్తే దాన్ని నెమ్మదిగా నోటితో ఊదుకుంటూ తాగుతూండి పోయాడతను. కాఫీ తాగిన తర్వాత మళ్ళీ నీళ్ళు పోయించుకుని గ్లాసు శుభ్రం చేసి, పాక గుంజకు దాన్ని బోర్లించి, పంచె కొసను విప్పి కొంత చిల్లర అక్కడ ఉంచి ఏదో పని ఉన్నవానిలా చకచకా వెళ్ళిపోయాడు.

ఆతనెవరో, ఎందుకిలా చేశాడో అర్థమై నా మనసంతా దిగులుతో ఆర్ద్ర మయిపోయింది. ఈ బెంచీ మీద కూచుని కాఫీ తాగిన నేనెవరో తెలిస్తే నన్ను కూడా ఆ సత్తుగ్లాసే వరిస్తుందా అనిపించి ఏదో కలవరం క్షణకాలం నన్ను కప్పుతుంది.

నేను తాగిన కాఫీకి డబ్బులు అతనివ్వబోతుంటే, బలవంతంగా వారించి నేనే చెల్లించాను.

"మా ఎలిమెంటరీ స్కూల్ చూపిస్తారా?" అతన్ని అడుగుతూ బెంచీమీద నుంచి లేచి సూట్‌కేస్ పట్టుకుని నిల్చున్నాను.

"ఆ దారిలోనే మా ఇల్లు - రండి" అంటూ అతను నడువగా నేను అనుసరించాను.

నడుస్తూ వాళ్ళ ఊరి గురించి ఏదో చెబుతున్నాడతను. రెండు వందల గడపలు మించని చాలా చిన్న ఊరట. రెండేళ్ళుగా సరిగా పంటలు లేవట. బావుల్లో అసలు నీళ్ళు లేవు. కూలీనాలీ మీద ఆధారపడే కుటుంబాలే ఎక్కువ. ఆర్నెల్ల క్రితం ఒక పెద్ద వర్షం వచ్చిందట. ఆ వర్షానికి ఎలిమెంటరీ స్కూల్ బిల్డింగ్ కప్పు కూలిపోయిందట. అదెప్పటిదో చాలా పాత బిల్డింగట. అప్పట్నుంచీ స్కూల్‌ను ఆంజనేయస్వామి గుడిలో నడుపుతున్నారట. స్కూల్ పుట్టినప్పట్నుంచీ సింగిల్ టీచర్ స్కూలేనట. ఇంకో టీచర్‌ను వేస్తామని సంవత్సరాలుగా అధికారులు చెబుతున్నారట. "ఇప్పటికి మీరే తొలిసారిగా వస్తున్న రెండో టీచర్" అంటూ విషయాలు దారి పొడవునా చెప్పుకొచ్చాడతను.

ఆంజనేయస్వామి గుడిలో స్కూల్ అన్నమాట వినిపించగానే చిన్న

సంచలనంలాంటిది కలిగి ఒక్క నిమిషం నా నడక కుంటుపడింది. మా ఊరి ఆంజనేయస్వామి గుడి గుర్తుకొచ్చింది నాకు. మా ఊరి ఆంజనేయస్వామికి ఆ చుట్టుపట్ల పల్లెల్లో ఎంతో కీర్తి ఎప్పుడూ ఎవరో ఒకరు వచ్చి ఆకుపూజ చేయించే వారు స్వామికి.

నా చిన్నతనంలో ఆ గుడి ముందు మూగేవాళ్ళం బడి పిల్లలం. నా తోటి పిల్లలు గుడిలోకి వెళ్తే నేను బిక్కు బిక్కుమంటూ బయటే ఉండిపోయేవాణ్ణి. కొబ్బరిచిప్పలు కొట్టి ముక్కలు చేసి, దూరం నుంచే నా చేతుల్లోకి విసిరేవాళ్ళు భక్తులు.

కొంత వయసొచ్చింతర్వాత మా చేతి స్పర్శ పొందని ఆ దేవుడే అస్పృశ్యుడు అనుకొని కసిగా నవ్వుకొనేవాణ్ణి నేను.

దారిలో ఒకరిద్దరు ఎదురైతే "కొత్తగా వచ్చిన టీచర్" అంటూ నన్ను మాట మాత్రంగా పరిచయం చేశాడతను.

ఒక సందు మలుపు తిరిగిన తర్వాత అతను ఆగి ఒక పాత బిల్డింగ్ కేసి చూస్తూ "ఇదే కప్పు కూలిపోయిన మీ ఎలిమెంటరీ స్కూల్. ఎప్పటికి రిపేరు చేయిస్తారో ఏమో" అంటూ ఒక పాత భవనాన్ని నాకు చూపించాడు.

ఊరంతా చాలా ఇరుకు సందులు. దారి నిండా గతుకులు – చిన్నచిన్న రాళ్ళు అతని పక్కనే నడుస్తున్నాను నేను.

ఎండ చాలా తీవ్రంగా కాస్తోంది.

ఒక పెద్ద వీధిలో నడుస్తున్నాం మేము. ఆ వీధి మలుపు తిరగ్గానే విశాలమైన బయలు ప్రదేశంలో కనిపించింది ఆంజనేయస్వామి గుడి.

"అదే గుడి - అదే స్కూలు" అంటూ చూపించాడతను.

ఆ గుడిని చూసి విస్తుపోతూ అలాగే నిల్చుండిపోయాను నేను. గుడిలో అరుగుల మీద నీడలో గుంపులు గుంపులుగా పిల్లలు కూర్చునున్నారు. వాళ్ళందరూ స్పష్టంగా కనిపిస్తున్నారు నాకు.

వాళ్ళకు ఎదురుగా గుడి ముందు ఎర్రటి ఎండలో, కసాయి ఎండలో, ఒకతను నిల్చుని చేతులు ఊపుతూ ఏదో గట్టిగా చెబుతున్నాడు. అతని నెత్తి మీద ఒక తువ్వాలు తుండు మాత్రం అటూ ఇటూ వేలాడుతోంది. అతని చెంపల మీద నుంచి ధారాపాతంగా చెమట కారుతూ ఉంది. అతని కాళ్ళ వెనుక ఒక చిన్న స్టూల్ నిస్సహాయంగా ముడుచుకుని కూచున్నట్టుగా ఉంది.

వల్చటి బట్టల్లో నిటారుగా నిలబడ్డ అతను పంచాగ్ని మధ్యంలో కఠోర దీక్ష వహించి తపస్సు చేస్తున్నవానిలా ఉన్నాడు. భూమిలోంచి ఏ ప్రమేయమూ

లేకుండా మొలుచుకు వచ్చి, ఎన్నాళ్ళుగానో నీళ్ళులేక ఎండిపోయిన పాత తుమ్మ చెట్టులా అతనెంతో దయనీయంగా కనిపించారు నాకు.

నేను నిలిచిపోవటం చూసి నా పక్క నడుస్తున్న అతను కూడా నిలబడి పోయి నా ముఖంవేపు చూస్తూ "ఈ గుడిలోనే మీరు పాఠాలు చెప్పాలి సార్" అన్నాడు. "అది సరే. గుడి ముందు నిల్చున్న ఆయనెవరండీ" అన్నాను నేను ఆశ్చర్యం వ్యక్తమయ్యేలా. "అతను సహోపాధ్యాయుడండీ. ఈ స్కూల్‌కు వచ్చి సంవత్సరమయింది" అన్నాడతను. ఆ మాత్రం స్ఫురించలేదా అన్న స్వరంతో.

"ఆదేమిటి, ఆయన ఎండలో నిల్చుని పాఠాలు చెబుతున్నారే" అన్నాను దాదాపు వణుకుతున్న కంఠంతో.

"అతను హరిజనుడండీ హరిజనుడు. తప్పదు మరి."

అతి సాధారణమైన విషయంలా ఎంతో అలవోకగా అతను చెబుతూంటే, నా నాభిలో మంట రగిలి, గుండెల్ని ఎగదన్ని శరీరం దహించిపోతున్నట్టుగా అలాగే కాలుతూ కాలుతూ నిల్చుండిపోయాను నేను. కొద్ది క్షణాల తర్వాత సంబాళించుకొని, అతని ముఖంలోకి నిశ్చలంగా చూస్తూ, "నేను కూడా హరిజనుణ్ణే" అన్నాను దృఢంగా.

* [ఇండియా టుడే, వార్షిక సాహిత్య సంచిక, 1995] *

# రచయితల గురించి...

## 1. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి :

1891 వ సంవత్సరం ఏప్రిల్ 23 వ తేదీన తూర్పు గోదావరి జిల్లా. రామచంద్రాపురం తాలూకా, పోలనూరు గ్రామంలో జన్మించాడు. తొలితరం కథా రచయితల్లో వ్యావహారికాంధ్ర భాషకు తమ రచనల్లో ప్రాధాన్యమిచ్చిన రచయిత. కథను ప్రారంభించడంలోనూ, పాత్రల సృష్టిలోనూ, శైలిలోనూ, సంభాషణలు రాయడంలోనూ, భాషలోనూ ఈయన రచనలు ప్రత్యేకతను సంతరించుకొన్నాయి. ఈయన దాదాపు డెబ్బై కథలు రచించాడు.

## 2. బందా కనకలింగేశ్వరరావు :

20-1-1907 లో కృష్ణాజిల్లా అటపాక గ్రామంలో జన్మించాడు. ఆంధ్ర దేశంలో పేరుపొందిన నటుడు. నాటక ప్రయోక్త. నాటక సమాజాన్ని సొంతంగా ప్రారంభించాడు. కూచిపూడి నాట్యకళకు నిరుపమానమైన సేవలందించాడు. ఉత్తమ రంగస్థల నటుడిగా అవార్డులందుకొన్నాడు. భారతీయ నాట్య సంఘం ప్రాంతీయ కార్యదర్శిగా పనిచేశాడు. ఉత్తమ కథా రచయితగా కూడా పేరు పొందాడు.

## 3. వేలూరి శివరామశాస్త్రి :

1892 వ సం॥లో కృష్ణాజిల్లా శిరివాడలో జన్మించాడు. ఈయన 1925-50 మధ్యకాలంలో కథానికలు రచించాడు. కథా రచనలో సుప్రసిద్ధులు, బహుభాషా కోవిదులు. కథా వస్తువులో, సంవిధానంలో వీరిది అనన్య పద్ధతి. ఈయన కథల్లో సంస్కరణ భావాలు కన్పిస్తాయి. సనాతన - అధునాతన భావ సమన్వయమూ, భావనిగ్రహమూ, వ్యంగ్యమూ, ఉత్తమ పాత్ర చిత్రణా మనోహర పదచిత్రాలూ పుణికిపుచ్చుకొని 'రసాత్మక కావ్యం' అనే నిర్వచనానికి ఈయన కథలు అద్దంపడుతాయి. దాదాపు డెబ్బై కథలు రచించాడు.

## 4. కరుణకుమార :

1901 వ సం॥ ఏప్రిల్ 17 వ తేదీన జన్మించాడు. అసలు పేరు

కందుకూరి అనంతం. ఈయన కథల్లో పల్లెటూరి ప్రజలు ముఖ్యంగా బడుగువర్గాల ప్రజల జీవన స్థితిగతులూ కన్పిస్తాయి. ఈయన శైలిలో దేశీయాలు, మాండలికాలు కన్పిస్తాయి. ఈయన కథలను కరుణ కుమార కథలు, సన్నజీవాలు అనే సంపుటాలుగా ప్రచురించారు. ఈయన కథల్లో ప్రతిదీ పాఠకుని హృదయానికి హత్తుకొనే విధంగా చిత్రణ వుంటుంది.

## 5. అనిశెట్టి సుబ్బారావు :

1922 వ సం॥ అక్టోబర్ 23 వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేట తాలూకా పురుషోత్తమపట్నం గ్రామంలో జన్మించాడు. ఈయన, కథలను 1950 లో 'అనిశెట్టి కథలు' అనే సంపుటిని వెలువరించాడు. ఆదునికాంధ్ర సాహిత్యంలో విభిన్న ప్రక్రియలను చేపట్టాడు. ఈయన కథల్లో మధ్యతరగతి ప్రజల జీవన విధానం కన్పిస్తుంది. సామ్యవాద ధోరణిలో సమసమాజ స్థాపనా లక్ష్యంతో రచనలు చేసిన అభ్యుదయ కవి. ఈయన అనేక నాటకాలు, సినిమా పాటలు, సాహిత్య వ్యాసాలు రచించాడు.

## 6. చలం :

1894 వ సంవత్సరం మే 18 వ తేదీన మద్రాసులో జన్మించాడు. కథానికా సాహిత్యంలో చలంది ప్రత్యేక స్థానం. రచనలో వస్తు వైలక్షణ్యమే కాక, దానికి తగిన శిల్పంకూడా తగినంత కమనీయంగా ఉంటుంది. వజ్రాయుధం లాంటి వ్యావహారిక భాష, జలపాతంలాంటి శైలీ, శక్తియుతమైన భావప్రకటనా ఈయన రచనలకు ఊపిరి. కొన్ని వందల కథలు రచించాడు.

## 7. అడవి బాపిరాజు :

1895 వ సం॥ భీమవరంలో జన్మించాడు. ఈయన కళాకారుడు. చిత్ర కారుడు. భావాత్మకమైన కథలను రంగుల కుంచెలతో చిత్రించడం ఈయన ధోరణి. వీరి కథల్లో అపూర్వ కల్పనలూ, ఉదాత్త భావాలూ, జాతీయ వాతావరణం, మనోహరమైన శైలి ఎక్కువగా వుంటాయి. అనేక కథలూ, నవలలూ రచించాడు.

## 8. త్రిపురనేని గోపీచంద్ :

1910 వ సం॥ సెప్టెంబర్ 8 వ తేదీన కృష్ణాజిల్లా, అంగలూరు గ్రామంలో జన్మించాడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. సజీవమైన భాషా, సరళమైన శైలీ, నిరాడంబరమైన శిల్పమూ, సూక్ష్మమైన మానసిక విశ్లేషణా, విప్లవాత్మక మైన భావసంపద, హేతుబద్ధమైన శాస్త్రీయ విజ్ఞానము సంగ్రహాక, వ్యంగ్యాత్మక

మైన వ్యాఖ్యానాలు ఈయన కథల్లో కన్పిస్తాయి. ఈయన అనేక కథలు, నవలలు రచించాడు.

## 9. ఆచార్య కొలకలూరి ఇనాక్ :

1939 వ సం॥ జూలై 1 వ తేదీన గుంటూరు జిల్లా, వేజండ్ల గ్రామంలో జన్మించాడు. కథానికా సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈయన కథల్లో బడుగువర్గాల జీవన స్థితిగతులు కన్పిస్తాయి. దాదాపు నూటా డెబ్బై కథలూ, నవలలూ, నాటకాలనూ, కవితలను రచించాడు. అనేక సాహిత్య వ్యాసాలను రచించాడు.

అడ్రసు:- తెలుగుశాఖ, యస్.కె. యూనివర్సిటి, అనంతపురం-515003.

## 10. ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి :

1939 వ సం॥ జూలై 10 వ తేదీన కడప జిల్లా రంగశాయిపురం గ్రామంలో జన్మించాడు. ఈయన కథల్లో ఆలోచన, సంవేదన ప్రతిబింబిస్తుంది. సమాజంలో వస్తున్న పరిణామాలు స్పష్టంగా స్ఫురిస్తాయి. ఈయన కథకుడు, సంపాదకుడు, నవలా రచయిత. ఈయన కథలు 'జప్తు' 'కేతు విశ్వనాథరెడ్డి కథలు' అనే సంపుటాలుగా వెలువడ్డాయి.

అడ్రసు :- డైరెక్టర్, (అకడమిక్) డా॥ బి. అర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైద్రాబాద్.

## 11. కలవకొలను సదానంద :

1939 వ సం॥ ఫిబ్రవరి 22 వ తేదీన చిత్తూరు జిల్లా పాకాలలో జన్మించాడు. ఈయన కథల్లో కారుణ్యమే ప్రధానంగా అభివ్యక్తమవుతుంది. స్పందించే హృదయంతో భావుకతతో అనుకంపతో రసస్ఫోరకంగా, వ్యంగ్య వైభవంతో రచన చేస్తాడు. కథల్లో సామాజికమైన వర్తమాన సమస్యలు ప్రతిబింబిస్తాయి. ప్రస్తుతం ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నాడు.

అడ్రసు :- పాకాల, చిత్తూరు జిల్లా - 517112.

## 12. చిలుకూరి దేవపుత్ర :

1952 వ సం॥ ఏప్రిల్ 24 వ తేదీన అనంతపురం జిల్లా కాలువపల్లె గ్రామంలో జన్మించాడు. వృత్తిరీత్యా రెవెన్యూ ఉద్యోగి అయినా ప్రవృత్తిరీత్యా గొప్ప కథకుడు. ఈయన కథల్లో మధ్య తరగతి ప్రజలు కన్పిస్తారు. ఇంత వరకూ దాదాపు డెబ్బై కథలు రెండు నవలలూ రాశాడు. ఈయన కథలను - ఆరు గ్లాసులు, ఏకాకినౌక చప్పుడు, అనే సంపుటాలుగా వెలువరించాడు.

అడ్రసు :- 12-170-A1, సాయినగర్, అనంతపురం - 515001.

## 13. మధురాంతకం రాజారాం :

1930 వ సం॥ అక్టోబర్ 5 వ తేదీన చిత్తూరు జిల్లా మొగరాల గ్రామంలో జన్మించాడు. వృత్తిరీత్యా రిటైర్డు ఉపాధ్యాయుడు, ప్రవృత్తిరీత్యా కథకుడు. ఈయన కథలు ఇతర భారతీయ భాషలలోకి అనువదింపబడుతున్నాయి. ఈయన కథలకు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్‌ను ఇచ్చింది. ఈయన అనేక నవలలూ, వ్యాసాలు, గేయాలు కూడా రచించాడు.

అడ్రసు :- దామల్ చెరువు (పోస్టు గ్రామం), పాకాల (మండలం), చిత్తూరు (జిల్లా).

## 14. పులికంటి కృష్ణారెడ్డి :

1937 వ సం॥ చిత్తూరు జిల్లాలో జన్మించాడు. ఈయన రాయలసీమ సహజ మాండలికానికి కొమ్ము కాస్తూ దుక్కిటెద్దులా సాహితీ వ్యవసాయం చేస్తున్నాడు. దాదాపు నూటాయాభై కథలు రాశాడు. ఈయన నటుడు, కథకుడు, ప్రయోక్త. ప్రస్తుతం ఆకాశవాణి, దూరదర్శన్‌ల సలహాదారుగా పనిచేస్తున్నాడు. ఈయన తన కథలకు అనేక బహుమతులను అందుకొన్నాడు.

అడ్రసు :- 467, బండ్లవీధి, తిరుపతి.

## 15. బోయ జంగయ్య :

1942 వ సం॥ అక్టోబరు 1 వ తేదీన నల్గొండ జిల్లా పంతంగి గ్రామంలో జన్మించాడు. 1970 ప్రాంతంనుంచీ కథలు రాస్తున్నాడు. ఈయన కథలు ఎచ్చరిక, దున్న అనే సంపుటాలుగా వెలువడ్డాయి. జీవితం గురించి బాగా అవగాహన చేసుకొని రాసే అరుదైన రచయితల్లో ఈయన ఒకరు. కవిత్వం, నవలలు, నాటకాలు అనేకం రచించాడు. సబ్ ట్రెజరీ ఆఫీస్‌లో ఉద్యోగిగా వున్నాడు.

అడ్రసు :- 2-9-214 మాన్యం చెలక, నల్గొండ - 508001.

## 16. ఆరవేటి శ్రీనివాసులు :

జానపద సంగీతంలో నిష్ణాతులు. లెక్కకుమించి రేడియో నాటక నాటికలు రచించాడు. రాయలసీమ నుడికారం, యాస శైలి వీరి స్వంతం. అనుకరణ లేకుండా తనదైన శైలిలో కథారచన చేయగల దిట్ట. ఈయన నాటకాలు ఇతర భారతీయ భాషలలోకి అనువాదమయ్యాయి. అనేక పురస్కారాలను అందుకొన్నాడు. వీరి కథలు పాఠకుడిలో ఆలోచనలు రేకెత్తిస్తాయి.

అడ్రసు :- ఆరవేటి శ్రీనివాసులు, ఆకాశవాణి, కడప.

## 17. స్వామి :

1952 వ సం॥ జూన్ 3 వ తేదీన అనంతపురంలో జన్మించాడు. అసలు పేరు బండి నారాయణస్వామి. వృత్తిరీత్యా కథకుడు. ఈయన కథల్లో రాయల సీమ ప్రజల జీవన స్థితిగతులు కన్పిస్తాయి. ఈయన దాదాపు ఇరవై ఐదు కథలు, ఒక నవల రచించాడు. ప్రజల జీవితాలను ప్రజల భాషలో చెప్పటమంటే వీరికి ఇష్టం. ఈయన కథలు ఆంగ్లంలోకి అనువాదమయ్యాయి.

అడ్రసు :- 6/651–A, మారుతీనగర్, అనంతపురం 515001.

## 18. డా॥ శాంతి నారాయణ :

1946 వ సం॥ జూలై 1 వ తేదీన అనంతపురం జిల్లా బండమీదపల్లె గ్రామంలో జన్మించాడు. వృత్తిరీత్యా కళాశాల ఉపన్యాసకుడు. 1974 నుండి కథలూ, కవితలూ రాస్తున్నాడు. సామాజిక బాధ్యతతో మొట్టమొదట రాసిన కథ 'దళారి'. ఇప్పటికి పదిహేను కథలు రచించాడు. 1989 నుండి అనంతపురం జిల్లా రచయితల సంఘం కార్యదర్శిగా వుంటూ సాహిత్య సేవ చేస్తున్నాడు.

అడ్రసు :- తెలుగు లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, పాతూరు, అనంతపురం - 515001.

## 19. డా॥ కాలువ మల్లయ్య :

1953 వ సం॥ జనవరి 12 వ తేదీన కరీంనగర్ జిల్లా తేలుకుంట గ్రామంలో జన్మించాడు. సాహిత్యానికి సామాజిక ప్రయోజనముండాలని, సాహిత్యంద్వారా సమాజాన్ని చూడగలమనే ఉద్దేశ్యంతోనే కథలు రాస్తున్నాడు. ఈయన దాదాపు రెండువందల యాభై కథలూ, మూడు నవలలూ, ఇరవై ఐదు సాహిత్య వ్యాసాలు, కవితలు వ్రాశాడు. డిప్యూటి ఛీఫ్ కెమిస్ట్‌గా ఉద్యోగం చేస్తున్నాడు.

అడ్రసు :- బి-37, ఫెర్టిలైజర్ సిటీ, కరీంనగర్ జిల్లా - 505210.

## 20. చిత్తూరి కోటేశ్వరరావు :

గుంటూరు జిల్లా తాడేపల్లి మండలం సీతానగరం అనే గ్రామంలో జన్మించాడు. నరసరావుపేట, గుంటూరు, విజయవాడలలో విద్యాభ్యాసం చేశాడు. 1971 వ సం॥లో I.A.S. Combined Examinations లో ఉత్తీర్ణులై I.P.S. ను సాధించారు. ఈయన దాదాపు ముప్ఫైఐదు కథలను రచించారు.

ప్రస్తుతం "కమీషనర్ ఆఫ్ ఇన్క్వ్యైరీ" గా పనిచేస్తున్నారు. ఈయన కథలు ఆంధ్రభూమి, మయూరి, ఆంధ్రజ్యోతి పత్రికల్లో ప్రచురితమయ్యాయి.

అడ్రసు :- 24/D, సెయింట్స్ జాన్స్ రోడ్, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్.

## 21. పినాకపాణి :

అసలు పేరు డా॥ గౌరీనాథ్. వృత్తిరీత్యా డాక్టర్. పినాకపాణి అనే పేరుతో కథలు రాస్తున్నాడు. ఈయన కథల్లో బడుగువర్గాల ప్రజల జీవన స్థితిగతులు ప్రతిఫలిస్తాయి. కథల్లో ఉద్యమ స్ఫూర్తి ప్రధానంగా కన్పిస్తుంది. దాదాపు పదిహేను కథల పైగా రచించాడు.

అడ్రసు :- C/o డా॥ గౌరీనాథ్, ఆత్మకూరు (పోస్టు) గ్రామం (మండలం) కర్నూల్ (జిల్లా).

## 22. బి. యస్. రాములు :

23-8-1949 వ సం॥ కరీంనగర్ జిల్లా జగిత్యాలలో జన్మించాడు. దాదాపు ఆరు నవలలు, యాభై కథలు, మూడు తాత్త్విక గ్రంథాలు రచించారు. తెలంగాణాలో గొప్ప సాహిత్యవేత్త. ఉద్యోగరీత్యా హాస్టల్ వార్డన్. పలు ఉద్యమాలతో సంబంధం వున్నవాడు. "దరకమే" స్థాపనకు కృషి చేశాడు.

అడ్రసు :- బి. యస్. రాములు, 6-2-157 మిషన్ హాస్పిటల్ ఎదురుగా, జగిత్యాల, కరీంనగర్ జిల్లా - 505327.

## 23. సింగమనేని నారాయణ :

1943 వ సం॥ అనంతపురం జిల్లా బండమీద పల్లె గ్రామంలో జన్మించాడు. వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు. ఈయన కథల్లో సామాన్య రైతుల కష్ట నష్టాలు ప్రతిఫలిస్తాయి. 1978 నుంచీ కథలు రాస్తున్నాడు. ఈయన "జూదం" కథల సంపుటిని వెలువరించాడు.

అడ్రసు :- 6-43/-A1, కోవూర్‌నగర్, అనంతపురం.